శ్రీరస్తు.

శ్రీరామచంద్రాయనమః

# శ్రీమోక్షగుండరామాయణము

## యక్షగానము.

(సవరణకూర్పు)

శ్రీ తాళ్ళూరి నారాయణ సత్కవి విరచితము.

ఎనిమిదవ కూర్పు.



రామా అండ్ కో.,

విద్యావిషయిక ప్రచారకులు,

ఏలూరు.

పట్టాభిరామా ముద్రణాలయము.

1933

 [కాలికో బైండు వెల రు 2-8-0

పోస్టు ఖర్చులు వేరు.

# పీఠిక

ఆర్యులారా!

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే.."

అను శ్రీకృష్ణభగవానుని వాక్యముననుసరించి భగవదవతారంబు లనంతములుగా విరాజిల్లు చుండెను. అందిరువదియొక్క యవతారంబులు ప్రాముఖ్యతను వహించి యుండెను. అందును నత్యుత్తమంబై శ్రీరామావతారంబు విరాజిలుచుండె. ఈయవతార పురుషుండగు రాముండు చిరకాలము బహుజన సమ్మతమ్ముగ రాజ్యపాలనంబు చేసెను. అందుచే లోకంబున "రామరాజ్య"మను గౌరవనీయవాక్యము స్థిరముగా నెలకొని యుండెను. ఈతని మించిన యవతారమూర్తి మఱియొకండు లేడు. ఆ మహాత్ముని చిత్రచారిత్రంబును మున్ను వాల్మీకి రచియించె. దాని నాధారంబుగఁ జేసికొని మహర్షులు కొంతమంది తమతమ నామములతో రామాయణంబులను పలువిధములుగ వ్రాసి యుండిరి. అన్ని దేశముల నన్నిభాషల యందు నీయుత్తమ చారిత్రము పవిత్రవంతమయినదిగా పద్యగద్యాత్మక ప్రబంధములుగాను, పదములుగాను వ్రాయఁబడి యాబాలవృద్ధముగాఁ పఠింపఁబడు చుండెను. ఆంధ్రదేశమున నీమోతుకుగుండ రామాయణము, సంగీతమునకుం బ్రాణమ్ము నొసగు స్వారస్యములగు నసమాన సంకీర్తనంబుల తోడను, తోఁహరలు, తేనెలొలుకు పలుకులనిండిన పద్యములతోడను, హరికథారూపంబున వ్రాయఁబడినది. ఈగ్రంథమింత స్వల్పకాలములో నెనిమిదికూర్పులు వేలకొలఁది పడుటయే దీని ప్రాశస్త్యమునకు నిదర్శనము. రసవంతమగు గ్రంథమగుటంబట్టియే మిగుల వాడుకలోనున్నదని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ఇట్టి యుత్తమ గ్రంథమును బఠించి యెల్లరు భక్తిముక్తుల రెంటంగడవులేని యశంబున నొప్పుదురనుటకు సందియము లేదు.

1915 సంవత్సరములో సర్వహక్కులును మేము పొంది ముద్రించుచున్నాము.

ఇట్లు విధేయుఁడు,
ఈదర వెంకయ్య పంతులు,
ప్రొప్రైటరు.
రామా అండ్ కో, ఏలూరు.

ఏలూరు,
24—9—29.

ఓం.

శ్రీ గురుభ్యోనమః.

# విషయసూచిక.

## అయోధ్యాకాండము 96_148 పేజి.

భిక్షు యీ వచ్చిన సీతను దశకంఠుండు లంకకుఁ గొనిపోవుట.
జటాయువు యుద్ధము, సీతావిలాపము.
సీతారహితమగు పర్ణశాలఁగని రాముండు దుఃఖించి వెదుకఁబోవుట.
జటాయువును కృతార్థుఁజేయుట.
కబంధ వధ.
శ్రీరామలక్ష్మణులు శబరియాశ్రమము సేరుట.
శబరివలన సుగ్రీవాదుల వార్త దెలిసి పంపాసరోవరము సేరుట.

## కిష్కింధాకాండము 187—231 పేజీ.

పంపాసరోవరవర్ణన.
హనుమత్సమాగమము.
రామలక్ష్మణులు ఋశ్యమూకాద్రి చేరుట.
సీతాభరణములు గని రాముండు విలపించుట.
వాలికి దనకు గల వైరకారణము సుగ్రీవుఁడు రామునితోఁ దెలుపుట.
వాలిని దునిమి వానరరాజ్యము నీకుఁ గట్టుదునని రాముండు ప్రతిజ్ఞ సేయుట.
సప్తతాళధ్వంసము.
వాలిసుగ్రీవుల ప్రథమ యుద్ధము.
యుద్ధమునకుఁ బోవలదని వాలినిఁ దార ప్రార్థించుట.
రెండవ యుద్ధమున రామునిచే వాలి హతుండగుట.
భర్తమరణమునకు దుఃఖించు తారకు రాముండు విజ్ఞానంబు గరపుట.
సుగ్రీవ పట్టాభిషేకము.
వర్షాకాలము పోవునంతకు రామలక్ష్మణులు ఋశ్యమూకాద్రి గుహాయందుండుట.
సుగ్రీవుండు దడిసినందుకు రాముం డలిగి లక్ష్మణుని గిష్కింధకుఁ బంపుట.
లక్ష్మణుని గౌరవించి సుగ్రీవుండు కపిసైన్యముతో రాముని జేరుట.
సీతాన్వేషణంబుకొఱకుఁ గపుల నలుదెసలకుఁ బంపుట.
దాహాతురులై వచ్చిన హనుమదాదుల సేదదీర్చి స్వయంప్రభ రాముని దర్శింపఁబోవుట.
సముద్రతీరము సేరి వానరులు ప్రాయోపవిష్టులగుట.
తమను మ్రింగవచ్చిన సంపాతికి వానరులు జటాయువు మరణవార్త దెలుపుట.
జటాయువు మృతిని విని దుఃఖించి సంపాతి తనపూర్వవార్త తెలుపుట.
సంపాతివలన సీతజాడ తెలిసి వానరులు లంకకుఁబోవ యత్నించుట.
అంగదాదుల ప్రేరణమున హనుమంతుండు సముద్రము లంఘింపఁబూనుట.

## సుందరకాండము 232—284 పేజీ.

# అవతారిక.

## కృతిపతివంశానుక్రమణిక.

గీ. కోవిదులు మెచ్చ 'రామాంజుకో' రచించె,
ప్రాభవమ్మందె 'పట్టాభిరామ ప్రెస్సు'
తెనుఁగుదేశాన నింటింటఁ దేజరిల్లె,
అంతయును గల్గె రామకటాక్షమహిమ.

క. శ్రీలలితాంధ్రధరిత్రీ
ఫాలస్థలతిలకముగఁ దపఃపరతంత్ర
ప్రాలంబశీల మగు నా
ర్వేలనియోగాఖ్యశాఖ వెలయు ధరిత్రిన్. ౧

క. వారలలో మంత్రకళా
ధౌరంధర్యాభిరామ తత్వజ్ఞనిధుల్
భారద్వాజసగోత్రులు
పేరొందిరి రాజనీతివిభవాంచితులై. ౨

క. భూదేవుల దీవనలన్,
భూదారుల మన్ననలఁ బ్రమోదితమై, సం
పాదితనీతివిభవ మగు
"ఈదర" కులదుగ్ధవార్ధి యెసఁగు సరసతన్. 3

శా. ఆ వంశంబునఁ బ్రోలమంత్రి జననంబై సత్కళావైభవ
ప్రావీణ్యుం డయి దొడ్డిచింతలపురీపర్యంతసీమాళులన్
దేవబ్రాహ్మణవృత్తులన్ బెనిచి భూదేవౌఘసంస్తుత్యుఁ డై
శ్రీవిభ్రాజితుఁ డై తనర్చె నృపతుల్ స్నేహం బపేక్షింపఁగా. ౪

ఉ. ఆతనిపుత్రుఁ డుజ్జ్వలదయానిధి రామయమంత్రి సద్ద్విజ
వ్రాతమునం దభిజ్ఞుఁ డయి భవ్యకవిత్వపటుత్వచాతురీ
రీతుల నగ్రగణ్యుఁ డయి శ్రీరఘురామపదారవిందసం
జాతమరందపానరుచిసక్తత నొప్పె రసజ్ఞు లౌ ననన్. ౫

సీ. సప్తసంతానముల్ సంతరించి యశంబు
నాచంద్రతారార్క మలరఁ జేసె;
ఏడువారంబుల కేకైకవిధముగా,
భజనప్రబంధముల్ ప్రచురపఱిచె;
గరిమమై వైకుంఠపురమును నిర్మించి,
శిలలతోఁ బెన్గోట వెలయఁ జేసె;
వర్తకవృత్తి ప్రవర్తిల్లఁగా బిడ్డ
ర్లనుగూర్చి ధనసమార్జన మొనర్చె;
గీ. తనదు వంశాభిధేయాంకితంబుగాఁగ
నలర నీదరవారితటాక మొండు
రాజిలఁగఁ జేసె నీదర రామమంత్రి;
ఆతనికి సాటికలరె ఈక్ష్మాతలమున ! ౫

ఉ. రామయమంత్రిదేవి యభిరామగుణాకర మంగమాంబ ని
స్సీమయశోభిరామయయి చెల్వలలోఁ దలమానికంబునై
కామునితల్లికంటె సిరిగల్గి నిరంతరభర్తృసేవనో
ద్దామదయార్ద్రచిత్తయయి దన్పెను బేదల నాదరంబునన్. ౬

గీ. మంగమా- రామమంత్రి దంపతుల కనుఁగు
సుతులు నల్వురు, మఱియును సుతలు నల్వు,
రమలగుణధన్యు లుదయించి; రందు జివర
మహితపట్టాభిరామయమంత్రి పొడమె. ౭

క. ఆ నీతి ప్రవణుఁడు ల
క్ష్మీ నరసాంబికను సాధ్విఁ జేపట్టి, కనెన్
సూనుల మువ్వుర సజ్జన
మానితులన్ సాధుగుణసమంచితమతులన్. ౮

గీ. రామసచివుడు, వేంకటరాయమంత్రి,
వేంకయామాత్యుఁ డను పేర్ల వృద్ధిఁ గనిరి;
ప్రబలయోగమ్ముచేత వర్తకముచేత
దీక్షఁ గొనిరి సరస్వతీదేవిఁ గొలువ. ౧౦

సీ. తన చిన్నతనమున దైవమ్ముప్రేరణ
ఏలూరుగడ్డపై గాలు వెట్టి;
పెట్టి మువ్వురలోనఁ జిలుతయయ్యును నేరు
పలరార నేర్చె విద్యాప్రశస్తి;
నేర్చి బుద్ధిస్థైర్యనిపుణుడై వ్యాపార
కలనలోఁ గన్గొనెఁ గౌశలంబు;
ముద్రణశాలయుఁ బుస్తకక్రియశాల,
నెలకొల్పి వర్ధిల్లె నేర్పుమీఱ;
గీ. దాన వచ్చెడి ధనము సాధనముగాఁగఁ
దమిని బంధుల రావించి తత్తమచిత
విధులయందు నియోగించె వినుత వినయ
మూర్తి వేంకయామాత్యుండు పూజ్యయశుఁడు. ౧౧

ఉ. రాముఁడు సర్వసంపదభిరాముఁడు భక్తజనైకరక్షణో
ద్దాముఁడు తత్కలంబునకు దైవతమై తనరారుచుండ నా
రామునిపేరఁ గంపెనియుఁ బ్రస్తుతిగాంచిన ప్రెస్సుఁగూర్చి శ్రీ
రామపదంబు వ్యాప్తి పొనరం బచరించె ననేకరీతులన్. ౧౨

సీ. ధన మిచ్చి మంచిపొత్తములు వ్రాయించెఁ బం
డితులచేఁ బఠితృసంతతులు బాగడ;
పాఠశాలలలోని బాలుర కను వగు
సరణిఁ బుస్తకముల సమయ మెఱిఁగి;

ఊరూరఁ బ్రకటించి యుత్సాహముం గూర్చి
విద్యార్థులను జదివించి మించె;
విద్యాధికారులు విరచించు నూత్నపు
స్తకముల నాంధ్రదేశమునఁ బఱపె;
గీ. దేశభాషకుఁ గ్రొంగ్రొత్తతెన్ను లరసి
ప్రబలతరదీక్ష నూరూరఁ బర్యటించి
గ్రంథరాజమ్ములం బ్రచురణ మొనర్చె;
మాన్యచరితుండు వేంకయామాత్యసుతుఁడు. ౧౩

సీ. భర్తృశుశ్రూషణపరతంత్రచిత్త యౌ
పార్వతి వామపార్శ్వంబు గాఁగ;
జిలిబిలిపలుకులు గులికించు పట్టాభి
రాముఁ డాత్మీయపుత్రకుఁడు గాఁగ;
చిన్నారి పొన్నారి చిట్టి లక్ష్మీనర
సమపట్టి ముద్దుముచ్చటలుగాఁగ;
సంతతం బమృతహస్తమున దీవన లిచ్చి
వెలయు లక్ష్మమ తల్లి వేల్పుగాఁగ
గీ. వేంకయాఖ్యుండు సద్గుణవిశ్రుతుండు,
సముచితోదారశీలుండు శాంతమూర్తి
యలరఁ జేయుచు నుండు రామాంకితముగ
దశదిశలు మ్రోఁగా శారదాసపర్య. ౧౪

ఆ. తల్లి పుట్టినిల్లు, తన యత్తగారిల్లు
సంతరించె రామచంద్రు కరుణ;
పుట్టినాఁడు తనకుఁ బట్టాభిరాముఁడే;
తనకు రామభక్తి తారకమ్ము;

ప్రకటవృత్తి తనకు 'రామాండుకో'యయ్యె;
నసదె సిరులు వేంకయార్యమణికి! ౧౫

గీ. సుందరీ- రామ దంపతుల్ సుకృతిరతులు
అవ్వ- తాతలు తన్నుఁ గాపాడినారు;
వారియాశీఃప్రభావ మేపారుచుండ
నభ్యుదయ మొందు ఈ వేంకయప్రధాని. ౧౬

గీ. మేనకా- హిమవంతులు మృడునకు బలె
నిజసుతం దన ధర్మపత్నిగ నొనర్చి
నట్టి శ్రీలక్ష్మియును రామయప్రెగడయు
నత్తమామలుగా వేంకయార్యుఁ డెసగె. ౧౭

— అంకితము. —

గీ. ఒకటితక్కువ యైదువేలు కలివత్స
రములు గడవ విళంబివర్షమునఁ జైత్ర
మాసమున "మోక్షగుండరామాయణమ్ము"
వ్రాసితిని రామునకు సమర్పణముగాఁగ. ౧౮

తే. గీ. అట్టి కథ జనమంచి శేషాద్రిశర్మ
కోవిదుఁడు సంస్కరించె నాకోరి కలర;
శిష్యతతు లద్ది పఠియించి చెల్వమీఱ
హరికథలఁ జెప్పి రందందు నంధ్రభూమి. ౧౯

తే. గీ. ప్రబలెఁ బ్రఖ్యాతి దానఁ, గరంబుఁ బ్రీతిఁ
బ్రజలు బఠియింప నుత్సాహభరితు లగుచు
నచ్చుఁ గూర్పించి మత్పుత్త్రు లధికభక్తి
నంధ్రభూమిని బ్రచురించి రాదరమున. ౨౦

తే. గీ. ప్రథమముద్రణపుం బ్రతుల్ వ్యయము జెంద,
శక్తికిని మించి యున్న బ్రసక్తియగుట

వృద్ధదశ గల్గుటయు నింక నెట్లటంచుఁ
జింత యోజించుచుండ నా శ్రీసు కృపను- ౨౧

ఉ. శ్రీయుతుఁడార్య సన్నుతుఁడు శ్రీరఘురామపదారవిందసే
వాయతచిత్తుఁ డీదరకులాంబుధిచంద్రుఁడు వేంకమంత్రి నా
రాయణసత్కవిన్ నను నయంబునఁ బిల్చియు మోక్షగుండ రా
మాయణనామసత్కృతి తదంకితమున్ బొనరింపఁ గోరుచున్- ౨౨

తే. గీ. దివ్యతాంబూల మొసఁగె నెంతే ముదమున;
రాముకథ కృతి; తత్పదారాధకుండు
భర్త డీవేంకయామాత్యవరుఁడు మత్కృ
తీశ్వరుఁడు; ధన్యతముఁడ నా కేమటంచు- ౨౩

క. నెమ్మది సంతోషించియు
సమ్మతి సూచించినంత శాలువజోడుం
గ్రమ్మలు భూషణములు ద్ర
వ్యమ్మును తాంబూలమొసఁగినంత నె ప్రీతిన్- ౨౪

క. శ్రీరఘునాయకపదయుగ
సారసమకరందసక్తషట్పదమునకున్
సారాచారవిశేషవి
హారావేశునకు వేంకయామాత్యునకున్. ౨౫

గీ. పుత్త్రి పౌత్త్రి ప్రపౌత్త్రి విస్ఫూర్తు లలర
నఖిలవిధభోగభాగ్య విన్యాస మొనర
ఆయు రారోగ్య విభవ సౌఖ్యంబు లోలయ
భవ్యయశ మొందఁ బ్రీతి దీవనలొనర్తు. ౨౬

వ. నా యొనర్చిన రామాయణహరికథాకాలక్షేపంబునకుఁ గృతిపతిగా
నొనర్చి, కథాక్రమం బుపక్రమించెద. ౨౭

శ్రీరామచంద్రగురుపరబ్రహ్మణేనమః.

అవిఘ్నమస్తు.

# శ్రీమోక్షగుండరామాయణము

## హరికథ.

### బాలకాండము.

శా. శ్రీమద్భూమిజ వామభాగమునఁ, బ్రాంచిన్ గేసరి పుత్రుడున్,
సామోదంబునఁ బార్శ్వయుగ్మమున నాశత్రుఘ్నకైకాత్మజుల్,
ప్రేమన్ బశ్చిమమందు లక్ష్మణుఁడు నావేష్టింపఁ, జెల్వొందు శ్రీ
రామబ్రహ్మపదారవిందముల నారాధింతు నశ్రాంతమున్.

మ. మఖముంగాచి, విరాధముఖ్యరిపులన్ మర్దించి, సుగ్రీవునిన్
సఖుఁగా నేలి, దశాస్యు ద్రుంచి, యవనీజం గూడి సాకేతమున్
సుఖమైచేరి స్వరాజ్యభోగములచే శోభిల్లు శ్రీరాఘవుం
డఖిలాఘంబుల ద్రుంచి భక్తులకు నిత్యానందమున్ గూర్చుతన్.

బేహాగ్: ఆదితాళము.

రామా మహీజావరా! పరంధామా! సుగుణాకరా॥
రామా! త్రిలోకాభిరామా! దనుజవిరామా! వినుతసుత్రామా! దశరథ॥ రా॥ సంగరశూరా! విహంగతురంగ! ఘనాంగ! కలుషవిభంగ! జనకజ॥ రా॥ ఖండేందుమౌళి కోదండవిఖండన! పండితనుత! మోక్షగుండపురరఘు॥ రా॥ వారణసుఃఖనివారణ! త్రిలోకకారణ! తాఖ్యారినారాయణార్చిత॥ రా॥

మలయమారుతము: ఆటతాళము.

శ్రీగురుప్రభో చిదఖండరూపభో॥ శ్రీగు॥ బాగుగ నీపాదభజనముచే భవసాగరముదాటఁగా గల్గె ధన్యుడ॥ శ్రీగు॥ చతురగ్రమున

సత్యరూపమున। మోతుగుండపందు-సాక్షిగ నెలకొన్న। యతియ తేజ నారాయణశర్మహృల్లక్షిత ! పూర్ణవి లాస ! వేంకటశివ॥ శ్రీగు॥

ఆదితాళము. (రవికులతిలక-వలె)

నను దయగనవే పరమేష్ఠిరాణి॥ నను॥ నన్నుగై కొనవే ఘన పావని వే॥ నను దయ॥ ఆపదల్ మాపగన్ - బాపముల్ వాపగన్-నీ పాటివారలు రూపింపగా లేరు; నీపదయుగళము ప్రాపగు॥ నను॥ భావంబునన్ సేవించెదన్ - నావాక్కునన్ నీవెప్పుడున్- ఠీవిగ నిలిచి శుభావహ మగు నటు, గావింపు జగత్పావని॥ నను దయ॥ మోతు గుండమం దనయము నీవు రంజిల్లి-యాక్షితి నారాయణకవి నేలెడుతల్లీ యక్షయకటాక్షమునన్ దీక్షమీఱ వీక్షింపుచు॥ నను।

శంకరాభరణము: రూపకతాళము.

శ్రీయుమాకుమారా ! పాహిశ్రీ దాయరా దా ! యఘాళి ద్రోయ బాళి॥ శ్రీ॥ పాయక నీ పదాబ్జములు సదా గొలుతు॥ శ్రీయు। కామేంద్రియపరిహారా ! కాయజారిసుకుమారా ! తోయజాతభవ వందిత ! శ్రేయము లిడరాదా ! శ్రీయుత నారాయణ కవిరాయ వినుత ! మోతుగుండనాయక ! నిర్విఘ్నంబుగ నాయభీష్ట మొసగూర్పుము॥ శ్రీయుమా॥

ఆ. వె. ప్రస్తుతమున నాకు వాసార్హమై యొప్పు
మోతుగుండనామపురమునందు
భవ్యరాఘవోత్సవమును విళంబి వ
త్సరమునందుఁ దనరు చైత్రమందు.

వ. యథావిధిగ నాచరింప సమకట్టి ప్రవాళ రజిత నీల స్ఫటిక తేజోరాజితంబగు నొక్క దివ్యమందిరంబున అష్టదళవిరాజిత భద్ర పీఠంబుపయి భరత శత్రుఘ్న లక్ష్మణ సీతాసమేతంబుగఁ గోటిసూర్య ప్రభాభాసమానుండయి వేంచేసియున్న శ్రీరామచంద్రమహాప్రభు

కొలువు సేయం గోరి సర్వేంద్రియవ్యాపారంబులతోం గలియకుండ మనంబును మారుతముతో జతపఱిచి పంచంగ నవి రెం డేకీభవించి, పెద్ద మార్గంబులు రెండింటిని విడిచి, నడిమి సన్న బాటను జని తన్మందిరంబునకుం గల ద్వారపాలకుల నాశ్రయించి మొదటి వానికి నాలునూఱులు, రెండవవానికి నాలువేలు, మూండవవానికి నాలువేలు, నాలవవానికి నాలువేలు, నైదవవాని కొకవేయి, యాఱవవాని కొక్క-వేయి, కడపటివాని కొక్క-వేయిగ-నీప్రకారము లంచ మిచ్చి వచ్చుచుం బోవుచుండుటకు నిరాతంకముగా స్వతంత్ర మేర్పఱుచుకొని చేరి యర్ఘ్యపాద్యస్నానంబులు గంగాదినదీజలంబులుగ, షట్క-మలంబులు పూజాద్రవ్యంబుగా, సూర్యచంద్రులే హారతులుగ, నిజానందంబే నైవేద్యంబుగ భావించి యాత్మారాముని సేవించుచుం దన్మయత నున్న సమయంబున,

ఉ. తంబురం గాలిగజ్జెలును దాళమృదంగముఖాదిభవ్యనా
దంబులు పొల్పుమీఱ హరిదాసచయం బగుదెంచి నృత్తగీ
తంబుల రామమూర్తిచరితంబును బాడుచు నుత్సవంబు సాం
తంబగు నంతదాంక భజనంబు లొనర్చిరి సంతసంబునన్.

వ. ఇట్టి సత్కాలక్షేపంబు సర్వజననేత్ర శ్రోత్ర మానసానందకరంబుగనున్న కాలంబున,

సీ. శ్రీరమణీయ వేమూరిసదన్వయ క్షీరాంబునిధిపూర్ణ శీతకరుండు,
మహనీయసత్సభామండలరంజిత సంగీతవిద్యావిశారదుండు,
దేవ మహీదేవ దేశికసజ్జనావలియెడ సద్భక్తి నిలుపువాండు,
పాపార్యవర్యుండు పరగ శేషాంబిక యందునం గన్నట్టి నెయ్యంపు గొడుకు,

గీ. సుబ్బయార్యునకుం గూరిమి సోదరుండు,
నలరు నరసింహశర్మకు నగ్రజుండు,
శ్రేష్ఠసుధ రామనామైక చింతనుండు,
యజ్ఞనారాయణుండు సత్యవ్రతుండు.

వ. ఉత్సవారంభదివససాయంతనంబునఁ బూజాసమయంబునకు వచ్చి యందు వేంచేసియున్న సాకారరామమూర్తిని వీక్షించి,

ఏకతాళము: బిలహరి.

కలిగె నాకు శ్రీరాఘవునిగొలువ॥కలి॥ ఘల్లుఘల్లున జిరుగజ్జెలు మెఱయ। నలినాక్షునికడ నాట్యము జేయ॥ కలి॥ తాళ మృదంగ ఫిడేలు తంబుఱలు। బాళిని మ్రోయ భజనఁజేయ॥ కలి॥ భూమిజయుతుఁడై పొదలెడు రాముని। వేమరుగన్నుల వీక్షింపఁగను॥కలి॥ అక్షరుఁడఁయి నా, రాయణు నేలెడు। మోతుగుండపతి మ్రోల నిలువ॥కలిగె॥

వ. ఇట్లత్యానందంబు నొందుచు హరిదాసబృందంబులం గలిసి భజన మొనర్చి యవభృథానంతరము మదంతికంబున నిలిచి సద్రమభావంబున,

సీ. శ్రీవత్ససంజ్ఞరాజితగోత్రభవుఁడ వార్వేలకులాంబుధి ద్విజవిభుఁడవు;
తాళ్లూరికృష్ణప్రధాని జ్ఞానాంబయుం దాదరంబున గన్నయాత్మజుఁడవు;
ఘనమైలవరపు వేంకటశివాచార్య కృపాలబ్ధవిజ్ఞానభాసితుఁడవు;
మూర్తిత్రయాతీతముఖ్య సచ్చిత్సుఖ మయవస్తుతత్వవిమర్శకుఁడవు;
గీ. కేవలాఖండమోక్షలక్ష్మీయుతుడవు;
భక్తి శ్రీరామచంద్రోత్సవవ్రతుఁడవు;
సరసపదపద్యనిర్మాణసక్తమతివి
హతదురితకర్మ నారాయణాఖ్యశర్మ.

అని సంబోధనచేసి యిట్లనియె:

క. రామాయణంబు హరికథ
గా మీరు రచించియుంచు కారుణ్యమునన్;
నేమమున నేఁ బలికెద;
భూమిని నాకొదవు భుక్తి ముక్తులు రెండున్.

వ. ఈమహోపకారంబుఁ గట్టుకొం డని ప్రార్థించిన సమ్మతించి వారిని సమర్యాదముగాఁ బంపి పిమ్మట నొక్కనాడు నాసనంబున,

సీ. ఛందోవిచారంబు సలుపఁగా నైతిని; వ్యాకరణంబు నేర్వంగ లేదు;
కావ్యంబులనుమాట గలలో నెఱుంగను; నైఘంటికంబులనంగవినను;
నవరసాలంకార నైపుణి లేదయ్యె; భరతశాస్త్రంబు చొప్పరయ లేదు;
రాగతాళములమార్గముగోచరముగాదు; స్వరవిభేదంబులజాడ లెఱుఁగ

గీ. నీమహాకావ్యరత్న మింకేవిధమున
హరికథ నొనర్తు శక్తి లే దనక నేను
సమ్మతించితి; నిది యెట్లు చక్కపడునొ!
యొండు శరణంబు లేదు రాముండు దక్క.

వ. అని యోజించి రాముని బ్రార్థించి యారాత్రి నిద్రించుసమయంబున నాపాలి ప్రత్యక్షదైవం బగు శ్రీరామమూర్తి మదీయకారణాచార్యులగు వేంకటశివార్యవర్యరూపంబున స్వప్నంబునఁ గనఁబడి దయారసం బొలుక నిట్లనియె:

తే. గీ. వత్స! వాల్మీకిముఖమునివరులు, నితర
నరులు, మును సంస్కృతాది నానావిధస్వ
భాషలను శక్తికొలదిని భక్తిచేత
నెన్ని రీతులనో రచియింప లేదె!

క. అందఱిలో నీ వొకఁడవు;
సందేహము నీ కిఁ కేల! సద్గురుకరుణా
నందంబున రామాయణ
ముం దగ హరికథ రచింపు ముదము దలిర్పన్.

ఉ. చొక్కపుహేమ మెవ్వరెటు సొమ్ములు సేసిన వన్నెవచ్చిన
ట్లెక్కువ రామమూర్తికథ నెవ్వరు సెప్పిన నొప్పిదంబగున్;

జక్కఁగఁ దత్కథారచన సాంగముగా నెఱవేర్చి భక్తితో
గ్రక్కున మోక్షగుండపుర రాముని కర్పణ సేయు పుత్రకా!

వ. దీనికి మోక్షగుండ రామాయణమను నామం బొసంగుము. నీకు మేల య్యెడు మని సెల విచ్చి వారు కను మొఱంగిన నేను మేలు కాంచి శ్రీమద్వేమూరి యజ్ఞనారాయణాఖ్యహరిదాసప్రోత్సాహంబున కనుగుణంబుగ సద్గురుకటాక్షంబు గలిగెఁగదా! యింక లోపం బేమి యని యానందించి యి ట్లనుకొంటి:

ఉ. ఈయవనిం గవీశ్వరు లనేకులు నేర్పరు లుండియుండ రా
మాయణముం రచింప నను మన్ననఁ బ్రేరణచేసె యజ్ఞనా
రాయణపాటి మిత్రులు ధరంగలరే! యిక నాదుభాగ్య మెం
తో యధికం బటంచు ధృతితోఁ దలపోసి యనంతరంబునన్.

వ. ఒక్క శుభదినంబున నుపక్రమించి యిష్టదేవతా సద్గురు సత్కవీశ్వరులఁ బ్రార్థించి,—

పద్యాంతములు: అటతాళము. (కలియుగవర్ణ్నద)

1. రామునకు జితభృగు-రామునకు జగదభి-రామునకు దానవ వి।
రామునకు మోక్షగుండ ॥రా॥

2. ధీరునకు నిగమసం-చారునకు రణరంగ। శూరునకు శరధి గం।
భీరునకు మోక్షగుండ ॥రా॥

3. ఖండశశిమౌళి ఘనో-ద్దండ కోదండ వర। ఖండీకృత బాహు
బలా। ఖండునకు మోక్షగుండ ॥రా॥

4. దివ్యునకు సుజన సం। భావ్యునకు మరుత్సుత-సేవ్యునకు మాని
మం। తవ్యునకు మోక్షగుండ ॥రా॥

5. ప్రీతునకు భువన వి। ఖ్యాతునకు రవివంశ। జాతునకు సీతా స।
మేతునకు మోక్షగుండ ॥రా॥

గని రమించుచు నుండిన కారణమున
రామఁ డను పేరు వచ్చెఁ బరాత్పరునకు.

వ. కాబట్టి యమ్మంత్రరాజంబు నీ వనుష్ఠింపఁదగినది. దీని య నుసంధానంబునఁ బునరావృత్తిరహితశాశ్వతబ్రహ్మానందపదవి ననుభవింపవచ్చునట్టి రామమూర్తికిని నాకును భేదంబులేదు సుమీ యని యమ్మంత్రం బుపదేశించిన నానందించి, యోపరమేశ్వరా ! రాముండు పరమాత్ముండయ్యును మాయతోఁగలసి యవతారంబు లెత్తినట్లు పురాణవచనంబుగలదు. అందువలన నతని కేమిప్రయోజనంబుసెల విమ్ము మహాత్మా! యని వేడిన నానందించి శంకరుం డిట్లనియె:

క. ప్రకృతి విలక్షణుఁడగు నా
త్మకు సృష్ట్యాదులు వికల్పితంబులు లేమా !
యొకటిని నంటక యాతఁడు
సకలంబును జేయుచుండు సర్వాధికుఁడై.

వ. ఇట్లు గావున జగత్సృష్టి స్థితి లయకారణకర్తయైనపరమాత్మ దుష్టనిగ్రహ శిష్టపరిపాలనంబుకొఱకును ధర్మసంస్థాపనంబుకొఱకును బ్రతియుగమునందు మాయాసహితుండై యనంతావతారంబు లెత్తుచుండు. అందొక్కటియగు రామావతారచరిత్రములోకత్రయ పవిత్రంబై శ్రోత్రానందకరంబయి యలరారునది దెలిపెద సావధానచిత్తవగుము.

పల్లవి. తోహర. రామరామయనవే! శ్రీ రామాయణకథవినవే! రామారఘుకుల రామా ! సీతారామా ! రామా! యనవే । రామా మణిరో రమ్యంబగు శ్రీరామాయణకథ వినవే॥ రామా॥

వ. ఓపార్వతీ ! ఈప్రపంచంబున నార్యావర్తంబునఁ గోసల దేశంబున మాంధాతృ నగర దిలీపేక్ష్వాకువులు మొదలగు సూర్యవంశ రాజులకు ముఖ్యపట్టణమయి యయోధ్యయను నొక్కనగరంబువెలయు. అది నవరత్నస్థాపితమయిన దివ్యభవనంబులచేతను, విశాలములయిన

రాజవీథులచేతను, రమ్యంబులగు విపణిమార్గంబులచేతను, నగాధము లగునగడ్తలచేతను, మోదప్రదంబులగు శశికాంత వేదులచేతను, బచ్చల తోరణములచేతను, ముత్యాల ముగ్గులచేతను, దనరారి వర్ణాశ్రమాచార నియతులయిన చాతుర్వర్ణ్యములవారికి నివాసయోగ్యంబయి యలకాపురంబుకన్న మిన్నయై వన్నెఁగన్న యన్నగరంబున,

తోహార. దశరథుఁ డనునొక ధరణీనాథుఁడు తరణివంశసంభవుఁడు। దశ దిశలందును విశదంబుగఁ దన యశము నిండఁగా నెగడు॥ రామా॥

వ. మున్నూటయేఁబదిమంది భార్యలలో ముఖ్యులయిన కౌసల్య కైక సుమిత్ర లను ముగ్గురు భార్యలతోఁ గూడి నను స్తనసుఖంబు లనుభవించుచుఁ బెద్దకాలంబు రాజ్యంబు చేయుచుండి తనకు సంతానంబు లేని కొఱంతచేఁ జింతించి సుమంత్రుండనుపేరఁగల నిజమంత్రిని నమాత్యులను రావించి సభచేయించి వసిష్ఠాదిమునులను బిలిపించి పూజించి ముకుళిత హస్తుండయి దశరథుం డిట్లనియె:

దశ—కీర్తన: ఆదితాళము.

మునులారా ! నా మాట వినరే। యోగహితులారా హితులారా! ధారుణి బుత్రులు లేరిఁక నాకు నే తీరున నోరిక తీరునో సూరివరులారా॥ సంతతిలేకను సద్గతిలేదఁట యెంతనిసంత వచింతు సేవింతుబుధులారా॥ మోక్షగుండ కమలాక్షుని కృపాకటాక్షము గలుగున యత్నయముగ॥ బుధులారా॥

వ. “అపుత్రస్య గతిర్నాస్తి” సుతులు లేని వారికి గతులు లేవని శ్రుతిస్మృతులు వలుకుచున్నవి. పెక్కు కాలంబయ్యె; నొక్కతనయుం డయినఁ గలుగండు. కాఁబట్టి సంతానంబుగలుగు తెఱంగెఱింగింపుఁడు,

సంధి: తోహార.

అని యిటు దశరథుఁడాడిన పలుకులు। వినిరి మునులు మోదమున। దనరఁగ సూతుఁడు దాను విన్నదం తయును దెలిప వేగమున ॥రామా॥

సూతు- కీర్తన- కమాచ్, ఆది:

విను ధరణీనాయకా, వినుధర, సురుచిరతనుజిత సుమసాయక విను॥ ధర॥ సంతతి లేదని చింతయేల మీ । మంతనమున మనవి నిలిపి॥ విను ధరణీ॥ ఎలమిఁ బుత్రకా మేష్టి జేసినను। వెలయఁగ దనయులు గలుగుదు రిల విను॥ ధర॥ అవని మోక్షగుం డాధిపు కృపచే । వివిధ సుఖంబుల । వీఁగగలవు విను॥ ధర॥

వ. ఓ దశరథమహారాజా ! పూర్వంబున అంగమహీపాలుండగు రోమపాదుండను రాజు తన రాజ్యంబున ననావృష్టి దోషంబుప్రాప్తించి జనక్షోభము గలిగిన నది నివారించుటకయి ప్రాజ్ఞుల వలన వర్షహోమాది క్రియలు చేయించియు వానలు లేకున్న జింతించుచుండఁగా నప్పుడు కొందఱు పెద్దలు విభాండకుని తనయుఁడు ఋశ్యశృంగుడను నతఁడు జన్మించినది మొదలు తపస్సంపన్నుడయి యున్నవాఁ డమ్మహానీయుండున్న దేశంబున దుర్భిక్షభయంబులు దొలఁగుగాన నతని నిందు రప్పింపు డని పలుకఁగ విని రోమపాదుండు చాతుర్యనిపుణలగు గణికాంగనలఁ బిలిపించి యమ్మునితపోవిఘ్నంబు సలిపి తోడి తెండని పంచిన మంచి దని,

రూపకము, రామల్ నలుగు-'వలె'.

వారల్ చనిరి మోదమున । నొయ్యారముమీరఁ॥ వారల్॥ సారెకు ఋశ్యశృంగుఁ ధీరుఁ వలపింపగఁ గోరి తదాశ్రమవనికిని జేరఁ॥ వారల్॥ మాటల్ చెఱకు రసము వలెఁ మాధుర్యము గారఁ । మాటికి సయ్యాటలతోఁ బాటలు పాడుచు గను గీటులఁ దగ చిఱునగవుల తోడఁ॥ వారల్॥ మూసఁ మఱపించి ధరా జాని పురముఁ జేర్పఁ । బూని సదా మోక్షపుర శ్రీనాథుని పదములు । ధ్యానించెడు మునివర్యుని గానఁ॥ వారల్॥

సీ. విరహిణీమృగముల వేటాడగమకించినమరుఁడు వైచినపుష్ప♦శరములనఁగ!
గడువేడ్కతోఁ బాల♦కడలిని జన్మించి జగతికి వచ్చు న♦ప్సరలనఁగ!

ధారాధర వినిర్గతంబులై దెసలకు బఱతెంచు క్రొక్కారుమెఱుపు లనఁగ
శృంగారరసములంజేరి క్రీడింపంగఁ గడగివచ్చెడు రాజకన్యలనగ;

గీ. నించుకైనను మది సంశయించ కప్పుడు
మించుబోణులు మిగులఁ గా మించి సంత
సించి మునియాశ్రమముఁ బ్రవేశించి యతని
గాంచి వలపించిరొని పోవ నెంచి రంత.

ఉ. వీనుల విందుఁ గొల్పఁదగు వీణల మీటుచు నాట్యయుక్తిని
గానము సేయుచున్ మఱియుఁ గాంతలు సుంతయు భీతిలేక యా
మ్మౌనిని దాఁకుచున్ గడఁగి మాటలు నీటు చెలంగఁబల్కుచున్
బూని విచిత్రమార్గముల మోహితుఁజేయఁగఁ గోరిరాతనిన్.

వ. ఇట్లు గొన్ని దినంబు లతని నాశ్రయించి తము స్వాభావిక
చేష్టల గనపఱచుచుండిన నతండు పూర్ణ సమాధిని జాలించి,

తోహర. కన్నులు విచ్చి య ఖండ తేజములఁ గనఁబడు
వారలఁ గాంచి। ఎన్నడు జూడని యీ వరరూపము లేమిటివో
యని యెంచి ॥రామ॥

వ. స్త్రీపురుష భేదాభేదంబు తెలియఁగని యతండు వారలఁ దన
వంటి ఋషులనుగా భావించి యిట్లనియె,

ఋశ్య, కీర్తన, ఏకతాళము, కనిపని-వరాళి:

ప్రమదమమరగ మిముఁ జూడగలిగెను। తమ యాశ్రమము
లెంత దవ్వుండు దెల్పుఁడెంత సముచిత సంభాషణములాడఁ గల్గెను॥
ప్రమ॥ మాకు గోచరమ్ము గాదు మారీతలనుండు। మీరు రమ్మన రెంతు॥
ప్రేమలెస గొమ్మనుండ।మాకెం బనులేక దాకీలాలయచు ॥ప్రమ॥
మీరెన్నడిటకు రారదివరకు సారెకు మాకు గుణముల నెట్లు నరకృప
తోడ। జేరిన కారణము జెప్పఁగఁ దగును॥ ప్రమదము॥

ఉ. అక్షయమైన తత్ఫలహారా దెసలన్ వెలిగించుచున్న రు
ద్రాక్షలు కంఠమందు వెలయన్ ధరియించితి రాహ్యలార! యా
వృక్షము తెచ్చుటన్ గలవి వెట్లు లభించెను మీకుఁ దెల్ప నే
నాక్షణ మేగి తెచ్చుకొని హారముగూర్చి ధరింతుఁ గుత్తుకన్.

క. పరిమళము గల్గు భస్మము
ధరియించితి రంగములనుదగ నిది గనులన్
దొరికినదో! చేసినదో!
కరము గురుతుఁ దెలుపరయ్యకవివరులారా!

గీ. హంస దండంబు లెచ్చటసలవడె? నివి
చేతముట్టిన నాదంబుఁ జేయుచుండు?
నిట్టి చిత్రాసనంబు లేతట్టుకలవొ
మావనంబున దొరకవు మానులార!

వ. ఇట్లు వారియందు బద్ధానురాగుండై తపస్సమాధి జాలించి వారింగలసి యిచ్ఛావిహారంబుగాఁ జరించుచు గాలంబు బుచ్చుచుండ నొక్కనాఁడు వారాంగన లిట్లనిరి:

క. మా యునికిపట్లు సేరఁగఁ
బోయెదమో మానివర్య! పొందుగ నెన్నా
ళ్ళాయె నిటువచ్చి యుఁకఁ సెల
వీయుము మాకన్న నాతఁడింతుల కనియెన్.

ఋషి, కీర్తన: ఏకతాళము, హంసధ్వని, రవితిలకశా.

విడువగ దగునా మహనీయులారా। తగునా। వగఁ దొ(ఱ)
యగఁ మే లగునా॥ విడువ॥ ఆడుగన్। జోడుగన్। దోడుగన్।
గూడియున్। వేడుకతోడుత విహరించియు విడ నాడగదఁలఁచుట
పాడియె॥ విడువఁగ దగునా॥ నే వచ్చెదన్। మీ వెంబడిన్। వేవేలుగన్।
భావింపకన్। బావనులార। కృపావహులై కొని। పోవుదునమ్మితిఁ।

గావున॥ విడువగ దగునా॥ ఒంటిగ । ఈ వనమున నే నుంటిగ । మిము వేడుకగాఁ గంటిగ । గలసి మెలసి యుం దుంటిగ । ఇఁక ననువిడువగఁ దగునా॥ మోక్షగుండ విభులదలచుచు మీ యాశ్రమముల్ । వీక్షింగఁజ మా కిచ్చవొడమె నిదిమేలు ! ఈక్షితి మిమ్మొడబాయక్-ఈక్షణామున రానీయుడు॥ విడువంగ దగునా॥

వ. అని యిట్లు వెంబడించిన వారకాంతలు దమ యిష్టార్థంబు సిద్ధించెనని సంతసించుచు నా ఘనుని యంగదేశంబునకుం జేర్చిరి రంత నాదేశంబున వర్షంబు గురిసి కాలంబు సుభిక్షంబయ్యెను. రాజు తన సుతయగు శాంతను ఋశ్యశృంగునకిచ్చి పెండ్లిచేసిన నతండు గృహస్థుం డయి యా రాజునింట భార్యాయుక్తంబుగనున్న వాఁడమ్మునిని దోడి తెచ్చి ముందశ్వమేధ యాగంబుచేసి పిమ్మటఁ బుత్రకామేష్టి సేసిన సుకుమారులయిన నలుగురు కుమారులను బడసెదవు. నిశ్చయమ్ము సనత్కుమారునివలన నీ వార్త మును నే వినియున్న వాఁడఁ గానఁ జెప్పితి నాప్రకార మాచరింపుడు,

తోహర. అని సూతుడు తెల్పిన దశరథుఁడతి హర్షాంబుధిలోఁ బొదలి చనియె రోమపాదుని నగరమునకు మునినిఁ బిలుచుటకుఁ గదలి॥ తా॥ శాంతతోడ ఋష్యశృంగుని దా సాకేతమునకుఁ దెచ్చెఁ, సంతానమునకు, జన్మము జేయించఁగఁదగ విధులిడియెనర్చెఁ॥ రా॥ అతని సమ్మతిని, నశ్వమేధమున కపుడు ప్రయత్నము చేసెఁ, అతివేగ వసిష్ఠాది, మునులఁ జన్యాన ఋత్విక్కులఁ జేసెఁ॥ రామ॥

కీర్తన: జంఝూటి, రూపకము.

అశ్వమేధ మఖముసేసె నవనిపాలుఁడు శాశ్వతముగఁ గీర్తి వెలయ సత్యశీలుఁడు॥ అశ్వ॥ గురులు వసిష్ఠాదిమౌని వరులు జెల్వుగ। సరగ వేద మంత్రములను జదివి వేల్వగ॥ నశ్వ॥ స్పష్టముగ సర్వజనులు దుష్టినొందఁగ । నిష్టమయినభోజనంబు లిచ్చిపొందుగ॥ నశ్వ॥ కోరినట్లు

ధనచయంబు గోట్లకొలఁదిని।ధారుణీ సురాదులకును దానమొసగుచు॥ అశ్వ॥ ఈక్షితి నారాయణ కవిరక్షకుండగు మోతుగుండ దేవుని కటాక్షమొందుచు॥ నశ్వ॥

సంధితోహర. ఇటుజన్నముసే, యించి పుత్రకా, మేష్టియొనర్పింపఁగను, దిటముగ యాగహ, విస్సులుపొందిన, దేవతలందఱుదగను॥ రా

వ. సత్యలోకంబున కరిగి బ్రహ్మకుఁ బ్రణమిల్లి తండ్రీ! మీ రిచ్చిన వరగర్వవశమున రావణాసురుండు విజృంభించి సాధువులకు బాధ చేయుచున్నవాఁడు. వాని ధాకకు లోకంబులు తేనువచెడి చీకాకుపడి యున్నవి. కావున నతని పొంగడంగు తెఱంగెఱింగింపవే! యని వేడిన దక్షణంబున,

సంధితోహర: వనజభవుడు దే, వతలను దోడ్కొని, వైకుంఠము నకుఁజేరి, యనువుగనారాయణమూర్తికి వందనములొసఁగి మదిగోరి॥ రా

కీర్తన: ఆదితాళము, (హరిచరణాస్మరణా) వలె.

పరమపురుషహరి। పాహిజనార్దన।సరసిజలోచన। సురవినుతా॥ శరణార్థులమము, జల్లనిచూపుల, నరసిబ్రోవవే। హతదురితా॥ పరమ। నీ వఖిలమునకు నేతవు దాతవు, నీ వెఱుంగనివి లేవు చూడు! దేవ మునుల బాధించుచు రావణుఁ డీవిశ్వమును జయించినాడు॥ పరమ॥దుర మున నాతని ॥ దునిమి మా బాధలు నరగున బాపుము శశివదనా!ధరను నారాయణదాసవినుత! కరి వరద! మోతుగుండ పురసదనా ॥పరమ॥

వ. శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకా! మహానుభావా! విశ్రవసుబ్రహ్మకుమారుఁ డగురావణబ్రహ్మ లంకలోనివసించి లోకకంటకులగు పెక్కండ్రు రక్కసులం గూర్చుకొని భీకరంబుగ లోకంబులఁ బీడించుచున్నాఁడు. దేవతలు తనయునికి పట్టుల నిలుచుటకు వెరవు లేదు. కాఁబట్టి పుత్రులకొఱకయి యశ్వమేధయాగంబొనర్చి శుచియైయున్న

రథుని భార్యలయిన కౌసల్య కైక సుమిత్రలయందు మీరు
ఖగు రూపంబుల నవతరించి దశకంఠునిరూపుమాపిమమ్మురక్షింపవే!

సంధితో హర: అని వేడిన బ్రహ్మాదులపలుకులు, విని హరిదయతో
యెౕ, జను డీక మీాయిష్టానుసారముగ, సలిపెద నేననియనియెౕ॥
వ॥ అంతట సురలకు నజుడు తెలిపె మీా, యంశంబుల వానరుల,
కమీాఱః గల్పించి తోడుపడు, డెంతయు ద్రుంతు నసురుల॥ రామ॥

సంధి, వ. అని విరించి యెంచి వివరించిన మంచిదని దేవతలు
స్థానంబులకుఁ జని తమతమయంశంబుల డెబ్బదిరెండు వేల్వవనచరుల
ష్టించిరి. వార లతిబలశౌర్యధైర్య సాహసంబులు మెఱయ గొంద
ద్ర నందనుండగువాలిని, గొందఱు సూర్యతనయుఁడగు సుగ్రీవుని,
ందఱు వాయుసుతుండగుహనుమంతుని, గొందఱువహ్న్యంశసంభవుం
ు నీలుని నిట్లొక్కొక్క మొనగాండ్రతోఁ గొంతకొంత బలగము
కొలుచుచు దుర్గమంబులగు విపినమార్గంబుల సంచరించుచుండిరి;
-డ నయోధ్యయందు,

కీర్తన, అటతాళము.

ఒకదివ్యపురుషు డుదయించె నంతఁ। బ్రకటహోమాగ్నిలో పల
డి వింత॥యొక॥ హరినీలనీలాంగుఁ డరుణతేజుండు, నరుణాంబరుండు
ాసవిక్రముండు॥ నొక॥ పాయసపాత్రను బాణితలమునఁ బాయక
ుచి పరమహర్షమున॥ నొక॥ గురుతరముగ మోక్ష శ్రీహరిని, స్థిర
ుతో నుతి సేయుచు ధృతిని॥నొక॥

ఆ. వె. తనను జూచియద్భుతం బందుచును లేచి
వినుతుఁడైన విభుని వెలయఁ గాంచి
భూమినాథయజ్ఞపురుషుండ సుతుల నీ
యంగ వచ్చితిని బ్రియంబుమీఱ.

శ్లో. అనువుగ నీపర మాన్నమ్మును నీ యంగనలకుఁ బంచిమ్ము
ఇనకులవర ! నీ-యిష్టార్థంబును, ఇఁకను బొందెదవు సుమ్ము ॥రా॥

వ. అనియిట్లు యజ్ఞపురుషుండు పాయసమహిమంబు సెప్పి తత్పాత్రను దశరథున కిచ్చి యదృశ్యుండయిన ధరణీవిభుఁ డక్కలశంబులోని పరమాన్నంబును కౌసల్యకు సగము, కైకకు సగము నిచ్చిన వారిద్దఱుఁ దమ యంశంబులలో సగము సుమిత్రకు నిచ్చిన నంతట వారది పుచ్చుకొనిరి, పిమ్మట భూవిభుండు ఋశ్యశృంగాదిఋత్విక్కులస్వదేశంబులకు వీడ్కొలిపి తాను కాంతాయుతంబుగ స్వకీయసౌధంబు చేరి సుఖలీల నుండె. అప్పాయసమహిమ వలనఁ కౌసల్యాదికాంతలు గర్భవతులయిరి; అంత.

ఉ. మన్నురుచించె నెన్నడలు మందము లైతగె; మోముదమ్ములున్
గన్నులుఁ దెల్లవారెఁ బొసఁగన్ నలుపెక్కెను జూచుకంబులున్;
అన్న మసహ్యమయ్యె; బహుళాభరణాంబర పఙ్క్తి భారమ
య్యె; న్నెల లంత కంతకును హెచ్చఁగఁ గాంతల కబ్బురంబుగన్.

వ. ఇట్లు క్రమక్రమంబున పండ్రెండు నెలలు నిండిన,

## శ్రీరామాది పుత్రజననము.

కీర్తన- కమాసు; రూపకము.

పుత్రోదయమాయెనప్పుడు, మిత్రకుల పవిత్రుండగు, ధాత్రీపతి-చిత్రమొందఁ ॥బు॥ చైత్ర శుద్ధ నవమి పగలు సౌమ్యవాసరాదితి న క్షత్ర కటకలగ్నయుత పవిత్రంబగు వేళను శుభ గాత్రియైన కౌసల్యకు ॥బు॥ ప్రాకటముగఁ బుష్యతారఁ, బదిరెండవ లగ్నమందు, కేకయరాజ పుత్రియైన శ్రీకరసుచరిత మంగళ కోకకు నా కైకకు నొక ॥పు॥ పాత్రంబగు కటకంబున, ఫణితారను గ్రహములు నతి, మైత్రిమెలఁగంగను శత పత్రాయత నేత్రకు శుభ, గాత్రకు సుమిత్రకు బహు॥ పుత్రో॥ రక్షకుఁడయి తాళ్లూరి నారాయణ కవి నేలు

చుండు, మోక్షగుండనిలయ కృపా వీక్షణమునఁ నా క్షణమున, నక్ష
యశుభ లక్షణులగు॥ పుత్రోదయ॥

క. తనయులు గలిగిన దశరథుఁ
డనుపమ సంతోషపులకితాంగుం డగుచున్
దనర వసిష్ఠుని బిలిపిం
చిన నాతం డరుగు దెంచిచిత్తం బలరన్.

సంధితోహార నామకరణ పుణ్యాహవాచనము లామునివర్యుఁ
డొనర్చెన్ - రామ భరత లక్ష్మణ శత్రుఘ్న సునామములవు దేర్ప
ఱిచెన్॥ రామ॥

వ. ఇట్లు వసిష్ఠమహర్షి స్వస్తివాచనమైన పిదప భార్యాత్రయ
శిశుచతుష్కయుతంబుగా దశరథుని పీఠంబులపంబు నాసీనుఁ జేసి సభా
సదుల సమక్షంబునఁ గౌసల్యాసుతునకు రాముండనియు, గ్రకేయికొడు
కునకు భరతుండనియు, సుమిత్రానందనులకు లక్ష్మణ శత్రుఘ్నులని
యు, బేరులు పెట్టి రాజువలన బహుమతులు వడసి చనిరి. అంత సంక
ల్పసిద్ధియైనందునకు భూకాంతుండు సంతసించి కాంతలతోఁ గూడి
సుఖంబుండె. పిమ్మట శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు తల్లులవలన
దాదుల వలనను సాఁకఁబడుచు బాలసూర్యులవలె దినదిన ప్రవర్ధమాను
లయి చిన్న వయస్సునందే యాటలాడ నారంభించి,

కీర్తన-ఏకతాళము (ఈశరాంబుజరాయ)- దరు.

వార లాటలాడి రీడు వారిఁ గూడుచున్; కోరి-చేరి చేరుచున్
బాలుచున్ పౌరుషంబులున్, సారెకు నెగడన్, పోరులు పొగడన్॥
వారలాట॥ నొవ్వన్, నవ్వన్, జివ్వకున్, గవ్వచున్, నవ్వడిగనిన్।
బువ్వల చెండున్ - రువ్వచు మెండున్॥ వారలాట॥ నాగి - మూగి,
లోగకన్, వాగకన్, యోగిరంబులున్, బాగుగఁ దినరన్, వేగము

చనకన్॥ వారలాట॥ దీక్షన్ఁ, గక్షన్, దక్షులై, తలఁగకన్, మోతుపుర పతియక్షయ కరుణా వీక్షణ గలుగన్॥ వారలాట॥

వ. ఈలీల బాలక్రీడాలోలురై కాలంబు పుచ్చుచున్న సమయంబున,

సంధితోహర: కైక దాసి యొక్కతె మంథర వేళాకోళంబని యెంచి, చేకొని చేతులఁ-జెండుదట్టుటయు, శ్రీరాముఁడు గోపించి, కట్టె దీసికొని కొట్టెనంత నొక - కాలు విరగ నత్తరుని, యట్టెమదిని జెర గొట్టుచు గొణగుచు నవతఁల జనెన త్తని॥ రామ॥

క. ఈలీల బాలురాటల
పాలయి క్రీడించుచుండఁ బరికించి మహీ
పాలుఁడు వసిష్ఠమౌనిని
మేలుగఁ బిలిపించి పలికె మృదువాక్శ్రేణిన్.

దళ, కీర్తన, దర్బారు అటతాళము – (రమ్మని పిల –) వలె.

మ్రొక్కెద నార్య, మునికుల వర్యా, అక్కట బాలకులాటల మరిగిరి॥ మ్రొక్కెద॥ చదువులు సాములు, చదివించివీరల, ముదమున నీతి కో విదులను జేయవే॥ మ్రొక్కెద॥ మోతుగుండాధిపు సాక్షిగ బిడ్డల, నక్షయ విద్యా దక్షుల జేయవే॥ మ్రొక్కెద॥

క. బాలురను బుద్ధికౌశల
శీలుర గావింపుడని వసిష్ఠునితో భూ
పాలుఁడు పలుఁగఁక విద్యా
శాలకుఁ గొనిపోయి చెప్పెఁ జదువులు సాముల్.

వ. ఇట్లుదశరథుని నియోగంబున రామలక్ష్మణ భరత శత్రుఘ్నుల విద్యాశాలకుఁ గొనిపోయి వసిష్ఠమహాముని స్వల్పకాలంబుననే చౌషష్ఠి విద్యాపారంగతులఁజేసి తోడితెచ్చి యొప్పగించిన భూపాలుండు

సంతసించి వారివలననే యుపనయనంబులు సేయించి వివాహంబునకు యత్నింపుచున్న సమయంబున,

సంగతిలోపాహర. దండకమండల, ధారుడగుచు మోదంబున గాధేయుండు, కుండలిశయనుని - గొలిచియోచుచు గ్రక్కున వచ్చె దీరుండు॥ రామ॥

కీర్తన: అటతాళము.

రామ కృపాకర ! రఘుకుల శేఖర ! స్వామి, నిశాచరసంహార ! శ్రీకర ! ॥రామ॥ మీనకూర్మ కిటి నరసింహ వటురూపక భృగు వంశజ రాఘవ ! ॥రామ॥ సాక్షి స్వరూపక ! మోక్షగుండ పురాధ్యక్ష! నారాయణ దాసనుతా ! జయ ॥రామ॥

తో॥ వచ్చిన మునివరు వార్త తెలిసి భూవల్లభుడెదురుగనరిగి, చెచ్చెరదోడ్కొని, వచ్చి సుఖాసన మిచ్చి పలికె దానెఱిగి ॥రామ॥ ఏమిపనికి మీ రిటకు వచ్చితిరో యొసగింపుడు దయతోను; స్వామి, నేను నిశ్చయముగ నా పని వలిపెద చెప్పుడన ననను.

విశ్వా: కీర్తన-నాదనామక్రియ-చాపుతాళము.

ఓహో రాజా ! నా మనవి వినుమ ॥మోహో॥ ఆహాహా నే నొక్క యాగము జేయ సు । బాహు మారీచులు । బహులవిఘ్నములు సేతు॥ రోహో॥ భూమిపుంగు వారిని, బాలించుటను మన-రామ లక్ష్మణు లను ప్రేమతోం బంపుము ॥మోహో॥ అక్షయముగను నారాయణ కవినేలు మోక్షగుండేశుండు రక్షించు మిమ్ముల నో ॥హోహో॥

వ. నేను యాగంబు సలుపు సమకట్టిన త్రిలోక కంటకుండగు దశకంఠునిచే సముజ్ఞాతులై మారీచ-సుబాహులు వచ్చి విఘ్నంబులు చేయుచున్నవారు. కాంబట్టి వారిని జంపి యజ్ఞంబు పరిసమాప్తినొందింప నీ కుమారులలో రామ-లక్ష్మణుల నా వెంట బంపు మని విశ్వామిత్రుం డడిగిన దశరథుండు,—

దశరథుని కీర్తన: దర్బారు, రూపకము.

వీరి నంపఁ జాలమాని వీర నీను వెనువెంటను । జనుడంచును। క్రూరరాక్షసులతో బోర । నేరరు నా కుమారులు సుకుమారులు గద ॥వీరి॥ తల్లుల నెడబాయలేరు; విల్లమ్ములు పట్టనేరరుఁగ; రల్ల యుద్ధభూములలో నుల్లంబుల నల్లన భీతిల్లరె! యిక ॥ వీరి నంప॥ మోతుగుండపురనివాసు సాక్షిగ విను ధీరు యజ్ఞ దీక్షబూను దేను వచ్చి, యాక్షణమున రాక్షసులను శిక్షింతును ॥వీరినంప॥

సం॥తో॥ దశరథు డిటువలెఁ దనతోఁ బలికిన - తాత్పర్యము నాలించి, విశదంబుగనా విశ్వామిత్రుఁడు వినకయనిమెఁ గోపించి॥రా॥

విశ్వా-కీర్తన-బేహాగ్: ఏకతాళము.

బలే, బాగునీమాటమహారాజా! బలే॥ బాగాయెగా-యాగా శాబాస్‌బలే ॥బాగు॥ నే గావించెద నీవను లనుచును వేగముతోవాగి తివి; మేలు శబాస్ బలే ॥బా॥ భానువంశజులు పలుక రబద్ధము; సీ నాడుగాన బడె; మేలు శబాస్ బలే ॥బా॥ మోతుగుండవిభు సాక్షిగ సభలో నీక్షణమే యే మంటి? మేలు శబాస్ బలే ॥బా॥

సం ॥తో॥ విశ్వామిత్రుఁడు వీరావేశము - వెల్లివిరియఁ బలుకఁ గను; విశ్వంభరపతి వెఱచుచు గురునకువినతు డగుచు నిట్లనెను ॥రా॥

దశ. కీర్తన: ఆదితాళము.

వినవే మునివర! వినవే తెలిపెద; వినవే నామొర వినవే! కడువడి ॥విన॥ విను వసిష్ఠవర మునిచంద్రమ! మొర ॥వినవే॥ రామ లక్ష్మణుల వే మఖరక్షణ కై ముని బిల్వఁగఁ గదలి వచ్చె నిది ॥విన॥ తాపసవరుని వృథాగను బంపినఁ, గోపముతోడను శాపము వెట్టును॥ విన॥ లేక లేక కల్గిరి వీరలు నా కీకాలమునకు! నెటులబంపుదును!॥విన॥ మోతుగుండకమ లేక్షణుకృపతో! దీక్షగ నా సందియముఁ బాపవే॥విన॥

క. అనితనతో నాలోచిం । చినభూపతి వాక్యములను జిత్తం బలరన్ వినియవ్వసిష్ఠమునిపతి । యనుపమమృదువాక్యసరణినవు డిట్లనియెన్.

వసిష్ఠునికీర్తన-హిందూస్థాని-కాఫి: అటతాళము.

రాము నంపినభయ మేమీ తెల్పు భూమీపాల ! ॥ రా ॥ రాముఁ డన సామాన్యుఁడా శ్రీమహావిష్ణునగు॥ రాము॥ ఉరగపతిలక్ష్మణుఁడు; ధర-సుదర్శనములు భరత శత్రుఘ్నులల పరాశక్తియె సీత॥ రాము॥ రాక్షసుల శిక్షింపఁగ, నీక్షితి నారాయణాఖ్య రక్షకుండు మోక్షగుండాధ్యక్షుఁడయి కలిగె నీకు॥ రాము॥

వ. ఈ గాధేయునకు మొదట కోరిన దాని నిచ్చెదనని చెప్పి యిప్పుడు బొంకవచ్చునా! సూర్యవంశ రాజులు సత్యవంతులని యెన్నికఁ గన్నకీర్తి యేల బోనాడెదవు? రామలక్ష్మణులకు రాక్షసులవలన గీడు మూడునను సంశయము మానుము. దీనివలన నీకు దప్పక మేలు గలుగును. నీ కుమారులను యజ్ఞసంరక్షణ కొఱకు గాధిపుత్రుని వెంట బంపుము.

సంధితోహార: అని వసిష్ఠుఁ డిట్లనుటవలన నెమ్మనమున నానందించి, జననాథుఁడు రాముని సౌమిత్రిని దనచెంతకు రావించి ॥రా।

దశ. కీర్తన-అటతాళం.

నాయన యీరాముని నాయకు వెంబడి నీయనుజునిగూడి పోయి రావోయి ॥నా॥ ఈయన యజ్ఞము చేయఁగ దానవు లాయెడఁ గొనసాగనీయరట దాన ॥ నా॥ యాగవిఘాతకు లగు మారీచాదుల వేగమె త్రుంపుము; సాగు నామీఁద ॥ నా॥ ఈక్షితిలోపల మోక్షగుండేశ్వరుఁ డక్షయ శుభముల నాక్షణ మిచ్చును॥ నాయన॥

ఉ. మాటికి బుద్ధిదెల్పెదఁ గుమారకులార; పరస్థలంబునం
దాటలఁ బాటలన్ దిరిగి యారడి నొందక యోగ మేచు నా
తాటకలోనుగాఁగలుగు దైత్యసమూహము ద్రుంచి నొంచి యి
మ్మాటికి బ్రీతిజేయుఁడట మీఁద యశం బలరాను మీకిలన్.

వ. అని కుమారులకు బోధించి విశ్వామిత్రమునిని గాంచి దశరథుండు గరకమలంబులు ముకుళించి.

దశ-కీర్తన-అటతాళము-హిందూ, తోడి.

తల్లిదండ్రుల చాటువారలు తాపసోత్తమ వీరలు; మెల్లనను గొనిపోయి వేగమె యిల్లుచేర్చుడు మీరలు ॥ తల్లి ॥ ఆకటికి దప్పికిని నొక క్షణమైన నోర్వగజాలరు; నీ కృపారస మెట్లుజూపెదో! నీకు దాసులు బాలురు॥తల్లి॥మోక్షగుండపురీశు కృపతో ముదముతో సేతెంతురు; ఆక్షణంబున వచ్చి మఖసంరక్షణను గావింతురు॥ తల్లి॥

సంధితోహర : అని గాధేయున కప్పగించి తన తనయుల నటు దీవించి, చనుడని పంపించిన తఱిలిరంత మునివెంబడిమోదించి॥ రామ॥

వ. ఇట్లు శ్రీరామ లక్ష్మణులు మునివల్లభునితోఁగూడి యారాత్రికి అర్ధయోజనము నడిచి సరయూనది తీరమునకుఁ జేరి మహాశ్రమ నొందుచున్నఁ గరుణించి విశ్వామిత్రుండు దాను మున్ను బ్రహ్మానలనఁ దపోమహిమచే నార్జించిన బలాతిబలములను దివ్యమంత్రముల నుపదేసించిన నామంత్రయుగప్రభావమ్ముచే రాజపుత్రులు ఆకలిదప్పి సొసలు మొదలగు బాధలనొందక దృఢగాత్రులయిరి. అంత నారాత్రి యక్కడ నివసించి మరుదినము ప్రయాణమై పోవుచు నా చెంగట నొక మహాధ్వని విని యిదియేమియని రాముడడిగిన మునీంద్రు డిట్లనియె:

విశ్వా-కీర్తన-ఖ్యాండు స్వరము: ఆదితాళము.

రామ రామ విను మది రాజితగంగానది; యీ మహానదిని మున్ను శివితలనుండి ప్రేమభగీరథుఁడీమహికిని దెచ్చె॥ రామ రామ॥ పట్టుగా నయోధ్యను జుట్టివచ్చి యిచటను దిట్టముగా నీ నదీసంగమం బగు నట్టులగాన మహాధ్వని గల్గెను॥ రామ॥ అక్షయఫల మిచ్చును, నఘములఁ బోకార్చును, మోక్షగుండపురాధ్యక్షు, నారాయణ రక్షు, మీ పదముల రహిని బుట్టె మున్ను॥ రామ॥

వ. ఇట్లు గంగానదీప్రభావంబు గాధేయునివలన విని యానందించుచు నాస్థానంబు గడచి యంగాశ్రమము మొదలగు ప్రదేశములు చూచుచుఁ బోవుచున్నయెడ,

సంధి తోహార: కన్నుల నిప్పుల కణము లురుల దిక్కరులు మదని బెదరఁగను, దన్ను గెలుచువారు ధరలే రనుచును దాటక వచ్చెను దగను॥ రా॥

వ. అప్పుడు శ్రీరాముఁడు లక్ష్మణునిఁ జూచి,

రాముఁడు. కీర్తన-ఆదితాళము. 'భజియింపవే మనసా' వలె.

కనుగొంటివా! లక్ష్మణా! కనుగొంటివా! దనుజవచ్చెడితీరుఁ ॥కనుగొం॥ మిడిగ్రుడ్లు కోఱలు దెఱచి, మిన్నునగులఁగఁ బెడబొబ్బలిడుచు బుడమి యదరఁగ॥ కను॥ మోక్షుగుండవిభుని నిన్ను, ముట్టడించిన రాక్షసి పోవఁగ గలదె ప్రాణముతోన॥ కనుగొంటివా॥

వ. అని తెలుపుచుండ,

సంధితోహార: అంతట రక్కసి మిడిసిపైకిఁ దా గంతులువైచుచు రాగా, మంతనమున దాని మర్దింపుండని మౌనివర్యుఁ డనె వేగ॥ రామ॥ మంచిదనుచు నొక మహితశరము సంధించి రాముడటు వ్రేయ మించి యురముభేదించి ప్రాణము వధించిన నది పడిపోయె ॥రా॥

క. తాటక పడిసిన, రాముని। గాటముగాఁ గౌగిలించి, గాధిసుతుం డ
మ్మేటికిసమంత్రకంబుగ। సూటిగశస్త్రాస్త్రములనుసొంపుగనిచ్చెన్.

వ. ఇట్లొసంగి ప్రియంబున నారాజసుతులఁ దనయాగస్థానంబగు వామనాశ్రమభూమికిఁ గొనిపోయిన, రాముఁడు,

రాముని కీర్తన, బేగడరాగము: ఏకతాళము.

మఖము జేయుఁడు, మౌనితిలక మీరు॥ మఖము॥ అఖిల ఋషులఁగూడి, యమితమోదమున॥ మఖము॥ అసురపీడులు నే డడచెరుపగను;

గుసుమశరారిని గూడిరా విడువ॥ మఖము॥ భూమి మోక్షగుండ పుర
మున వెలసిన స్వామి కృపచేత, సన్న్యాసిచంద్రమ॥ మఖము॥

వ. ఇట్లు చెప్పిన,

ఉ. అంతట గాధిసూనుఁడు మహాముద మొందుచు రామునాజ్ఞచే
నెంతయు దీక్షఁబూని, సమునీశ్వరుఁడై మఖ మాచరింపఁగా
మంత్రము లుచ్చరించుచును మానులు హోమము చేయుచుండ భూ
కాంతసుతుల్ ప్రియంబునను గాంచుచునుండిరి పంచరాత్రముల్.

సంధితోహర: వరమారీచ సుబాహులు గడపట వచ్చి మాయ
లకు జొచ్చి, పోరి మలమూత్రంబులు హోమాగ్నుల గురిపింపగ
గడు హెచ్చి॥ రా॥ రాము డొక్క-శర రాజము వైచిన, నామారీచుని
వడిగ, దామసించి తత్తరపడ వైచెను నామహాబ్ధిలో బడగ॥ రా॥ పదపడి
మఱియొక బాణము వైవ సుబాహుడు నీలిగె నంత; ముదమున శ్రీరా
ముని దీవించుచు మునులు వొగడి రాచెంత॥ రామ॥

మునుల కీర్తనము—యదుకుల కాంభోజి: ఆదితాళము.

శ్రీరామరామ రామ, సునా శ్రీరాదివినుతనామా, సారెకునీ
మాయ దాటనేరము భక్తకామా॥ శ్రీరామ॥ నీకంటె నొం డేమియు,
లేక నిండియున్నావనియు బ్రాకటముగ, శ్రుతులు పలుకు లోకేశ
నిక్క-మదియు॥ శ్రీరామ॥ యాగముగాచినావు; తాటకాదుల దునిమి
నావు; రాగ రహిత యోగులకు బాగుగావించినావు॥ శ్రీరామ॥ సాక్షి
స్వరూపుడవు; శ్రీ మోక్షగుండేశుడవు; సాక్షాన్నారాయణ కవిని
రక్షింతు వెపుడు నీవు॥ శ్రీరామ॥

వ. అని కొనియాడి మును లిట్లని యాలోచించిరి:

తోహర: జనకుడు శంకర చాపము సారిం చిన వరరాజసుతు
నకు, దనకూతురు సీతను నిచ్చెద నేనని చాటించెను నటకు॥ రా॥ మన

ుని గొని చనినశుభంబగు నని మును లాలోచించి, దినకరకుల
ని రాముని గనుగొనిపలికిరి మోదించి॥ రా॥

మునుల కీర్తన - కమాస్: ఆదితాళము.

పోదమురా! రాఘవ॥ పో॥ సముచిత సంభాషణములతో
నము; అనిమిషాదులకు నలవిగాని యొక ధనువు గలదు జనకుని
లో। మనము దాని గను గొని వత్తము॥ పోదమురా॥ నయముగ
ర్వారి నారాయణకవి ప్రియమున గొలువంగ దయ గనుచు, రయ
మోహకుండ రమణ! రామ॥ పోదమురా॥

క. అని రామలక్ష్మణులం దో
డ్కొని గంగాతీరమునకుఁ గూరిమితోడం
జనునెడ నిర్జన మగు నొక
వన మగుపడఁ గాంచి మౌనివరునకు ననియెన్.

రాముని కీర్తన - కమాచ్: ఆదితాళము.

ఈవన మెవరిది సుధీవర! తెల్పు॥ ఈ॥ ఈవనమున పావనము
ము బావులు దీవులు తావులు గలిగిన॥ ఈవన॥ శుకపికరవము శిఖి
ప్రాకటమై కేకులమూకల కేకలుగలిగిన దీవన జరుగెవరు। గన
మును పిచట మునులుండిన తావని తోచెను మది ॥ఈవన॥
కుండాధ్యక్షుకృపాపేక్షణచేలక్షణవృక్షములక్షయముగగల॥ఈవన॥
సంధితోహార: రాముం జూచునలె వయమున నా విశ్వామిత్రు
నుగ, స్వామి, తెలిపెదను జక్కగ విను మీస్థలవిశేషమును
రా॥

విశ్వామిత్రుని కీర్తన: ఆదితాళము.

గౌతమవన మిది కనుగొను రాఘవ! యాతని భార్య యహల్య
, నాతరుణిని పురుహూతుఁడు గలియఁగఁ బ్రీతితో నంచ గామా
తై ॥గౌ। కుక్కుటరూపుఁ గైకొని నడిరేయినిఁ గొక్కురొ

కోయని కూయగను । జక్కఁగ నమ్మౌని స్నానార్థము జన నిక్కఁడ రతుల సుఖింపఁగను ॥గౌత॥ కాలముగా దని క్రమ్మర వచ్చియుఁ జాల వారిచేష్టలకలిగి యాలిసి గని శిలయటు లగు మని యా వేళను మౌని శపింపఁగను ॥గౌత॥ రక్షింపుము శాప మోక్షము దెలుపుము; కక్ష వద్దనగ, గరుణతోను మోక్షగుండరాముని పాదము సోక నాక్షణ మేతీరు నని యనెను॥ గౌతమ॥

వ. ఇట్లు శాపవిమోచనకాలంబు చెప్పి గౌతముండు హిమవం తంబునకుఁ జనియె అది మొదలీ వనంబు నిర్జనమైయున్నది. రామా! పరంధామా!

తో: కావుననో రాఘవ యీరాతిని గావింపుము వనితగను నావుడు రాముడు, నవ్వుచు నటులనే కావించెద సరి యనెను ॥ రామ॥ రాముం డా మార్గంబున నేగియు రాతిమీద బద మిగడఁ గోమలియై గ్రక్కున లేచి శ్రీరాముని బాగడఁగ దొడఁగెఁ॥ రామ॥

అహల్య, కీర్తన-ఆదితాళము : (తంగమెట్టు) వలె.

వందనమో రఘువర్య, మందరధైర్య! సుందర పాదార విందయుగ్మమునకు॥ వంద॥ నా పాపమున శిలా రూపము నొందిన శాపము బాపిన నీపాదపద్మములకు ॥వంద॥ భువనత్రయంబును బ్రవిమలముగ జేయు దివిషత్స్రవాహిని భవమైన పదములకు ॥వంద॥ మూడడుగులు భక్తి తోడ నిచ్చిన బలి మాడు పైనుంచిన మంగళ పాదములకు ॥వంద॥ భాసుర మోక్షగుండ వాస నారాయణ దాసమనోబ్జసం వాసిత పాదములకు ॥వంద॥

తోహార. అని యిటు వందన మాచరించి రాముని వీడ్కొని యా కాంత! ఘనివినియెను దన భర్త చెంతకును నినకుల సంభవుడంత ॥రా॥

వ. గంగానదిని జేరి యన్నదిని దాఁటుటకు నావ యెక్కఁబోవు రామునకు నావికుం డిట్లనియె:

ఆ. వె. రామ! తను పదాబ్జరజముసోకంగనె
కఠినమయిన రాయి కాంతయయ్యె!
నావ దారుమయము; నాతిగాకుండునే!
యెటుల బ్రదుకువాఁడ నినకులేశ!

వ. కావునఁ, దమ పదంబులు గడిగికొనక నావయెక్కవలదన్న, నవి యటులనే కానిమ్మనినఁ, గణఁధారుండు గంగానదీ జలంబులచే రాముపాదద్వయ ప్రక్షాళనంబుఁజేసి వస్త్రంబుచేఁ దుడిచి యారోహింపఁజేసి, నది దాటించిన, పిదప,—

తోహర: తాపసవర్యుఁడు రాముని వర మిథిలాపురి కేగఁ నెఱిగిఁ। ప్రాపుగ జనక ధరాపాలుడు దా బరుగున నెదురుగ నరిగి ॥రామ॥

వ. తోడుకొనిపోయి సభాస్థానంబునకుఁ జేర్చి రత్నసింహాసనాసీనులం జేసి,

క. రంగుగ గాశికునకు సా
ష్టాంగ నమస్కార మొసగి యర్చించి యనం
గాంగులగు రామ లక్ష్మణు
లంగని సంతోషమునఁ జెలంగుచుఁ బలికెన్.

జనకుని కీర్తన—సురటరాగము ఆదితాళము.

మునీంద్రా! వీరెవరో తెలుపుము॥ మునీం॥ మనోజ సుందర మంగళరూపులు ॥మునీం॥ మరుసమానసుధీరులు నతిసుకుమారులు నెవరికుమారకులో వీరిటు రాగను గారణమేమో॥ మునీం॥ వేడి వెలుగు తే వెలుగులవలెనే జోడుగూడి మీతోడుతను వేడుకతోడుత

నేడు వచ్చిరి ॥మునీం॥ మోక్షగుండపురమున వెలసి జగద్రక్షణచే పరాత్పరునిదీక్షమీర వినుతించుచు తెలుపుము॥మునీం॥

ఉల్లంబులు రంజిల్ల విల్లమ్ములు గరపల్లవమ్ముల నల్లనల్లన యుంచి మెల్లమెల్లన వచ్చిన యీ మారసమాకారులు సుకుమ లెవరి కుమారులో దెలుపవే! మహానుభావ! తపఃప్రభావ!

తో. అని యిటువలె వేడిన యాజనకుని వినయ వాక్కు లించి, విను మని బాలుర వృత్తాంతము మునివిభుడు దెలిపెమో ॥రామా॥

విశ్వా- కీర్తన. జంఝూటి- అటతాళం.

మహారాజ! దశరథ తనయు లాదిన రాజకుల ఘనులు; రాజకులఘనులు! శ్రీరామ-లక్ష్మణులు॥మహా॥ చనుదెంచి మారీ సుబాహు జయించి యాగమ్ము, జయించి యాగమ్ము, సా గిం దినమ్ము॥ మహారాజ॥ శిలరూపమైన యహల్యశాపము వాపిరి వెత బాపిరి వీరు; కృపతోప గనినారు ॥మహా॥ మీ యింటగల చాపమును గను గొంటకై కోరి, కనుగొంటకై కోరి, నా వచ్చిరి॥మహా॥ శ్రీ మోక్షగుండాఖ్యుడు కృప నిట లాక్షు విలు సు నిట లాక్షు విలుసూపి, పరీక్షగనుడోపి ॥మహా॥

చ. మునివిభుఁ డిట్లు లాడగ, బ్రిమోదకముతో జనకావనీశుఁ
పిన పదివేలమంది భటవీరులు దోర్బలవంతు లేగి, య
మ్మనసిజవైరి విల్లుగల మందస నీడిచి తెచ్చి తత్సభ
ఘనముగ నిల్పఁగాంచి నృపకాంతుడు కౌశికుఁగాంచి యిట్లనె

జన - కీర్తన కాఫీరాగము-రూపకము.

విన్నపమయ్యా మన్నింపుము మౌనివర్య॥ విన్నప॥ మున్ను భూ దున్నగ నొక కన్నియ వే గమున దొరకె॥ విన్నప॥ కూతుగగొ ఖ్యాతిగ నే సాకుచుంటిః చేత మలర సీత యనుచు ప్రీతిగ నే బిల

టి ॥ విన్న ॥ అక్షయపదవి సాక్షాన్నారాయణకవి కక్షయ మీా
నిడి రక్షించెడి మోక్షగుండ విభుసాక్షిగ॥ విన్నప॥

వ. ఇట్లు గారాబంబునఁ బెంచుచుండ నబ్బాలికారత్నంబు శుక్ల
చంద్రునింబోలె దినదిన ప్రవర్ధమానయై యలరార,

గీ. పటికవార్చిన కనకంబుపదిగి, మృగమ
దంబుఁ గూర్చిన దివ్యచందనముభాతి,
సానబట్టిన వజ్రంబుచందమునను
యౌవనస్ఫూర్తిఁవహియించి యలరె సీత.

ఇట్లు జవ్వనంబు నిండారి యున్నతఱి,—

జనక. తో: మాళవ ఘూర్జర మగధ నిషధపాంచాల సింధు
ర, చోళ వంగ నేపాళముఖ్య దేశాల నృపులు వేర్వేర ॥రా॥

వ. చతురంగబలంబుతోఁ గూడి వచ్చి మదాౕజధానిం జేరి
క్రమంబున ని ట్లని యడిగిరి:

రాజుల కీర్తన—కమాచ్: ఏకతాళము.

వినవయ్యా జనకభూవరా ! వినవ॥ నెయ్యముతోడ మీా
;ము గోరి, యియ్యెడకును మే మేతెంచితిమీా॥ యయ్యా॥ నిరు
ాతిౕకి నీ వరపుతిౕకి సరియగునాతని బరికింపుము ॥వినవ। మా
నెవరికి బోలునో వానికి, నా లలనామణి నర్పింపుము॥ విన
య్య॥ అండబాయక మోక్షగుండవిభుడు బోౕచుచుండు సదా మిము
కృపతో ॥వినవయ్యా॥

వ. అని యడిగిన వారికి నే నిట్లంటి.

తోహార: ఈశునివిలు మాయింట గలదు దాని నెక్కిడు
ిమరునకు । నీ శుకవాణిని నిచ్చి పెండ్లిగావింతు నన్ను విని
ప ॥రా॥ రా కుమారకు లనేకులు గుములై ప్రాకటబలులరై
ఖూ కోదండము నెత్తగ నోపకనింనుండిరి కను వారి॥రామరామ॥

క. ఈవింటఁ గూల్చెఁ ద్రిపురము;
లీవింటగజాంధకాద్యనేక రిపుల ముం
దే వధియించెను; శంకరుఁ
డీవింటనె దక్షయాగ మేడ్తెర నడచెన్.

వ. అప్పుడు మా మూలపురుషుఁడగు నిమిచక్రవర్తికి నాఱవ తరంబువాఁడు దేవరాతుడు సాయపడి దేవతలఁ దోలిన మెచ్చి యతని కీశ్వరుఁ డీ విల్లు నిచ్చె.

తో: అది మొదలుగ మా యన్వయజాతులు హరదత్తశరాసనము, ముదమున మందసమున నిడి సంతత మును బూజింతురు నిజము॥ రామ॥

జనక-కీర్తనము-కాఫీ: ఏకతాళము.

ఈ శరాసనంబసాధ్య మేరికైనను । గౌశిక మునిచంద్ర! యీ మహీశు లరయను ॥ఈ॥ భీతిలేక రాముఁడెక్కు వెట్టి తిగిచిన, సీత నిచ్చి నేను బెండ్లి సేతు బ్రియమున ॥నీశ॥ ఈ క్షితి నారాయణాఖ్య రక్షకుం డగు మోటుగుండనగర విభునిసాక్షిగవినుడు॥ ఈ॥

వ. అని జనకమహారాజు సెప్పుచుండ, సీతాదికాంత లంతఃపురంబునుండి యాలించి, సోరణగండ్లనుండి శ్రీరాముని వీక్షించి సీతకుం జూపుచుఁ జెలులిట్లనిరి:

క. రాకొమరు లనేకులు నేఁ
డీకార్ముక మెత్త వచ్చి యుందుండి; రిదో
యీకోమలి, వా రెవ్వరు
నీకమనీయాంగు బోల; రిది నిజముసుమీ !

ఉ. ఆ నగుమోముసుందరము, నాకరపల్లవ కోమలంబు, నా
జానువు లంటు బాహువులచందము, నాకనుదోయి యందముల్,

ానిని, కాంచుమా త్రిదివ మర్త్య రసాతలలోకవాసులం
వమోహనాంగునకు నీ దగు వా రొక రైన లే రహా !

చెలికీర్తన- శహానరాగము; రూపకతాళము.

నీకు దగిన మగడు గదవే! నీలవేణిరో । శ్రీకాముని యాకా
జేకొనినాడో కోమలి ॥నీకుదగిన॥ మున్ను నోచినట్టినోము లన్ని
ఏవు మున్ను ॥ కన్నారగఁ గన్నావటె! వన్నెలచేఁ జిన్నెలచే
పుండరీకనయనమోక్షు గుండవిభు డగు ॥పుండ॥ దండిగ
ంబును ఖండించును ఖండితముగ ॥నీకు దగిన॥

వ. అనిపలికిన సిగ్గువడి జానకీదేవి యవతలజని చెలికత్తియలు
స దమమనంబున—

క. మాతండ్రి విల్లు విఱిచిన
యాతనికే నన్ను నిత్తునని తనప్రతినన్
భూతలి జాటింపించెను;
నీతనిచే నౌనొ ! కాదొ ! యెటు సేయఁ దగున్?

తే. ఇదివఱకు గొంద ఱరుదెంచి యెత్తలేక
పాఱిపోయిరి; వారితోపాటు నీతఁ
డేగునో! లేకమోపెట్టి యెలమి నన్ను
గొనునో! నాప్రాప్త మెటు లౌనొకో! తలంప!

సీత-కీర్తన, అఠభిరాగము; ఆదితాళము.

మరునికోపు మాపు రూపు మరునితూపు మాపుజూపు ॥మరుని॥
ంకు నోపు నడకలు; గమలారికిదాపు వదనము; సరసిజ
ప గరములు వాపు; కురు లళితతులను బరువడిలేపు ॥మరుని॥
ంబు గలకంఠంబు; నంబరంబు ఆమధ్యంబు; భంబుల జెలువంబు
ఖంబుల పొంకంబు మోక్షపురంబులోన నారాయణకవికి
చ్చు శ్రీరమణుని సుతుడగు ॥మరు॥

వ. ఇట్లు సీతాదేవి రామసౌందర్యం బుపలక్షించి వర్ణించుచుఁ దండ్రి నుద్దేశించి మనంబున,

తే. కమఠ పృష్ఠకఠోర మీ కార్ముకంబు
నమితసుకుమారమూర్తి యీయర్కకులుఁడు
దీని నెక్కిడునటుల విధించుటకట
తాత, మీ రిడు పణ మతిదారుణంబు.

వ. అంత,

క. ఈవార్తఁ జెప్పిపంపక
యే వేగులవలనఁ దెలిసి యెలమిని సీతా
దేవిని గొన మిథిలకుఁ దా
రావణు డరుదెంచి జనక రాజునకనియెన్.

రావణుని కీర్తన-జంఝూటి: ఆదితాళము. (వాసంతికా—వలె)

నీకన్యకామణి నీరా జనక ॥నీకన్య॥ నాకన్నను జగదేకవీరు లీలోకమునను గలరే! యొకలోపము లేదిక ॥నీకన్య॥ కులగోత్రంబులు, గుణమును రూపము బలిమియు గలిమియును, గలవరునకు నీ దగు ॥నీకన్య॥ మోక్షగుండపతి ముద్దుకొమరుని కటాక్షము బొందితిని విను రాక్షస విభుఁడను ॥నీకన్యకా॥

వ.అనిపలికిన రావణాసురునిగాంచి,

జనక-తోహ: శంకరునిశరాసనము గలదు మాసదనంబున నది దాల్చి, కొంకక నీవును గుణము సారించినఁ గూతు నిత్తు నన లేచి॥రామ॥

రావణ, కీర్తన-ఆదితాళము : మంగళింహరి.

ఏదిరా యోరి! ధనువేదిరా యోరి ॥యే॥ ఏదిరా చాప మేదుర్నింతు భూప! నాదు ప్రతాపనైపుణి దోప॥ నేదిరా॥ పట్ట నేరన్నా! మోపెట్ట జాలనా! పట్టికి నిట్టిపందెము గట్టి పెట్టితో౯ జుట్టి పెట్టితివట్టి॥ దేదిరా॥ ఎల్ల రాజులవలె నెంచితో బళా! ముల్లనజెల్లు మోపెట్ట బెల్లుపెల్లున

విల్లు గిల్లును డుల్లు॥ నేదిరా॥ మోౕకపురపతి గన, నోకుమాపతి, అక్షీణబలుఁడు నతివిక్రముడు రాక్షసవరు ఘూరకపోడు చూడు॥ మేది॥

వ. అని పరాక్రమంబున నాడిన, మంచి దని విల్లున్నమాఁదస దెఱచిన, నవ్వుచు రావణుండు—

తోహా: ఎడమకరంబుల నెత్తగ నాధను వేమియు లేవకయున్న। గుడిహస్తంబులఁ గోరి యెత్త దలపడినను గదలకయున్న ॥రామ॥

వ. దశదిశలు కలయఁ జూచి దశవదనంబులఁ గోపంబు జేగురింప నవుడు గఱచుచు—

క. ఇరువది కరముల నెత్తఁగ
దొరకొన బరువైన నతని దోర్బల మెల్లం
దఱిగి సరివారు నవ్వఁగ
వెఱచుచు ధరమీఁద వెల్ల వెలకిలఁ బడియెన్.

వ. ఇట్లు వెలకిలఁబడిన రావణుని యురంబున హరశరాసనంబువడియె. నా భారంబు దుస్సహంబయిన లేవలేడయ్యెనప్పుడు,—

క. లాలా మూత్ర స్వేదము
లాలో నేఱు లయిపాఱె; నక్షులు దిరిగెన్;
నాలుకలు సాచె; నిలపయి
వ్రాలెఁ గిరీటములు; మేను వడకఁ దొడంగెన్.

వ. ఈ యవస్థ గనుంగొని యచ్చటనున్న రాజులు పకపకన నవ్విరి. అదిచూచి జనకధరారమణుఁ డురుకృపారస పరిపూరితహృదయుండై సభయందున్న రాజన్యులతట్టు చేయిసాచి, యిట్లనియె.

జనకుని కీర్తనము—కమాచ్: ఆదితాళము.

లేరైరే శూరులు! రారైరే ధీరులు!॥ లేరై॥ వారక నీ సభవారెల్లను గన్నారఁగ గను చున్నారదేల?॥ లేరై॥ పంటి క్రిందబడి

పీడు తన్నుకొను చుంటఁ గాంచి యూర కుంటిరేల?॥ లేరై॥ త్రాణ లేమ వాస్తవముగ సీతని ప్రాణంబులు గాపాడువారు॥ లేరై రే॥ మోక్షగుండపతి సాక్షి జీవసంరక్షణజేయ నుపేక్ష యేల?॥ లేరై రే॥

వ. అని యిట్లు రావణుని విషయమై దయాపహాస్యంబులు గనుపట్ట జనుకుండాడిన వాక్యంబులు విని,—

క. అక్కుపయినున్న చాపముఁ
జక్కగఁ ద్రొలఁగించి ప్రోచు శక్తి నృపులలో
నొక్కరికిని లే దయ్యెను;
గ్రక్కున రాముండు కాంచె గాధితనూజుఁ.

వ. అప్పుడు శ్రీరామభద్రుని యభీష్టం బెఱింగి విశ్వామిత్రుండు—

కీర్తన, బేహాగ్—ఆదితాళము.

ఇఁక లెమ్మా! శ్రీరామా! లేచి రమ్మా! నీవిమ్మహాధనువు చేకొమ్మా॥ ఇక లెమ్మా॥ లెమ్మా రమ్మా కొమ్మా కోదండ!॥ యిక లెమ్మా॥ ఆది వరాహమై మున్ను నీవు కోర వసుంధర మెత్తిన మేటి వవురా!॥ అరపు వెరపు మఱపు లేశయ॥ నిక లెమ్మా॥ ఈ కార్య మోతది రఘురామా! జనవర్యులు జూడ గుణధామా! శౌర్య ధైర్య స్థైర ధుర్యుఁడ॥ విక లెమ్మా॥ తఱగొండ మూపున నెత్తలేదా! మోక్షగుండేశ! యెక్కుపెట్టరాదా! నిండియుండు; బెండు వంటిది॥ లేలెమ్మా॥

వ. అని యిట్లు గాధేయుం డుత్సాహంబు గల్పించిన రాముండు కట్టాయితుండై,—

క. కోదండపాణి తనవర
కోదండము లక్ష్మణునకుఁ గొమ్మని యిడి త
త్కోదండ మెత్త మునిపతి
కైదండయొసంగ నడచెఁ గడుచిత్రముగాఁ.

వ. ఇట్లు చని దశవదనుని మొదలు బాదలు నరసురాసురగరు
నుల కసాధ్యంబగు ముక్కంటివింటిని రాముండు వామకరంబున
నగి నెత్తినం దద్భారంబు దొలంగుటచే మెల్లన బోరలి లేచి
ను బోడిశిలలతోఁ దిరిగి చూడక పోవుచు,—

రావణ-కీర్తన-కమాచ్-ఆదితాళము.

ఈకన్యయేల నా కనుకూల గాకుండు జాలఁ! గైకొనఁజాల !
ంల॥ కావలయునన్న నీవిల్లు దిన్నఁగా వీరలెన్నగా నెత్తలేన॥
ము రు మోక్షు గుండ ఘు రు గొల్చుచుండఁ గని రోసి పుడ
డ్చినాడ ॥ఈకన్య॥

ని పదరుచు రావణుండు యథేచ్ఛం జనియె; నంత—

రాముఁడు శంకరధనువును
వామకరంబునను బెండువలె దాలిచి, సు
త్రామాదిసురలు పొగడఁగ
భూమీశ్వరు లరయ, జనకభూపతి కనియెన్:

రాముని కీర్తన-కన్నడ: ఆదితాళము.

౩ గోధనువు నరపాల ! చూడుమి॥ ఇది ప్రాతది గద గుణశీల॥
ది కడుజులు కసగాదా! నా కిది యిది నిస్సారం బనరాదా!॥
మహనిని నే మని పొగడుదు నోమునికులవర్యా! నామ
నాటికిఁ దీరెను; నీమోహనాంగున కిచ్చెద సీతను ॥ఈ॥
మోక్షు గుండ ధాముని మిత్రుని వరశరాసన మెత్తగ నర సురా
ధర కిన్నరుల కైన దరముగా దీంత డిత్తటి బట్టి విఱిచెను.

అని యీప్రకారంబున జనకచక్రవర్తి భూసుతయగు సీతా
రామచంద్రమహాప్రభువున కిచ్చి వివాహంబు సేయ నిశ్చ
రము సింగారింపుఁడని యాజ్ఞయిచ్చి, దశరథమహారాజును

కుటుంబపరివారయుతముగఁ బిలుచుకొని రావలసినదని బుద్ధిశాలురగు మంత్రుల బంపిన వారును బ్రయాణంబై మూఁడుదినంబులకు సాకేత పురికి జేరిరి. అంతలో నక్కడ దశరథుండు తన పుత్రులతో నిట్లను చున్నాఁడు; —

దశ-కీర్తనము. హిందూస్తానితోడి-రూపకము (భుజ.)వలె.

కొడుకు లరిగిరి చాల తడవు నిలిచిరి; గడియా యైన గాని నన్ను విడిచి యుండరు॥ కొడుకు॥ ఎన్నడు గందు! వార్త నెన్నడు విందు! గన్నులకును గట్టినటుల నున్నది యుంచు॥ కొడు॥ అరివధ చేయ జేసినై నదో లేదో! గురుతర మోతుగుండవిభుని కరుణ లేదేమో॥ కొడు॥

— కీర్తన-కమాచ్: రూపకము.

విల్లు విఱిగెఁ బెల్లు పెల్లున॥ మెల్లన రిపు లుల్లంబులు జల్లన భీతిల్లగ శివు ॥విల్లు॥ అల్లన దశదిక్కు లదర, నల్ల దిగ్గజములు బెదరి తల్లడమున బాఱ, నల్ల కల్లోలము గా వార్నిధు లెల్లను ఘూర్ణిల్లగ శివు ॥విల్లు॥ ధరణిని శ్రీమోతుగుండ ధాముఁడు శ్రీరాముఁడు దీవర మున దిగి యంగ, నరగవరులును భూచరులును ఖేచరులును గడు వైరగుపడఁగ ॥విల్లు॥

తో: జనకుఁడు గౌశికమునియు రామ-లక్ష్మణులు దప్ప నందఱును! మునుకొని యాధ్వని విని మూర్ఛలలో మునిగి పడిరి తొందరను ॥రామా॥

వ. ఈప్రకారంబున శ్రీరాముండు ఖండేందుధర కోదండఖండ నంబొనర్చినఁ గాంచి, డెందంబున నానందంబు నొందుచు గాధినందను నకు జనకవసుంధరాపురంధరుం డిట్లనియె:

జనక-కీర్తన-కాంభోజి: అటతాళము.

చూడ.మి॥ పొగడితి నాకడయు దీని తెగగొన నిలువదు; విరిగిన జూడు॥ మోతుగుండధరత్రినై నాకు లక్ష్యమౌ దీని నెత్తగలేనా॥ చూ॥

వ. అని నిర్లక్ష్యంబుగఁ బలుకుచు, —

ధీతనూజునికా దుకోమాంచంబుతోఁ గూడ నెత్తెను దొడరివిల్లు
నావనీశ్వరాననకంజములతోడ వంచె నత్తఱిఁ బురవైరి విల్లు;
కభూపాలసంశయ బుద్ధితోఁ గూడ గదలించె నపుడు శంకరునివిల్లు
కకన్యామనస్సంకల్పయుతముగా గడువడి లాగ ముక్కంటివిల్లు
కార్తవీర్యార్జునుని బలాఖర్వగర్వ
నిర్వహణశక్తియుక్త మానితరుధిర
భరిత లసదంసతలుఁడైన పరశురాము
విపులదర్పదమితముగా విఱిచె విల్లు.

కాకుత్స్థుం డీరీతిని
బాహాటముగ శరము దొడిగి పటుముష్టిని దా
నాకర్ణాంతము దిగిచినఁ
జేకుపుడకగతిని విల్లు చెచ్చెర విఱిగెన్.

వ. అక్షీణబలదర్పులగు రాక్షసులను శిక్షించి మునియాగ; మొనరింపఁ దత్క్షణమున రాములక్ష్మణులేగిరి. ముక్కలంపులచే జిక్కునడిరో! యెక్కడనున్నారో! యిక్కరివలననైనఁ దక్కుటా!

తోహా: అని తనయులు రాసందుకు నగచెను నాదశరథ విభు
డునిమంత్రులు వినతు లగుచు నిట్లని పలికిరి శ్రీమీరి॥ రామ॥

మంత్రుల కీర్తన — ఆదితాళము.

రాజా దశరథ రాజ మహారాజ! ఆజనకానీసు నాప్తమంత్రు
।రాజా। నీముద్దుతనయులు, రాములక్ష్మణులు సామోదమున
వనము గాచినారు ॥రా॥ ప్రాపుగ నహల్య శాపము బాపి
పురి జేరి శివు చాపము విఱిచినారు ॥రా॥ తనపుత్రి సీతను
కినియ్య, జనకుఁడు తలఁచి యున్నానిచెను మిమ్ముఁ బిలువ॥ రా॥

ప్రకటిత మోక్షగుండ పతిని దలంచుచు సకుటుంబ పరివార సన్నాహముగ రండు॥రా॥

సం.తో॰హ: అనిజనకుఁడు పంపిన వస్తువులను సర్పించిన, దశరథుడు, మనమున నలరుచు మంత్రుల నార్యులఁ గని పలికెను దానపుడు ॥రా॥

౭౪-కీర్తనము-ఆదితాళము: (రామమంత్రము) వలె.

మీరు వింటిరా! సభ వారు గంటిరా! వీరు జనక రాజననివ వీరవరులట! ॥మీ॥ గాధిపుత్రునిఁ గూడి కరము మైత్రిని నాదు సుతులు మిథిలలో నున్నారట సుఖులై॥ మీ॥ లక్షణాంగుఁడై సర్వసాక్షిరూపుఁడై మోక్షగుండ దేవుడు గటాక్షముంచెను॥ మీ॥

తో॰హ: అలసురాసురుల కలవిగాని హరు విలువిఱిచెను రాముండు; చెలఁగి యాతనికి సీతనిచ్చి పెండ్లిసేయఁదలచి జనకుండు॥రా॥ మమ్ము ర మ్మనుచు మంత్రుల బంపెను; నెమ్మది మనసుఁదలతుము, సమ్మోదంబునఁ జనుదము ప్రయాణమ్ములు సేయుడుస్థిరము ॥రా॥

వ. అని చెప్పి జనకునిమంత్రులకు బహుమతులిచ్చి పట్టణమలంకరింపించి బాధువులకు శుభలేఖ లంపి వసిష్ఠాదిమునులును భరత శత్రుఘ్నులును దక్షిణ పరిజనులును రాజబంధువులును దోడరాఁగనలి కరి రథతురంగంబులమీద సమస్తవస్తుసంభారంబులు సాగించుకొని ప్రయాణంబై నాలుగుదినములకు మిథిలాపురికిఁ జేరిన, సమాచార విని, జనకుం డెదురేగి వసిష్ఠాది మునులకు నమస్కరించి దశరథుని కుశలం బడిగి బంధువుల సన్మానించి తోడితెచ్చి విడిదికిఁ జేర్చి యిట్లనియె:

జనక- కీర్తన-ఆదితాళము (తంగమెట్టు) వలె.

సాకేతరాజ, నీకుమారునకు నాకూతు నియ్యగను బూనితి; మీకు వార్త నంపితి ॥సాకేత॥ ఈవసిష్ఠాదులు నేతెంచుట చేత,

౦శము గేహము జన్మము పావన మాయెగదా॥ సాకేత ॥భూపాల
ః రేపే ముహూర్తము రూపించియున్నారుగా విబుధులు! లోప
లేవుగా! ॥సాకేత॥ ధారుణి దాళ్ళ్వారి నారాయణాఖ్యా ధాముడె
ౕగుండధాముడు శ్రీరాము డౌ నిజము॥ సాకేత।

క. జనకుడు పలికిన వాక్యము లను విని
దశరథుఁడు గడుఁ జెలంగుచు, దన నె
మ్మనమున సంతోషించుచు
వినయముతో సభ్యులెల్ల వినఁగాననియెఁ:

దశ. కీర్తన—బేహాగ్: ఆటతాళము

మిథిలాధినాథా, విను, నాదుపలుకులు॥ మి॥ పృథివిని నాకుఁ
మగు నీసరి వియ్య మెన్నటికిని జిక్కదు; నాదుపలుకులు॥ మి
సుమిత్రా నందనునకు నీయూర్మిళాదేవి నీయుము; నాదుపల్కులు
ారుదుగ నీసోదరుని కుమార్తెల భరత శత్రుఘ్నుల కీయుము;
లుకులు॥ మి॥ అక్షయశుభము లీక్షితి నిచ్చు మోక్షగుండే
మునకును నాదుపలుకులు॥ మి॥

వ. అనిన,

తో.హ. మంచిది మీసమ్మతమే మాసమ్మత మని జనకుడు
నంచితముగ సభయందునున్న వారనిరి తథాస్తని కడక ॥రామ॥

వ. అంత జనకుండు సని పురాలంకారము మొదలుగాగల వివా
హ్నములోనుండె. అప్పుడు విశ్వామిత్రుండు రామ లక్ష్మణులఁ
ు దశరథుని బసకువచ్చినఁ నమ్మహీపతి యెదురుగఁజని పూజించి
చ్చి కనకపీఠంబుపై వసియింపంజేసిన, దీవించి మౌనియిట్లనియె:

విశ్వా-కీర్తన-రూపకము.

మంగళమగు మంగళమగు మంగళమగు రాజా! పొంగుచు
్యరము బొందెద వినతేజ ॥ మంగళ॥ నీకొడుకులు నాకార్యము

నెఱవేర్చిరిరాజా ! యేకొఱతలు లేకుండిరి, నాకడ మహారాజా ! మంగళ॥ కొడుకులగైకొని, శుభములు, వడయుచుమహారాజా! కడువడి మోతుకుండేశుని కరుణను మహారాజా ॥మంగళ॥

సం-తోషః అని తెలిపెడు తఱిఁ దనతనయులు మ్రొక్కిన ముదమున దీవించి, ఘనముగ కౌఁగిట జొనిపి దశరథుం డనియెను మౌనినిగాంచి ॥రామ॥

దశ-కీర్తన శంకరాభరణము, ఆదితాళము.

తాపసేంద్ర, దయారసము దోప మీరు చూడఁగ నాపుత్రుల కెన్నటికి లోపము లుండవుగా ! ॥తాప॥ మీసేవ చేయుట చేత మేటి గుణములందును భాసురముగ బ్రవీణులై పరగిరి వీ రెందును ॥తాప॥ దీక్ష నారాయణకవిని రక్షించుచుండెడు మోతుకుండవిభునకును మ్రొక్కి కొలుచుచుండెను ॥తాప॥

వ. ఇట్లు ప్రశంసించుచున్న తఱి శతానందుండు దశరథమహారాజు దర్శనార్థమై వచ్చిన, వారికి దగిన మర్యాద నిలిపి పీఠంబొసంగి కూరుచుండఁజేసి పూజించి ప్రస్తావవశంబునదశరథుం డిట్లనియడిగె:

క. జనకునకుఁ బురోహితుఁ డవు;
ఘనుడ; వహల్యాత్మజుఁడవు; గావున, సర్వం
బును వేద్యం బగు నీకును;
వినిపింపగ దగును సీత వృత్తాంతంబున్.

వ. ఈసీత జనకక్ష్మాపతియౌరసపుత్రికయా? దత్తపుత్రికయా? అటులయిన నామెను గనిన తలిదండ్రు లెవరు? వివరింపవే, మునివరా, యని వేఁడిన, శతానందుండు:

శతా - కీర్తన - త్రిశ్రజాతి.

విన్నవించెద వినుము వీనులలర ॥విన్న॥ నన్ను దెలుపు మని, యెన్న జనక సుతపూర్వచరిత ॥విన్న॥ మునుపద్మాక్షుఁడను జనపాలు

పద్మాక్షీ - కీర్తన - కన్నడ : అటతాళము.

కన్యకైన యుగుకాంతు డెవ్వాడో! యీ॥క॥ ధన్యుడైనట్టి రాజన్యుం డెవడున్నాడో! ॥క॥ రూపవయోగుణ సంపన్నతలను లోపములు లేక లోకములో మన ॥కన్యకైన॥ నరులలోపల విద్యాధరులలో బన్నగ వరులలో మఱియు ఖేచరులలో గాంచిన ॥క॥ మోతుగుండప్రభు వత్యుత్కృపా కటాక్షము చే నిచ్చినట్టినా నెయ్యంపు ॥కన్యకైన॥

వ. అని యోజించి, యనంతరంబ స్వయంవరంబు చాటించె.

అప్పుడు—

చ. నరులును ఖేచరుల్ సురలు నాగులు యక్షులు సిద్ధచారణుల్
గరుడులు రావణాద్యసురకాంతులు మానులు వాగ్ఘలున్ గిరుల్
దరువులు కామరూపములు దాల్చి మహావిభవంబుతో స్వయం
వరమును జూచుకోరికను వచ్చిరి తన్నగరంబుం జేరంగన్.

వ. ఇట్లు వచ్చిన వారందరు విన,

తే. రహిని నాకాశనీలవర్ణంబు రీతి
నెవనితనుకాంతి వెలయునో, యవని సతని
కీ శుభాంగిని నిచ్చెనే నిపుడు పెండ్లి
చేయ బూనితి నని పల్కె క్షితివిభుండు.

వ. పద్మాక్షుని వాక్యంబున కందఱు కుపితులై యిట్లనుకొనిరి:

రాజులకీర్తన—కన్నడ: రూపకము.

బలుమోసకాడుగాడె యీతడు! బలు॥ కడు నాసగొల్పి మనలను రాం జేసి యిటుల భాషించెడు! ॥బలుమోస॥ ఈ కన్నె చక్కదనము ఏ కన్నె లందుగనము! చేకొన్న వాని భాగ్య మది యెన్న నలవిగా కుండును ॥బలుమో॥ ఆచంద్రమైన రూపు, మన యందు నెవరి కొదవు ! భువియందు మోతుగుండ విభునందు నుండం గాం జెల్లును ॥బలుమోస॥

వ. స్వయంవరమని పిలిపించి వంచించి యెందునులేని యొడ్డ
బన్నియున్నవాఁడు. ఇన్నరాధమునిఁ గదనంబున వధియించి యీ
నను గైకొందమని యెంచి యందరును, యుద్ధాభి ముఖులయిన
పద్మాక్షుండు—

తోహర : వారల నెల్లను వాడి శరంబుల వైచుచు బోరాడ
సూరతఁ బోవిడి సురలు మానవులు స్రుక్కి యనలఁ జనగాను ॥ రా॥

వ. పద్మాక్షుండు విజృంభించి తలుముచుండిన సహింపనోపక దాన
మాత్రము వెనుదీయక పోరాడి,

మ త్త కో కి ల .

అక్షయంబుగ బాణముల్ గొని యాతనిన్ వడివైచి, రూ
క్షేక్షణంబులఁ జూచుచుఁ దగ నేపుమాపిన, సుక్కి ప
ద్మాక్షుఁ డాహవభూమిఁ గూలిన నందఱున్ జెలిఁగైకొనన్
ఆక్షణంబున రాఁగ దాఁచెను నామె దేహము వహ్నిలోన్.

వ. ఇట్లగ్నియందు దాఁగి కనబడకుండిన నా కన్నియను వెదకి
నూ పురంబంతయు గాల్చి శ్మశాన తుల్యంబుఁ జేసి యందరు
ఖం జనిరి. లక్ష్మీకామతత్పరుండై పద్మాక్షుండిట్టి దశ ననుభవించె,

క. వరియింపరు లక్ష్మిని ధీ
వరు లెన్నఁడును నెమ్మనమున భయ శోకంబుల్
మరణముఁ జిత్తచలనమును
సిరిఁ బొందిన వారికెపుడుఁ జేకురు ననుచున్.

వ. అంత నతని పత్నులు వేయిమంది సహగమనం బొనర్చిరి.
బహుకాలంబునకు దశకంఠుండు విమానారూఢుండై దిగ్విజ
బరగువాఁడా మార్గంబునవచ్చిన—

తోహర: అనలకుండ బాహ్యప్రదేశమున నాపద్మ చరింపగను,
ణు డా, కన్యను దశకంఠున కటుజూపఁగఁ గనెను.

వ. ఇట్లు గాంచి యతఁడు మోహంబుచే విమానంబు గ్రిందికి బఱపుచు,

రావ-కీర్తన. పూరికల్యాణి: అటతాళము.

ఉం డుండవె యోచెలి ॥యుం॥ దండిమగండ ప్రబలుండ దయ నిండారగ ॥నుం॥ లోకు లనేకులు నీకొఱకై గద యీకడ నీకొరుగ దాకి మును వేకూలిరి ॥యుండు॥ అప్పుడు దప్పిన, విప్పుడు దప్పని! యొప్పులకుప్ప ముద మొప్ప నను మెప్పుజేయు ॥నుం॥ రాక్షసరాజను రావణనాముడ: నీక్షితి మోక్షగుండాధ్యక్షువరసాక్షి యాగు ॥నుం॥

వ. అని పలుకుచు డాయం జనిన, నామె మరల నగ్నికుండం బునం బ్రవేశించినఁ, గోపించి,—

రా॥ తోహర: బహుజనమును బాధించెను దా దహనుని లోపలఁజేరి, యహహా! యిప్పుడు నటులనె జేసెను నతివ కను చమ త్కారి ॥రామ॥

వ. అయిన నీరహస్యంబుఁ దెలిసితిగదా! ఇఁకను సాధించెద నని యెంచి,

సీ. అంతట రావణుం డాయగ్నికుండంబు
జల్లార్చి చూచిన, నరగ నందు:
బంచరత్నంబులేర్పడఁ గనుపట్టిన,
నవిపెట్టెలోఁ దాఁచి, యది విమాన
మున నుంచికొని పురమున కేగుదెంచి
తత్పేటిక దేవమందిరమునందు
నునిచి, యారాత్రి మందోదరితో
ననె 'భామిని, నే రత్నపంచకంబు

తే. నీకునై తెచ్చి, దేవమందిరమునందు
బెట్టినా'నన, నామె యాపెట్టెకడకుఁ

జేరి రొత్తగం జాలక సిగ్గునొంది
భర్తతోఁ దెల్ప నద్భుతపడుచు; నతఁడు.

వ. ఆ మందిరంబునకుఁ జని,

సం-తో: కదిలించిన సది కదలకయుండినఁ గడురోషము పెన
గొన్న, నెద మెచ్చుచు నిరువదికరములతో నెత్తిన లేపక యున్న॥ రా॥

వ. అతండు మహాపరాక్రమంబున లాగి మూఁతదీసిన, నందుఁ
గోటిసూర్య ప్రభావిరాజమానమ్మై కన్నుల మిఱుమిట్లు గొలుపుచున్న
కన్నియయున్నఁ, గన్నులారఁ గని మందోదరి-

మందో-కీర్తన-బిలహరి: రూపకము- (ఘూర్జరా) వరుస.

ఏమి యీ విధము నా మనంబులో సంశయ మగు! ॥ఏమి॥
స్వామి, రత్నము లేదిలే విట! యీమె యెవ్వా రగు! ॥ఏమి॥ మేలు
మే లగు! బాలికామణి నేఁ దెచ్చి తీ వేళ నెచ్చట లీల గన్నాడఁ।
జాల దెల్పుము జాలమేటికి! ॥మేలు॥ కుమారిమై మోముగుండ శ్రీహరి
నారిగాబోలు! నేమి వా రంత భార మాయె రే! తేరిచూడఁగ నేర
కెవ్వాగును॥ మేలు॥

వ. అని యడిగిన రావణుండు పద్మాక్షుభూపాల కులసంభూత
యగు నీమెకొఱకుఁ బూర్వంబు తనుపడిన పాట్లన్నియు నగ్నికుండఁ
బునఁ దాఁగిన నామును దాఁ దెచ్చిన విధంబును దెలిపినవిని, మందో
దరి యదరిపడి, —

మం-తో: స్వకులధ్వంసమునకు నీమును లంకకుఁ దెచ్చితి నగు
నేను! అకటా! యిది బాలిక యని యెంచకు మాదిశక్తియగు జూడు!
॥రా॥ నీ వంశంబును సరు జేయు నిక, గావున, నిటునిల్పకుము! రావణ,
వనములలో విడిపించిన బోస్తు నచట సత్యమ్ము॥ రా॥

మం-కీర్తన-హిందూస్తాని కాఫి-రూపకము. (నను మారు) వలె.

మరు మాట తెలుపవలదు వినుము మానవాశనా! పేటికయం దీమె నుంచి పేర్మితోడను నొకచోట భూమి దవ్వి, యందు మాట దగును॥ మరు॥ వరగృహస్థు డయ్యు విషయవాంఛ దవ్వులక, ధరబరగు రాజయోగియింట బెరుగు ముందిక ॥మరు॥ సర్వగుణను మోక్షగుండ స్వామి మయముగ గను నిర్వచారు గీమునంను నిలుచు నింపుగ ॥మరు మా॥

వ. ఎంతమాత్ర మీ సమయమందిచ్చట నుంపవలదని నొక్కి-వక్కాణించిన, భయకంపిత గాత్రుం డయి రావణుండు—

తో॥ మందసమందా సుందరి నుంచి విమానముపయి నుంచుకొని, యెందైనను ధరయందు బూడ్చి రం డిప్పుడె యని చెప్ప విని॥ రా॥

వ. రాక్షసభటులు సిద్ధపడుచుండ నప్పుడు సర్వులు విన, నాకన్య యిట్లనియె:

సీ. ఈసారి లంకకు నేతెంచి రావణుఁ
బుత్రమిత్రులతోడ బొలియ గూల్తు;
మూడవసారి నేర్పున వచ్చి పౌండ్రకు
శతకంఠు రావణు సంహరింతు;
నాల్గవసారి మానక వచ్చి మూల
కాసురుఁ డను ఘటకర్ణసుతుని గూల్తు;
నని చెప్ప నాలించి యసురులెల్లనమృత
ప్రాయులైరంతట రావణుండు

గీ. భయము నొందియు, నదియు లోపల నడంచి,
దీని నిప్పుడె పట్టి వధింతు ననుచు,
కత్తి ఝుళిపించి పైకి శీఘ్రమున నుఱుక,
నడ్డమై నిల్చి మయ కన్య యనియె నిట్లు.

వ. ఆపెట్టె నెత్తించుకొని జనకమహారాజు సభకుఁ జేరఁబోయి, ద్విజుండు,

విప్ర—జనక సంవాదము కీర్తన—ఆదితాళము.

వి. 'భూమిపాలవరా! ప్రేమను నా మనవిని వినదగు! భూ॥'
రా. 'భూమిదేవరా! ధీమతితోఁ దెలుపఁగ దగు నది॥భూ॥'
వి.-'తా మొసంగిన భూమి దున్నఁగ నేమొ కాని యిది యొక టగపడె ॥భూ॥'
రా.-'ఏమియున్నను నేమి కర్తలు స్వామి తామే; సంశయ మేటికి॥భూ॥'
వి'-దాన మిడునది ధారుణియకద! యీనిధాన మిడి యుండితివే ॥భూ॥'
రా.-'దాన మిచ్చిన ధరణినుండిన, దాని నేను దగఁ గైకొందునె ॥భూ॥'
వి' ఈక్షితికి రాజేంద్రులే యధ్యక్షులౌదు రంతటికిని నిను ॥భూ॥'
రా—' మోతుగుండాధ్యక్షుని పదసాక్షిగను సర్వము తమదే ॥భూ॥'

వ. అని విప్రరాజన్యులు వివాదపడుచుండ సభవా రిట్లనిరి:

తోహర: వలదు వలదు సంవాద మేమిటికి వాకిలి దీసియు గనిన నెలమి బెట్టెలో నేమియున్నదో తెలియుద మందఱమునిస ॥రా॥

వ. మంచి దని భటులచేత మూతఁ దీయింప నంత మేఘవినిర్గత విద్యుల్లతికయుంబోలె బాలికామణి వెడలి వచ్చిన నాశ్చర్యకలితులై సభాసదు లిట్లనిరి:

క. తన తండ్రియైన సాగరు
గనవచ్చిన లక్ష్మిఁబోలెఁ, గన్యామణి చ
య్యనఁ దమ గేహమునఁ జేరెను
మనుపం దగుఁ గూతుఁగాగ మనుజాధీశా.

వ. అని పలికిన సభ్యుల పలుకుల కలరి యిలాపతి యయ్యది నంగీకరించె. ద్విజుండును బాలామణిని జనకభూపాలున కర్పించి నిజగృహంబునకు జనియె: అంత_

వ. మీరు వివాహమందిరమునకు దయచేయుం డని చెప్పి, శతానందుండు పోయె. ఇక్కడ జనకుండు వివాహమునకు సమస్తము సిద్ధముచేయించి వధూవరులను గైసేయుండని యాజ్ఞాపించినఁ గాంతలు సని రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులను, సీత యూర్మిళ మాండవి శ్రుతకీర్తులను, వేఱువేఱ నలంకరింపఁ బ్రయత్నించిరి,

మధురగతి రగడ:

పల్లవి: సీతారాములనుఁ గైసేసిరి వేడుకను; పెండ్లికుమారుల బ్రియమున గొందఱు, పెండ్లికూతులను బ్రేమను గొందఱు ముత్తైదువులటు ముదమున బిల్వఁగఁ జిత్తరు చవికెనుఁ జేరిరి చెల్వఁగ; పీటల మీఁదను బెంపుగ నుంచియుఁ, బాటలు బాడుచుఁ, బరువము గాంచియు, సంపెఁగనూనెను సరగున బూయుచు, సొంపుగ నలుగుల శోభిలఁ జేయుచు, నను వొందఁగ స్నానము గావించిరి; ఒప్పులుగఁ వడి యార్చిరి మోదించిరి; వన్నెగలుగు దువ్వలువలఁ గట్టిరి; కన్నుల సొగసుగఁ గాటుకఁ బెట్టిరి; ముద్దులమోముల ముదితలు గూర్మిని దిద్దిరి కస్తురితిలకముఁ బేర్మిని; బరిమళగంధము బాగుగ బూసిరి; వరు వడి వరధూపంబులు వేసిరి. సురుచిరసుమముల సరులు ఘటించిరి; వర కంచుకముల వాసి ధరించిరి; నవరత్నాభరణంబులు దాల్చిరి; నవనీరజనమనయనలు గొల్చిరి; మకరికలప్పుడు మనుతను వ్రాసిరి; ప్రకట భూషలొప్పగ గైసేసిరి; అంతట జనకుం డందఱుఁ గూడను, సంతోషంబున సభ్యులతోడను, మంగళకరహిత మహిత నాదములు పొంగుచు మ్రోయఁగఁ బొలఁతి ముత్తెములు, సేసలు చల్లఁగఁ జెలగుమనములను వాసి మీఱఁగను వరపూజనమును వారక చేసి, వివాహమందిరము వారలఁ దోడ్కొని వచ్చి, సుందరము మీఱఁగ జేర్చి యమేయవిభవముగఁ దీరుగ లగ్నముఁ దెలిసి విభవముగ॥

దరు—కీర్తన— హిందూస్థాని కాఫి : ఆదితాళము. (శ్రీపతి యింతటి వలె)

ఈ విపరీతము లేల దోచెను ! స్వామి ! ॥ఈ॥ భావుక కార్యము లు వడసి యుత్సాహమున బోవ నుత్పాతము లావహిల్లెను గదా ! ॥ఈ॥ గాలియత్యంతముగ గదిరివీవఁగఁబూనె! ధూళి సూర్యునికాంతి తొలఁగఁ గ్రమ్మెను గదా ! ॥ఈ॥ ధరణిని మోతుగుండవగుకృప రాదాయె! గరితురగాదులకు వెఱపు గలిగెఁ గదా! ॥ఈవిపరీతము॥

వ. అని యడలున నడిగిన దశరథునకు వసిష్ఠముని యిట్లనియె,

వసి. తోహర.

అదలకు ముందు మహాభయ మొక్కటి యావహించి త్వర లోను, అది తొలఁగును; నాపిదప నయోధ్యకు నరుగవచ్చు మేల గును॥ రా॥

వ. అని చెప్పునంతలో—

సీ. తండ్రియానతిని సొదలమోచి తనతల్లి,
కంఠంబు దునిమెనే గణ్యసుతుఁడు
పితృవిరోధిని గార్తవీర్యార్జునుని బట్టి,
ప్రాణముల్ దీసెనే ప్రథితవీరుఁ
డిరువదియొకమాఱు దిరిగి నిర్బాహుజ
మొనరించె నుర్వి నే యుగ్రమూర్తి
కశ్యపునకునిచ్చి కాశ్యపి యనునామ
మొసఁగె నీధరకు నే యసమశూరుఁ,

గీ. డట్టి సిద్ధప్రతిజ్ఞుఁ డధ్యాత్మవిదుఁడు,
పరశురాముండు దివ్యచాపంబు కేలఁ
గ్రాల శ్రీరామచంద్రభూపాలమౌళి
మ్రోల నిలఁబడె ముల్లోకములు వడంక.

వ. ఇట్లు కట్టెదుట నిలిచిన పరశురామునిం గని శ్రీరాముండు రంబులు ముకుళించి నమస్కరించిన నతం డిట్లనియె:

పర. తోహార: మొక్కిన విడతునె! మును రాజన్యులం బెక్కం డ్రను గూల్చితిని! జక్కితి పిక పనిసేయుము! నిన్నును జక్కాడెద ధృతిని ॥రా॥

వ. అనిన నవ్వుచు శ్రీరాముం డిట్లనియె:

రాముని మత్తకోకిల.

ధారుణీతలమెల్లం గశ్యపతాపసేంద్రున కిచ్చి వి
స్తారశాంతుండవై తపంబును సల్పుచుండుటచే నమ
స్కార పాత్రమవంచుం జేసితి గాని నీకు భయంబునం
జేరి మ్రొక్కినవాండగాను: హాసింపనేటికి భూసురా!

వ. అనిన రోషించి పరసురాముం డిట్లనియె:

పర. కీర్తన – రాగము: రూపకము.

ఆహా నే తాపసుండనే గాని నేసుమా! శ్రీరామ! ॥యూహా॥ హావముని సహస్రబాహోగ్రుని ముఖ్యనృపులం మోహారించి చంపినట్టి హాసుండనే గాని॥ ॥యూహా॥ రాముండనంగ నే నిల రాజిల్లంగ, వింకొక రాముండ నని వచ్చితివా! రాజన్య నిను బోనిత్తునె ॥యూహా॥ త్రిలోకవిభుండు శివుండు, మోతకుండనేత నాకు విల్లునిద్దె గెలిపి నతని నిగ్రహించి తట! యోగ్యుండనే॥ యూహా॥

వ. అనుమానరు శ్రీమద్రామభద్రుం డిట్లనుచున్నాడు:

రాము. కీర్తన–హిందుస్థాని కాఫీ: ఆదితాళము.

నమ్మదిగా వినుము భార్గవా॥ నా॥ ఇమ్మహిని నా భుజాసత్వ మిట్టి దానను॥ నమ్మ॥ నేను వినోదముగ లాంగ గాన విటిగ; నాకర్గాంత నినీతియునంత కలదె యుగ్రుని కోదండము॥ నమ్మదిగా॥ గోప్పల పులజంపం గోర దర్క నాతిలులు; నీ వెగ్గు లెన్నియాడిన నీకె చెల్ల

నిన్నోంప॥ నెమ్మ॥ సదయుండౌ మోతుకుండేశు సాక్షి నాకుత్సుకంబిది; యదియె నీ గొడ్డలి; యుచిత మైనరీతి జేయుము॥ నెమ్మది॥

వ. అనువాక్యంబులకు నత్యంతకుపితస్వాంతుండయి జామదగ్ని యిట్లనియె,

గీ. నీవు క్షత్రియుండవు; నేను విప్రుండను;
గర్వ మున్నదటులఁ గాంచఁ బోకు:
నాపరాక్రమంబు నాభుజశక్తియు
నీకుఁ జూపువాఁడ నిశ్చయముగ,

వ. అని పలికి,

పర. కీర్తనం - ఆదితాళము : పోపొమ్మ.

పోనియ్యఁ బోనియ్యరాఘవ ! నిను॥బోని॥ పూనికతో నిన్నుఁ బట్టి పొంగడంగఁ జేయక నే॥బోని॥ సారహీనమైన విల్లుఁ బూరిపుల్లక రీతి విఱిచి, వీరుండ ననుచు విఱ్ఱవీగుచు నేతెంచెదవు ! [illegible] మనవచ్చును నా విల్లు సూడు॥బోని॥ బీమబలుండనంయిన నెక్క—నెట్టుక దీని లేకయున్న శ్రీ మోతుకుం [illegible] రఘురాముండని [illegible] నిన్ను; నాముందర నీ సామర్థ్య మేమి పనికి వచ్చు నింక॥బోని॥

వ. జనకునియింట నీవు విఱిచిన విల్లును, నేధరించిన విల్లును విశ్వకర్మ యేక కాలమందు నిర్మించియున్నాఁడు. అందొక్కటి త్రిపురా సురసంహారణ కాలంబునందు హరునకు సురలచే నియ్యఁబడియె. దానిచే త్రిపుర సంహారణంబొనర్చి తనశక్తిని యీశ్వరుండు [illegible] నున్న [illegible]ష్ణుండు శరాకృతిచే సహాయపడ, శివుండు జయించె నని దేవత లాడిరి. [illegible] ప్రమథులవల్ల విని శివుండు కోపించి హరిని యుద్ధంబునకు రమ్మనన, [illegible]డవ కాండాసనంబు హరికి నిచ్చి దేవతలు పురికొలుప హరి [illegible] [illegible]ఁబోరు ఘోరంబయ్యె. అప్పుడు హరికరనిర్ముక్తశరంబు వాఁగుటచే [illegible]రునివిల్లు నొచ్చి పేటెత్తిన శివునిబలంబు లోటువడియె. అది గని,

అజుఁడ వవ్యయుఁడవు పరుడవు నానందమయుఁడ వాదిమూలకారణుండవు
నిజమాయాగుణయుతముగ సృజియింతువు ప్రజలను; రఘు ॥రామ॥
సంగసహితులయిన వారలు నిను గాంచలేరు; సంగరహితులయిన
ధీరులు రంగుగ దమమనములలోనం గని యానందింతురు ॥రామ॥
మోక్షగుండపురవిహారకా! నారాయణకవిరక్షక! షడ్భావదూరకా!
మోక్షప్రద! దేహాదుల వీక్షింతువు సాక్షి వగుచు ॥రామ॥

పర. తో: ఆదియందు నే హరిని గూర్చి తప మాచరింపఁగా
నతఁడు, నాదరమున బ్రత్యక్షంబయి యిటు లనుచుఁ బలికెఁ దా
నపుడు ॥రా॥

మచ్చిదంశమున మహిని గలిసి నీవు నిచ్చలు హైహయనృపుల,
మెచ్చకత్రుంచి యమేయశమంబును మెఱయఁ దాల్పు మే నవల ॥రా॥

రాముఁడనఁగ దశరథకౌసల్యలకీమహిలో నుదయించి, నీమము
తోడుత నీకుదర్శనము నే నొసఁగుదు దయ యుంచి ॥రా॥

అని పలికిన నాహరివే నీవై యవతరించి తని వేడి, చనియె.
మహేంద్రాచలమున కాతని యనుమతిఁ గొని కొనియాడి ॥రా॥

వ. ఇట్లు పలికి పరశురాముండు చనినపిదప రాముండు, భయ
భ్రాంతచిత్తుండై యున్న దశరథునకు నమస్కరించిన, నాతఁడు కొడు
కును గౌగిలించుకొని దీవించి యిట్లనియె:

దశ-కీర్తన-పున్నాగవరాళి: ఏకతాళము.

నాపుత్రరత్నమా! నాపెన్నిధానమా! ముద్దులయ్యా! ॥నాపుత్ర॥
నానోముఫలమా! నాపాలిభాగ్యమా! చిన్నితండ్రి! ॥నాపుత్ర॥
నిను వేగ గంటిని; నేఁగీర్తిగొంటిని; లోప మేమి ॥నాపుత్ర॥
వరమోక్షగుండపుర మేలుపుండరీకనయన! ॥నాపుత్ర॥

సం. తో: అని యిటు పలుకుచు నందఱు గామిగా నరిగి
యోధ్యను దరిసి, ఘనముగ బౌరులు, గని ముదమొందగ జనిరిఁ
'ముల బొరసి ॥రామ॥

వ. తదనంతరంబున భానుమంతుండుఁ గోసలుఁడులోనుగాఁగల
రెనమందు శ్రీరాముని మేనమామలు తమతమ స్వదేశంబులు
ంచుచు రాముని పాణిగ్రహణమహోత్సవమునకు రావలసినదని
ఘుండు శుభలేఖ లంపఁగా వారివారి మనంబులలో వారు వారి
కొనిరి:

తో: రామార్పణముగ రయమున గాంచిన నాముద్దుల
ను, ప్రేమ మీఱఁగ వరింపక సీతను బెండ్లి యగుట యెట్లిలను॥రా

వ. అయిన దీని విచారింపవలసిన దని ప్రతివారును యోజించి
ళా విమలజ్ఞాన క్రియాయోగాదినామంబులచే నలరారు తను కూ
్రి నూటయిరువది యెనిమిదిమందిని దోడుకొని యయోధ్యకు
దశరథాదులరాక వేచియుండి, వారు గృహప్రవేశమునకు వచ్చు
యమున—

క. తనయాయుతముగ రామునిఁ
గన వచ్చిన మేనమామ గారికిఁ బ్రియవం
దనము లొనరించి యుచితా
సనములఁ గూర్చుండఁ జేయ సంతోషమునన్.

వ. ఆసీనులయి యి ట్లనుచున్నారు:

మేనమా-కళ్యాణి: రూపకము.

శ్రీకరముగ భానువంశశేఖర! వినుమా! యీకన్యలఁ గైకొని
రిపుము భరింయింపుము నీవు ॥శ్రీకరముగ॥

నీ కర్పితముగను గంటిమి కావున దగను, రాకొమరుల కిం
కా దియ్యఁగ సత్యంబుగ ॥శ్రీకరముగ॥

రక్షోవరహరణా! నారాయణకవిశరణా! మోక్షగుండ పుర వల్లభ, మోహించిరి ముదితలు నిను ॥శ్రీకరముగ॥

తో॥హ: వీరికోరికలు దీటిచి బ్రోవుము; వీరికి భర్తవు నీవు; వీరు భార్యలిక వెలయంగ నీకును వేఱుగఁ జూడక బ్రోవు ॥రా॥

వ. అని పలికిన మేనమామల వాక్యంబులు విశ్వసించి తండ్రి యుండిన సభకుఁ జని నమస్కరించి రాముం డిట్లనుచున్నాఁడు.

రాము-కీర్తన-రూపకము.

జనక, నామనవి వినుము! మేనమామ లెనమండుగురువీరె యేతెంచినారు; ఘనముగ తాముగన్నకన్యల నూటయెనమండెనిమిది మందిన్ వెనుకన్ గొనుచున్ గైకొను మనుచున్॥ జనక॥

ఆముద్దుబిడ్డల రామార్పణముగ, దాము గన్నారట! తలఁగిపోరట! ఆమోహనాంగుల నన్యుల కీరట! యామాటలకున్ దలఁపన్ ఏ మనియందున్ ముందున్॥ జనక నామనవి॥

ధరను మోక్షగుండ ధాముని సాక్షినన్ వరియించి కన్యలు వచ్చిరినేడు; పరిణయ మగుదునో! మరలి పొమ్మందునో! పరమోపాయం బొందున్ సరగన్ దెలుపన్ వలయున్ జనక నామనవి॥

వ. అని రామచంద్రుం డడిగినఁ దండ్రి యిట్లనియె:

గీ. అగ్నిసాక్షిగ మొదట బెండ్లాడినట్టి
సీత నెమ్మది యొప్పినఁ జెట్టబట్టు;
లేనిచో మానియుండుము; మేనమామ
బిడ్డలైనను ధర్మంబు విడువఁ దగునె!

అని వచించిన తండ్రివాక్యంబున కలరి రాముండు సీతాదేవి యున్న దెస కభిముఖుండై యి నమోక్తుల నిట్లనియె:

సీతతోఁగూడ నూటయిరువది తొమ్మిదిమంది భార్యలతోఁగలసి యేక పత్నీవ్రతుం డను ప్రతీతితో రాముండు వెలసె అంత—

సం.తో: అగ్రిభార్య యగు నవనీజయుంజెలు లందఱు వొబడి రాఁగా, స్వగృహమునకును జని తల్లులకును సరగున మ్రొక్కి—రి వేగ॥ రామ॥

సం - వ. వా రానందంబునొంది వారిని లేవఁదీసి అక్కునఁ జేర్చి యాశీర్వదించిరి. అంత—

సం - కం. శ్రీరాముఁడయోధ్యను సీ
తారామయుతంబుగా ముదంబున నత్యా
శ్రీరంజిల వైభోగము
లారూఢిని బొందుచుండె నతివేడుకతోన్.

సీ. కన నెల్లెడల నల్లగను నల్లుకొనిన మ
బ్బులు డుల్లి దెసలెల్లఁ దెలుపునొంద,
జలజాకరతటాకములు వాక లెడలేక,
జలపూర్తినొంది ముచ్చటగ దోఁప,
ఘనపంకములు డొంకలను నింక నకలంక
గతి జంతుతతికి సంకటము వాయ,
జను లెంతయును సంతసము నొంద ఫలవంత
ముగ నంతటను సస్యములు సెలంగ

గీ. నవనిజయకాంక్షతో రాజు లలరుచుండ,
ధవళకిరణములను సుధాధాముఁ డొప్ప,
నరులు దైవోత్సవముల యత్నములు సేయఁ,
బొడమె శరదాగమంబు సంపూర్ణముగను.

సం-వ. అట్టిసమయంబున దీపావళ్యుత్సవంబు నెఱవేర్ప నుద్య మించి మిథిలాపురిలో జనకచక్రవర్తి తనమంత్రులఁగాంచి,

జనక.తో: రాముఁడు మొదలగు జామాతల సీతాముఖులగు
హితలను, భామాయుతముగ బరువడి దశరథ భూమీశుని మం
ంలను॥ రామ॥

వ. దీపావళిపండుగకు మననగరంబునకుఁ బిలుచుకొని రావల
దని చెప్పిన వారు గదిలి యయోధ్యకుఁ గొన్నిదినంబులకుఁ జేరి దశ
సనిచే సమ్మానింప బడి,

మంత్రుల-కీర్తన-ఆదితాళము. (పోవెపొన్వలంకరింపఁగా) వలె.

ధారుణీశ, చిత్తగింపుమా! జనకుండు పంపెను॥ ధారు॥ మీరా
, గోరెఁ మారాజేంద్రుఁడు॥ ధారు॥ దారలు, గోడండ్రు, దన
లుఁ జెలికాండ్రు, పౌరులు బందుగులు, మీరు రాఁదగు॥ ధారు॥
క్షుపుర పతికృపను మిథిలకుఁ దగఁ బోవుదము ప్రయాణం
ండు॥ ధారు॥

సం-వ. ఇట్లు జనకుని సచివులు దెలిపిన, దశరథక్ష్మాపతి యా
దభరితుండయి భటులను గనుఁగొని,

దశ-సీ. దీపావళికి మిథిలా నగరమునకు మమ్ము
రమ్మని జనకధరావిభుండు
పుత్తెంచెఁ గాన మత్పుత్రిలు స్నుషలును
కాంతలు హితులు ప్రధానులాత్మ
బంధువు లాశ్రితుల్ పౌరులు మఱిజాన
పదులును జతురంగబలము వారు,
దగ బ్రయాణంబులై తఱలి రావలెనని
చాటింపు డంతట సకలవాద్య,

గీ. నృత్తగీతము లలరార నేడు వార
కామినులు వందిమాగధ గణము లెల్ల

సిద్ధముగనుండు నట్లాజ్ఞ సేయుఁ డఖిల
యానము లలంకరింపుడు హర్షమెసఁగ.

సం-వ. తదాజ్ఞాప్రకారము సర్వము సిద్ధమయిన సంతసించి.

కీర్తన-కాంభోజి: రూపకము-(శ్రీవణామృత)వలె.

మిథిలాపురమున కేగెను, మిత్రకులుఁడు రథముమీఁద నెక్కి-యధికవిభవ మలరారఁగ॥ మిథిలా॥ రామాదికుమారులెల్ల సామజముల బ్రేమమీఱ నెక్కి ప్రియమున దన వెనుక నడవ॥ మిథిలా॥ యుల్లన సీతాది యువతులెల్ల వెంబడి బల్లకీలలోన నుల్లముః లలరగఁ వెడలగ ॥ మిథిలా॥ కౌసల్యాదులు పౌరులు డాసి, నడన వాసి మోతుకుండ వాసుని సన్నుతి సేయుచు॥ మిథిలాపుర॥

సం-వ. ఇటుల చటుల విభవంబున శుభంబున బయలుదేఱి కొన్నిదినంబులకు మిథిలఁ బ్రవేశించినఁ, దద్వార్త విని,—

చ. ఘనుఁడు విదేహరాజెదురుగాఁ జని యందఱ గౌరవించి పా
యని యనురక్తిఁ బౌరులు రయంబున సేసలు జల్ల, వారకా
మినులు నటింపఁ, గాయకులు మేలుగఁ బాడ, సువాద్యఘోషముల్
దనరఁగ, స్వీయధామము ముదంబున జేర్చెఁ బ్రసన్నచిత్తుఁడై.

వ. పిమ్మట వారిని మృష్టాన్నపానంబుల సంతుష్టి నొందించి దీపావళి దివసంబున—

తో: కూతుండ్రకు జామాతల కమితఖ్యాతిని దల లంటించి, పీఁటిగ నలుగులు బెట్టించి శుభస్నాతుల నటుగావించి॥ రా॥ అతులాంబర దివ్యాభరణాలంకృతు లగునటు చేయించి, చతురంగంబుల సద్దాసీ దాసచయంబుల నర్పించి॥ రాము॥

సం-వ. దశరథుని దత్కాంతలను దక్క-సబాంధవులను బహువిధ సత్కారంబుల దనిపి దీపావళ్యుత్సవంబు సేయించిన, నానందభరితులై దశరథాదులు—

వాహినులఁ వెలదులను నేమరకు ॥పట్టుగ॥ మోక్షపురీశుసాక్షిగను దీక్షగను దెలిపెదను ॥పట్టుగ॥

వ. తండ్రికి బ్రణతుండయి యనుజ్ఞవడసి శస్త్రాస్త్రసన్నద్ధుండై యున్న తండ్రియరదం బెక్కి- లక్ష్మణయుతంబుగఁ గదలినఁ గని,

సం-కం. భరతుడు శత్రుఘ్నుండును
పరువడిఁ బదివేలరాజ భటులను వెంటన్
శరకోదండంబులుగొని
నరపాలురతోడఁ బోర నడచిరి బలిమిన్.

సం. వ. ఇట్లు శత్రురాజుల కభిముఖంబుగ నడచి దిగ్గజంబులు బ్రమ్మొగ్గ, ధనుష్టంకారం బొనర్చినఁ బగతురను వెనుదీయక యదిరించి,-

రాజుల - కీర్తన - ఆదితాళము. (రామనీదయ) వలె.

నేడు మమ్మెదిరించి పోరుము శ్రీరామచూతము॥ నేడు॥ చూడు జనకుని వీడునందల్లనాడు ద్విజరాజ చూడు! ధనువుఁ ద్రుంచి, యీడు రాజుల కెల్ల సిగ్గొనగూడఁ బెండ్లి యాడి సీతఁ దోడుకొని చనితి నపుడు॥ నేడు॥ దానవమాకవమాన మాయెను; గాన నాలము లోన గరకుటమ్ము లూని కదనడిమేన వైతును; మానసములోన సభిమాన సంయుతుఁడ వైన ॥నేడు॥ అండవై మోక్షగుండ దేవుఁ డఖండ మగు దయ నిండఁ గనుచు నుండ, ఖండశశిధరచండకోదండఖండనోద్దండ సమర్థుండవై । యలరి తపుడు ॥నేడు॥

వ. అని తృణప్రాయంబునఁ బలికిన రాముని సైన్యంబులు మూగి, భటులః—

ఉ. బుద్ధివిహీనులార ! బలముం దలపోయక రామమూర్తితో
యుద్ధముసేయవచ్చితి రహో శలభంబులు వహ్ని సేరి స
న్నిద్ధతి మేము సిద్ధముగ నుండఁగ రాఘవుఁడేల మిమ్ము దే !
యిద్ధరఁగూలనేతు మిపుడింటను గెల్చియు; నచ్చ గెల్వఁడే!

సం-వ. పరశుకుంత భిండివాలాది సాధనంబులు వచ్చుచున్నవి.
దప్పించుకొని పొండని వైచి భటు లార్భటించిన, వాని లక్ష్యంబు
పక యక్షయమహేక్షణంబుల వీక్షించి యక్షమాధ్యక్షులు.

భుజంగప్రయాతము.

ధనుర్జ్యానినాదం బుదగ్రంబుగా జే
సి, నారాచముల్ పూన్చి, చేబల్మిఁ ద్రేయం
గ, నాబంటు లందుండఁగాలేక దూరం
బున న్నిల్చి రామీదభూమీశు లెల్లన్—

వ. సింహనాదంబులు సేయుచు రాముని కభిముఖు లైన భరత
శత్రుఘ్న లక్ష్మణు లడ్డగించి,

భరతాదులు:—

సీ. తాటకాదుల నిరాఘాటంబుగాఁ దోలి
యాగంబుఁ గాచిన యది యెఱింగి,
పాషాణరూపమై పడిన యహల్యకు
శాపంబు వాపిన జాడ యెఱిగి,
మీ కసాధ్యంబైన శ్రీకంఠు చాపంబు
వేయెత్తి విఱిచిన విధ మెఱింగి,
పుడమి నరాజకముగ నొనర్చిన భృగు
రాము గెల్చిన పరాక్రమ మెఱింగి

గీ. రాము నెదిరింప వచ్చితి రా! యిదేమి!
యెదిరి బలమును స్వబలము నెఱుఁగలేని
మందమతులైన మిమ్ము నే మందు మింక!
మమ్ము గెలిచిన తదనంత రమ్ము పొందు

వ. మాబాణంబులు రాకముందు ప్రాణంబులు గాపాడుకొనుఁ
డని మిక్కిలి యుక్కుగల పెక్కమ్ము లెక్కపెట్టి చుక్కలు రాలినట్లు
దిక్కున నక్కుల దిక్కు లక్షించి వైచిన, వా రలిగి,

తో. బహువిధశరములు వఱపి తత్క్షణము భరతుని మూర్ఛిల జేసి, సహజన్ముల లక్ష్మణ శత్రుఘ్నుల సరకుఁ గొనక వెనుదాసి॥ రామ॥ అమితబాణ వర్షముల ముంప, వా రంత యోర్వఁగాలేక, విముఖులైనఁ గని విక్రమమున రఘువీరు జేరి వెనుదాక॥ రామ॥

రామ-కీర్తన-ఆదితాళము. (సరే సరే) వలె.

బలాబలంబులు దలంప కిటు నను గలంపవత్తువురా! రణకౌశలంబుఁ జూపెదరా! ॥ బల॥ అజుంబు లాదిగ్గజంబులను గెల్వఁ జాలుసే వినుడీ! దీని నిజంబుగను గొనుడీ ॥బలా॥ దురంత మగు మీ పరాక్రమంబుల తెఱం గెఱిగియుంటి! మిథిలాపురంబులోఁ గంటి ॥బలా॥ ప్రగల్భములు పల్కఁగా నేల మోతుగుండపతియాన నిలువఁగఁ దగుఁ రణములోన ॥బలా॥

వ. వర్షధారలంబోలి వెడలెడు మద్బాణపరంపరల కోర్చినఁ జాలు నని పలికి. కౌసల్యాది కాంతలు స్మితహాసహింతబుగఁ దనయుద్ధనైపుణ్యంబు జాలరంధ్రంబుల నుపలక్షించుచుండ దశరథుం డచ్చెరువందె,

శా. వాయవ్యాస్త్రము వింట నెక్కిడి కడుఁ వైళంబ బింకంబుగా
ద్రేయన్ వార్ధితటంబునన్ బడగ, వారిన్ గొందఱన్ ద్రోసి; నా
చాయ న్నిల్చిన వారిగర్వముడుగన్ సమ్మోహనాస్త్రంబుపై
డాయం జేయ, వితాకులైపడిరి చేష్టల్ దక్కి భూనాయకుల్.

వ. రాముండు ప్రియజనకుఁ జేరి నమస్కరించి సోదరుల యవస్థనుగుఱించి విచారింపఁ బోవునంతలో, నైక,—

ఆ. సమరతలమునందు సాయకములఁబడి
మూర్ఛ మునిఁగియున్న ముద్దుకొమరు
శిరము స్వాంకతలము జేర్చి యత్యంత దుః
ఖాబ్ధి లోన గూలి యడలుచుండె.

కైక-కీర్తన-ముఖారి: రూపకము (హా ప్రాణనాయక)వలె.

నాకూర్మినందనా! నను నిటు దేరి చూడరా! కైక నేర మేమి
! నీకరణిని శోకాబ్ధిని వేఁగూల్చిరి భూకాంతులు॥ నా॥ పలువురు
కూరు లుండి, కలనను నిడుములఁ బడుచోఁ దలగింపఁగఁ దలపరైరి
॥ మనుకులమున జనియించిన నిను బగతురు చెనకెడుచో, జన
నుగను చుండెను ॥నా॥ జగతిని శ్రీమోక్షగుండనగ శేషుఁడు
డ్డుపడగ జాలక వగ ద్రోసెను ॥నా॥

వ. ఇట్లు దుఃఖింప దశరథ-కౌసల్యాదులు సేరి యూరార్పు
రి. అంతట, రాముఁడు లక్ష్మణునిజూచి,—

మ. అనుజా! ముద్గలమౌని యాశ్రమము దాపైయుండుని చ్చోటి,కా
యన దివ్యౌషధవల్లికల్ బెనిచె; నీ వం దేగి నాయాజ్ఞఁ దె
ల్పిన సంజీవని నిచ్చు దాన సుఖియై లేచుం దగం గైకజుం;
డను మాసంపకపొమ్ము కార్యవిఫలం బౌ జాగు గావించినన్.

వ. రథారోహణంబుసేసి పొమ్మనఁ దత్క్షణంబ లక్ష్మణుండు
జ్ఞ శిరసావహించి ముద్గలాశ్రమంబుఁ బ్రవేశించి తదీయశిష్యులం
—

సంవాద సీసము:

లక్ష్మ - వటులార యొందున్నవారు మీ గురువులు?
వటులు - యోగసమాధియం దున్నవారు.
లక్ష్మ - మా కార్యములు దీర్చు మాన్యు లిం దెవ్వరు?
వటు - కార్యంబు లెవ్వి చక్కఁగఁ దెలుపుడు?
లక్ష్మ - సంజీవకరణికై చనుదెంచినారము;
వటు - దాని మీ కీ నుచితంబు గాదు;
లక్ష్మ - రామాజ్ఞ! లక్ష్మణ నాముఁడ వచ్చితి;
వటు - నెవరైన నేమి? మే మియ్యగాదు.

గీ. లక్ష్మ - ఎప్పు డవి మాకు దొరకునో చెప్పరయ్య !
వటు - ముద్గలార్యుని నడిగి కొం పోగదయ్య!
లక్ష్మ - తడవు జరిగినఁ గార్యంబు చెడును గాదె !
వటు - యందఱకు నిచ్చుటకు గురునాజ్ఞ లేదు.

వ. అంతట నిష్ఫలుండై వేగంబున రామునికడ కరిగి,—

మ త్త కో కి ల.

మౌనివర్యుఁడు నిర్వికల్పసమాధి నుండెను శిష్యులెం
తేని నన్ను నిరాకరించిరి దేశికాజ్ఞకుబద్ధులై;
నే నిజస్థితిఁ దెల్పి కార్యము నెమ్మనమ్మై నెఱవేఱఁగా
నైనమూర్గ దెలియంగ వచ్చితి; భావిమార్గము జూపవే!

రా. వ. తడవు జరిగిన భరతున కపాయంబు వాటిల్లు.

లక్ష్మణ-దేవరవారి యాజ్ఞ ననుసరించి చేయ సిద్ధము గా నున్నాను.

రా-బ్రహ్మచారుల ధిక్కరించి యౌషధలతల దేనోపునవా !

ల-ఋషివర్యునకలుక వొడమిన మనకు ముప్పు అసిభవము.

రా-ఈకార్య మనుకూలమయిన పిదప వారికోపశాంతిఁ నేఁ జేయుదుఁగదా!

ల- చిత్తము వెళ్ళుచున్నాను.

చ. చటులజవంబుతో నరిగి సంయమి యోగసమాధినుంట సం
తటఁ బరికించి యౌషధలతల్ గొన నడ్డము వచ్చినట్టి యు
ద్భటుల నిరాకరించి బలవంతముగా నవి సంగ్రహించి, పి
మ్మట నరదంబునన్ జని ప్రగుణంబున నర్పణ చేసె ప్రమోదమొప్పగన్.

వ. రాముడు పరమానందభరితుఁడయి అమ్మూలికను ప్రయోగించినఁ దత్ప్రభావంబున భరతుండు సుప్తునింబోలి మేల్కొని తలిదండ్రులకు రామునకుఁ బ్రణమిల్లె. వారు దీవించిరి. కైక పరమసంతోషిత

నిరపరాధులము మానిలయంబులకువచ్చి
గోటియుల దోడేలు బొదివినట్లు,

గీ. రేపుచుండుదు రిదివిపరీత మనక
తపము సాత్వికవృత్తి వ్యర్థంబుగాదె!
మూలనుండిన వారిని మునిగిధులకు
దీయ న్యాయమె యీభూమినాయకులకు!

ముని-వాని నామధేయం బెఱుంగుదురా?

వటు-ఇదివర కెఱుఁగము. లక్ష్మణుం డని వచించె.

ముని- క్రోధతామ్రాక్షుండై ఎక్కడి లక్ష్మణుఁడు! మన వన మెక్కడ! నతం డెం దుండువాఁడు! అక్రమప్రవేశ మేలచేసె! మదీయ కోపానలజ్వాలలు ప్రజ్వరిల్లిన నతఁడు భరింపఁగలఁడే!

వటు-రామునిసోదరుండనని మాతోఁ బలికె. రాముఁడెవ్వఁడో!

ముని-ఏమీ! రామునిసోదరుఁడా? (అని మోహించి దివ్య దృష్టితోఁ గని,

చ. దశరథరాజనందనుఁ డుదారయశోనిధి రామచంద్రుఁ డా
కుశికతనూజతో మిథిలకుం జని తత్పురమందు నున్నయా
పశుపతివిల్లుఁ ద్రుంచి సులభంబుగ సీతనుగొన్నయట్టి నే
విశదముగాఁగ వింటి మును వీరవరుం డతఁడే యితండహో.

వ. అయిన మన మతనిఁ దర్శించి రాఁ దగును-అని శాంతంబు వహించి ప్రయాణంబగు మండ నిక్కడ దశరథుండు విషాదంబున నతీ సుతాదుల నవలోకించి,

దశ. కీర్తన -ఆనందభైరవి: రూపకము (ఓ మహాత్మా) వలె.

ఏమిసేతు నేయుపాయము నా కేది తోప ॥ద॥

ఆమునీంద్రునాజ్ఞఁగొనక నౌషధములు దెచ్చిరంట! తామసించి శాపమిడక సామాన్యముగాఁ గనునే! ॥ఏమి॥

మానులవిశ్వాసమునకు భూనాథులుపాత్రు లగుదు; రీనాఁడది
ద వ్వాయెను; ఈ నేరం బెట్లు వాయు! నేమి॥ మోక్షగుండవిభుభక్తుల
క్షితి నపకారంబును బక్షపాతమునఁజేయఁగ నాక్షేపింపరే లోకు!
॥లేమి॥

దశ-వ. ఇదిగాక యతనియనుమతంబు వడయక తెచ్చిరి. ఆఘ
నుఁడు సమాధిచాలింపక యున్నపోయి క్షమాపణ వేడుకొనియెద నని
యందఱతోఁ గలసి మునియాశ్రమంబున కరిగె. ఆమునియు నెఱిఁగి
ఎదురుజని,

ముని—

కం. క్షితినాథ, సతీ-సుత-భట
హితయుతముగ వచ్చినారు హృత్తోషము స్వా
గతమొసఁగెద; నీదినమున
నతిథులరై నిలువవలయు నాశ్రమమందున్.

వ. ఇది మదీయేప్సితం బని యసదృశకుసుమసమన్విత వృక్ష
లతాసముదయంబులపొంత నాసీను లగుటకు వసతులుగల్పింప, అందు
వసించి దశరథుండు విన్నదనంబున—

దశ- మునీంద్రా! భవత్పాదారవిందంబుల కనేక వందనంబులు.
ము-దిగ్విజయోస్తు! పుత్రపౌత్రాద్యభివృద్ధిరస్తు!

సంవాద-సీసము.

ద-అపకారమొనరించి రయ్య! నా నందను;
లలుగక కృపఁజూడ వలయు నేడు;
ము- అపకార మేమి చేయఁగలేదు భూనాథ
హితము చేసిరి యుపకృతియ తలఁచి
ద-ఔషధలతలు మీయాజ్ఞఁ గైకొనక స్వ
తంత్రించి తెచ్చుట తప్పుగాదె!

ము-రాముండు సుగుణాభిరాముండు సర్వలో
క స్వతంత్రుండగుం గాదె భూప
ద-తే. కోపగించితిరో యని తాప మంది
శాంతి పఱుపంగ వచ్చితి సంయమీంద్ర!
ము-మనుజరూపము దాల్చిన మాధవుండు;
రాముఁడాతని మాకోప మేమిసేయు.

సం - వ. అంతఁ గౌసల్యాదికాంతలు, సీతాదిస్నుషలు, రామాది కుమారులు వేర్వేఱ సుమతీ-ముద్గలులకుఁ బ్రణామనంక లాచరించి వారి దీవన లంది, పిమ్మట వారి యాతిథ్యం బంగీరించి యాదినమందుండిరి. అప్పుడు—

దశ-

కం. మునివర్య! యొక్క-విషయము
వినఁగోరితి మిమ్మునుండి విశ్రాంతినొందుఁడ
అనవుఁడు, తులసీఖండం
బునకును గొనిపోయి వివరముగ నడుగుమనన్,

దశ-తో. తమ రెఱుఁగనివిషయము లుండవు; నా కొమరుఁడైన రామునకుఁగ్రమమున రాఁగల కాలశుభాశుభగతు లెఱిఁగింపుఁడు నాకు॥

సం - వ. ముద్గలుఁ డానందకందళితహృదయారవిందుండయి,-

ము - కీర్తన-హిం, కాఫి : ఆది (పెంట్రీ కృదన్) వరె.

చెప్పెద నీవు భూధవా! ఇప్పుడు చేసిన ప్రశ్న కొప్ప ప్రత్యుత్తరము॥ చెప్పెదన్॥ శ్రీరాముఁ డనఁగ నాదినారాయణుఁ డుద్భవించె ధారుణీశ! నీదుపుణ్యకారణమునకు ॥నీకు॥ జెప్పెనష్టమైనధర్మమునుసృష్టి పైఁగ్రమ్మఱ నిలుపు, దుష్టులను శిక్షించుచు శిష్టులను రక్షించుఁ ॥జె॥ శ్రీమానినియంశమైన సీతనుజాయఁగ గొని భూమిని శ్రీమోతు గుండ రాముఁడై రంజిల్లును ॥జెప్పెద॥

ముద్గలుఁడు-

. కొలఁదికాలంబునకును నీవు దివి కేగ
గలవు వృందాశాపకారణమున;
రాముఁడు దండకారణ్యంబునకు జని
యవల నయోధ్యకు నరుగుదెంచి
రాజ్యంబుగైకొని పూజ్యంబుగా నేలు
లీల బదునొకండు వేలయేండ్లు
కొడుకు లిద్దఱు మఱి కోడండ్రు నల్వురు
మనుమ లిర్వదినాల్గుమంది మనుమ
. రాండ్రు పండ్రెండుగురు ప్రపౌత్రాళి యగణి
తంబుగా నిట్లు సూర్యవంశంబు నెంచి
దీవులేడింటిఁ దాన సాధించి యేలఁ
గలఁడు నీయగ్రసుతుఁ డొక కాలమందు.

వ. ఇదియ నీకొడుకు భావికాలవర్తమాన మనిన,

దశ-తో. వృంద యనఁగ నెవ రెందుండును నాసుందరి విభుఁడె
వు ? ముందు శాప మా యిందిరాపతికి నెందు కొసఁగె నది
॥రా॥

వ. ఆకథావిధానంబు కరుణారసపరిపూరిత హృదయుండనై
:గింపు డన ముద్గలుండు——

ము. నాట-రూపకము, (జనకా) వలె.

వినుము భూమిపా మునుపు శంకరుని ఘనకోపవహ్ని వన
ుడిన జయించె నరములో జలంధరాసురుఁ, డనఁగఁ; వరుణుఁ డే
అనురాగమునం బెనిచెఁ॥ విను॥ జాలంధర మనుపొలిలు
ంచి చాలఁగ నందు లీలవసించి, కాలనేమిగన్న కన్యను వృంద
బాలఁ సద్గుణజాలఁ ఆలిం గాఁ దాఁ గైకొనె॥ విను॥ దఁడి

వీరుఁ డనఁ దనరివేలుపుల దండించి తొలిదర్పముదూల, నుండతావు లేక బెండువడి మోక్షగుండనగరవిభుని యండ జేరి తెల్పిరి॥ విను॥

వ. ఇటువలెఁ దనశరణుసొచ్చిన దేవతల నాదరించి విరించి జనకుఁడు:—

విష్ణు-క. పురహరుఁడు దక్క నొరు లె
వ్వరు వాని జయింపలేరు వాస్తవమాశం
కరునారాధింపుండా!
తఱిగని నేఁ దోడుపడుదు; దైత్యుడు మడియున్.

వ. అంతదేవతలు:—

శివప్రార్థన—దేపిలావణి.

పురవైరీ! పురవైరీ! పురవైరీ! పురవైరి! విధృతవనజారి! వినుతఘనసూరినిచయ! కరివైరీ! కరివైరియానవర, శౌరి! మాత్తహర భూరిభయద నరకారీ! నరకారివినుత పద వారిజాత! స్మరవైరి! హర! గరుడారి! గరుడారితల్పశరధారి! వినుతపరిహారి! లోక హితకారీ! ॥1॥ శ్రీమోక్షగుండధామాక్షదామ! ప్రతిపక్షద్విరదహర్యక్షా! హర్యక్షవక్త్రిబుభుక్షుశూరఘనరాక్షసప్రకరశిక్షా! కరశిక్షోపరిరక్షితరావణ యక్షరాజసంరక్షా సంరక్షిత మునినుత! దక్షాధ్వర సర్వక్షయదివ్యకటాక్ష॥ 2॥

వ॥ ఇక్కరణిఁ బెక్కగతుల నగ్గించిన ముక్కంటి దేవతలదిక్కు వీక్షించి ప్రసన్నుం డయిన, మొక్కులొసఁగి,—

దేవతలు,—

ఉ. దేవ, జలంధరాసురుఁ డుదీర్ణబలంబున మమ్మదిర్చి మా
తావులు దానగై కొనియెఁ; దాళఁగఁజాలము వాని ధాటికిన్!
యేవిధి నింక వానిసమయించి దయార్ద్రుల మమ్ముఁ బ్రోవఁగా
నీ వసమర్థుఁడౌదు వన, నిం బరు లోపరు చంద్రశేఖరా॥

దే-వ. మాకు శరణ్యుండవుగావే యని యని ప్రార్థించిన, వారి కభయంబిచ్చి వాని యుద్వేగం బడంప నిశ్చయించి,

సం-తో. శూలము గైకొని జాలంధరు నిలఁ గూలుపఁ జనుచుం డఁగను వేలుపులను దావెదకుచు నెనురుగ వేగ వచ్చె నాతంపును॥ శూ॥

సం-వ. ఇట్లిరువు రొకచోఁ దారసిల్లి పో రొనర్చుచుండిరి. అప్పుడు—

సం-క. శీతాద్రిజాత ప్రేరణ
చేతరమానేతఁ దనదు చేతమునంద
త్యాతుర మొందుచు వృందా
పాతివ్రత్యంబుసెరుప బరువడి నరిగెఁ.

సం-వ. జాలంధరపురోద్యాన వనంబున నొక శిష్యునితోఁ బ్రవేశించి యొకచో నాసీనుండై తపంబు సేయుచుండె.

తే॥ వృంద నిజభర్తృ పాదారవిందములను
డెందమున గొల్చి యొకనిశియందుఁ దనదు
మందిరంబునఁ బూపాన్పునందు నిదుర
జెంది కలఁ గని లేచి లోఁగుంది కండి.

వృంద-పాట-ఆది (వలదచటికి) పల్లవి.

కల గనినానే! చెలియ! వినుము తెలియఁగ ॥కల॥ చెలువుఁడ నూనె దలయంటుకొని, వలువ దాలుపకయ యున్నటులను ॥కల॥ ముండియై మహిషమును నెక్కి నిశిని దండధరునిదిశకు దరలినటుల॥కల॥ మోక్షగుండేశుని యక్షయకారుణ్యావీక్షణ కలదో! లేదో! తెలియరాదు ॥కల॥

వృంద- సీ. పలువేలుపుల డీలు పడిపాఱఁ గాదోలు
నలకాలుపస ప్రీలునటుల జేయు;

దగఁ బాసి దెసఁ డాసిఁ తనవాసిఁ గనఁజేసి
మఱి యక్షవరుశిక్ష పఱచి పసుపు
సిరిబిడ్డ గసబడ్డఁ జఱుగడ్డమునులాఁగు
బలుమాఱు జడదారు లలయ దూరు
బనిమాలి వనమాలిఁ గని గేలిసేయును
గుఱిమీఱ హరుబోరఁ గోరుచుండు

గీ. నెంత దెల్పిన విన డిసుమంతయైన
నిపుడు ద్రిపురారి పైకేగ నిపుణుఁ డగుచు
యుద్ధ మగుచున్న దచట మహోగ్రగతులఁ
జెడ్డకలఁగంటి నే నేమి సేయుదాన!

వ. ఈసంతాపంబు కొంత యుపశాంతించుటకు వనాంతరంబున విహరింత మని పలికి, తెల్లవారినపిదప నిరువురు చెలికత్తెలతోఁ గలసి యుద్యానవనంబు సేరి విహరింపుచు ప్రాణనాథుని దలంచి వగపు గలుగ:—

వృంద-కీర్తన-హిందోళ: రూపకము-(వరధాత్రితనయా) వలె.

తరుణీ! నావిభుఁడు తడయుటకు గతంబదేమో॥ తరు॥ పుర హరుతో బోరుసలుపఁ దర మగునటె తనబోఁటికి! తరు॥ అశుభసూచకములు దోఁపనాయె నేఁడుఁ నా కిఁక విశదంబుగ క్షేమవార్త విను పించెడువారు లేరు॥ తరు॥ ధరణిని శ్రీమోక్షగుండధాముఁడయిన శ్రీహరి హరు లజేయు లనుచును బలుమఱుఁ దెలిపిన విన డాయెను ॥ తరుణీ॥

వ. ఇట్లు విలపించుచున్న:—

చెలులు- క. కలకేమి! కనులు మూసినఁ
బలువిధములఁ దోచు చుండుఁ బ్రతిదినమును నా;

ఫల మనుభవించితివి! యీ,

కలకున భయపడఁగవలెనె! కంజదళాక్షి !

వృంద-వ. నామనంబునకు మిగుల దిగులును భయమును గలు

గుచున్నదమ్మా !

చెలి-వ. నేనుండ భయ మేల తల్లీ !

వృంద-వ. ప్రళయకాలాభీల జగత్కల్లోల మార్వారజమేఘగ

ర్జనంబునుంబోలిన ధ్వనియొకటి వినంబడుచున్నదిగదే!

చెలి-వ. ఇంతలో నీ కింత చిత్తచాంచల్యము గలిగినదమ్మా.

వృంద-వ. నాకు చిత్తచలనముగాదు. నీకు బధిరత్వము వచ్చి

ం. (అని కొంచె మాలోచించి.)

చెలి-వ. నీమాట నిశ్చయమయిన నిజ గుహాంతరమునుండి

గంబు మాతంగసంఘంబుప్లె లంఘించు గర్జయని తోఁచెడిని:

వృంద-వ. సింగమయిన నున మాకువారముగదా:—

చెలి-వ. శీఘ్రంబున నడుపుము; తొలంగెదము.

ఉ. కొండలు మాఱుమ్రోయ దిశికుంభినులట్టిటునల్లలాడ,మా,
ర్తాండుఁడు త్రోవఁ దప్ప, సలయంబని లోకులు దల్లడిల్లనా,
దండ కిలార్భటీయము మదంబున రాక్షసయుగ్మ మప్పుడు,
న్గండతఁ బ్రచండము నాకుక; దన్నయి భీతింగలంగి రంగనల్.

నం-వ. భీమనాదంబ్రకటితమునంబులతో వినుకొనిన రాక్ష

ంగని భయవిహ్వలులై పలుంగువారము నా వెంగట తపంబు

మహాస్న మునిపుంగవునింజేరి యాలింగనంబుఁ జేసికొని,

వృంద-కీర్తన-బంగ్లాటి; ఆటతాళము. (కామిత్తుఁ కా) వర.

మునివర ! నను బ్రోవవె ! కరుణ గనవె ! నిను గని ఘనమౌ

మనమునఁ దెలిసితి॥ మునివర॥ వినుకొని దనుజాలు నను దలు

మ్రొగి భయవనధిని మునిఁగితి ! ఘనముగ శోకగతిని॥
ముందాపదనొంది, వగఁజెంది వనమందుఁ జేరి యుండ మునుసు
ద్రోడిం ద్రోకకీ డొంద నాయె॥ ము॥ తాపసేంద్ర ! మనో
క్షితిపతిబోలి యిపుడీపాపుల కోపాగ్నిని రూపార్పుము!
॥ మునివర॥ [ఇంతలో]

తో. పటుభయంకరార్భటులతోడ నచ్చటికిరక్కసుల
నటుఁగని తటుకున నమ్ముని హుమ్మన నవ్వల కేగిరి వేగా॥

వ. అమ్మహనీయుని ప్రభావంబునకు నాశ్చర్యపడి సా
ష్టాంగనమస్కారం బొనర్చి వృందాదేవి—

వృంద. సీ. భవదీయహుంకార పటురవస్ఫూర్తిచే
మత్ప్రతిపక్షులు మాయమైరి;
మీదయారసము నామీఁద వర్షించిన,
సకలభయాగ్నులు సమసిపోయె,
మీ రెఱుఁగని దెద్ది మేదినిలో లేదు
మహనీయులరు మీరు మౌనితిలక,
యడిగెద మి మ్మొకయంశంబుదానియ
ర్థార్థంబు దెల్పఁగా నగును దేవ.

గీ. నాదుమగఁడు జలంధరనామ దనుజుఁ
డభవు నెదిరించి యనిసల్ప నరిగినాఁడు;
బహుదినంబులు జరిగె నిప్పటికి రాఁడు
వార్త దెలియక యీగతి వనరుదాన!

వృంద-వ. నాయభీష్టంబు దీర్పుఁ డని ప్రార్థింప, ముని
యూర్ధ్వదృష్టితో నవలోకించె. రెండుకోఁతులు వియన్మార్గమున
క్రిందికి వచ్చె. నమస్కరించె. మౌనికనుసన్నతోఁ దెలిపిన—

క. గగనమున నెగసి రెండుగ
దెగియున్న జలంధరాఖ్యు దేహము గొని, వా
ర్మగుడ జనుదెంచి, వృందకు
నగపఱచిరి క్షణములోన నాశ్చర్యముగన్.

వ. భిన్నమైయున్న భర్తృకళేబరంబు గని వృంద మూర్ఛిల్లిన, మునీంద్రుండు కమండలోదకంబు ప్రోక్షింప, మూర్ఛదెలిసి,

వృంద. కీర్తన - నాదనామః (ఆదిఏంతదుర్గి) వలె.

దైవదుర్బలమో! నావాంఛితఫలమో! యీవేళ విగతజీవుం డాయెను పతి॥ దైవ॥ ఏకాలమున కేమే లగునో, యేకీడగునో యెఱుంగలే మకట! ॥దైవ॥ విజయము నొంది వే వత్తు నని నిజముగ నమ్మి నే నుంటి నయ్యో! ॥దైవ॥ గురుతర మోక్షగుండేశుం గెల్వదర మగునే నీకు! దరి యెవ్వ రింక ॥దైవ॥

వ. అప్పుడు మునివర్యుండు సమీపించి,—

ముని:- క. చచ్చినవారలు గ్రమ్మఱ
వచ్చెదరే! శోక మొంద వలదు విబుధులీ,
వచ్చుట బోవుట సమ మని
చెచ్చెర చెప్పుదురు కాదె శీతాంశుముఖీ!

వ. దుఃఖింపవలదు తెప్పునదెలివినొందిజడదారిపదములంబడి—

భుజంగప్రయాతము.

వృంద- మునీంద్రా! భవత్పాదముల్నమ్మితిన్నా
మనోనాయకుం గూల్చె మారారి యల్కన్,
బునర్జీవితుంజేయం బూజ్యుండ వీవే!
కన న్వేఱొకం డోపంగా లేడు ధాత్రిన్.

పంచచామరము.

ముని- పురారిగొన్నవీనిప్రాణపుల్ మరల్ప నేఁడు నా
తరంబె! యైన మత్కృపాసుధారసంబు నీపయిన్

గరంబు జిల్కఁ జూడు సీమగం డిదే సజీవుఁడై
కురంగటం జరింప జేతుఁ గూడు మంగనామణీ!

వ. అంతలో జలంధరుండు యథావిధిగ లేచి నిలిచిన వృంద యానందకందళితహృదయమై ముని నభినందించుచుఁ బ్రాణనాథుఁ నాలింగనంబుఁ జేసికొనియె. అది మొదలుగ—

సీ. ఖేలానుకూల విశాలలాలిత మాల
తీలతా నికురంబ కూలములను
సారసకల్హార వారిపూరితదివ్య
చారుసరోవర తీరములను
సంతతసుమఫలసంతాన శోభిత
సంతాపహారతరుప్రాంతములను
మలయానిలాయాతసలలిత సుమరజో
కలితమౌ సైకత స్థలములందు.

గీ. అలజలంధరు రూపుగొన్నట్టిచక్రి
వృంద ముదమందముఖము చుంబించి మోవి
పానకముగ్రోలి చౌసీతిబంధరతుల
గలసిమెలఁగెను దాఁజిరకాల మచట.

వ. ఒకనాఁటి సురతాంతంబున ప్రమాదంబుచే నిజరూపంబున నిదురించుచున్న యతనిం గని వెన్నుం డని గుర్తించి యా యన్నుల మిన్న కన్నుఁగవఁ గెంపు లొలుక—

కృతి-కన్నడ: ఆదితాళము (రాకేందు) వలె.

నీ మాయ దెలిసె! మనసు సొలసె! మాయఁజేయ నాయ మగునా॥ నీమా॥ అపకారబుద్ధివచ్చినట్టి శౌరి వని కంటి! కపట తపము గావించితివి ॥నీ మా॥ పరదారసంటి వెంట నుంట గౌరవం

గా! మేర మీరి తౌరా ధీరా। ॥నీ మా॥ గురుండు శిష్యుఁడాయె,
కుగుండవర నీకు దండ నుండఁ దగదు తలఁగు ॥నీమా॥

జయవిజయులను నీపారిషదులు నాకు
గీడొనర్చిరి రాక్షసాకృతులతోడఁ
బుణ్యశీల సుశీలు రిప్పుడు కపులంబు
నీదు పను పాచరించిరి నిశ్చయంబ.

ముం దీవు రాక్షసులచేఁ
బొందుగ నిజసతిని గోలుపోయి మనములోఁ
గుందిన కపులుఁ దోడ్పడఁ జే
కొందువు కామినిని మగుడఁ గూరిమితోడన్.

వ. దండకాననవిహారంబు భార్యావియోగంబు కపిసహాయంబు
చనంబునం జేసి నిశ్చయంబుగ నీకు లభింపఁగల దని,

సం- తో: ఇందిరాపతికి నిటు శాపం బిడి వృంద విభుని స్మరి
పొందుగ ననలము గూర్చి తనువు నానందమ్మున నర్పించి॥రా॥

వ. పరలోక సుఖంబున కరిగె-

ముద్గ-పాట: అట-(ఓర్చియుండు మిక) వలె.

రాజ రాజ విను దశరథమహా ॥రాజ॥ ఆ జయవిజయులె
బలైనా రిపుడు ॥రాజ॥ రావణ కుంభకర్ణ నాములైరి మహా
దనుజు లంకయందు వసించిరి ॥రాజ॥ లోకకంటకులై య
గలించిరి ॥రాజ। మోక్షగుండేనుపైఁ బూనిరి వైరము ॥ రాజ॥

సీ. మనుజేశ నీకొడుకు గోడలును బంచ
వటియందు నుండ రావణుఁడు వచ్చి
రామునే మరఁ జేసి భూమిజఁ గొనిపోయి
తల్లిరీతిని బ్రోచి తనరుచుండు;

వాలినివధియించి వానితమ్మునిఁ గూడి
కపిసేనచే వార్ధిఁ గట్టఁజేసి,
రావణాదులఁ గూల్చి రమణితోడ నయోధ్య
జేరి తాఁ బట్టాభిషిక్తుఁడగును;

గీ. యజ్ఞము లొనర్చి మఱి తీర్థయాత్రలాచ
రించిద్వీపంబులేడు సాధించి యేలు;
నిదియు గోప్యంబు; నీకు నే నెఱుకపఱచి
తిని; మహీవర యొరులకుఁ దెలియనీకు.

శివుని- క. ఈరీతిని ముద్గలముని
శ్రీరాముని భావిచరిత చెప్పఁగ విని యో
గౌరీ! దశరథుఁడు సమ
స్కారము లర్పించి పలికెఁ గ్రమ్మఱ మునితోన్.

కీర్తన. శంకరాభరణము: అట (పింతలాయె) వలె.

సన్మునీంద్ర! సంతసమాయెను ॥సన్ము॥ మన్మనోభీష్టము మానుగఁ దీర్చితి ॥సన్ము॥ రాముఁడు హరియని భూమిజ రమ యని స్వామి తెలిపితిరి ॥స॥ జోడుగ గొడుకుఁ గోడలుగా నను గూడఁగ నేటికి॥స॥ శ్రీకరమోక్షపురీపతికృపతో నాకథఁ జెప్పవె ॥సన్ము॥

వ. నాపూర్వవృత్తాంతము దయాంతఃకరణముతోఁ గొంత సెలవిండని ప్రార్థింప ముద్గలుం డానందభరితుండై.

మ. ధరణీనాయక, సహ్యపర్వతము చెంతన్ వింతగా నొక్కపట్టణ
గరవీరం బన నొప్పు, నందుఁ గమలీలన్ ధర్మదత్తాఖ్యుఁడౌ,
సురుఁడొక్కరుండు గలండు; సద్గుణుఁడు సుశ్లోకుండు సద్ధర్ముఁడై,
హరిసేవాపరతంత్రుఁడై మెలఁగు నిత్యం బాత్మ సంతుష్టితోన్.

వ. ద్వాదశాక్షరవిద్యాపరాయణుండై భార్యాద్వయముతోఁ గూడి యతిథిపూజ యొనర్చుచునుండు, వాఁ డొకపరి—

తో. భాసుర కార్తికమాసంబున హరివాసరమున గుఱియుంచి
గఁ దా నుపవాసనియతిమై వాసుదేవు నర్చించి॥రామ॥

సం-వ. రాత్రి జాగరణకొఱకు హరిమందిరమునకు నరుగుచుండ
క్రమధ్యంబున—

సీ. వెడఁదశరీరంబు విన్నుముట్టనకంటి,
కాటుకకొండతో దీటుగాఁగ,
దీర్ఘనిశ్వాసంబు ఘుర్ఘురస్వనమును,
దెగువ భీమంబుగ దిశలఁ బర్వ,
రక్తలోచనముల రగులువహ్నికణంబు,
లలప్రళయజ్వాల ననుకరింప,
లంబజిహ్వాగ్రంబు జుంబించు వక్రదం
ష్ట్రిలు వరాహంబులతోఁ జెలిమిసేయఁ
. గడుదిగంబరమై పైకి గవయు శుష్క-
దేహనొకరక్కసిని గాంచి ద్విజవరుండు
దనువు గంపింప నొకకొంత తడవు భీత
చిత్తుఁడై యందు నిలిచి యోజింపఁ దొడఁగె.

కీర్తన-కదంబరాగము, ఆది(ఇంతపాప మెన్నడైన)వలె

ఏమి యీవికారరూప మిటుల నెదుట దోప, స్వామి కేమిలోప
లిపినానో। తలఁప॥ నేమి యీ॥ ఎన్నిసారు లిటు రాలేదు!
డిచటలేదు! చిన్నిరూపుగాదు! పై కొన్న దవలబోదు! ॥యేమి॥
గుండహరిని గొలువఁ బోవుచుండతులువ రాక్షసిటుల నిలువ,
దిఁ కేమి తోచిన!॥యేమి॥

వ. ఆపన్నివారణుండగు హరియుండ భయంపడ నేలయని నిశ్చ
వాసుదేవద్వాదశాక్షరి జపించి తులసీదళయుక్తం బగు నుద
దానిపైఁ జల్లిన,—

తో. భాసుర కార్తికమాసంబున హరివాసరమున గుఱియుంచి
గఁ దా నుపవాసనియతిమై వాసుదేవు నర్చించి॥రామ॥

సం-వ. రాత్రి జాగరణకొఱకు హరిమందిరమునకు నరుగుచుండ
క్షమధ్యంబున——

సీ. వెడఁదశరీరంబు విన్నుమన్నునకంటి,
కాటుకకొండతో దీటుగాఁగ,
దీర్ఘనిశ్వాసంబు ఘుర్ఘురస్వనమును,
దెగువ భీమంబుగ దిశలఁ బర్వ,
రక్తలోచనముల రగులువహ్నికణంబు,
లలప్రళయజ్వాల ననుకరింప,
లంబజిహ్వాగ్రంబు జుంబించు వక్రదం
ష్ట్రిలు వరాహంబుతోఁ జెలిమిసేయఁ
. గడుదిగంబరమై పైకి గవయు శవక-
దేహనొకరక్కసిని గాంచి ద్విజవరుండు
దనువు గంపింప నొక కొంత తడవు భీత
చిత్తుఁడై యందు నిలిచి యోజింపఁ దొడఁగె.

కీర్తన-కదంబరాగము, ఆది(ఇంతపాప మెన్నడైన)వలె

ఏమి యీవికారరూప మిటుల నెదుట దోప, స్వామికేమిలోప
లిపినానొ। తలఁప॥ నేమి యీ॥ ఎన్నిసారు లిటు రాలేదు!
డిచటలేదు! చిన్నిరూపుగాదు! పై కొన్న దవలబోదు! ॥యేమి॥
ఁగుండహరిని గొలువఁ బోవుచుండ తుటువ రాక్షసిటుల నిలువ,
దిఁకేమి తోచిన!॥యేమి॥

వ. ఆపన్నివారణుండగు హరియుండ భయంపడ నేలయని నిశ్చ
ఁ వాసుదేవద్వాదశాక్షరి జపించి తులసీదళయుక్తం బగు నుద
దాసిపైఁ జల్లిన,——

సం వా-సీ. భి-చెప్పినరీతిగ జేయు వే మదినీవు?
కల-చెప్పి చేయింప నీచేత నౌనె!
భి-ముందుగాఁ దిని పండుకొందు వటే కొమ్మ!
కల-నీయాజ్ఞ నా మీఁద నెఱపఁగలవె!
భి-దేవపూజయు వైశ్వదేవ మెట్లగునింక?
కల-వేఱుపాకంబుఁ గావించుకొనుము
భి-నే వండుకొను నెడ నీ వుండ ఫలమేమి?
కల-నాయింట నుండుట నాకుఁ దగదె!
భి-ఎంత తెగువరి వైతివే యిందువదన!
కల-నీకు లోఁబడుదాననే నిశ్చయముగ!
భి-మారువల్కిన శిక్షింతు మగువ నేఁడు.
కల-కూపమునఁ గూలి ప్రాణంబు గోలుపోనె!

కల-వ. నానామంబు సార్థకంబగునట్లు వితండము లాడుచుఁ బ్రవర్తించుచుండ నపకీర్తిలోఁబడి యతండు బహుకాలంబు గడపి విసిగి యొకనాఁడు తనప్రియ మిత్రునింజేరి,—

కీర్తన - ఆదితాళము: (రారాజభాంగ) వలె.)

విన్నావె మిత్రి యీవేళ నాచరిత్ర ॥విన్నా॥ వినుటకుఁ జిత్ర మీవేళ నాచరిత్ర ॥విన్నా॥ ఇంటిలో పో రహో! యింతింత యఁ రాదు! కంటకమౌ మె! వేగమె! నాచరిత్ర ॥విన్నా॥ చెప్పినరీతిగఁ జేయదు పెండ్లాము! తిప్పలబెట్టు! నీ తీరు నాచరిత్ర ॥విన్నా॥ మోక్షు గుండేశునిసాక్షి నాతోఁ బ్రతికక్షుగఁ జేయు వేగమె నాచరిత్ర ॥విన్నా॥

వ. ఇహాపరసౌఖ్యంబులకు నాలవాలము దార యను కారణంబున నోరిచి యెంతబోధించినను భస్మహావ్యమువలెవ్యర్థమగుచున్నయది. దీని కేదైన యుక్తిచెప్పుము సఖా! అని వేడిన—

సఖుఁడు:-క. క్రమముగఁ బని చెప్పిన న
క్రమముగ! దా నాచరించుఁ గావుననీ వ
క్రమముగఁ జెప్పుము తా నది
క్రమముగఁ గావించునదియు గార్యంబు పొమ్మా.

వ. ఈయుపాయంబున కచ్చెరువొంది భిక్షుండు వెంటనే గేహము నకువచ్చి యువిధ పరీక్షింపఁగోరి,—

దంపతుల వివాదము-మానినీవృత్తము.

భి. మానిని, నాప్రియమిత్రుఁడు ధూర్తుఁడు; మానుగ విందు కుఁ బిల్వకుమా! నేనును నాతనిఁ బిల్వను నావుఁడు—

కల. నేరవు జ్ఞానవిహీన, ధరన్ వానిసమానుఁడు లేఁడు; కృతఘ్నుడ; వాపరమాప్తుని దూరెదవా! మానుగ నేఁ జనివిందుకుఁ బిల్తుసుమా వలదన్నను మానుదునా!

వ. ఇట్లుపలికి యతనిఁ దోడితెచ్చి మృష్టాన్నతృప్తునిం జేసి పంపితి. అది మొదలు నిషేధోక్తు లాజ్ఞాపించుచు సంసారంబు నెఱవేర్చుకొను చుండి యొకనాఁడు—

సంవాద-కీర్తన-అటతాళము: (రాము నంపిన) వలె.

భి-ఇద్దినము నాతండ్రిదిది తద్దినము వినగదె! ముద్దుగుమ్మ, నెర వేర్పవద్దు మన మిద్దఱము ॥ఇది॥

కల-అద్దిరా! యిదేమి యబ్బతద్దినము మానుదుర! బుద్ధిలే దూరకుండు! పెద్ద లిది మెచ్చెదర ॥అద్ది॥

భి-మాటికి నే పేటఁ బెట్టనేటికి కిది బోటి! విను, కూటికై పితరు లిచ్చోటి కరుదెంచెదరె ॥ఇద్ది॥

కల-ఏటి కొడుకవునీవు! చేటులకు మూల మిది! సాటివారు వెలివేయరె! టాటోటుమాటలు చాలు॥ అద్ది॥

భి-ఆక్షేపణలేకయుండ దీక్షగ నే నొక్కనికిఁ గుక్షి కింతకూడు బెట్టి యీక్షణమె పంపెదను॥ ఇద్ది॥

కల-వీక్షగుండ శౌరిపదసాక్షిగను శాస్త్రవిధి లక్షింపక యి చ్ఛాగతి నీక్షితిఁ జరించెదవె॥ అద్దిర॥

వ. ఇట్లు భర్తను ధిక్కరించి తత్క్షణమపోయి పదునెనిమిది మంది భోక్తలను నియమించి గృహాదులు శుద్ధిచేసి సమస్తశాక సూప భక్ష్యాన్నములు సిద్ధపఱిచి భోక్తలఁ దోడి తెచ్చి శుద్ధాసనాసీనులఁ జేసి యర్చింపు మన.

భిక్షుండు-నాకుశరీరము జబ్బుపడినది. స్నానము మానుదునా?
కల-ఇంతదురాచారుఁడవా! స్నానముమానిన వృథా శ్రాద్ధముకాదా?

భిక్షు-(స్నానముచేసి వచ్చి యథావిధి నర్చించి)

సంవాదము-ఉత్సాహవృత్తము.

భి- అందఱుఁ భుజించుదనుక నాగలేవు భామినీ
ముందు నారగించి, పిదప భోక్తలకుఁ బెట్టుమా!
కల- మందమతివి ధర్మశాస్త్రమతమునీకుఁ దెలియదా!
ఇందఱిఁ భుజింపఁజేసి యేను బిదప దినియెదన్.

వ. ఇట్లపసవ్యంబుగఁ జెప్పినపను లెల్ల సవ్యంబుగ నాచరించు చుంటి. అప్పుడు బిండప్రదానంబులోఁ గూడ శ్రాద్ధంబు నెఱవేర్చి—

సంవాదము-మత్తకోకిల.

భి-ఈదినం బుపవాస ముండెద నింతి నే భుజియింపనా! మోద మంది భుజించు మిప్పుడు మూడుజాములు మీఱెనా!

కల-వాదమా! యిది పైతృకం బుపవాసహేతువు గాదు మర్యాదగన్ దిను మంచుఁ బెట్టితి; నారగించెను నాతఁడున్.

వ. అటుపిమ్మటఁ బ్రిమాఁడంబున—.

తో. ఈపిండంబుల నిపుడుగంగలో నింతి వైచి రమ్మనఁగఁ,
బాప మనక మలకూపములో నవి పడవైచితి నావెనుక॥ రామ॥

వ. ఆ యకృత్యంబున నసూయనొందియు నది లోపల నడంచికొని,

క. మలకూపంబుననుంచుము;
జలములలో, వేయఁ దగదు సతియన, మలిన
స్థలమందు నుండనీయక
తలగించి జలంబులందుఁ దప్పక యిడితిన్.

వ. అట్టి విపరీతకృత్యంబునకు నోర్వ లేక యలుక రెట్టింప భిక్షుండు.

కీర్తన-కేదారగౌళ ఆదితాళము (ఇంతరంసం.) వలె.

ఎంతగయ్యాళివే నీవు! నా శాంతమున్ బోఁద్రోచినావు; కుంత
ముందూరిచి గొంతుసింపి గుంతలోఁద్రొతునా దోషకారీ! హాంతకారీ!
తంత్రకారీ! యంతమొందింతు మర్దింతు నొంతు నెంత॥ దీక్షతో నా
యిల్లు సేరి ప్రతికక్షఁ బూనితి నౌరా! మోతుగుండేశుని సాక్షిగాను
శిక్ష గావింతును జిక్కబట్టి, రక్షపెట్టి రాతఁగొట్టి భిక్షుకుఁ బంపింతు
నీక్షణమున॥ నెంత॥

వ. కఠోరంబుగాఁ బలికి నన్నుఁద్యజించి కులశీలసుగుణంబులుగల
యొకకన్నియను బెండ్లియాడిన నేను రోషించి విషపానంబున నసు
వులు విడిచితి; అప్పుడు:—

కల-తో. దండధరుని దూతలువచ్చిరి యుద్దండపరాక్రమ మొప్పఁ;
జండశాసనము సలుపుచుఁ గొనిచని శమనునిసన్నిధి నిలుప॥ రా॥

చ. శమనుఁడు చిత్రగుప్తుఁగని చక్కఁగ నీబిడ చేసినట్టి క
ర్మములు విమర్శచేసి వివరంబుగఁ దెల్పుము నాఁగ నాతఁ డా
క్రమము గణించి దేవర! నిరంతర మీచెలి పాపకృత్యముల్
బ్రిమదముతో నొనర్చె; నిది బంధురశిక్షకుఁ బాతురాలగున్.

చిత్ర- సీ. ఇష్టాన్నమును భర్తకీయక తినె గాన,
వల్లు! నీజన్మంబు వడసి స్వనుల
భక్షణ యగు నిజభర్తతో ద్వేషించి
కలహించె నిత్యంబుగాన, నడవి
పందివై స్వమలము భక్షించుచుండును
బాక భాండమునుండి భర్తసూడ
కుండ ముందుగఁ దిని యుండెనుగావున
బిల్లివై తనుఁగన్న పిల్లలఁదిన;

గీ. నధిపుసాధింప నాత్మహత్య యొనరించెఁ
గాన, బ్రేతశరీరంబు పూని ముందు
ననుభవించి యనంతర మవని మూఁడు
తనువు లెత్తఁగఁదగు భానుతనయ! యిపుడు.

చిత్ర-తో. ప్రేతశరీరోపేత యగుచు మరుభూతలమున నుండు
టకుఁ, బ్రీతిగ నాజ్ఞాపించి పంపుఁ డిదె దూతలవెంబడి నటకు ॥ రా॥

వ. ఇది క్రమమైన శిక్షయని చిత్రగుప్తుఁడు పలికిన విని
యముండు నిజభటుల కాజ్ఞాపించిన—

కల- ఉ. దూతలు నన్నుఁ దెచ్చి పగతో మరుభూమిని జేర్చి యిచ్చటన్
బ్రేతశరీర మిచ్చి విడిపించిరి; పంచదశాబ్దముల్ సనెన్ !
జేతము క్షుత్పిపాసలఁ గృశింపఁగ దాళఁగలేక నేను గృ
ష్ణాతటమందుఁ జేరఁ గని నన్నట నుండఁగనీక క్రమ్మఱన్.—

వ. హరిహరదూతలు గొని తెచ్చి యీనిర్జలప్రదేశమున వీడిరి.

కీర్తన—తోడి: ఆదితాళము. (వినవే యొకమనవి) వలె.

ధరణీసురతిలక, తత్ప్రభృతి యీమనే తాళి యుందు॥ ధర॥
తరము గాదికను భరియించుటకును! తిటిగ బలమంతఁ। దనరె బలు
చింత ॥ధర॥ అలసితి గడు దాహమునన్। వ్యాకులము గలిగె నాకలి

కిఁ నిలువ వశముగాదు। నిజముగను నాదు కలుష మడఁచితి; కరు
గాచితి॥ధరణి॥ అయో! ముందు త్రివిధ యోనులను బుట్టుయోగవ
ధరదుల్లఁగ మెల్లఁగ నల్లనఁజేయుము ॥ధరణి॥ క్షితిఁ బురాకృతసు
తంబు హత మొనరించితివి; ధృతపుణ్యాయుతివి ॥ధర॥ వెలయఁ ,
బలముగల తను మహిమను దెలియ నెవరితరము ॥ధర॥ జగన్ను
తైన మోక్షగుండహరికరుణ వడసిన ॥ధర॥

వ. నే నెంతదురంత పాపములుసేసి యింతవంతపాలై
భవద్దయాంతఃకరణమున నాకొంతలుదీరె తనుకసాధ్యం బేదియు
నన్నుఁ గడఁదేర్పవలయును. దీనదయాపరా ! యని వేడిన విప్రుండ

సీ. నీవు సేసినపాపనికరంబులెల్లను
నిర్మూలమయ్యెను నేటితోడఁ;
బ్రేతత్వమును బాసి పిమ్మట దోనిత్ర
యంబు నొందఁగఁ జాలనని విచార,
పడెదవు నీకు నపాయంబులేని యు
పాయంబుఁ గంటిని భయపడకుము
జన్మాదిగా నేను సలిపిన కార్తిక
వ్రతఫలంబున నర్ధభాగ మిపుడు
గీ. ధారవోసితి గొనుమని ద్వాదశాక్ష
రమును జపియించి తులసియుతముగ జలము
పణియం దుంపఁ బ్రేతరూపం బడంగి,
విమలలావణ్య యగునొక వెలఁది యయ్యె.

వ. అంత నాయింతి తేజోభిరాముయై ధర్మదత్తునకుఁ బ్రణమిల్లి

స్రగ్విణి.

నీప్రసాదంబునన్ నేను ధన్యాత్మనై,
సుప్రభాయుక్తమౌ సుందరాకారముల్,

విప్రచూడామణి, వేగఁ గైకొంటి నా
నాప్రకారంబులం నాకు మే లయ్యెడిన్.

వ. ఇట్లనుచుండునంతలో దేదీప్యమాన మగు నొకవిమానము గొని విష్ణుదూత లరుదెంచినఁ గని, ధర్మదత్తుండు వారికి సాష్టాంగనమస్కారంబులర్పించి,

ధర్మ-తో: ఈ విమానమును నెవరికొఱకు మీరిచటికిఁదెచ్చితిరిపుడు ? ఆవైనము నా కాన తియ్యు డని యడిగినంత వా రపుడు ॥రామ॥

విష్ణుదూతల కీర్తన. కమాస్: ఝుల్వ- (నేరమేలజార) వరౌ.

నేలవేలుపా వచింతు మాలకింపుమా ! మేలుగ భువన మేలెడు వనమాలిబహిర్ద్వార పాలురము మేము ॥నేల॥ ప్రేతరూపంబున నీ తెరవున నున్న పాతకురాలిని దే నీతపోబలము నాతిని జేసితి; వాతరుణియు పునీతురా లయ్యెను॥ నేల॥ శ్రీ మోక్షగుండేశుఁడా మాధవుండు దా వైమానికము బంపెను; భామలతో నీవు నీమానినీమణి యీమేటిపుష్పక మెక్కుడు పోదము ॥నేల॥

ఉ. చిన్నటినుండి శ్రీహరికిఁ బ్రీతిగఁ గార్తికమాస సువ్రతం
బెన్నఁగఁ జేసినావు; జపియించితి వెప్పుడు ద్వాదశాక్షరిన్;
బన్నుగజాగరంబు నుపవాసములున్ జరిగించినావు; నీ
కన్న ఘనుం డెవండు! త్రిజగంబుల భూసురవంశ శేఖరా!

గీ. అట్టిపుణ్యంబునందు నర్ధాంశ మిపుడు
దాన మొసఁగితి నీమెకుఁ; దానఁ జేసి
ద్విగుణ మయ్యెను బుణ్యంబు; ద్విజవరేణ్య,
విష్ణుమూర్తికి నది మహాప్రీతి యయ్యె.

క. సుకృతార్ధంబును గొనుటను
సకలాఘంబులకుఁ బాసిసద్గుణఖనియై

యకలంకరూప తేజము,
లకు బానక మయ్యె నీమె లావణ్యనిధీ!

వ. ఈకారణంబున మీకు విష్ణుసాయుజ్యంబు గలిగె; భక్తపరాధీనుండగు వైకుంఠుని దయారసం బపారంబు, వినుము:

సీ. హరిని నారాధింప నౌత్తానపాదికి
దారకామండలస్థాయిదౌరకె;
గ్రాహగృహీతమై గజరాజు ప్రార్థింప
గ్రాహంబు దునిమినాగమును గాచె;
హరిచక్రమునఁ గూలినట్టి యాగ్రాహంబు
విజయుఁడై జనియించె; గజము జయుఁడు
నాఁ బుట్టి యిరువురు నారాయణునిపార్శ్వ
చరులైరివారలవ్వ రుననేమ

గీ. విష్ణుఁ గొల్చుచు నుండు మా విష్ణునాజ్ఞ
మిమ్ముఁ గొనిపోవ నీవిమానమ్మువెంట
వచ్చినాము హరిప్రభావమునఁ గాదెఁ
మాకుఁ జెడిపోనిపదవి సంభావ్య మగుట.

విదూ. కీర్తన-కాఫి: ఆది. (ఆనతిమ్మ) వలె.

ఆనందాబ్ధిలోన దోఁగుచు గదలుఁ డిపుడు॥ఆనం॥ మేనుప్పొంగగాను నీవిమానమున మఱి యెక్కుడు॥ ఆనం॥ నారాయణునిఁ జేరి చెదము; మీ రా ఘనుని కారుణ్యమునుగోరి నిర్విచారసుఖము లావరూ థముగ ననుభవింపు॥ డానం॥ దీక్ష పుణ్యము క్షీణింప నాక్షణంబునను మోక్షగుండ సంరక్షునిపనుపున నీక్షమాతలి కరుదెంతురు॥ఆనం॥

ఆ. ధర్మదత్త నీవు దశరథుఁ డనుపేరఁ
బొద్దుకాలమునందుఁ బుట్టఁగలవు;
నీ సతీమణులును గౌసల్యయు సుమిత్ర
యనఁగ బుట్టి భార్యలగుదు రపుడు.

ధా|త్రీ॥ మిత్రకులజసుపవిత్రశౌరిపుర చిత్రములను వీక్షించుచు, సుజన స్తోత్రములకుఁ దాఁ బాత్రుఁ డగుచుఁ, గడుమైత్రిని జిరకాలమువసించి నాఁడచట॥ ధాత్రీ॥ నిర్మలినంబగు నిజకృతిపుణ్యసుకర్మ మడఁగినంతట నందుండక ధర్మదత్తుఁ డీపుడమిని దశరథవర్మయనఁగ నవతరించె; నెవ రన నీవ సుమి॥ ధాత్రీ॥ అతనిభార్య లిరువురు కౌసల్యాసతి సుమిత్రలై; రిపుడు గలహ యను నతివ కైక యన నలరెను మువ్వురు: క్షితివర సతులై చెలఁగిరి నీకును నిశ్చయము॥ ధాత్రీ॥ శ్రీమించఁగ శ్రీమోక్ష గుండ హరిచాప శంఖచక్రములు గ్రమముగను: రాను లక్ష్మణ భరత శత్రుఘ్న సునామములు నీకుఁ గుమారులైరి విను వీరె కను॥ ధాత్రీ॥

వ. జన్మాంతరసుకృతపరిపాకవిశేషంబున నిన్ను ధన్యనింజేయం గోరి యీ జన్మంబున భగవంతుండు నాల్గురూపంబుల నీయం దవత రించె. ఈతని కతంబున నీకు విష్ణుసాయుజ్యంబు గలుగు. నిశ్చయము.

క. నీ వడిగిన స్వచరిత్రము
నే వినిపించితిని; ధారుణీవర యింకన్
దేవులతోఁ బుత్రులతో
వేవేగ నయోధ్య సేరి విశ్రాంతిమెయిన్.

వ. నిజరాజ్యపాలనంబు సేయుచు సుఖంబున నుండు మని యా శీర్వదించిన, దశరథుండుఁ గళత్ర-పుత్రసహితంబుగ మునిసంఘ మ్మన కనేక ప్రణామంబు లాచరించి వారిని వీడ్కొని, యనంతరం బో పార్వతీ,—

శివుడు-తో: వందిమాగధులు బృందములై తను ముందరఁ బొగడుచు నడువ, దుందుభిలోనగు తూర్యరావములు సందడి యలరఁగ మెఱయ॥ రామ॥

వ. నిజయానంబుల నారోహించి రెండు మూఁడు దినంబులకు నిజరాజధాని యగు నయోధ్యకుఁ జేరి యానందమున నగరు ప్రవే శించిరి. అంత దశరథుండు గొలువుండి సభికులు విన భరతున కిట్లని యె:

కీర్తన—జఁఝూటి—ఆదితాళము.

పొమ్మికఁ గేకయభూపతిపురికిని నెమ్మదిఁ బొదలఁగ భరతా॥పొ॥ నెమ్మదిని నిన్నిపుడు రమ్మని మామేనమామ సమ్మతమునఁ బిలువ వచ్చె॥పొ॥ తాతకు నవ్వకు నిరతము బ్రీతిని దండము పెట్టుము భరతా॥ పొ॥ మాతులుని మది గొలువు నీతోఁగూడ శత్రుఘ్నుని ఖ్యాతిగాను బిలచుకొని॥పొ॥ కోరినచదువులు నేరుచుకొను మచ్చట నీవు కొదవల నుంపక ॥పొ॥ పౌరులను భక్తిగను ధారుణిని మోక్షగుండధాముని నమ్ముచు వెడలి ॥పొ॥

అంత— క. భరతుఁడు జనకుని యాజ్ఞను
సరగున శిరమున వహించి శత్రుఘ్నునితో
బరువడి గేకయ పట్పురి
కరిగె నిజబంధు దర్శనార్థముగాఁగన్.

కాండాంతతోహార. అని తాళ్ళూరి నారాయణకవి రామాయణమును హరికథను ఘనముగఁ జెప్పెను గద యాదిది బాలకాండము చిలుకును సుధను॥ రా॥

ఇది వినువారల కిహసౌఖ్యంబులు గొదవలేక చేకుఱును; ముదమునఁ దుదకును ముక్తి లభించును మోక్షగుండహరికృపను॥ రామా॥

క. నాచేత నయినకొలఁదిని
జూచి రచించితిని దీని; సుజనులు నెరసుల్
దోఁచినయెడ దిద్దుదు రని
నాచిత్తములోన నమ్మినా ననయంబున్.

శ్రీమోక్షగుండ రామాయణమునందలి బాలకాండము.

సమాప్తము.

---

శ్రీరామచంద్ర గురు పరబ్రహ్మణేనమః

అవిఘ్నమస్తు.

# శ్రీమోక్షగుండరామాయణము

## హరికథ.

## అయోధ్యాకాండము.



క. శ్రీరాముడు జానకితోఁ
నారూఢిగఁ గలసి మెలసి యంతఃపురిలోఁ
గూరిమిని నున్న వేళను
నారదుఁ డరుదెంచె దర్శనము జేసికొనఁగన్.

కీర్తన-కళ్యాణి-ఆదితాళము.

సీతాధిప కరుణాసాగరా॥ సీతా॥
ధారాది షడబ్జసమన్విత బోధరూప గుణభూషణా-గుణభూ॥సీతా॥
ద్ధస్ఫటికవిశోభితచిన్మయ సిద్ధయోగి హృద్గోచరా ॥సీ॥
వ్యష్టిసమష్టిమయప్రపంచఘన సృష్టిస్థితిలయకారణా॥ సీ॥
రాక్షసహర నారాయణకవినుత మోక్షగుండపరిపాలకా॥ సీ॥

తో: అరుదెంచిన యాసురముని కెదురుగ; దరుణితోడఁ దానరగి, సరగున రఘుపతి సాష్టాంగనమస్కారము లిడియెను జెలఁగి ॥రామ॥

మునినాయక మాబోఁటిగృహస్థుల కనయంబును మీవంటి ఘనులదర్శనము గలుగుటదుర్లభ, మనఘుఁడ నైతిని మంటి॥ రామ॥

వ. అనిన నారదుఁ డిట్లనియె:

కీర్తన-ఫరజురాగము.

నీమాయను దాటఁగ నేర్తునా రామ॥నీ॥
ఏమాత్రము నీ యెరుక లేకయ సామాన్యముగను సర్వేశా హరి॥నీమా॥
నీవు హరివి, శ్రీదేవియ జానకి; దేవ, నీకృపచేఁ దెలిసితి రామ॥నీ॥
సకలపురుషరూపకుఁడవు నీవే! సకలయువతులీ జనకజ; రామ॥ నీ॥
భువిని మోక్షగుండధవ నారాయణకవినుత, సాధుల గావగదే రామ॥నీ॥

గీ. రాజ్యభారంబు దశరథరాజ నీకు
నీయఁ దలఁచెను దాని నీ వియ్యకొనిన
రావణాదినిశాటవర్గములఁ ద్రుంచి
మమ్ము రక్షించు టెన్నడు మదనజనక !

వ. అనిన శ్రీరామచంద్రుఁడు నారదున కిట్లనియె:

కీర్తన-ఆదితాళము.

దేవ మునీశ్వర దెల్పెదను నా వాక్యంబులు నమ్మవిను! రావణాది దుర్మార్గుల ద్రుంచి సురావళిఁ బ్రోచుట కరుదెంచెదనే ॥దేవ॥
దండకాటవిని దాపసవృత్తిని నుండెద బహునాళ్లేఁ దలఁచట; నొందుఁగ సీతా మిషమున ఖలులను ఖండించెద మోక్షగుండేశుఁడనై ॥దే॥

వ. ఈ ప్రకారంబున శ్రీరామచంద్రుని రావణవధార్థము చను మని ప్రేరేపించి మున్మాఱునమస్కరించి రాముని సెలవు పొంది నారదుండు యథేచ్ఛఁ జనియె. అంత దశరథమహారాజు రాజ్యపాలనంబు చేయుచు గొలువు కూటంబున బరివేష్టించియున్న సభ్యులఁ గని యిట్లనియె.

కీర్తన-అటతాళము-కాఫీరాగము.

విను డిది సభవారు విన్నప మొక్కటి ఘనముగ మదిసితి మనమున రోసితి పనిఁబూని రాజ్యముఁ బాలింప జాలను; గనుక రాముని కును గట్టుదు బట్టము ॥విను॥ మీ కిది సమ్మతమేకద దీనికి జేకొని

సర్వము సిద్ధము సేయుడు మాకులమున గల మర్యాద యగు నిది; యాకరుణాంబుధి యగ్రజు డర్హుండు ॥విను॥ భరత శత్రుఘ్నులు పర గంగ లేరిట నరిగిరి మాతుల పురమును జేరంగ ధరను నారాయణ దాసనుతుం డగు వరముని మోక్షగుండహరిని దలంచుచు ॥విను॥డిది॥

తో. వదలక దశరథువాక్యంబులు సభవారలు దా మాలించి, సదమలనుతులయి సంతోషించుచుం బిదప ననిరి యోజించి ॥రామ॥

కల్యాణి-ఆదితాళము.

ఇది ఘనకార్యము భూవరా! మా ॥కిది॥ ఎదలోపల నీ వెంచిన కార్యము ముదమున జేయుము చాలు ॥ఇది॥ మేలుగ త్రిభువన మేలేడు నేతకు నీలోకము నేలు టెంత ॥ఇది॥ మోక్షగుండ రామమూర్తిని మా కధ్యక్షుని జేయుము రాజ ॥ఇది॥

వ. అనిన,

దశ-తోహార: అప్పుడు దశరథుం డావసిష్ఠుం గని 'యనూర్యా, కులగురువర్యా! ఇప్పుడు రాముని కిది యెఱిగింపంగ నేగుడు సద్గుణ ధుర్యా॥రామ॥

క. అనుడు, వసిష్ఠుండు రాముని
గన నేగినవారిరాకం గని రాముం డెదు
రొంగని, కాళ్ళు గడిగి తజ్జల
మును శిరమునం జల్లుకొనియె ముదితయుం దానుక.

వ. ఇట్లు కులగురువునుదోడి తెచ్చి రత్నపీఠంబుపయిం గూర్చుండం జేసి పూజించి కరకమలంబులు ముకుళించి రాముండిట్లనియె.

అటతాళం (నమిలాం) వలె.

మాకు శుభంబు మీ రాక కేవలమును శ్రీకరమై యున్నది, ధీరవర॥మా॥ ప్రాకటముగ గృహపావన మాయెను. మాకుల మిదె పావదలె ॥ధీర॥తమపాదాంబువు దాల్చుటకతన సార్థకమాయె నాజన్మము

॥ధీర॥ అవిరళ మోక్షగుండాధీశు గొల్చు మీ రఘులు ధన్యాత్ములు ధీరవరా॥ మా॥

సం-తో. ఇనకుల వర్యుండీరీతిగ నన విని వసిష్ఠమునివరుఁడు మనమున నలరుచు మాబోంట్లను నీవు మాయలఁ బెట్టెద వెపుడు॥ రామ॥

నీపదజలమును నెత్తిని దాల్చెను నీలగళుఁడు ప్రియమునను; నీపదజలమున నీరజభవుఁడు పునీతుఁడయ్యె గ్రమమునను ॥రామ॥

ఇటుల నుపదేశించుటగాదే యిలలోఁగల జనులకును బటుతర సాక్షివి పరమాత్ముఁడ వను ప్రజ్ఞగలదు మీదయను ॥రామ॥

వశి-జంఝూటి-అటతాళం.

దేవదేవుఁడవు నీవు పుట్టినావు! రావణవధకు శ్రీరామా! రామా! వేవేగ మీసేవ గావింప నీదూష్యజీవనముంనుంటి నీవలను ॥దేవ॥

అగుణుఁడ వగు నీవు సగుణుఁడవై యిందు భగవంతుఁడనఁగను బ్రబలితివీ; తగ నిన్నుఁ గనుఁగొంటి ధన్యుఁడ నయితిని జగదీశ మాయలోఁ దగిలింపకే॥ దేవ॥

గురుగురుఁడవు నీవు, గురుఁ డని నన్ననుట కర మొప్ప నా భాగ్యగరిమగాదే! నరపాల, తాళ్ళూరి నారాయణార్చిత, వరద, మోక్షగుండవాస! రామ॥ దేవదేవుఁడవు॥

వ. అనిపలికిన సంతోషించి శ్రీరామచంద్రుం డిట్లనియె.

తోహర: మీ రరుదెంచిన కారణ మేమో కోరి తెలుపు మో స్వామీ! సారెకు నేశిరసావహింని యది సలుపుదు సంశయ మేమీ!

వ. అనిన వసిష్ఠుండిట్లనియె.

కీర్తన-మధ్యమావతి-రూపకము.

రఘునందన! రఘునందన! రఘునందన! రామా! రామా!
అఘసంహార, రాజ్యము నీ కర్పింపఁగ నెంచె రాజు॥ రఘు॥

ముద్దియతోఁగూడ నొక్కప్రొద్దుండుము నేఁడు; రేపు ప్రొద్దున మీతండ్రిగారి యొద్దకు నేతెంచినచో ముద్దుగ నన్నియుఁ దెలుపును ॥ రఘు॥ ఈక్షితిపరిపాలనమున కీవ యర్హుఁడగుదు వయ్య! మోక్షగుండ పురమందిర, సాక్షాన్నారాయణకవిరక్షక, నే వీడ్కొనియెద॥ రఘు॥

వ. అనిన,

తోహర: మంచిది మీ యనుమతమురీతి గావించెద బొం డని యనఁగ, మించినభక్తి నుతించి దశరథునిఁ గాంచ నేగి యి ట్లనెగా॥ రా॥

శ్రీమీఁ అఁగ రఘురాముని కన్నియుఁజెప్పి వచ్చితిని రాజా! క్షేమ ముగ నభిషేకద్రవ్యముఁ గూర్పుము రవితేజా॥ రామ॥

క. అనిన నృపాలకుఁడు సుమం
త్రుని గని యటుఁ జేయు మనిన, దోడ్తో భటులన్
గని యతఁ డాజ్ఞాపించు డుఁ
జని కూర్చిరి సకలవస్తు సంభారంబుల్.

రగడ:

అంతనృపాలకు నాజ్ఞను జారులు,
వింతఁగ దెల్పఁగ విని యాపౌరులు,
చెలువుగఁ బురి శృంగారము సేసిరి చెలఁగిరి;
నిలయంబులు పన్నీటను నలికిరి;
ముత్తెపుముగ్గులు ముదమునఁ బెట్టిరి;
చిత్తరు వలదిరి, చిలుకులుగొట్టిరి;
పలుతోరణములు బరువడి గూర్చిరి;
చలువపందిళులు చయ్యనఁ దీర్చిరి;
ఎచ్చటఁ గన వాయింతురు భేరులు;
ఎచ్చటఁ గన దీవింతురు పౌరులు;
తులగానని బహుతూర్యనాదములు

వెలసెను నంతట విపుల మోదములు;
కడువడి గాయకగణములు పాడఁగ,
గడనచేడియలు ఘనముగ నాడఁగ,
మంగళజలములు వడి తెప్పించిరి;
అంగుగ నభిషేకార్థమ్మొంచిరి;
పురియెల్లెడలను బోలుపునఁ జూడఁగ,
మురియుచు జనములుసుచ్చటలాడఁగ,
నాకలకలరవ మటు మందర యను
కైకదాసి చక్కఁగఁ దా వినియును,
నొక్కమేడపై కొయ్యన నెక్కియు,
గ్రక్కున నాశ్చర్యంబునఁ బొక్కియు,
రామునిదాదిని రయమునఁ గనుగొని,
భామిని యిట్లని పలికెను ఘన మని:

జంఝూటి: ఆదితాళము.

ఏమది! చెలి! నామది! కెఱఁగింప వమ్మ॥ యే మది॥
భామినిరో! పట్టణము నేమిటి కలంకరించి॥ రే మది॥
కానఁగను కౌసల్య దానముల నిచ్చుచున్న॥ దే మది॥
చేడియలు నేఁ డేమొ వేడుకలు సేయుచుండి॥ రే మది॥
భామిని శ్రీమోక్షగుండస్వామి దయతోడఁ దెల్పు॥ మే మది॥

తోహార: త న్నడిగిన మందర కారాముని దాది యిటుల దా
వని యెఱ: బన్నుగ రాముని పట్టాభిషేకం బెన్నఁగ రే పన వినియెన్
రామ॥ తందర నొందుచు మందర కైకేయి మందిరమునకును జేరి,
కిందటి కసి దీర్చికొన సమయ మని దండడిపడి యానారి॥ రామ॥
కేళీగృహమున డోలికమీఁదను బూలపాన్పుపై జాల లీలతోడ
బవళించియున్న యా లేమ కనియె నవలీల॥ రామ॥

కళ్యాణి: ఆదితాళము.

సరోజసమానముఖీ! భరింపఁగ జాల సఖీ॥ సరోజ॥

నరేశ్వరుం డరే! యరే! ధరిత్రి నెల్ల రాముఁడే భరింపఁగా వరించెఁ బరోక్షంబునఁగా॥ సరోజ॥

ననున్ గనుంగొనఁగా బ్రియంబునన్ విభుం డనంగ నేదినంబుఁగా ఘనంబుఁగా వినేయుండునఁగా॥ సరోజా॥

క్షమాధిపత్య మెల్ల నీ కుమారు డూన మోతుగుండ మాన్యుండు మీఁకుఁగా బ్రమోదం బిడుఁగా॥ సరోజ॥

తోహర: నీమీఁదను గడుఁ బ్రేమగలిగినఁగా నీకొఁడుకును, బోనాడి రామున కిచ్చునె రాజ్యము దశరథరాజు కపటి వగలాడి॥ రామ॥

వ. అనిన విని కైకాదేవి మందరను గసరివైచుచు నిట్లనియె:

దర్బారు: అటతాళము.

రామున కియ్యగరా దటె! రాజ్యము, గోమలి! నీకింతకూ్రరత యెటు గలిగె ! ॥రామున॥

ఘనముగ గౌసల్య కన్నను మిన్నగ గనుచుండు నన్నును; గడు గుణవంతుఁ డగు ॥రామున॥

ఈమేలువార్త నా కెఱింగించినందుకు ప్రేమతో ముత్యముల దామ మిచ్చెదఁ గొను ॥రామున॥

భరతున కైన నేమి ! ధరమోతుగుండ రఘువరునకు నైన నేమి ! యిరువు రొక్కటె నాకు ॥రామున॥

వ: అనిన మందర గటకటపడుచు నిట్లనియె:

తోహర:నీసంతోషమునీటనుగలియను!నీసుతుఁ డెక్కువగాడా! ఈసు వహింపవు ఇంతమూర్ఖమా ! ఇఁక నయిననను వినరాదా ॥రా॥

పీలురాగము: ఆదితాళము.

తల్లితల్లి! భరతునితల్లి! ననుఁగన్నతల్లి! వినుమీ తల్లి! తెలిపెద॥ తొల్లి నన్నునీతోఁ గూడ మీతల్లిదండ్రులే దాసిగ బంపిరి ॥త॥ తడయక రాముని, ధరణీజను నీకొడుకును గొడలుగొలువఁగ వలదా! ॥త॥ సవతి యగుచున కౌసల్యకు లోఁబడి తివిరి దాసివై తిరుగవలదే నీవు ॥త॥ ఆక్షణమే వారిపక్షమగును పతి మోక్షగుండవిభు సాక్షిగఁ దెలిపెద ॥త॥

తోహార: భరతుని దేశప్రభుని జేయు మని పదునాల్గేం డ్లడవులకు బరువడిరాముని, బంపు మనుచు నీవరు నడుగుము! మేలు మనకు ॥రామ॥

వ. అని త్రివక్రవక్రోక్తులు విని కైక యర్ధాంగీకారంబున—

కీర్తన: ఆదితాళము.

ఏ మని యడిగెద నామనోనాథుని రాముని గాననసీమ కంపు మని ॥ఏ॥ అడిగితిబో నన్నదలించును గాని, చెడుకార్యంబును జేయు నటే సఖి!॥ఏ॥ కైకమానస మెంతకఠినం బనుచునులోకులునన్ననుకొనకను బోదురా ॥ఏమ॥ సాక్షాన్నారాయణరక్షకుఁడయినట్టి మోక్షగుండేశుఁడె మోహాన రాముఁడు ॥మని॥

ద్వి: అని యిటు పలికిన నాకైకతోడ
ననియె నా మందర యతిహర్షమునను:
యువతి! దేవాసురయుద్ధంబునందుఁ
దవిలి యేతెంచియు దమకుఁ దోడ్పడఁగ
నింద్రుండుగోరిన, నేగెను దశర
థేంద్రుఁడు; నీ వప్పు డేగితి వెంట;
రథచీల యూడంగ రణమధ్యమందు

రథచీలగా నీకరం బుంచి లబల !
నీకు ధైర్యమునకు నృపుఁ డలరారి,
నీదుకోరిక దెల్పు, నే నిత్తు రెండు
వరముల ననియె; నీ వలన నేవింటి;
మఱచితి వీవు నే మఱువంగ లేదు
ఒకదానికిని రాము నుగ్రాటవులకు
బ్రికటితంబుగఁ బంపఁ, బదునాలు గేండ్లు
మఱియొకదానికి మనభరతునకుఁ
గరుణతో బట్టంబుఁ గట్టునట్లుగను
గోరుము నీకోర్కె కొనసాగువిభుఁడు
సేరవచ్చెడు వేళఁ జెచ్చెర వచ్చె.

వ. మఱియు—

బేగడ: ఏకతాళము.

జవదాటకే చానరో నామాట ॥జ॥ ధవళాక్షి నీకోపభవనము జేరుము ॥జ॥ అలి వేణి! సొమ్ము లలంకరింపకు; మలినాంబరము మానక గట్టుము ॥జ॥ క్రిందఁ బరుండుము; సుందరి! నాథుని జిందరవందర చేయుము; నామాట ॥జ। మోతుగుండేశుని సాక్షిగ బల్కెద దీక్షతో నీకోర్కె దీరును; నామాట ॥జ॥

తోహర: అపుడు కైకదాసి యగు మందర తన కుపదేశించిన కరణి, జపలతనొందక సలుప దలఁచి కోపసదనము జేరియు దరుణి॥రా॥

భూమిపయిఁబడి పొరలుచు నుండఁగ, భూమీశ్వరు డే తెంచి, కామిని బొన్పునఁ గానక కావలికాని నడిగె వివరించి ॥రామ॥

'కైక యేదిరా! కనబడ లే' దనఁ, 'గారణ మెఱుఁగను రాజా! ప్రకటముగ గోపభవనము చేరెను బరికింపుడు మారాజ' ॥రామ॥

క. ద్వారకుఁడు తెలుపఁగా నా
నారీమణివార్తఁ దెలిసి నరపాలుం డే

కారణమో యని పొగులుచుఁ
జేరగఁ జని దేహమును స్పృశించుచుఁ బలికెన్.

కీర్తన: ఆదితాళము.

ఇది యేమే! సుదతీలలామా! యిటు మళ్ళిచూడవే భామా! ॥ఇది॥
కోమలి, నీ కింత కోపము గల్గుట కేమిలోపము వచ్చె ॥నిది॥
వెలలేనిచీరలు విడిచి యీరీతిగ మలినవస్త్రము గట్ట ॥నిది॥
కొమ్మరో! రత్నపుసొమ్ముల నొల్లక నెమ్మది వగవగను ॥నిది॥
మృదుసుమతల్పము వదలి యీ నేలను సుదతి పరుండగను ॥నిది॥
శ్రీమోక్షగుండస్వామియె సాక్షిగ నీమాట మీఱలేదే ॥యిది॥

తోహర. ఎవ రయినను ని న్నెగ్గులు పలికిన వివరింపుము నాతోను। భువిఁ జెలు లయినను, బురుషు లైనను, బోరిగొంపను వ్యధ మాను॥రా॥

నినుమన్నించిన నిరుపేదల నైనను ధనికుల జేసెదను! నినుదూరినచో ధనికులయిన నిర్ధను లగునటుఁ జేసెదను ॥రా॥

రామునిసాక్షిగ రమణిరో నీతల పే మయినను నేదీర్తు; భామినిరో! నా ప్రాణము లిమ్మని పలికిన నవి యర్పింతు ॥రా॥

వ. అని దశరథుఁడు ప్రతిజ్ఞగాఁ బలికినవాక్యంబుల కలరిక న్నెత్తి చూచి తిన్నగా లేచి గద్గదస్వరంబున నిట్లనియె:

జంఝూటి-అటతాళము.

మాట దప్పకు రాజచంద్ర! కోటినేయును నీకుగుణము భూమీంద్ర! ఘాటిగ దేవ నిశాటులయుద్ధము నాటివరద్వయ మీనాడు నెరవేర్పు ॥మాట॥ ఒక్కదానికి భరతునకు గ్రక్కున బట్టము గట్టుకొ దనకు తక్కక రెండవదానికి రాముని నిక్కడ నుంచక నిలువెళ్ళ వంపు ॥మాట॥

దండకాటవి కేగు మనుము; దండిగ బదునాలుగేం డ్లుండు మనుము; ఖండితమిదియ నాకాంక్షిత మగు; మోక్షగుండ దేవునియాన రెండవది కోర ॥మాట॥

తోహర: పిడుగువంటి యీ నుడుగు కర్ణములఁ బడిన మాత్రము న నపుడు, గడగడ వడకుచుఁ గడువడి మూర్ఛిల్లి పడియె బుడమిపయి నృపు ॥రామ॥డుఁ కొంత కాలమునకును దెప్పిరి తన చెంతనున్న కామినినీ, యెంతయు గని తనమంతన మెరియగ జింతతో ననె నత్తఱిని ॥రా॥

ముఖారి—అటతాళము.

కలికీ! యిది యేమే! నాతో నిటు పలికి ఫలమేమే ॥కలికి॥

కలికి! రాముని దండకావనములకు బంపు మటంచు నాతో నలుకకయ, కఠినాత్మురాలా! పలుక నో రెట్లాడె నీకుఁ ॥కలికి॥

నిరతము బొగడుదువు రాముగుణనికర మెన్నుదువు; సరగనా కుపచారములు దా సలుపు నా కౌసల్యతోడను । సరిగ ననుచుండుదువు నీ వీవఱకు, నది యిపు డేల మఱచితి॥కలికి॥

ధరలోఁ దాళ్ళూరినారాయణదాసు కడఁజేరి వరము లిడు శ్రీమోక్షగుండ నివాసుఁ డెదలో మెచ్చ వలదా! భరతుఁ డిల నేలినను రఘుపతి పురములో నుండంగ దగడా॥ కలికీ యిది॥

తోహర: అని యిటు భూపతి యతినిష్ఠురములనాడిన విని యాకైక, మనమున గోపము మల్లడిగొనఁగా మగనిమాట గైకొనక ॥రామ॥

యదుకుల కాంభోజి—ఏకతాళము.

నను గారింపక చూచుచూ! నాథా! నాథా! ॥నను॥

మనమున నిసుమంత నిను నమ్మగా లేదు ॥నను॥

వేళాకోళా లేలా! వేలా! మనుజాధిపాల! నను॥

పలుమాటలచే ఫలమా! ఇల బొంకుల మారివి చాలు చాలు ॥నను॥

జలజాప్తాన్వయజాతుల్ దెలియ న్నవ్వుల కైనన్ గలలో బొంకరు నీ వాకులజాతుండ, జలమర్యాద దలపోయంగవలదే ॥నేఁడునను॥

'మన సొప్పింతు, బనిగావింతు, నిను మెప్పింతు, వినుమానింతు ననుచును మొదటన నవి తెలిపిన వెనుకను విన నైపక వెతజెందెదవు ॥నను॥

నాకన్న మిన్నయగు కాంత లెన్న నీ కున్నవారు గా కేమి! ఇంక నీకా వరంబులో కైక యీను పో! కాద టంచు బోఁ (ద్రో) లరాదే! యీ కపటము లిటు ఘటియించుచు ॥నను॥

నరగ మోక్షగుండేను సాక్షిగ శ్రీరామునకున్ ధర ఇడి నీ దెవ్వలతో, జిరసౌఖ్యంబుల దేలు! భరతుఁడు నేనును మేలుల్ దొరగద; మా తరువాతన్ నిరంతరము సరాసరిగ జరించినను భరించెద రె! సరెసరే! ధరారమణ! ॥నను॥

వ. ఇట్లు కైక మాట్లాడిన కఠోరవాక్యంబులకు బదులు చెప్పుటకుఁ దోఁపక దశరథుండు మహాదుఃఖాంబుధి మునుంగుచు నా రాత్రి నాలుగుజాములు నాలుగు యుగంబులుం బోలెఁ గడపుచుండె. అంత నుదయమైన నక్కడ రామపట్టాభిషేకమందిరమున కందఱుఁ జేరిరి,

ఉ. అంతట జానకీసహితుఁ డైన రఘూద్వహుఁ డగ్నికార్య మ
త్యంతముదంబుతో సలుపునట్లుగఁ జేసి వసిష్ఠమౌని ధీ
మంతునిజూచి పల్కెను:'సుమంత్ర! ముహూర్తము వేళయయ్యెభూ
కాంతుఁడు రాఁడు! కారణము గన్గొని యాతనిఁ దెమ్ము వెంబడిన్.

తోహర: అంత వసిష్ఠుని, యానతిచేత సుమంత్రుఁడంతిపురి కరిగి, ఇంతి, 'విభుఁడు సభ కేటికి రాఁడన, నిట్లు కైక యనెఁ దిరిగి ॥రామ॥

బేహాగ్: ఆదితాళము.

వినుము మంత్రివర్యా! కనకాద్రిధైర్య! ఘనగుణధుర్య! మన రాజుచర్య ॥విను॥ రామునిమీఁది ప్రేమతో రాత్రి యేమియు నిద్ర యెఱుఁగకయుండె॥ విను॥ ఈవరదనుక లేవఁగలేదు; కావున నీవు గడు వడిఁబొమ్ము॥ విను॥ భూమీశుఁ జూడ భువిమోతుగుండధాముని రాముఁ దగ రమ్మనుము॥ విను॥

తోహార: 'రా జదేమికారణమున బలుకడు రాజీవాక్షిరో!' యనఁగ, రాజు సెప్పు మన నేఁ జెప్పితి నిఁక రాముని ర మ్మను మనెగా॥ రా॥

కైకయిటుల బల్కఁగను సుమంత్రుఁడుగదలిపోయి రఘుపతిని, బ్రీకటముగ గని పదముల కెఱఁగియుఁ బలికె నపుడు నెమ్మదిని॥ రా॥

కీర్తన: ఆదితాళము.

రామ! రమ్మిఁక రఘురామ! లె మ్మిఁక; భూమివిభుని జూడగాను బోద మింపుగ॥ రామ॥ నిన్ను బిలువగ రాజు నన్నుబంపెగా, బన్నుగ నాకైకయింట నున్నవాఁడుఁగా॥ రామ॥ తడవుసేయక! రాఁ దగుసుమీ యిక! బుడమి మోతుగుండదేవ, పోయి చూడఁగ॥ రా॥

వ. అని చెప్పిన,—

తోహార: అపుడు రాఘవుం డనుజ యుతంబుగ నరదము నారో హించి, విపులవేగమున బితృసన్నిధికి వింతగాను జనుదెంచి॥ రామా॥

తనపాదములకు దండముపెట్టిన తనయుని లేవగదీసి, కనికరమున నాగాఢాలింగన మొనరిచెఁ జేతుల గదిసి ॥రా॥

వ. అంతట,

క. హాహా! యని దుఃఖించుచు
మోహంబున దశరథుండు మూర్ఛ మునింగెన్!
ఆహా! యీ దుఃఖంబున
కే హేతువొ యనుచుఁ గైకఁ నినకులుఁ డడిగెన్.

వ. 'ఈ ప్రకారంబున నన్నుఁ బిలిపించి మహత్తరమయిన దుఃఖాంబుధిలో దశరథుండు మునుంగుచున్నాఁ డదేమికారణము తల్లీ!' అనిన, రామునకుఁ గైకాదేవి యిట్లనుచున్నది,

కాఫిరాగము: ఆదితాళము.

రాజుదుఃకాఖరణంబు రామ తెలిపెద; దేజ మలర నీకె చెల్లు దీనిదీర్పఁగ॥ రాజు॥ నాకు రెండువరము లిచ్చినాడు; పిన్మాట శోక మొందుచున్నవాడుచూడు మిచ్చట॥ రాజు॥ నరకములకు బాపి తండ్రి నరసి పోషించిన వరసుతుండె పుత్రుఁడనఁగ బరగు జూచిన॥ రాజు॥ ఆడి తప్పలేకయున్నవాఁడు జనకుడు; నేడు మోక్షగుండనగరనిలయ! పలుకడు॥ రాజు॥

వ. అనిన రాఘవుండిట్లనియె,

యదుకుల కాంభోజి: అటతాళము.

జనకుని కార్యము సలుపలేనట్టి యాజన్మ మేటికమ్మా॥ జన॥ జనయిత్రి; యిట్టిజీవనము కంటె విషమైన ద్రాగుట మేలు॥జన॥ రాజాజ్ఞయైన నీరాజ్యము నైనను, భూజాతనైన విడుతు॥ జన॥ మోక్షగుండ విభుసాక్షిగ తత్క్షణమున వచింపుము తల్లీ॥ జన॥

తోహార: అనిన వాక్యముల కతిహర్షంబున కనియెఁ గైక రామునకు: దనయ! వరద్వయమున కొక్కటికిని: నిను బంపగ వనమునకు॥ రామ॥ కడమదానికిని: పుడమికి భరతుని యొడయని జేయగ నడుగఁ దడయక ప్రత్యుత్తర మీయక దాబడియున్నాడని నుడువ ॥రామ॥

వ. నీకుఁ బట్టంబు గట్ట యత్నించుచున్న రాజును జూచి భరతునకు బట్టంబు గట్టు మనియు, రాముని జటావల్కలములు ధరించి దండకాటవులఁ బదునాలుగేండ్లుండఁ బంపు మనియు నేను గోరితి. తొల్లి నాకిచ్చిన రెండువరంబులు లేదన జాలక నిన్నుఁబాసియుండ లేక దుఃఖించుచు నీతో మాటలాడుటకు లజ్జించియున్నాఁడు. కాబట్టి

పితృవాక్యపరిపాలనము చేసి కీర్తివడయుము కుమారా! అనిన కైకమాటల కామోదించి రఘునందనుండు,--

అటతాళం (రామకృపా) వలె.

పోయెద బోయెద బోయెద నాతల్లీ! హాయిగ నే దండకాటవి జేరగ; భరతున కీరాజ్యభార మర్పించియు బరువడి బితృవాక్య పాలన జేయగ॥బోయెద॥ ధరణి మోక్షగుండధాముని సాక్షిగ నరమర లేక నన్నంపు ముమ్మాటికి॥బోయెద॥

వ. అని రాముఁడు బలుకుచున్న సమయంబున దశరథుండు మూర్ఛదేరి కుమారునిం జూచి శోకావేశంబున-

తేవారము: హా! నా కుమారా! రామా! హా! త్రిలోకాభిరామా!॥ మానుగ రాజ్య మిచ్చి మరల గైకొంటి హెచ్చి నేను భ్రాంతాత్మకుండ నీచవర్తనుఁడ జడుఁడఁ। గానలకు నీవు సనినఁ బ్రాణముల నిలుపఁ గలనా!

వ. అని పలికినఁ దండ్రికి నమస్కరించి యుత్తరీయంబుచేఁ గన్నులఁ నీరు దుడిచి దుఃఖ మపనయించుచు రాముం డిట్లను చున్నాఁడు,

కీర్తన-ఏకతాళం.

వగపేటికి నాతండ్రి! వనసీమకుఁ బనుపండి! తగ బదునాల్గేండ్లుండి తడయక వచ్చెద జుండి। లెండి లెండి జగతీశ మాటమీఱజూడండి ॥వగ॥ తమవాక్యముఁ బాలింపగ దల్లికి బ్రియమును గూర్పగ అమరుల కార్యము దీర్పగ అట మానుల సేవింపగ వేగగ బోఁగగ సమకూరె నాకు గాన భావింపగ ॥వగ॥

వర రాజ్యసుఖముకన్నగ వనవాస మధికమెన్నగ భరతుని ప్రభువుగ గొన్నగ బాలించును గనుగొన్నగ; వత్తుగ జొత్తుగ ధర మోక్షగుండదేవు కృపయున్నగ ॥వగ॥

వ. అని యిట్లు దండ్రినూరడఁ బలికి తత్క్షణంబున రామలక్ష్మణులు కౌసల్యామందిరంబున కరుదెంచినప్పుడు,—

తోహార: శ్రీరామునకును క్షేమము గలుగగ గోరి బ్రాహ్మణుల కెల్ల, భూరిదక్షిణాలు పొలుపుగ నిచ్చుచు బోదలుచుండె గౌసల్య ॥రా॥ ఆమెను గని సాష్టాంగ మొనర్చిన నాలింగన మొనరించి, ప్రేమ ముద్దుగొని ప్రియమున నన్నము వెట్టెద ర మ్మన గాంచి ॥రామ॥

వ. నాయనలారా! నన్నుఁ గన్నతండ్రులారా! ఆఁకొనివచ్చినారు అన్నంబు వెట్టెదఁ గడుపారఁ దిందురుగాకరండు! బంగరుకొండా! ఖండిత ఖండేందుధరకోదండా! యనిన నమ్మకుఁ జిన్నికుమారుం డిట్లని యె:

శహాన: రూపకతాళము.

దండకాటవులకు బోదుఁ దండ్రియాజ్ఞను ॥నేదండ॥ దండమిదిగో! సెలవొసఁగుము, దండిగ భూమండలి కధిపుం డట భరతు డింకనే ॥దండ॥

కైకతల్లి గోరెనిట్లు కన్నతండ్రిని: పోకదప్ప దమ్మ నాకు వ్యాకులమున శోకింపగ నీకేటికి నూఱడుమా ॥దండ॥

ధారుణి శ్రీమోక్షగుండధాముని కృపను జేరుదు బదునాలుగేండ్లు; కారూఢిగ నీ రాజ్య మపారంబుగఁ బాలించెద ॥దండ॥

వ. తండ్రియానతిచే నిండిన వేడ్కతో దండకవనమున కేగి పదునాలు గేండ్లుండి పిమ్మట వచ్చెద నవార్య ధైర్యంబున నా రాక కెదురు చూచుచుండుము తల్లీ! యాశ్రితజనకల్పకవల్లీ!

తోహార: శ్రీరాముం డిటు చెప్పినపలుకులు చెచ్చెర కర్ణములందు, నారసములవలె నాటిన మూర్ఛిల్లి నాతి తెప్పిరిలి కుందు ॥రామ॥

హిందూస్తానితోడి-అటతాళము.

అయ్యయో! యెటువిందును! హావిధిని నేమందును! నిన్నెడ నెటు నుందును! యెటుల మఱచియుందును! ॥అయ్య॥

భరతుఁడు ప్రియుఁ డయినను బట్టము గట్టినను బురము విడిచి నిన్నటు బొ మ్మనగ నేటికి ॥అయ్య॥

మోతుకుండనివాసునిసాక్షిగ నిను బాసి నే నికేతి నెటు లో
ర్తును! ఏది ది క్కని జూతును ॥అయ్యొ॥

సీ. వన్నెలఁ దేలు నీచిన్నారి నెమ్మోము
నెన్నఁడు జూతురా! కన్నతండ్రి!
నాయన్న! నాకూన! నాపట్టి! యని యింక
నెన్నడు పిలుతురా! చిన్నితనయ!
సూపాన్నపాయసాపూపశాకాదు లిం
కెన్నఁడు నిడుదురా యిద్ధచరిత!
అమ్మా!యటంచు నెయ్యమ్మున నను బిల్వ
నెన్నడు విందురా నృపకుమార !

గీ. కంటకశిలాదిదుర్గమకాననముల
నిడుములం బడ నెట్లు సహింతు వన్న!
కంటఁ బగవట్టి యీ కైక కారణమున
బాపురే! బ్రహ్మయిటులెడబాపె మనల.

కీర్తనం. పీల్ రాగము: అటతాళము.

నినుఁ బాసి మే నెట్లు నిలుపుదు నకటా! వనముల దిరుగ నే
వత్తు నీవెంట ॥నిను॥ ప్రియురాలిమాటకు బ్రియుఁ డొప్పి నేఁడు భయ
విపినముల వెంబడి బంపినాఁడు॥ నిను॥ నిను నదృష్టశాలి యని గురుఁ
డనియె జనన కాలమున; నిశ్చయము గాదాయె ॥నిను॥ నోము లె
న్నెన్ని నోనోచి కంటినిరా! యీమేలు సవతి సహింపదాయెనురా!
॥నిను॥ మతిమోతుకుండేశుఁ డరగంట నరయ వెతపులు గలిగె
యీవెతలాయెఁ దనయా ॥నిను॥

ద్వి॥ కైకకు వర మిచ్చు కారణంబునను
నాకూర్మితనయ, కాననసీమలకును,
బొ మ్మనుచున్నాఁడు, భూపతి నేఁడు;

నెమ్మది వల దని నేను జెప్పితిని;
నామాట విందువో! నాయనమాట
యేమఱి విందువో! యెఱిగింపవయ్య!
తల్లితో సరిగారు తండ్రియు గురువు,
నిల్లు విడిచి పోవ నేటికి వినుము:
వినవేని నేనింక విశ్వంబుమీఁద
మనియుండుటే కల్ల మఱి మఱి చూడు॥

ఉ. ఎక్కడఁ! గైక! యీవరము లెక్కడఁ! గాననలంజరింపని
న్నక్కట! పొమ్మటంచు నృపు డంపుట యెక్కడ! నీవు పోవుటల్
ఎక్కడ! చాలు నాభరతుఁ డేలినరాజ్యము నేలుగాక, నీ
వెక్కడి కేగఁ బోకు; మనయింట నె నిల్వుము నిర్భయంబుగన్.

సం-తో: అనునప్పుడు దన యనుజాతుఁడు విని, యతిశౌర్యంబున లేచి, ధనువును జేకొని తల్లియునన్నయు వినఁగ ననియెఁ జేఁజాచి॥రామ॥

లక్ష్మ- బేహాగ్: ఆదితాళము.

నాసొంపు పెంపు దెంపు గను రామ! నిలింపులైన నడ్డమే శ్రీ రామ! గుంపులైవచ్చిన గుణధామ! కనులఁ గెంపు లొల్కఁ ద్రుంతు మేఘశ్యామ॥ నా॥

భరతుని దశరథుఁగూడ బట్టి, వారిబంధుఁగు లందఱితోడ బట్టి, పురము దాటిపోవ వెళ్ళఁగొట్టి, నే నరయుదుఁ బట్టము నీకు గట్టి॥నా॥

ఇల నీ కభిషేకము గాకుండ వేగ వల దన్న వారిఁబట్టి కండఁ లొలుతు;నీకీర్తి మోతుగుండపురనిలయ, సకలదిశల వెలయుచుండ॥నా॥

వ. అని విపులోగ్ర మహోగ్రహ సమగ్రుండయి నిగ్రహంబున నగ్రజుని యగ్రభాగంబున నిలిచి పలికిన లక్ష్మణుని వాక్యంబుల కలరి కౌగిలించుకొని యుపశాంతికొఱకు రాఘవుం డిట్లనియె:

తోహార: తమ్ముడ, నీవంతటి శూరుడవే సుమ్ము ! వేళగా దిపుడు; సమ్మతి నోర్చుము; క్షణభంగుర దేహమ్మును నమ్మకు మెపుడు॥ రామ॥

సారహీనసంసారములో బడి శాశ్వత మని నమ్మెదరు ! సారెకు బుట్టుచుఁ జచ్చుచు నుందురు జనులు భ్రమలఁ బడియెదరు.

బేహాగ్: రూపక తాళము.

ఏదియు నిజ మనుచు నమ్మరాదు వినుము సోదరా! వాదమేల నింద్రజాలవతు గాదా! సోదరా!॥ యేది॥ మనము బొందు స్రక్చందన వనితాది విషయభోగము లనయము మేఘస్థసౌదామనివిధముగ దెలియుము॥ యే॥

కాలినలోహమున జలకణముపడి నశించినపోలిక ప్రతిక్షణ మాయువు పోవు దటిగి కాంచిన ॥ నేదియు॥

సత్య మయిన మోక్షగుండస్వామి యెఱుక లేకయ మృత్యుపాలై యమబాధ మిఁకుచుందురేఁగాద॥ యేదియు॥

గీ. పాము నోటఁ బట్టువడియుఁ, నీఁగను గప్ప
తినఁగఁ బూనినట్లు, దినముఁ గాల
మనెడు పాము మ్రింగు టరయక యస్థిర
భోగములను బొందఁ బూనుచుందు్రి.

క. కలవంటిది స్త్రీ భోగము;
కలిమియు మైనీడ సమముగద! యౌవనముల్
జలబుద్బుద తుల్యం బగుఁ!
దెలియక జీవులు భ్రమింతు్రి స్థిరమని యనుజా!

క. దేహాత్మబుద్ధి కతమున
మోహించిన జనుల కెట్లు ముక్తిలభించున్!
దేహికిఁ గామక్రోధవి
మోహాది వివర్జనంబె మోక్షమనఁబడున్.

తోహర: క్రోధముచే నడగును మోక్షంబును; క్రోధముచే మది గలగు; క్రోధముచే హితగురు పితృభ్రాతృలఁ గూల్చుతలపు మదిమెలఁగు॥ రా॥ క్రోధముచే నానఁగూడును సంసృతి; క్రోధమె ధర్మక్షయము; క్రోధము వదలిన గోరిక లెల్లను గొనసాగును నిది నయము॥ రామా॥ సంతోషంబె నందనవన మగు; శాంతి కామధేను వగు శాంతి వహించిన సజ్జనపాళికిశత్రువు లెవ్వరో యెఱుఁగుము॥ రామా॥

క. కావున దేహేంద్రియముల
కావల వెలుఁగొందు నాస్వయంజ్యోతిని సం
భావించుచు నారబ్ధము
వేవేగమె ప్రాజ్ఞుఁ డనుభవింపఁగవలయున్.

గీ. ఎంతకాలముతన్నుఁదా నెఱుఁగలేఁడొ
యంతదాఁక భ్రమించు దేహాదులందుఁ;
గాన నయ్యాత్మ నెఱిఁగినవాని నెందు
ద్వేషరాగాదు లంటఁగ వెఱచువత్స!

తోహర: అనుజున కీరీతిని బోధించియు నాతల్లికి నిట్లనియెన్: ననుదీవనలన్ వనముల కనుపుము; మనమున వగవకుమనియెన్॥ రామ॥

వ. ఇట్లు పలికినఁ గౌసల్య సమ్మతించి యరణ్యవాసంబులందుఁ బ్రయాసమ్ము లేకుండునట్లుగఁ ద్రిమూర్తులు నిను రక్షింతురుగాక యని దీవించె. అపుడు లక్ష్మణుఁ డన్న కిట్లనియె:

ఆదితాళము: తంగంమెట్టు.

శ్రీరామచంద్ర! కారుణ్యసాంద్ర! ధీర! నాసంశయము రాఘవా తీఱెను నిశ్చయము॥ శ్రీరా॥ నీసేవమాని నే నుండలేను; నీవెంట నే వత్తును రాఘవా! నీవు వద్దనబోకుము॥ శ్రీరా॥ రావలదన్నను బ్రాణములొల్లను: వేవేగ మోక్షగుండ రాఘవా! దేవర! నీసాక్షిగ॥ శ్రీరా॥

వ. అనిన, రాముఁడు సమ్మతించి యీవార్త దెలుపుటకు సీత
దేవిగృహంబున కరిగె. ఆయమ్మ యర్ఘ్యపాద్యంబు లర్పించి యిట్లని

తోహర: శ్వేతచ్ఛత్రము, వివిధవాద్యములు, వెలయఁ గిరీ
దులును, ఖ్యాతిగ వదలి యొకండ విటుల రా హేతువు వినవ
వినెను॥ రా॥

రా-తోహర: దండకాటవికిఁ దరలవలెను మాతండ్రి యాజ్ఞ
నబల! దండిగ మీయత్తను సేవించుచు నుండుమింట బహువిధుల॥ ర

వ. అనిన,

క. 'ఏ కారణమున భూవిభుఁ
డాకానల కేగు మనుచు నాజ్ఞాపించెన్ ?
నాకును వివరింపు' మనన్,
గాకుత్స్థ కులుండు తెలిపెఁ గాంతామణితోన్.

చ. భరతునకున్ ధరాతలము బట్టముఁగట్టగ నన్నుఁగాననాం
తరములనుండఁ బంపఁగను దద్దయుఁగోరిన దమ్మకైక భూ
వరుని వరద్వయమ్మతఁడు వందురి సూనృతధర్మమూఁదియా
వరములనిచ్చె; నేనరిగి వత్తు నిటన్ వగఁ దక్కియుండుమీ !

వ. అని సీత యిట్లనియె.

శంకరాభరణము: ఆదితాళము.

ఔ నేను మీమాట యాశ్చర్య మయ్యెడి గాసల నీ వుం
నే నింట నుందునె॥ యౌనౌ॥ ఇద్దఱ మొకచోట, నొద్దిక నుందవ
వద్దన బోకుము! వచ్చెద నీవెంట॥ యౌనౌ॥ పతిసేవ కన్నను స
గతులేవింక? నీక్షితి నారాయణకవినుత, మోక్షగుండేశ ॥యౌనౌ॥

వ. అనిన శ్రీరాముఁడు,

తోహర: కంటకంబులును గఠోరశిలలును, గలవు నడువ
లేవు! వంటక మబ్బదు ఫలములు దుంపలు భక్షింపఁగ లేవు నీవు॥ ర

ఘోర రాక్షసులు క్రూరమృగంబులు గునిసియాడునటవినుము నారీమణి! కాననములకును రానేర వింటనె నిలుము॥ రా॥

వ. అనిన, సీతాదేవి విన్నదనంబున నిట్లనియె.

హిందూస్థాని తోడి; ఆదితాళము.

గడియయిన గాని మిము విడువఁగఁజాలఁ బ్రియా! అడవుల మీతో నుంట యది యింద్రభోగ మగు॥ గడి॥ మీ రారగించినంత మిగిలిన ఫలమూలాదు లారగించిన నవి యమృతోపమాన మగు ॥ గడి॥ తమతోడ సంచరింప దర్భలు కంటకములు శ్రమలేక మృదువు లౌను రాజిల్లుఁగాదే యిక॥ గడి॥ నేరాక మాన నిక నారాయణాఖ్య నుత ధారుణి మోక్షగుండధామ శ్రీరామరామ॥ గడి॥

క. మును జ్యోతిష్కులు పలికిరి:
'తనపతితో నడవికేగు ధరణిజ' యనుచున్;
నను రా నియ్యనిచో నా
ఘను లాడిన మాటలెల్లఁ గల్లలుగావే!

స్రగ్విణి. నన్ను రా నీయకే, నాథ, మీ రేగినన్
బన్నుగా దేహమున్ బాయ కెట్లుందు! నా
పన్నసంరక్ష, నాప్రాణముల్ నిల్పవే!
తిన్నఁగా నాదు సందేహమున్ దీర్పవే!

సంధి-తో: ఈ మాడ్కిని సతి వేమఱు వేడిన రాముం డిటు లనె: 'లలనా! నీమది గనుటకు నేనంటినిగా నిన్ను బాయఁ గలనా॥ రా॥

దండకాటవికిఁ దఱలి నావెంబడి, యండజాక్షి! నీవు రమ్మా! దండిగ నాయరుంధతికి హారములు దగ నుపాయనము లిమ్మా॥ రా॥

వ. ఇట్లు సీత వచ్చుటకు సమ్మతించి వేదవిదులగు బ్రాహ్మణుల కునుదక్షిన సమస్త జనంబులకును దరిద్రతాహతంబగునట్లు షోడశమహా దానంబు లవారిగ శ్రీరామ లక్ష్మణు లిచ్చిరి. సీతా కౌసల్యా సుమి

త్రులు నరుంధతి లోనగు సువాసినుల కభీష్టవస్తువులు దానంబుసేయు చుండిరి, అప్పుడు—

సం-తో: త్రిజటాఖ్యుం డగు ద్విజుం డొకండు దరిద్రంబున బాధితుండై, నిజకుటుంబమును నిర్వహించుకొన నేరక యన్నాతురుఁడై ॥ ధా॥

గీ. హాలికవృత్తిని జీవన మాచరింపఁ
దలఁచి, గుద్దలి నాగలిఁ దలనుమోచి
కొనుచు నేగి, స్వయంకృషిఁ గోరి చేయ,
నతని యిల్లాలు తత్తణ మచటి కరిగి.

కీర్తన: త్రిశజాతిఁ (సతతంబున)వలె.

పాణినాయక ! ఫలమేమి నీ కిక॥ పా॥
మేను సుడివడఁగ మిగులశ్రమల నలయఁగ నేటికి॥పా॥

అగ్రజాతిని బుట్టి యన్యవృత్తికిఁ జొచ్చి తీ గ్రహచారము నే మందు నయ్యయో! ॥బ్రా॥ శ్రీరామచంద్రుం డవారిగ దానము లీరాత్రి విప్రుల కిచ్చుచున్నాఁడట॥ పా॥ నీపేరు వివరించి! నీలేమి వచి యించి, మాపేరు వివరించి మఱియు యాచింపుము! ॥ పా॥ శ్రీ మోక్షగుండేశుఁ డామహనీయుడు; నీమనోభీష్టము నెఱవేర్పఁ బో పొమ్ము॥ బా॥

సం-వ. అని పలికిన భార్యమాటల కియ్యకొని,

క. వ్యవసాయపుఁ బనిముట్లను
నవతలఁ బాఱంగవైచి యాతురమునరా
ఘవ లక్ష్మణు లుండినయెడ
కవనీసురవర్యుఁ డరిగి యతివినయమునన్.

కీర్తన: ఆదితాళము.

రామచంద్రమహాప్రభో! నా మొఱప్రేమతో వినుమా॥ రామా॥ నే మహీసురుఁడ నిత్యదరిద్రుఁడ స్వామి త్రిజటు డను నామమువా

డను। దారపుత్రులకుఁ నిరతము కోరినట్టుగను గూడును గుడ్డయుఁ గూరిచిపెట్టుట భారమయ్యెను॥ రాము॥ నాదరిద్రము దీరగ దమ రాద రించి యిష్టార్థపదార్థము లీఁ దగు మోక్షపురీశ వేఁడెదను॥ రామ॥

వ. అనిన శ్రీరామచంద్రుం డిట్లనియె:

తోహ: అన్నిపదార్థము లయిపోయిన విక, నావులమందలు గలవు; ఎన్నగ జాతిని యివ్విన నంతవఱ కిచ్చెద గైకొనగలవు॥ రా॥

వ. అనిన భూసురపుంగవుం డాశాపాశబద్ధుండై లేచి,

సీ. కుడిభుజమ్మునవ్రేలు కొల్లాయిగుడ్డను
బిఱబిఱ నడుముపై బిగియ గట్టి,
దోవతిపై కెగఁ దోసి జుట్టు విదిర్చి
కులుచగా శిఖ ముడి గుదురవైచి,
ప్రాణానిలములు నరమ్ముల బిగఁబట్టి
పాణియం దొక్కపాషాణ మూని,
కేక వేసియుఁ బిడికిలిబెట్టుగాఁ ద్రిప్పి
యెదమీఁద జందెమ ట్టిట్టుఁ దూలఁ,

గీ. నెమ్మదిని రామమూర్తిని నిలిపి పొగడి,
జూచువారలు రాముండుఁ జోద్య మందఁ,
బ్రదుకుజీవన మిది యని బ్రాహ్మణుండు
తనబలంబున సరయువు దాఁక వైచె.

వ. ఇట్లు త్రిజటుండు సరయువుదాఁక రాయి వేసియంతవఱకుండు నావులఁ గొనిన, రాముం డచ్చెరువొంది యి ట్లనుచున్నాఁడు:

తోహర: పన్నగ మొదవులఁ బదినూర్లిచ్చెద, బాపడ, కోరు మనంగన్, జన్నమునకు నతిశయ మగున ట్లిమ్మన్న, నిచ్చి పను పంగన్॥ రామా॥

వ. అవి యన్నియుఁ గొని సంతోషంబున దారాపుత్రులం గలిసి తన నెలవునకుఁ జని సుఖం బుండె. అనంతరంబున ధనుర్బాణధరులైన రామ-లక్ష్మణులు సీతతోఁగూడ కాంతారంబునకుఁ బోవ నిశ్చయించి యనుజ్ఞకొఱకుఁ దండ్రిగృహంబున కరుగుచుండఁ బురజనంబులు గట కట పడుచుఁ దమలోన—

హిందూస్థాని: రూపకతాళము.

కైక కోరిన వరములెంత శోకకరములు! వీక నెటుల దిరుగుదురు విపినపథములు॥ కై॥ సీత సుకుమారి నడవఁ జేత గాదుగా! ధాత వ్రాత వాప నెఱితరము గాదుగా॥ కై॥ ఈక్షితి దప్పింపరైరి యెవ్వరైనను! మోక్షగుండవరనగరాధ్యక్షు డయినను॥ కై॥

వ. అని పరస్పరం బాడుకొనుచు వగచుపురజనుల దుఃఖ నివృత్తికొఱకు వామదేవుండను ముని యిట్లనియె:

తోహర: మునుపు దశరథుఁడు దనను గూర్చి తప మొనరింపగ హరి మెచ్చి, కనబడ నీ కేమి కావలె నన నీవు దనయుడ వగు మన నిచ్చి॥ రా॥ రాజుకోర్కె దీరగ నుదయించెను; రావణాదులను గ్రుంచు దేజ మలర ముని దేవతలను నూరార్చి వేగ బాలించు॥ రా॥

ఆదితాళము: (పరమపురుష) వలె.

ఆదినారాయణుఁ డగు నీరాముడు; నాదిలక్ష్మి సీత యనికనుడు ఆదిశేషుడే యగు లక్ష్మణుఁడు! మేదిని బుట్టియు మెలగుదురు ॥ఆ॥ కరుణతోడ మీన కమఠ వరాహ నరహరి శ్రీవామన పరశురామ వరరూపము లీవఱకు దాల్చి రఘువర తనువిప్పుడు వడసెను మా ॥ఆది॥ అక్షయపత్రికృతివి: లక్షణు డీతడు; మోక్షగుండపురరక్షకుడు: రాక్షసగణముల శిక్ష యొనర్పగ నీక్షితి బహురూపు లెత్తుచుండు ॥నా॥

తోహర: ఇతనిగూర్చి మీ రేల వగచెదరు! ఇతడు పరాత్పరు డనుచు, సతతము దెలిసియు, సన్నుతి సేయుడు సద్గతి నిచ్చుచు మనుచు॥ రా॥

తోహర: అనవుడు, రాము మాహాత్మ్య మెఱింగి యాజను లగ్గించిరి యంత; జనకుని సెలవును గొన జనకైకను గని పలికెను నాకెంత ॥రా॥

క. సీతాలక్ష్మణయుతముగ
నాతల్లీ ఘోరమౌ వనంబులకును నే
నీతరి వెడలుదు; నీనుడి
నాతండ్రికిఁ జెప్పవచ్చి నాను గదమ్మా!

ద్వి. అని యిట్లు చెప్పిన నాకైక లేచి
ఘనముగా రామ లక్ష్మణసీతలకును
నారచీరలు దెచ్చి నాతి వేర్వేఱ
వారల కిచ్చిన వరుసతో నంది
రామ-లక్ష్మణులు వస్త్రములు వర్జించి
శ్రీమీఱ దాల్చి రాచీరలు సీత
గట్టంగ లేకున్నఁ గాంచి రాఘవుఁడు
గట్టంగఁ బూనె నక్కడ నున్న రాజ
వనితలు మొదలైనవారు దుఃఖింప
గని వసిష్ఠుఁడు వక్ర గైకతో గనలి—
తేవారము:ఏమిదుర్మార్గురాలా! ఇంతకాఠిన్యమేల!

రాము బాయంగలేక రమణి పోవంగఁగైక! భూమిజకు జీర లీడగఁ జోలునే నీకు వడిగ నీముఖం బరసినంత నిరయ మే తెంచుఁ గాంత॥

కన్నడరాగము; రూపకతాళము.

ఇది నాయ మానె నీకుఁ బాతకి'॥ యిది నాయు। ఇటుఁ జేయ లోకదూష్య మని తలపోయ లేక కావించితి॥ విదినా॥మిడిమేల మేల యింత! నరపాలచంద్రునకును ననుకూలవతివి గాక। మది జాలినొంద

గావించితి॥విడి॥ రఘువీరుబాయ లేము; చనుదేరగలము వెంట మనసార నందుమీద బాడూరిలోన నీ వుంపుము ॥ఇది॥ తనతండ్రితోడ గూడి, భరతుండు మోక్షగుండపతియుండఁ జేయుగాక! నీ వుండుచోట దానుండునే ॥ ఇదినా॥

వ. అని వసిష్ఠుండు కఠినముగాఁ బలుకుచుఁ ధరాపుత్రిదుకూలాం బరాభరణంబులు ధరించి పోవునటుల నియమించె. అంత రాజు కైక దిక్కుజూచి శోకకోపంబులు మల్లడిగొన నిట్లనియె:

హిందూస్థానితోడి : రూపకము.

అడిగియుంటివా? నన్నడిగి॥ పుడమిజాత లక్ష్మణుల నడవి కనుపగ॥ నడిగి॥ హానివృద్ధులు గాన వైతి నయ్యయో! మానుషాకారమున నున్న దానవులారా ॥ అడిగి॥ చీర లియ్యగా నీకు ఱేతు లాడెగా నారి, మోక్షగుండపుర నాథు సాక్షిగ॥ నడిగి॥

తో॥: అని నిష్ఠురముల నాడి భూషణములును మఱి దువ్వలువలును, జనకజ కిప్పించిన ధరియించెను దనపతియనుమతమునను ॥రా॥

వ. అంత సీతా-లక్ష్మణసహితంబుగా రాముండు మున్నూటయేఁబదిమంది తల్లులకుఁ బ్రదక్షిణనమస్కారము లాచరించి సుమిత్రం జేరి నిలిచిన, నామెదుఃఖ సంతప్తమానసయై యూరడవలికికొని లక్ష్మణున కిట్లనియె:

క. రాముని దశరథునిగఁ గను;
భూమిజ ననుఁ గాఁగ గనుము; భూరివిపినముల్
శ్రీనుత దయోధ్యగఁ గనుమా!
సౌమిత్రీ పోయిరమ్ము సౌఖ్యము గదురన్.

వ. అని పలికి శ్రీరామునిం గని,

సు- గీ. నీకు సోదరుండు, నీకు నమ్మినబంటు;
నీకు సేవకుండు; నీకు హితుఁడు;

నీకు మేలుగోరి నీ వెంటఁబర తెంచు;
నడవులందుఁ గరుణ నరసి ప్రోవు.

వ. అని యప్పగించిన, మాఁచి దని రాముఁడు సీతాలక్ష్మణులం గలసి పోవుచుండె. అప్పుడు.

తో: మనుజేశుండు సుమంత్రుని గనుగొని మన యరదముఁదెమ్మనగా జని యాతఁడు దెచ్చినఁ, బిత్రాజ్ఞను జనకజ నెక్కించెనుగా॥ రా ॥

గ్రక్కున దండ్రికి మ్రొక్కి రామ లక్ష్మణులు ధనుశ్శరములతో, నక్కజముగ రథ మెక్కియుఁ బోనిమ్మనిరి సుమంత్రుని ధృతితో॥ రా॥

వ. ఇట్లతి వేగమున రథము విపినమార్గంబు వట్టిపోవఁ బౌరు లందఱొక్కుమ్మడి రథంబుఁ జుట్టుకొని నడచుచుండిరి. అంత దశరథుండు దుఃఖాతిశయంబున నడవనోపక బహిర్ద్వారంబున నిలిచి చెయ్యెత్తి పిలుచుచు,

తేవారము:- నిలుపు నిలుపో సుమంత్ర, నీకు త్వరయేల నింత! అలసితిని నింక నవల నడుగు బెట్టఁగ నోపఁ! చెలిమితో నాకుమారు చెలువమింకొక్క మాఱు బలుప్రియంబునను గాంచిపంపుదును సమ్మతించి.

గీ. రథము నిల్పు మటంచును రాజు వలుక,
రథముఁ బోనిమ్మటంచును రాముఁ డనఁగ,
కొంచ కాతండు రథముఁ సాగించుచుండె;
నంత బలికె వసిష్ఠు డయ్యవనిపతికి.

తోహర: శోకించుచు నీసుతుని పంపఁగా నీకు దగదు వినవయ్యా! ఏకాలమునకు నేదిప్రాప్తమో యెవరి కెఱుక కనుమయ్య॥ రా॥

తోహర: పదపద మని భూపతిని గాంతలను సదనంబులకును జేర్చెఁ, సదయతనల కౌసల్యాదులఁ దా విదితుఁడగుచు నూరార్చె॥

వ. అంత నయోధ్యకుఁ గ్రోశమాత్రంబుననున్న తమసానదీతీరంబు నకు నా రాత్రి శ్రీరాముఁడు సేరి, యక్కడ విశ్రమించి తనతో వచ్చిన పురజనులఁ గని యిట్లనియె:

తోహర: భరతునిఁ గొల్వఁడు! పురిని జేరఁడు! బహుదూరము వచ్చితిరి ! బరువడి బొం డని, పలికిన, రాముని బాయమి వారిట్లనిరి॥ రా

రూపక తాళము: (తాపమొందగ) వలె.

మిమ్ము బాయగజాలము మేము వత్తుము రామ ! నెమ్మదిలో వెంబడిరా నిమ్ము వేగము రామ॥ మిమ్ము॥ మీరు విహరించినచోటే యూరగు మాకు రామ ! మీరు లేనట్టిచోటే కారడవి మాకు రాము ॥మిమ్ము॥ భరతునితోఁ బని మా కేల ! బట్టణమేలా రామ ! తరుణీ సుత భ్రాతృ ధన ధాన్యము లేల! రామ!॥ మిమ్ము॥ కూడ రావద్దన్న, మోక్షగుండనాయకా, రామ! నేడు మా ప్రాణములు మేన నిలుచు పోక రామ! ॥మిమ్ము॥

వ. అనిన, వారల నిశ్చయం బెఱింగి వారి నేమఱించి పోదలంచి యాకిటుకు సుమంత్రునికిఁ దెలిపి యందఱిని శయనింపుఁడని చెప్పి చొక్కు-జల్లిన ట్లందఱు నిద్రించుచుండ.

తోహర: అర్ధమ రేయిని ననుజాదులతో నరదము నారోహించి, తద్దయు సాకేతమునకుఁ బోయెడు దారిఁ బట్టుకొని నడచి॥ రామ॥

ఇం కొకదారిని నేగిరి యడవికి నెవరి కె ఱు క ప డ కుం డ, శంక లేక దమసానది దాటిరి సరయువుదాటిరి యిచట॥ రామ॥

వ. ప్రాతఃకాలంబున—

ఉ. పౌరులు మేలు కాంచి రఘువర్యుని గానక చింతనొంది తా
మారథనేమిమార్గమును నారసి చూడ, నయోధ్యదిక్కు-గా
బారినయట్లుతోఁచిన, శుభం బని యూరికిఁ బోయి, రాముఁడున్
జేరమికై వగంబొగిలి చెచ్చెఱ నిండ్లకుఁ జేరిరందఱున్.

తో: అంతట నాసాయంత్రికి గంగాప్రాంతములకు రానుజనుడు, సంతసమున నచ్చట నున్నట్టి నిషాదనాయకుడు గుహుఁడు ॥రామ॥

క. ఫలములుఁ బువ్వులుఁ దేనెలు
నెలమిని గానుకల గొనుచు నెదురుగఁ జని సా

గిలిపడి దండము లిడి కే
వలభయభక్తులొదవ రఘువర్యున కనియెన్.

ఉ. నేను నిషాదవర్యుఁడను; నిక్కము దెల్పెద: శృంగిబేరసం
స్థానము నేలుచుందును సజ్జనవంద్య! గుహాభిధానుఁడన్;
గానలకేగ మీరటకు గ్రక్కున వచ్చుటెఱింగియుంటి గా
నా నిలయంబునన్ నిలిచి నన్నుఁ గృతార్థునిఁ జేయుదేవరా!

ఆటతాళము: (ఒకదివ్య) వలె.

స్వామి! నాజన్మము సార్థకమాయె! భూమిపై నాపాపములు గూలిపోయె॥స్వామి॥ ఈనిషాదరాజ్య మేలును దేవా! నేను సల్పుచు నుందు నీపాదసేవ ॥స్వామి॥ కందమూలాదులు గలవు మాయింట విందుగా గొనుము సేవింతు నీబంట స్వామి। మోక్షగుండధామ! ముని నుతనామ! సాక్షాన్నారాయణ రఘురామా! ॥స్వామి॥

వ. అనిపలికిన గుహుని వినయవాక్కుల కలరి రాఘవుం డిట్లనియె:

ఉత్సాహవృత్తము.

దండకాటవులకు నేగి, తాపసులను గూడి నీ
వుండు మనుచు దండ్రి వనుపనొప్పి వచ్చినాడ నే
నుండఁ దగదు గృహములందు, నూళ్ళయందు గావునన్,
ఖండితముగ నేటిరాత్రి గంగదరిని నుండెదన్.

వ. ఇట్లు తెలిపి సీతాసహితంబుగా జలప్రాశనంబుఁ జేసి గుహుని చే నిర్మింపఁబడిన కుశపర్ణాస్తరణంబున శయనించి నిద్రింపుచుండ లక్ష్మ ణుఁడు ధనుర్బాణధరుఁడయి శ్రీసీతారామచంద్రగురువు నారాధించు చుఁ బదునాల్గేండ్లవఱకు నిద్రాహారములు వర్జించియుండ నిశ్చయించి, నిద్రాదేవిని స్వాధీనము చేసికొని, తానుమఱల నయోధ్యకుఁ జేరు నంతకు నూర్మిళయందు రెట్టింపుగా నుండు మని యాజ్ఞాపించి రామునికి వచ్చినయిడుములఁ గుఱించి గుహునితో నిట్లనుచున్నాఁడు.

కాంభోజి: ఆదితాళము.

ఎంత దెల్పుదురా సఖా! వీరలకష్ట మెంతని కాంతును నిక యింతకు మూలముకైక; వంతలపాల్ సేసె గదరా॥ యెంత॥ కాంచన పర్యంకమున సుఖముగ శయనించు వీరి కింతలోన నెంచగ నీ నేలబవ ళించగవలసెనయ్యో! ॥ యెంత॥ పట్టుపీతాంబరములు శృంగారముగఁ గట్టుచుండెడి వీరలు, నేట్టిఁ నారచీరలు గట్టవలసె నయయో! ॥యెం॥ ఎండగన్నెఱుగరుగా! శ్రీకరమోక్షగుండవాసుని సాక్షిగ దాడిగ గాఱి డవుల నుండవలసె నయ్యో॥ యెంత॥

వ. అనులక్ష్మణుని దీనాలాపంబులు విని గుహు డిట్లనుచు న్నాఁడు:

తోహర: పూర్వజన్మకృతపుణ్యాపాపమునఁబొందలును సుఖదుఃఖ ములు; సర్వము గుడువగఁ జనుజీవులకును స్పష్టమివి యుస్వకృతములు.

అనుభవింపకయ యజునకునైనను నాముక్కంటికినైన, ననువుగ నారాయణమూర్తికి నైనను దప్పనె భువిలోన॥ రా॥

క. పగ లరుగ రాత్రి, నిశివో
వఁగఁ బగలును వచ్చునట్లు, వరసౌఖ్యము వో
వఁగ దుఃఖము, దుఃఖము వో
వఁగ సుఖమును జీవతతికి వచ్చుచునుండున్.

క. జలమును బంకము నొకటిగఁ
కలిసి యభిన్నముగ నున్నగతి సుఖ దుఃఖం
బులు రెండు గూడి యుండియుఁ
బొలుపుగ నే దయిన నొకటి పొందును దేహిన్.

ఆ-తోహర. కావున సుఖదుఃఖములను సమముగ భావింతురు ధీవరులు; భావములోపల నీవు వీరికొఱకై వగవకు మిక జాలు॥ రామ॥

అని వా రిరువురు ననుకొనుచుండగ నంత దెల్లవాఱగను, జనక తనూజాసహితముగను రామచంద్రుడు మేల్కని తగను॥ రామ॥

ఉ. రాముడు మఱ్ఱిపాలు గొని ర మ్మని యాగుహు నంప, నాతఁడుꣳ
ధీమతిఁ దెచ్చి యీయఁగను, దీవ్రముతో జడలుꣳ ధరించి, మ
మ్మామహనీయగంగఁ దరియింపగఁ జేయు మటన్న, నావఁదే
గా ముగు రెక్కి; రాదరికి గ్రక్కునఁ జేర్చె నిషాదభర్తయుꣳ.

వ. ఇ ట్లద్దరి జేరినపిదప నడవికి మీతో గూడివత్తు మనికోరిన, సుమంత్ర గుహుల నూరార్చి, సుమంత్రు నయోధ్యకుఁ బొ మ్మని సెలవిచ్చి, మే మీసారి వచ్చు నంతకు మారాకఁగోరుచు శృంగిబేరంబున నుండు మని గుహునివీడ్కొలిపి గంగాభవానికి నమస్కరించి శ్రీసీతా రామ లక్ష్మణులు గంగను బొగడి యనంతరంబ-

గీ. అచ్చటికి యోజనత్రయ మైన యట్టి
యాభరద్వాజముని ముఖ్యు నాశ్రమంబుఁ
జేరె రాఘవుఁ డనుజుఁడు సీతబలసి
యరుగుదేరఁగ నాటి సాయంత్రమునకు.

తోహర: రాముని రాక భరద్వాజుఁడు గని ప్రేమను నెదురుగ నేగెꣳ; శ్రీమహీళాపతిగా మది దెలిసియు వేమఱుబొగడగ సాగెꣳ॥ రా॥

దర్బారు: రూపకము.

శ్రీరామా! శ్రితకామా! శివశంకరిజపనామ! క్షీరాంబుధివరతల్పక! ఘోరాహితధారాధర మారుతసమ! శ్రీ॥ నీభక్తుల రక్షింపగ, భూభారము బరిమార్పగ, నీభువిలో నుదయించిన నీభోగము వేభంగుల సేబొగడెద ॥శ్రీ॥ నారాణకవిపాలిత శౌరి మోక్షగుండేశ్వర! నీరాకయు మేలాయెను, ధీరాత్మక కోరిక లీడేరెనుగద॥ శ్రీ॥

క. అనివేడి పర్ణశాలకుఁ గొని
దెచ్చియుఁ బూజసేసి గురుతరభక్తిꣳ
వినమితుఁడయి కొలువఁగ, నా
దిన మచ్చట నిలిచి బయలు దేఱెను బిడపన్.

వ. అంత రాముండు భరద్వాజుని వీడ్కొని యమునానది దాటి చిత్రకూటాద్రికిఁ జేరి యందుఁ దపంబు సేయుచున్న, —

తో: వాల్మీకుం డను వరమునిచంద్రుండు వారల గనుగొనె నంత; చెల్మిని లక్ష్మణసీతా రాములు సెలగి మ్రొక్కి యని రంత ॥ రామ॥ తండ్రియాజ్ఞచేఁ దఱలి వచ్చితిమి దండకావనికి నరుగ; దండిగ గొన్నాళ్ళుండగ సుఖ మగు తావు దెలుపు డన నరిగ॥ రామ॥

వాల్మీ - ఆదితాళము (నీవను) వలెం

నీ వుండనితావు లేదీ! యేదీ! నీవెఱుఁగనితావు లేదీ! యేదీ ॥ నీ॥ స్థావరజంగమస్థలములలోపల వేవేగంబున వెతకిన గానీ॥ నీవుం॥ అంతర్బాహ్యములందు నాదిమధ్యాంతరహితమై యలరుచుండి॥ నీవుండి॥ నానామానివితానహృదయ సంస్థానంబున విజ్ఞానరూపమై॥ నీవుం॥ మోక్షగుండపురరక్షణ ప్రకృతి విలక్షణ, యంతర్లక్ష్యవశ్యమై॥ నీవుం॥

క. ఏనామస్మరణంబున,
నే నమలుండ నైతినో! గణింపఁగ నదియే
నీనామసత్ప్రభావము
దానిని దెలియంగ నెవరి తరము మహాత్మా!

వ. తొల్లి నేను జాతిమాత్రంబున విప్రుండనయ్యుఁ గిరాత వృత్తిచే గిరాతకులం గలసి జీవహింస చోరకర్మాది వృత్తులచే బ్రవర్తించుచు బ్రహ్మర్షుల యనుగ్రహమువల్ల నీనామమును సంపాదించి నిష్ఠతోఁ జపించుచున్న నాపయిన పుట్టలు పెరిగెఁ; బిమ్మట నీయనుగ్రహమును బొంది వల్మీకమును భేదించుకొనిబయటవచ్చుటచే వాల్మీకి యనునామమువచ్చినది. అంత బ్రహ్మర్షినయియిక్కడ నిలిచి తమనామ స్మరణ మఱవక చేయుచున్న కారణంబున—

తో॰హర: నీయనుగ్రహము నేటికి గలిగియు నీదేవీసహితముగ, బాయగ నాకును బ్రత్యక్షంబయి తీరెద నిష్టము లిడగ॥ రామ॥

ఇంకను నాతప మీఁడేరెను నే నెలమి గృతార్థుడనైతి; పంకజాక్ష। యీపర్వతాగ్రమునఁ బరగగ నుండుము ప్రీతి॥ రా॥

వ. అని రాముని నొడంబఱచి,—.

క. గిరిమధ్య నీటిదాపున
సరసియు నొకపర్ణశాల సత్యగ్ర్భత సుం
దరముగ శిష్యులచేతను
విరచింపఁగ జేసె మౌనివీరుఁడు గడిమిన్.

వ. అంత సంతోషించి శ్రీరాముండు కాంతానుజ సహితంబుగ నాపర్ణశాలయందు వసించియుండె.

క. అంత నొకనాఁడు సీతా
కాంతాంకతలంబు దిండుగాఁ దల నిడియ
త్యంతసుఖాప్తిని రఘుకుల
కాంతుఁడు పవళించియున్న కాలమునందున్.

తోహర: కాకి యొకటి వేగంబున జనకసుత కాలి వ్రేలు ముక్కునను, బీకి రక్తమును బీల్చ దొలినను బాక వచ్చు గ్రమ్మఱను॥ రామ॥

వ. ఇట్లే మఱించి వచ్చి బాధించుచుండినఁ గొంతవడికి రాముండు నిద్రలేచి వ్రేలియందు రక్తస్రావమగుటఁ దిలకించి యిట్లనియె:

సీతారామసంవాదము.—పాట:ఆది.

రా॥సరోరుహాక్షి, రక్త మట్లు గారగన్ గారణంబదేమొ తిన్నగా వచింపుమా! క్రూరు లేరు లేరు సుమ్మిట॥ సరో॥

సీ॥సుధీర, మీరు నిద్రయందు దేరగన్, జేరియొక్కకాకిముక్కుచేత నిటువలెన్ గీరన్ గీరన్ గారె రుధిరము॥ సుధీ॥

రా॥సహోదరుండు లేఁడె దాని మోదగన్ బాద మిట్లు జీరినట్టి పాపికాకము ఏదీ యేదీ లేదు చూడఁగన్॥

సీ॥ ఫలాది సంగ్రహంబు జేయఁగా దగన్ నాడుమఱది మోక్షుగుండ నాథ! పోయెను; బోదు మీదమీద వచ్చును॥ సుధీ॥

వ. అని వారు చెప్పికొనుచుండు నంతలో—

తోహర: క్రమ్మఱి నక్కాకము సీతాంగన కాలు చీరుటకు రాగ, నెమ్మది గని కోపమ్మున నొక్కతృణమ్మును వైచెను వేగ॥రా॥

వ. ఇట్లు రామకరనిర్ముక్తతృణంబు బ్రహ్మాస్త్రంబై వాయసంబుపైకి ఘోరంబుగా గవిసిన, నది కావు కావు మని వాపోవుచు,—

యదుకులకాంభోజి: అటతాళము.

దేవేంద్ర! యోశచీదేవీమనోనాథ! వేవేగఁ గావు! కావు! ఓవిష్ణునందన! యోవాణీవల్లభ! వేవేగఁ గావు! కావు! ॥దేవేం॥ అక్షయబ్రహ్మాస్త్ర మావరించె దిశాధ్యక్షులారా! కావరే! మోక్షగుండేశ్వర ముక్తిశ! నే నిక మ్రొక్కెదఁ గావు! కావు ॥దేవేం॥

వ. అని యిట్లు వాపోవుచు వేడుకొనుచున్న కాకి కేకవాక్యంబుగా వా రంద ఱిట్లనిరి:

తోహర: రాముడు వైచిన బ్రహ్మాస్త్రంబును మేము నిలుపఁగా గలమా! ఆనుమానీయుని నాశ్రయించినను నత డుసుపును నికఁ గనుమా! ॥ రామ॥

వ. అని వారిచేత నియమింపఁబడి త్రిలోకంబులు దిరిగియు నెందును శరణంబు లేక కాకంబు గ్రమ్మఱవచ్చి శ్రీరామమూర్తిమ్రోలఁ గుఁజొచ్చి భయభక్తుల నిట్లని వినుతించె:

కమాచ్—ఏకతాళము.

సీతాధిపా, శ్రీరామా, త్రిభువననుత! ॥సీతా॥ గౌతముని నాతి నపుడు పునీతను జేయవె ॥సీతా॥ కావు కావు కలుషాపహార ॥సీతా॥ కుజనహరణ, సుజనహృదయ, గురుజలజాతనిలయ ॥సీతా॥ నను గన్న జనకుఁడ వన్న కనుగొన్న నిను నమ్మియున్న నను బ్రోవుమన్న ॥సీతా॥ నీ కన్న వేఱు లోకాధ్యు లేరు! కాకుత్స్థ లేరు కాపాడువారు! చేకొని పాపము జిందరవందర జేసి శుభము లిడు ॥సీతా॥ రామ రామ నారాయణకవినుత నామ మోక్షపురధామా! రాజలలామా! పాపవిరామా! సజ్జనకామ! రూపజితకామ! నీరదశ్యామ! శరణు॥ సీతా॥

వ. అని యిట్లు పరిదేవనము సేయుచున్న కాకిని గరుణించి శ్రీరామదేవుండు పలుకుచున్నాఁడు:

క. నా యస్త్రము వృథ వోవదు;
నీయంగం బొక్క- టిమ్ము! నేఁ డన, విని యా
వాయస మొక కన్నిడి తాఁ
బోయెను శ్రీరాము నాజ్ఞఁ బూని యథేచ్ఛన్.

వ. అది మొదలు గాకులకు నొంటికంటి చూ పేర్పడె. ఆ పిమ్మట సీతా-రామ-లక్ష్మణులు ఫలాహారంబులు సేసి వాల్మీక్యాది మహర్షుల సాంగత్యంబుచే బ్రహ్మానందంబు నొందుచుండె నిక్కడ, —

తో॥: మంతన మాటిమ సుమంత్రుఁడు రథమును మరలి నయోధ్యకుఁ జేర్చి; వంతచేత దలవాంచుచు జని భూకాంతుని కెదురుగ నిలిచె॥ రామా॥

వ. ఇట్లు నిలిచినఁ గాంచి దశరథుండును వగమునఁ గన్నీ ర్నించి,—

తో॥ సారి: ఇందుముఖి సుందరుఁడు గోమలులు గోడలు నెచ్చట నున్నారోయి? యడవులు వ న్నెనని నిర్దయుఁడో నాడిరా చెప్ప గదోయి॥ రామ॥ అని యెలుగెత్తియు హా! యని యేడ్చుచు నడిగిన, నా దశరథుని, గనుగొని చింతాక్రాంతుండగు మనుసనియు మంత్రి నమ్మదిని ॥రామ॥

ద్వి. రాజేంద్ర, శృంగిబేరము జేర్చినాను;
తేజములు ధరించి నెమలి, జాహ్నవిని
దాటి, కాల్నడకతోఁ దద్దయు జిత్ర
కూటశైలమ్మునకును జేరినారు;
'తల్లిదండ్రులకు దండముల్ సెప్పు
మల్లన వగవ వద్దను' మనినారు,

సాకేతమునకన్న, సకల సౌఖ్యంబు
లాకానలం దెక్కువని యనినారు;
సీత యత్తలకును, జెప్పె దండములు
భూతలాధిప యిదేపో వార్త లనిన—

మ. విని కౌసల్య విలాప మొందుచు విభుఁ వీక్షించి 'హానాథ! నీ యనుకూలంబుఫలించెఁ! గైకకొడుకుర్ హర్షంబుతో నిందు ర మ్మని పిల్పించి ప్రభుత్వ మిమ్ము! వల దీయాలస్య మింకేల ? నా తనయుల్ నాకులఁ గూరలై బ్రతుకరా దైన్యంబునన్ గానలన్!'

వ. అను నుడువు లొడలిపైఁ యుడుకు జల్లి నట్లయిన వాపోవుచు-

సురటః ఆదితాళము.

ఎందుకుఁ బల్కెదవే సుందరి॥ ఎందు॥ నందను నెడఁబాసి డెంద ము గుందగ ముందే నే దుఃఖింప నిందటిలో, నందుకు దోడుగ నగ్ని జిలికిన రీతి॥ ఎందు॥ నే నింక ప్రాణాలు నిలుపఁగ జాలను! గానఁగ శాపము గలదు నాకు! మానిని, యింతలో మర్యాదబోనాడి ॥ఎందు॥ శ్రీమోతుకుండపురీశుని సాక్షిగ గామిని, నాశాపకారణము వేమరు నే నీకు వినుపింతు నింతలో॥ నెందు॥

గీ. వేట తగులమ్మునం బిన్ననాట వనికి
నరిగి సరయూతటమ్మునఁ దరువుపొంతఁ
బొంచి యుంటిని; యట కొకముని సుతుండు
వచ్చి గుండిగ ముంచెఁ బ్రవాహమందు.

తోహః బుడబుడ మని చప్పుడు గలిగిన నప్పుడు గజ మని నేఁ దలఁచి, జడిగొని వైచితి శబ్దవేది యను శరమును దరిపై నిలిచి ॥రాను

'హాతాతా! హామాతా! మిము నను నావిధి వాపెనె' యనుచు భూతలివ్రాలిన ముని సుతుదరిసితి నాతురతంబడుచు॥ రా॥

వ. ఇటుల చెంతకుఁజేరి యిట్లంటిః

హిం. కాఫీ: ఆదితాళము.

నీ వెవరో తెల్పుము నాకు ॥నీవె॥ నే వనకుంజర మని, భావించి వేసితిని శరము॥ నీవె॥ వేటకు వచ్చితిని; యీ యేటిదరిని నుంటిని; ధాటిగ నయోధ్యనాది; దశరథావనీశుఁడను॥ నీవె॥ కానక చేసితిని; తప్పు గావుము మ్రొక్కితిని పూని నన్ను బ్రహ్మహత్య పొందెనేమి చేయువాఁడ॥ నీవె॥ ఏకుల మేస్థలము రా నేల నీవీయెడకు। ప్రాకటముగ మోక్షగుండపాఁలదయ లేక పోవె॥ నీవె॥

వ. అనిన, నతండు—

క. నాపేరు యజ్ఞదత్తుఁడు;
భూపాలక, వైశ్యుఁడను; దపోమహితులు మా
తాపితరులు గల రంధకు:
లీపొంతను,నిదిగో కాంచు మీదయ వెలయన్.

గీ. వారిదప్పిఁ దీర్ప వారికై వచ్చితి
నా పురాకృతంబు నన్నుఁ బంప;
బ్రహ్మహత్య యనెడు భయము నీ కింక లేదు;
మిగిలినట్టి పనికి వగవ నేల !

ధన్యాసి: ఆదితాళము.

ఇఁక బొమ్మా ధరణీవల్లభా॥ ఇ॥ అమ్మయు నబ్బయు నతిదాహముచే నల్లాడుచు నున్నారచటికి ॥నిక బొ॥ ఆకులపడుదు రాచీకులు నాకై! యీ కలశంబును గైకొని నీ ॥విక బొమ్మ॥ నాపోబడిఁ గానక నే డయ్యో! వాపోవుదు రీవార్త దెలుప ॥నిక బొ॥ దక్షతతో వారి దాహము దీర్పగ మోక్షగుండపతి సాక్షిగ నీ ॥విక బొ॥

తోహా: శాపం బిత్తురు చను మిక దడయకు; శరవేదన బడజాల! బ్రాపు జేరి యీ బాణములాగుము ప్రాణము విడుతు నీవేళ॥రా॥

వ. అని పలికినఁ, జింతాక్రాంతుండ నగుచు డగ్గఱి యతని యెడద నాఁటియున్న శరంబు పెఱికిన యజ్ఞదత్తుండు దేహంబు బాసి దివంబున కరిగె. అంత నేను విధిని దూఱుచు నక్కలశంబును నెత్తిన మోచికొని మెల్లన నడుగు లిడుచు యజ్ఞదత్తుండు సెప్పిన గుఱుతు ప్రకారము ముసలివున్న చోటికిఁ బోయినఁ, గాళ్ళచప్పుడు విని, ఆముదుసల్లు-

తేవారము:- కొడుక, నీ వింతసేపు దడయగా నేలఁజెప్పఁ! బడుగులము దప్పిచేత బడలి యున్నాము; ధాత యిమ్ములొందఁగఁ జేసె నిటుల దలమీఁదవ్రాసె! గడియయును నిన్ను మేము కానకయు నిలువలేము.

వ. అనిన భయభ్రాంతచిత్తుండయి దశరథుండు నీటికడవనచ్చట దించివారిపాదంబులపై వ్రాలి, ---

తేవారము: నేను మీసుతుండ గాను, నిక్కము నేఁ దాపలేను; భానువంశోద్భవుండ బాహుజుండ దశరథుండ; నే నిచట వేటలాడ బూనిజనుదెంచినాఁడ గాన కపకార మొకటి గరువము మై జేసినాఁడ.

వ. అని సవిషాదంబుగా-

చ. 'సరయువుఁ జేరి మీ కొడుకు చప్పుడుఁ జేయుచు నీరుముంచఁగాఁ,
కరి యని శబ్దవేది యగు కాండము వైచితిఁ! గూలె బిడ్డ ద
ప్కరమగు గిల్బిషమ్ము నొడిఁ గట్టితిఁ గట్టిఁడి' నంచు మ్రొక్కి వం
దురితిని: వారి దప్పికకుఁ దోయము లిచ్చి సమాశ్వసించితిన్.

త్రో: నేపాపాత్ముఁడ, నీచవర్తనుడ మీపుత్రుని జంపితిని! నాపయి నెక్కిలి గోపము సేయక, నను బాలింపుడు ధృతిని॥ రామ॥

మేకొని యుదకము మీకు దెచ్చితిని జేకొని త్రాగుడు వడిగ; నా కృత్యము మానసమున నుంపక నను గృప గనుగొను డనగ॥ రామా॥

వ. అంత వారు మూర్ఛపోయి కొంతవడికిఁ దెలిసి కొడుకుం గూర్చి-

జోగిరాగము: ఆదితాళము.

మా పుత్రరత్నమా, నీవు నను బాసిపోతివా ! ॥ మా॥ నీవు మాపైనగలభక్తి మఱచిపోయితివా! భూపతి నెపమున భువి నింతటికో బాపురే విధి యెడబాపెను మసలను॥ మా॥ మాకెవ్వరింక దిక్కు- మర్యాద చేయుగా ! గాకులకొల్లచేసి కదలి పోతివిగా ! యీ కానలలో నెటుల మెలగుదువు! చీకుల ! మెవ్వరు పెట్టబట్టుదురు? ॥ మా॥ భూమీశు చేత నేడు పోలియగ నాయెగా ! శ్రీమోతుగుండ శౌరి ప్రేమ లేదాయెగా ! శ్రీమీరాటి చిరంజీవివి గమ్మని మే మను మాటలు మిథ్య లాయెనుగా॥ మాపుత్ర॥

వ. ఇట్లు దుఃఖించి యొట్టకేలకు ధైర్యము బూని,-

తో: క్షితిపాలక నీవు జన్మంబు దెచ్చియు జనిచెప్పుము త్వరగాను॥ నతులితగుణి మాసుతు డరిగిన యాగతికి బోనా మే మనిన..

గీ. అటులఁ జనిఁ జేర్చి తెలిపిరి; సంత నార
లగ్నిలోఁ బోచ్చి 'మునినా మాయటుల నీవుఁ
బుత్రశోకాగ్ని చేతనే పొలియగల' వ
టంచు శపియించి యొడలు ద్యజించి చనిరి.

తో: కాన్పున నాశాపకాలమున చ్చెనుఁ గాదది వ్యర్థము నిజము; వేవేగంబున బోవును ప్రాణము వెలదిరో, నిల్వ నవశము ॥ రామ ॥

వ. అని కౌసల్యకుఁ జెప్పి తత్క్షణంబున——

శా. 'హా రామా ! సుగుణాకరా ! ప్రియసుతా ! హా సీత ! హా లక్ష్మణా॥
మీరల్ స న్నిధిఁ బాసి పోవుకతనన్ మేనుఱ విసర్జింపఁ దే
కూరెన్ శైకను దూఱఁగాను; విధి బల్ క్రూరత్వముం బూనెనా
చారాటమ్ముగ సైదోలింగి చన నస్థాంగుల్ ప్రబలాపింపఁగా.

ఆ॥ తో॥ హర: అంతట గౌసల్యాది మానినులు హాహాకారము తోడ, నెంతయు వగచుచు, నెదలు మోదుకొని వంతమునిఁగి గోడాడ॥ రా॥

కౌసల్య - జోగి: ఆదితాళము.

సుగుణాకరా! రణభీకరా! నృపలోకశేఖరా! యిహలోక భోగము సరిపోక వేగము నిరాకరించి పొందితే! పరలోకసౌఖ్యము॥సుగు॥ నిను దూలనాడితి! గడుజాలిబెట్టితి! సుశీలుడవని నీమది గనఁజాల కెన్నితి॥ సుగు॥ అలకైకకృత్యము బహు శోకమూలము। అనేక మైనకష్టము లెంచ లేక దోచెను॥ సుగు॥ ధర మోక్షగుండనాథుడు, కక్షుగట్టినా సురక్షితంబుగల్గునా! తల వ్రాత దొలగునా!॥ సుగు॥

వ. ఇట్లు రాజకాంతలు దుఃఖించుచుండ...—

తో॥ హ: తెల్లవాఱగను దెలిసియు బురజను లెల్లరు గుములంబు వచ్చి, గొల్లున నందఱుగూడి యేడువగ గొల్లురేగె; నది చూచి॥రామ॥

చ. గురుఁడు వసిష్ఠమౌని చని గొబ్బున నందఱి నూఱడించి, భూ
వరతిలకమ్ము దైలమునఁ బక్వముఁ జేయఁగ బంచి దూతనొ
క్కరుని గిరివ్రజమ్మునకుఁ గైక సుతుంగొని తేఱఁబంచె; వాఁ
డరిగి వసిష్ఠునాజ్ఞ భరతాదులకుం దెలిపెన్ వినీతుఁడై.

తో॥ హ: విని భరతుం డతి వికలచిత్తుడయి తనవారలు పీడ్కొలుప, గనుల నశ్రువులు గార్చుచుఁగాళులు గడగడలాడుచుఁ గలఁప ॥రామ॥

శంకరాభరణము—ఆదితాళము.

ఓహో బంధులార, నే నయోధ్య కేగుచుంగదా ;! యాహా ! నన్ను బిలువ భటుని నంపిరి యోజించెదా॥ ఓ॥ రాము డెందు బోయి నాడో ! రాజుమాటదెలియదు ! ఏమికారణమో ! నా కేమి దోపగా లేదు॥ ఓ॥ దక్షుఁడగుచు వసిష్ఠుఁడు దాను బంపెనేమో ! హా! మోక్షగుండశౌరి కెఱుక మోస మేమో వచ్చె హా!॥ ఓహో॥

వ. అప్పుడు శత్రుఘ్న సహితంబుగా భరతుండు శీఘ్రయానంబున సాకేతనగరంబుఁ జేరి కళాహీనముగానున్న యా నగరంబును గని ఖిన్నుండయి రథంబు దిగి మాతృగృహంబున కరిగి యొంటిగా నున్న తల్లికినమస్కరించిన లేవనెత్తి దీవించి యిట్లనియె:

తోహర: మాతులు డత్తయు మాతామహియును దాతయు జుట్టంబులును; బ్రీతిగ గుశలం బేకద! యన విని మాతకు దా నిట్ల నెను॥ రా॥

మధ్యమావతి: ఆదితాళము.

ఎందుబోయె నాతండ్రి నేఁడు॥ యెం॥ ఎందు బోయె! మది యందు దోపలేదు; ముందు నీదుగృహమందు నిలిచి తనడెందమందు నానంద మొందు నిపు డిందు లే డాయె తండ్రి॥ ఎ॥ దుందుభిరవముల సందడు లలరగ వందిమాగధులు బృందములై తనముందర గొలువగ సుందర ముగ జెలు వొందు భూమీంద్రు డిపు॥ డెం॥ ఈక్షితి నారాయణకవి నేలెడు మోక్షగుండపురదక్షకు దయాశో నీక్షణమున ప్రతిపక్ష గణంబుల శిక్ష జేసెడిదక్షు॥ డెందు॥

వ. ఇట్లడిగి కించిన్మాత్రంబు దుఃఖితుండయిన, కైకయిట్లనియె-

తో: వగవ నేల సుత వాడిమేధమఖవర యాజకు లేగతికి దగ జనుదురో యాస్థానమునకు మీతండ్రి సేరె సద్గతికి॥ రాము॥

తో: అనగా నామాట వినగా మూర్ఛిలి, యవనిపైనిబడి పొరలి, గొనకొని శత్రుఘ్నునిసహితంబుగ గొంతవడికి దెప్పిరిలి॥ రాము॥

క. నాయన స్వర్గమునకుఁ దాఁ
బోయెడు సమయంబునందుఁ బొలుపుగ మాకుఁ
ఏయేబుద్ధులు గఱపెను?.
నాయెడదయయుంచి తెలుపు నను గన్నమ్మా!

వ. అనినఁ దల్లి యిట్లనియె:

తో: శ్రీరాముని నాసీతను లక్ష్మణు సాకెరు దలపోయుచును, దోరపుదుఃఖముతోఁ బాగులుచు గడతేరె ననగ విని యనెను॥ రామ॥

వా రెచటికి నావలెనే పోయిరో వారక దెలుపఁ గదమ్మా చేరువ కోకరును జేరని హేతువు జెప్పు మనగ నాకొమ్మ॥ రామ॥

జంఝూటి-ఆదితాళము.

విను తనయా! తెలిపెద॥విను॥ నిను గురించి చేసిన నాకృషి ॥విను॥ నట్టడవికి రఘునాథు నంపగా, పట్టము నీకును గట్టగను గట్టిగ గోరితి గాంతునితో ॥విను॥ రెండువరము లిడి యుండె గాన మీతండ్రి యవియు లే దనలేక, దండిమనసుతో దయచేసెను విను ॥తన॥ దీక్షగ సీతా దేవి లక్ష్మణు లాక్షణమున రా నడవులకు, మోతుకుండపతి సాక్షిగ జనె॥విను తన॥

గీ. వారి నంపి పిదప వారిపైఁ బ్రియమునఁ
బాగిలి పొగిలి చచ్చె పుడమిఱేడు!
కొదువ యేమి యింకఁ! కుతలంబు నేలుము
తనయ, యనిన, నతఁడు గనలి పలికె.

కీర్తన:ఆదితాళము.

పో పో గదే పో గదే పాపాత్మురాల! ॥పో॥ నీపట్టినై ధర నే బుట్టుటే రోత॥ పో॥ మాత వనుచు నిక బ్రీతిగ గన వచ్చునే తండ్రి జంపిన ఘాతుకురాలవు॥ పో॥ అన్నను వనముల కంపి యీ రాజ్యమున న్నేలుము నెదవు నాలుకెటు లాడె॥ బోపో॥ శ్రీమోతుకుండపురీశుని సాక్షిగ వేమారు నీమోము వీక్షింపఁగానొల్ల ॥పో॥

వ. అని యిట్లు కఠోరంబుగాఁ బలుకుచున్న యెడఁ జూడ వచ్చిన వారిలోఁ గొంద ఱీ మంథరవల్లనే యింతతొందర గలిగె నన, విని శత్రుఘ్నుండు క్షాత్రవంతంబున లేచి,—

హానినుండ నికఁ గూల్చివేతునని పూనికతో
హత్యకు మదిసంశయపడి మాని కొంత సైరించి
జంపగ దలచిన నిది మాతృద్రోహం బనుచు
పద కౌసల్యావరగృహముస కనవినుచు॥ రామ॥
ం యిరువురుఁ గౌసల్యనగరంబునకుఁ జని భర్తృవి
పించు నామెపదంబులతో బడి యేడ్చిన, నా

తండ్రి, సర్వము దల్లిచే నెమ్మది విని యుండుదువు;
నేలుము నీ విక నిష్ఠూరంబులు నొదవు॥ రా॥ రామ
జయును నారలచీరెలు ధరియించి, ధీమతి నడవుల
నేపుడె ది క్కన గాంచి॥ రామ॥
రతుం డిట్లనియె,

హిం. తోడి–ఆదితాళము.

దాయె తల్లీ! యిక నేమిసేతునే! కుటిలాత్మురాలు
ను॥ యె॥

ల్ల నించు కెఱిఁగి యుంటినేని బాకిట బ్రహ్మ
ంతును॥ ఈ॥ గురుని వసిష్ఠుని తరుణితో గూడను
బొందుదు॥ ఈ॥ నాతల్లి మోక్షగుండ నాథుని
జేసి యెఱుగను మన్నించు॥ యెఱుదోప॥
తుండు ప్రమాణపూర్వకముగాఁ బలికె. కౌసల్య
ను లేవ నెత్తి 'నాయనా! నీమనోభావంబుఁ గన
వించుచు నొకరి నొకరిగాగిలించుకొని యెలుఁగెత్తి
శిష్ఠుండు వచ్చి భరతునితో నిట్లనియె:
ర్వమను భావ్యము! చచ్చినవారు వత్తురే!
జ్ఞుల సన్నుతిఁ గాంచు కుమారులం గనెఁ;

తగిలె సమస్త భోగములఁ; దద్జ్ఞత నొప్పి దివంబుఁజేరె; నా
యగణిత ధర్మశీలునకు నైపలవించుట పామరత్వమా !

సీ. దేహ మెల్లప్పుడు దిరముగా నుండదు
మృత్యువు వెన్నంటి మెలఁగుచుండు;
సర్వసంపదలు నశాశ్వతంబులుకర్మ
ఫలితంబు గుడువక వాసి చనదు;
దారపుత్రాదులు దారు సూ వెన్వెంట
మాయాకృతంబు లీమమత లెల్ల;
బాల్యకౌమార యౌవన జరావస్థలు
సమత నెల్లపుడొక్క క్రమతఁ గనునె?

గీ. ఇట్టితనువుల నెన్నిటి నెత్తినాఁడొ!
పుట్టివచ్చుట సహజంబుభూతతతికి
నశ్వరం బగుదీనిని నమ్మరార్య;
లింక దుఃఖించినను ఫల మేమి భరత!

క. చినిగినగుడ్డలు విడిచియు
మనుజులు క్రొత్తవి ధరించుమాడ్కిని తనువుల్
వెనుకటివి విడిచి నూతన
తనువుల్ గాలక్రమానఁ దాల్తురు జీవుల్.

క. కావున విజ్ఞతఁ గైకొని
చావులు బుట్టువులురెండు సమ మని మదిలో
భావించియు, సంస్కారము
గావింపుము తండ్రి కిపుడుఁ గడుభక్తి మెయిన్.

వ. అని బోధించిన వసిష్ఠునివాక్యంబులవలనఁ దెలివినొంది తైలద్రోణంబుననున్న తండ్రి కళేబరంబు దీయించి విధ్యుక్తముగా నగ్నిసంస్కారంబుచేసి దశరాత్రంబులు కర్మ మాచరించి, వేదవిదులగు

విప్రులకు షోడశమహాదానంబు లిచ్చి, సభాస్థానంబునఁ బరిజనమంత్రి సహితంబుగాఁ గొలువు దీరియున్న భరతునకు వసిష్ఠముని యిట్లనియె:

క. మీతండ్రికి మాటుగ నీ
వీతటి భూభరణముఁ వహింపుము; కౌస
ల్యాతనయుఁడు పిమ్మటఁ బృ
థ్వీతలము భరించుచుండు విబుధహితముగా.

జంఝూటి: రూపకము.

రాముని సేవింప బోదు- రాజ్య మేటికి? ఓమునీంద్ర, ఇహ సుఖము లొల్లను నే నుల్లంబున ||రా|| కాఅడవుల రాము డుండ నూరం నుందునా! మాఁటుమాట లేదు రేపు మనమందఱ మరుదెంతము || రా|| కైకదప్ప స్త్రీపురుషులు గడనువారలు ప్రాకటముగ మోక్షగుండ పతికృపతో రావచ్చును|| రాము||

తోహ: రాముని దోడ్కొని-రయమున వచ్చియు రాజ్యము వే గట్టెదను; ఆమహానీయుఁడు రానియెడల నే నందే గడపెదను. ||రా ||

వ. అని నిశ్చయించి యేగిన తరువాత వసిష్ఠాదిమునులును సుమం త్రాదులును దల్లులును జతురంగబలంబులును బౌరులును గూడి రా భరత శత్రుఘ్నులు గదలి గంగాతీరంబునకుఁ జనిన, గుహుండు నూచి,—

గీ 'కాననంబుల దిరిగి రాఘవుఁడు మరల
వచ్చునో! యంచుదండెత్తి వచ్చుచున్న
యటులఁ దోచును నీరాక! యైన నేమి
నన్ను గెలిచియుఁ బొమ్ము నీ' వన్న ననియె:

గీ 'రాముఁ బ్రార్థించి తోడ్తెచ్చి రాజ్యమియ్యఁ
బోవుచున్నాడ' నన్న, నుప్పొంగి యతఁడు-

పండ్లు పాలును దేనియల్ బడవలందు
నుంచి యందఱ నదిని దాఁటించె నపుడు.

వ. భరతశత్రుఘ్నులు రామలక్ష్మణులవలెనే జటావల్కలములు ధరించి యానాఁడు భరద్వాజాశ్రమంబుఁ జేరిన, నతండు–

తోహర: పురి నీ కిచ్చియు బోయిన రాముని బోనియ్యంగా లేవా! భరతా! యిటువెంబడిఁ బడి వారలదఱమగ జనుచున్నావా! ॥రామ॥

తోహర: అనిన, భయపడి 'మునివర! రాముని గొని దెచ్చి ప్రభునిఁ జేయగ, జనుచున్నా' నన, సంతసించి యాయన యాతిథ్యం బీయగ ॥రామ॥

వ. అందుండి మఱునాఁడు బయలుదేఱి చిత్రకూటాద్రిఁ జేర వచ్చినఁ గాంచి లక్ష్మణుండు మునిజనపరివృతుండయిన యగ్రజుఁ గాంచి,—

కీర్తన: ఆదితాళము.

వారెవరో! చూడుము॥ వా॥ వివిధసేనలతో వెడలివచ్చు ॥వారె॥ సమరథు లున్నారుగా! అతిరథు లున్నారుగా! రథ హయ భట వారణ ములుగల॥ వారె॥ ఇనకులులఁ చిన్నియ నెనయఁగలిగి మన దెస కలరి వచ్చు॥ వారె॥ ప్రతిపక్షవీరులో! ప్రతిమోక్షగుండపుర రక్షక యల॥ వారె॥

వ. అనిన, రాఘవుండు—

తో: భరతుడు మనలను బురికిఁ బిలువఁగా, వచ్చునాఁడు కాఁబోలు! సరగున నీమది సంశయముడుగుము సౌమిత్రీ యిక జాలు॥ రామ॥

తో: అనుకొనుచుండగ నంతలోన వారరుదెంచిన ముదమంది, జననుల కంజలి సంఘటించి దీవనలఁ గ్రమంబున నంది॥ రామ॥

క. కులగురునకు దండము లిడి
యలరుచు 'ధన్యుండ నైతి, నయ్యా, మాత
ల్లులుఁ దమ్ములు వచ్చిరి యిట
నలవడి మాయయ్య యేడి? యగపడ' డనఁగన్,

వ. అనిన వసిష్ఠుం డిట్లనియె-

వ-ద్వి. మిమ్ము గానఁగఁ గంపి మేదినీవిభుఁడు
మిమ్ము దలంచుచు మృతుఁడయ్యె నంత
భరతునిఁ బిలిపించి, పరలోకవిధులు
బరువడిఁ జేయించి ప్రభువు గమ్మన్న
నొల్లక మిముఁ జూడ నొయ్యన వచ్చె
తల్లులతోఁ గూడ దశరథరాము!
అనుపల్కు లాలించి, యారామవిభుఁడు
జనకజా-లక్ష్మణసహితంబుఁ గాఁగ
గడునడి మూర్ఛిల్లి గ్రక్కునఁ దెలిసి
సుడియుచు నిట్లని శోకింప దొడఁగ.

హిం. తోడి: రూపకము.

తండ్రి! పోతివా! కన్న ||తం|| తీవ్రమయిన శైకశోర్క-దీర్చి పోతివా ||తం|| కొడుకులకొఱకు వెతగుడిచియుఁ గడకు బడలి చెంత నెవరు లేక బాసిపోతివా|| తం|| చాలకాలము నీచాటున మేము లీల మెలగు ప్రాప్తి మాకు లేకపోయెను|| తండ్రి|| ఎంతదలచితో! మమ్మెంత బిలచితో! సంతతంబు మీకుగూడ స్వామి కెటుకగు|| తండ్రి||

వ. అప్పుడు వచ్చిన వారందఱు కన్నీరు మున్నీరుగాఁ బొఱలి నేడ్వ, వసిష్ఠుండు శాంతవచనంబులఁ వారందఱ నూరార్చి రాముని దగ్గరి,—

క. లోకంబులు గల్పింపను,
బ్రాకటముగఁ బెంపఁ నొంపఁ బతివయ్యు నిటుల్

బాఁకృతిని రీతి నీకున్
శోకింపఁగ నేల సకల సురగణపాలా!

వ. నీయంతవాని కిది తగునే! దుఃఖించినఁ జచ్చినవారు వత్తురే! లె మ్మన, గురువాక్యంబువలన రాముండు దేఱి తమ్మునితోఁ గూడ గంగానదియందు స్నాతుండయి తండ్రికి వాసోదక పిండోదకములనిచ్చి యాదిన ముపవసించి, మఱుదినంబున స్నానంబుఁజేసి యథాస్థానంబు నకు వచ్చి మునిజనపరివృతుండై యున్న యన్నకు భరతుండు సాష్టాంగనమస్కారము లర్పించిన, రాముం డిట్లనియె:

క. పితృవాక్యపాలనకు నే
ధృతితోఁగానలకుఁ నేగుదెంచితి; నీవున్
క్షితిభారముఁ దాల్పక యీ
గతి నడవికి రాఁగ నేమి కారణ మనుజా !

వ. అనినఁ భరతుండు దీనాననుం డగుచు నిట్లనియె:

ఖ్యాండుస్వరము: ఆదితాళము.

రామచంద్ర, రమ్మిక! రాజ్యమును గొమ్మిక! స్వామి, నిన్ను వీడి చనను నేను బురికిఁక! భూమిబాలింపగ బోల నేను; శీఘ్రమీఱి విలాపంపుజేసెదను॥ రామ॥ కపటచిత్తురాలగు కైకమాట దలపకు; తపనకులజ, నాయెడ దప్పులేదు చొప్పడ; విపులాటవుల కేగు టిక మానుము; కృప యుంచు నామీద నేవలము॥ రామ॥ మోతుగుండ దేవునిసాక్షిగ నీవు రా నని పక్షపాత ముంచిన బాదములు విడుతునా! లక్ష్మణ-సీతలు లలితాంగులు అక్షయ కష్టము లంద లేరు॥ రామ॥

వ. అనిన శ్రీరామచంద్రుం డిట్లనియె:

క. జనకునియాజ్ఞను దాటఁగఁ
జనునా ! రాజ్యంబు నీ కొసంగియు ననుఁ గా
ననములకు నరుగ మనియెను;
బనివడి నెఱవేర్చకున్నఁ బాపము గాదా ?

వ. అనిన భరతుండు శోకవ్యాకులచిత్తుండై యొక్కదర్భాసనంబునఁ గూర్చుండి యిట్లనియె:

తో: ప్రాణాయామము బట్టియు నేనుదు ప్రాణంబులు బో విడుతు; గాన మీరు రాక యయోధ్యకు నే బోను సత్యమని యనెను॥ రా॥

వ. అంత భరతుని మనోనిశ్చయంబునకు నేమి చెప్పుటకు దోఁపక శ్రీరాముండు గన్ను గీటిన, వసిష్ఠుండు భరతున కభిముఖుం డయి యిట్లనియె:

అటతాళము (నాయనా) వరె.

అగ్రజుశాసన మాలింపరాదా! వ్యగ్రతగా నీవు వర్తింపవలెనా! ॥అ॥ కారణ-కార్యము లారయవలదా ! తీరు మిక్కిళులు దెలియగవలదా॥అ॥ రావణు గూల్చి సురావళి నెల్లను బ్రోవగ బుట్టిన దేవుడు గాడా॥ అ॥ ఆపనిదీర్పగ నది కడుమే లగు; పాపాత్ము లెల్లరు బలిసిరి భూమిని॥ అ॥ మోక్షగుండ పురాధ్యక్షునివల్లనే రాక్షసకులములు శిక్షింప బడ నగు॥ అ॥

తో: తిరిగి రాముడరుదెంచిన నాపని దీర్చువార లిక నేరీ! చెరి యొక కార్యము జేయుదు జనులకు క్షేమం బగు ననె సూరి॥ రామ॥

సం-వ. ఇట్లు భరతునకుఁ దెలిపి రామునింగాంచి,

వసి-తోహర: పదియు నాలుగబ్దంబులు నిండినపిదప నయోధ్యకురండి! సదమలముగ సజ్జను లౌనసగా బృథివి నెల్ల నేలండి॥ రామ॥

వ. అని తెలిపిన,

క. ఇందుకు రాముఁ డొడంబడె
నందుకు భరతుండు నొప్పె నటుపిమ్మటఁ దా
వందన మొనరిచి సభవా
రందఱువిన భరతుఁడనియె నగ్రజుతోడన్.

గీ. అయ్యతర్వాత ప్రభుతనీదగునుగాని,
నాకు దగదయ్య! సింహాసనంబు నెక్కఁ
బాదుకల నిమ్మువాని కే భక్తితోడఁ
జేసికొనియెద రాజ్యాభిషేక మింక.

గీ. పాదుకల నిమ్ము; నెమ్మి నీవచ్చుదాఁక
గొలిచి యేల్బడినెట్టులో సలుపుచుందు
గడవులో రాక తడసిన గరముఁదీని
చత్తునీపాద మాన నిజమ్ము నమ్ము.

వ. అనిన రాముండిట్లనియె

తోహర: 'తమ్ముడ! నీయిష్టమ్మురీతిగా, దప్పక నే జేసెదను; బొమ్మిక బాదుకలివ్మంటిని కైకొమ్మని యిచ్చెను దయను॥ రామ॥

వ. అంత భరతుం డానందమొంది పాదుకల శిరసావహించి రామునకుఁ బునఃపునః ప్రణామంబు లాచరించిన, దీవించి యిట్లనియె:

కీర్తన: అటతాళము.

ప్రజలను బాలింపుమీ తమ్ముడ! ॥ప్ర॥ సుజనులగాంచి సారిది బూజించి వృజినపథంబుల నెఱిఁగి తొలంచుము॥ ప్ర॥ నీతి మానక ఖ్యాతిఁ బోనీకఁ దాతతండ్రులబోలి ధర్మసుగుణముగా॥ ప్ర॥ పేదసాదలను బ్రీతితోఁగనుచు నాదరమున మితముయిన పన్నుగొనుచు॥ ప్ర॥ రాక్షసనాశ మోక్షగుండేశు నక్షయఫలదుని నర్చనజేయుచు॥ ప్ర॥

వ. అని బోధించి శత్రుఘ్నుని భరతునికి సహాయంబుగా నుండుమని నియమించి తల్లులకుఁ మగుడ నమస్కరించిన, కైక రామున కిట్లనియె:

తో: నీవు దేవుడవు; నిర్వికారుడవు; కేవలపరిపూర్ణుడవు; నావనజునకు నయిన దెలియ దరమవునే! పరమాత్ముఁడవు॥ రామ॥

కపటినిపాపిని కష్టచిత్తను నృపహంతను గావునను, నపరాధము నీకాచరించితినిఁ నపనయించి కావు నను॥ రామ॥

ఇది వినువారల కిహసౌఖ్యంబులు గొదువలేక చేకురును
ముదమున దుదకును ముక్తిలభించును మోక్షగుండహరికృపను॥ రా॥
రామ! రామా! యనవే! శ్రీరామాయణకథ వినవే! గౌరీ!॥ రా॥

క. నాచేతనైన కొలందిని
జూచి రచించితిని. దీని; సుజనులు నెఱసుల్
దోఁచినయెడ దిద్దుదు రని
నా చిత్తములోన నమ్మినా ననయంబున్.

అయోధ్యాకాండము—హరికథ.

సంపూర్ణము.

శ్రీ రామచంద్ర గురు పరబ్రహ్మణేనమః

అవిఘ్నమస్తు.

# శ్రీమోక్షగుండరామాయణము

## హరికథ.

## ఆరణ్యకాండము.

---

క. శ్రీరామగుణ కథామృత
సారము జనులారఁ జెవుల నక్తిఁ గ్రోలం
గోరెదు భాగవతాళికి
వారక కావ్యములు కొంగుబంగార మగున్.

వ. అంత శ్రీమద్రామమూర్తికిఁ జిత్రకూటాద్రియందున్న ఋషికాంతలు మంగళహారతులుపాడి రిట్లనిన—

సురట: ఆటతాళము.

మా రఘుకులజాతా! మహీజాసమేతా! జయమంగళం-శుభమంగళం
మారకోటి సుకుమారశరీరా! జయమంగళం శుభమంగళం॥
మానివాఙ్గోచర! మహితతేజ నీకు మంగళం శుభమంగళం॥
మానితకామక్రోధాదిఖండన జయమంగళం శుభమంగళం॥
మండలోజ్వల మోక్షగుండరాఘవ! జయమంగళం, శుభమంగళం॥
మహినారాయణకవి మానసాధీన! జయమంగళం శుభమంగళం॥

వ. అనంతరము శ్రీరామలక్ష్మణు లచటి మునుల వీడ్కొ-కదలి యత్రిమహాముని యాశ్రమంబుఁ బ్రవేశించిరి. అమ్మహర్షి యెదుర్కొని తోడితెచ్చి పూజించె. సంతసించి రాముండిట్లనియె:

తో: వనయాత్రకు రావలసిన నెపమున నినుగనగలిగె మునీంద్రా!
అనయము నేను కృతార్థుడ నయితిని; నను బ్రోవు కృపాసాంద్రా! రా॥

వ. అనిన, నత్త్రిమహాముని యిట్లనియె:

కీర్తన: ఆదితాళము.

కరివరద కామితఫలదా! బ్రోవవే కరివరదా!॥

ధరను నీమాయలో దగులక మెలగగ దరమే యజహరసురల కైన॥ కరివర॥ నను పావనుని జేయగవచ్చిన నీ వనుమాటలు నా కద్భుతములు॥ గరివర॥ నారాయణకవినందిత! సంసారతారక! నే నికధన్యుడనో ॥కరివర॥ వసుధమోతుగుండవాస, దయానిధే, యసురుల బాధలు హరియింపుము॥ కరివర॥

వ. అంత ననసూయాదేవి సీతాదేవిని గని,—

తో: అన్నివిషయముల ననుసరింప దగు నధిపతిని బతివ్రతలు, గ్రన్నన నీ వటు గావించుటకయి కదలి వచ్చితివి మేలు॥రామ॥ చేడియ నీగతిఁ జెలగుచు దాఁ గౌని యాడియు సమ్మానించెన్; వాడని పూలును, మాయని చీరెలు వరభూషలు నర్పించెన్॥రా॥

వ. పిమ్మట రాముండు దండకావనమునకు మార్గముఁ జూప శిష్యులఁ బంపుమన నత్త్రియిట్లనియె:

క. లోకులకుఁ దోవఁ జూపెడు
నీ కెవ్వరు త్రోవ జూప నేర్తురు వేడ్కన్
లోకానుసరణిచే నీ
వీకరణిం గోరితివి పరేశ! యనంతా!

వ. అటులనే బంపెద నని తనశిష్యులలోఁ గొందఱిని బంపె. వారి వెంబడి గదిలి,

రగడనుబోలిన కీర్తన.

దండకాటవికిని వారు దగజొచ్చిరి ధృతిని,
బెబ్బులు లెలుగులుఁ బొబ్బమెకంబులు,
గస్తురిమృగములు ఖడ్గశరభములు,
గండకఖగములు గొండయేనుగులు

సారంగంబులు గారెనుబోతులు,
సవరిమృగంబులును, హయముఖంబులును,
నక్కలు లరణ్యపు నక్కలు దుప్పులు,
జెప్పులబోతులును జెలగుబోతులును,
కోతులగుంపులును గొండముచ్చులును,
దాసరిపాములు నాసరవెల్లులు,
పెనుసింగములును బునుగుపిల్లులును
మహిషములు కమఠములు మొసలులు ఉడుతలు
ఘూకనిచయంబులు గాకులమూకలుఁ
మొదలగు మృగములు పులుగులగుంపులు,
భూతగణంబులు బేతాళంబులు,
బ్రహ్మరాక్షసులు హై హై నార్చుచు,
దిరుగుచు జనులను దిగులొందించెను॥ దండకా॥

వ. ఇట్లు దండకారణ్యంబుఁ జొచ్చి యత్రిశిష్యుల వెనుకకుం బంపియొంటిగా నరణ్యంబునఁ బోవుచుండ,

తో: శూలము భుజమున, సొంపుగ దాల్చి కరాళవక్త్రమును దెఱచి, వాలాయముగా వచ్చువిరాధుఁడు వడి నార్చుచుఁ జేజఱచి ॥రా॥

వ. ధీరులవలె సీతారాములతోఁ గూడ గాఁడడవిలో దూఱిదూఱి వచ్చెదు మీ రెవరు? చరాచరంబులుగూడి వచ్చినను దూరంబున హరింపగల విరాధుండను. బ్రతుకఁ దలఁచిన సీసతిని విడిచి మీ యిరవుల కరుగుఁడు. అనిన రాఘవుండు విరాధుని గనుంగొని,

చ. దశరథరాజసూనుఁడను, దానవ! నాది యయోధ్య; తండ్రిచే
విశదముగాఁగఁ బంపఁబడి వేగమ వచ్చితిఁ గానకున్; భవా
దృశులగు రాక్షసాళిని వధించుటయే పని నాకు; పత్ని యీ
శశిముఖి సీత; యీతఁ డనుజాతుఁడు లక్ష్మణుఁ; డేను రాముఁడన్.

వ. అనిన నతండు బెబ్బులింబోలు నాబొబ్బకు మునులుబ్బు చెడి తబ్బిబ్బయి బాఱుచుండిరి. మీ రన నెంత పంతంబుమీఱతి యింతిం దలుగా మీగొంతులు గోటికి రుధిరంబు గ్రోలుదురా ! నరాధమా!

కమాచ్: ఆదితాళము.

నిలునిలు మోహభావరా ॥నిలు॥ బలిమిని నిను నే బట్టి వధింతును ॥నిలు॥బలము గలిగినన్దలగక నీవునిలు॥నిలు॥మువ్వురి నొకపరి గ్రొవ్వు సెడగ నే నవ్వుచు గైకొని నమలుదు నిక॥ నిలు॥ రాక్షసులకు నరభక్షణ మగు విధి; మోతుగుండవిభుసాక్షిగ గదలక॥ నిలుమో॥

వ. అని ప్రగల్భంబు లాడుచు శూలంబుచే వైచి సీత నెత్తుకొని యాకాశంబున కెగిరిన,

తో: సరగున రాముఁడు శరములు వైచిన, సరకుగొనక పైకెగయ, బరువడి నొకఘనశరమున శూలము విఱుగగ రాముఁడు వ్రేయ॥రాము॥ అంతట సీతను నవని ద్రోయగను నాక్రందనమునరాగ, గాంతుడు రాముడు గరుడాస్త్రంబున గ్రక్కున దించెను బాగ॥ రా॥

వ. అప్పుడు,

గీ. ధరణిజంగొని, యర్ధచంద్రప్రయుక్తి
రాఘవుఁడుగూల్చె దైత్యు విరాధు వాని
ప్రాణతేజము దివ్యవిమాన మెక్కి
చనుచు నిటు లనె రెండుహస్తములుమోడ్చి.

తో: విను రఘువర! నే విద్యాధరుడను! దూర్వాసుడు నన్ను గనలిశపించిన దనుజాకృతమై గడపితి నీక్రియ నేను॥ రామ॥ నీచే జచ్చితి; నిన్ను నెఱింగితి; నీవు పరాత్పరు డగుదు; నీచకృత్యములు నేటికిబోయెను, నేను ముక్తి కిక జనుదు॥ రామ॥

వ. తదనంతరంబ శ్రీరామ-లక్ష్మణులు శరభంగముని యాశ్రమంబున కరిగిన నాతఁడెదు రేగి నమస్కరించి,—

బేహాగ్: అటతాళము.

స్వామి శ్రీరామ! రామచంద్ర నమో॥స్వామి శ్రీరామ॥రామ॥
నీసహితముగ నీమూర్తిని హృత్సనుఁగాంచఁ దపమాచరింతును
॥స్వా॥ నే ధన్యుఁడ నయితీ; నేగడ తేరితి; నేటికి గోరికలు తీఱె॥ స్వామి॥
మోక్షగుండ పురాధ్యక్ష, నారాయణరక్ష, నీపదములు నమ్మితి॥
స్వామి శ్రీరామచం॥

చ. అని కొనియాడి గంధ కుసుమాక్షతలుఁ గొని తెచ్చి పూజనం
బొనరిచి, గందమూలముల నొయ్యన నిచ్చిన నారగించి; రా
వెనుకన దత్సమీప మునిబృందము లెల్లను రామచంద్రుఁగాం
చను శరభంగమౌనియుటజమ్మును దాసెఁగుతూహలమ్మునన్.

తో. రాముఁడు సీతా లక్ష్మణయుతముఁగ నామునులకు మొక్క-
గను, నామోదంబున నందఱు రాముని నర్చించిరి భక్తిగను॥ రామ॥

వ. అప్పుడు.

సిం౦. కాఫి. ఆదితాళము.

తావకదాసులము రామ రామ! భావములను గొల్తుము!
నీవు వైకుంఠపదవు శ్రీదేవియె సీత యగు రామ॥ తావక॥

వరశంఖచక్రములు రామ రామ! భరతశత్రుఘ్నులు; ధర
లక్ష్మణుఁడే శేషుఁడు నగుమను లేనరిఁ బుట్టినవాఁడు రామ రామ॥ తావ॥

రాక్షసులనుగూల్చను రామ, రక్షింప సాధులను, నీక్షితి గలి
గితివి రామ, మోక్షగుండేసుడవై! రామ॥ తావ॥

వ. ఇట్లు పొగడి,

తో: తిమతిమునా నాశ్రమములు సూడగ దనను రమ్మనుచు
బిలువ, ప్రమదంబున జని కరికించను వారు పరమభక్తితో గొలువ॥
అచ్చటచ్చటను నస్థులు శిరములు నగపడ రాముం డనెను; 'నిచ్చ
టెలుపు డివి యొక్కడి' వనగా - నెలమిని వారి ట్లనిరి॥ రామ॥

గీ. రక్కసులు రావణునియాజ్ఞ నుక్కుమిగిలి
పరహితార్థుల నిరపాయకరుల మునుల
పలలముగ మెక్కి పాలివై వంగ బడిన
ప్రోవు లియ్యవి: పుర్రె లెమ్ములు మహాత్మ!
తాపసులరక్ష నీకు వ్రతమ్ముగాదె!

వ. అని వేడిన,

తో. సాధువులను గడుబాధచేయు నసురాధములను బోకుండ నీధర గూల్తును నిక వారలభయ మేమి మీకు లేకుండ॥ రామ॥

వ. అని శపథంబుగా రాముఁడు పలికిన, మునులందఱు డెందాబుల నానందంబు నొందుచు,

ఆర్యావృత్తము.

జయజయ తులసీదామా! జయజయ రవికులసుధాంబునిధి సోమా! జయజయ తారకనామా! జయజయ త్రిజగద్విభో! పరంధామా!

వ. ఇట్లు వారు పొగడుచుండఁ గ్రమంబున వారి యాశ్రమంబులన్నియు జూచుచు సుతీక్ష్ణాశ్రమంబుఁ జేరె. అందు.

తో: రామదివ్య మంత్రంబు జపించెడు నా మునివర్యుడు లేచిఁ రామున కెదురుగ రయమున జని తా నేమముతోఁ దోడ్తెచ్చి॥ రా॥

ఆదితా: (గురుమహారాజ) వలె.

దశరథరామా! దశరథరామా! దైవలలామా!॥ దశరథరామా॥ సరగున నీమంత్రజపమును సలుపగ దరమె! గౌరీతరుణికి నక్కగ॥ దశ॥ నీపదసేవయు నీసుదర్శనము నాపాలిప్తంబున నాకు లభించెను॥ దశ॥ అక్షయ సృష్టివిలక్షణ చిన్మయ! మోక్షగుండపురరక్ష పరాత్పర॥ దశ॥

వ. ఇటుల నుతించిన రామచంద్రుండు —

పంచచామరము.

సుతీక్ష్ణ నామమాత్రమున్ విశుద్ధితో జపించి హృ
ద్గతుండవైన నన్ను భక్తిఁ గాంచి గొల్చుచుందువో!
నతిప్రమోద మయ్యె నాకు సద్ధి చెంతఁ మిచ్చితిన్;
క్షితిన్ జనింప వీకమీఁద సిద్ధమో మునీశ్వరా!

వ. అని పలికి మఱియు,

తో: అరయఁగ మీఁగురు డగు నగస్త్యమునివరుని జూడ బోవ
లెను; బిఱబిఱ మావెరువెంబడి రమ్మని పిలిచికొనుచటు వెడలెను
॥రామ॥

వ. ఇట్లు పోవుచు,

క. సీతారాములగస్త్య
భ్రాతృగృహాంగణము జేరి భక్తిని వాతం
డాతిథ్య మిఁడ్యగొని సం
ప్రీతునిగాఁ జేసి చనిరి ప్రియమున నవలన్.

వ. ఇట్లు యగస్త్యాశ్రమంబు సమీపించి సుతీక్ష్ణునిం గాంచి-

తో: మీఁగురుసను మాయోఁగను వార్త సమీపితముగ నెఱి
గింపన్, వేగమె పొమ్మన వెడలి సుతీక్ష్ణుండు దా గదిలెను రాముం
డంపన్॥

తో: ఆమహిమాశ్రమమందు గురుఁడు శిష్యాళితన్నుఁ గూడన్
సామమునన్ శ్రీరామునుహిమమును శ్రావ్యముగాఁ బాడన్.

గీ. 'అనుఁగుఁదమ్ముఁడు సర్ధాంగి యనుగమింప
వచ్చె మిముఁ జూడనిదె రఘూద్వహుఁడుస్వామి'
యన్న నుప్పొంగి శిష్యసంపన్నుఁడగుచు
స్వాగత మిచ్చె నర్ఘ్యపాద్యముల గురుఁడు.

వ. ఇట్లు చని జానకీలక్ష్మణ యుతంబుగా రాముండు మ్రొక్కిన లేవ నెత్తి యాలింగనంబుఁ జేసికొని పర్ణశాలకు గొనివచ్చి పీఠం బిడి పూజించి ఫలహారంబులు వెట్టి అగస్త్యుడిట్లనియె:

బిలహరి: ఆదితాళము.

అత్యంతసంతోషము భవదాగమనంబు మా॥ కత్యంత॥ శ్రుత్యంతములచేత శోధించిచూచిన నిత్యానందమైననీదివ్యదర్శన॥ మత్యం॥ నీనామమంత్రానుష్ఠానతత్పరులకు మానుగ గోచర మౌ నీదుదర్శన। మత్యంత॥ మోక్షగుండమునను మోహనరూపుతో సాక్షివై నిలిచిన సర్వజ్ఞ మీ రాక॥ యత్యంత॥

క. రాజస సాత్విక తామస
రాజితగుణములను గలిసి బ్రహ్మ హరి శివుల్
గాఁ జనియించియు జగముల
నోజను బుట్టించి పెంచి యుడుపుదు వనఘా.

తో: క్షీరాంభోనిధి జారంబున ఘురు జేరి యజాదులు వేడగ, ఘోరరాక్షసులఁ గూల్ప దలచి యవతార మొందితివి నూడన్॥ రాము॥

క. అప్పటినుండియు దర్శన
మెప్పటి కగునో యటంచు నెదురారయుచున్
దప్పక యీ స్థలమున నే
నొప్పుగఁ దప మాచరించుచుందు ననంతా!

వ. నేటికిఁ బ్రత్యక్షుం డైతివి నా మనోభీష్టంబు దీరె నేను కృతార్థుండ నైతి,

ఉత్సాహ వృత్తము.

గౌతమీతటంబునందుఁ గలుగు పంచవటికి నీ
సీతతోడ జేరు; మది వసింప మంచితా వగున్
బ్రీతితో మునీంద్రు లందు బెక్కురుంద్రు రుచ్యవి
ఖ్యాతమౌ ఫలాదు లచట నలరెడున్ సమృద్ధిగన్.

వ. అని చెప్పి యక్షయతూణీరబాణంబులును ఖడ్గంబులును మహేంద్రచాపంబును నిచ్చి వీడ్కొలిపిన నగస్త్యునకుఁ బునర్వందనంబులు సమర్పించి పంచవటికిఁ బోవుచున్న, నప్పుడు.—

తో: దారినచను కొండనుబోలిన యాకారముతో గనబడిన। శూరుజటాయువుఁ జూచి। నమ్మదిని సోదర్యుని దిచ్చొప్పనెః॥ రా॥ తమ్ముఁడ! లక్ష్మణా! నేనిమ్మ ధనుర్బాణమ్ములు గ్రహించెద నీవి తెమ్మ, నవు డాలించి గృధ్రపతి, యమ్మయిఁ బలికెను బూని॥ రామ॥

కాఫీ: ఏకతాళము.

రామనృపజటాయు వనెడు నామము గలవాఁడ; నీ భూమిపతికి దశరథునకుఁ బోలుపుగ సఖుఁడ॥ రామ॥ ఈ వనంబునందు నేను నెపుడు మెలగెద నో దేవ మీకు హితము నేను దెలుపఁ దొడగెద॥ రామ॥ పంచవటికి బోవుచున్నవారు మీరలు! మించిదనుజులప్పుడపుడు మెలగుచుందురు॥ రామ॥ మోసగుండు దేవ, నీవు మోసపోకుము! యీకుమారి నరసి మేలుమందుము॥ రామ॥

వ. కావున, నేను నధాస్యుఁడగాను, మీ హితంబుఁ గోరువాఁడ ననుఁడు, మన్నించి యనంతరంబున—

మధురగతిరగడ - పల్లవి సహితము.

పంచవటికి జనిరి వారు పంచవటికి జనిరి, కుంద కురంటక కోవిదారములు, చందన తిందుక సాలవృక్షములు, మందారంబులు మామిడిగున్నలుఁ, బొందుగఁ జెలఁగెడు పొగడలుఁ బొన్నలు, మాలూరంబులు మాకందంబులు, దాళంబులు హింతాలచయంబులు, దాడింబులును గదంబవృక్షములు, నాఁడెములగు ఘననారికేళములు, కరక లుసిరికలుఁ గంటకఫలములు, గురువకములు న్యగ్రోధవృక్షములు, శ్రీగంధంబులుఁ జిరుబిల్వంబులు, బాగుగ జాతీఫలభూరుహములు, నౌదుంబరములు నశ్వత్థంబులు, మోదుగ లనఁటులు మొదలగు తరు

వులు, ఫల కిసలయ సుమ భరితము లగుచును, వెలయుచు నుండఁగ, వేగమె కనుచును, శుక పికరవములు సొంపుగ వినుచును, ప్రకటిత సీతా రామలక్ష్మణులు బంచవటికిఁ జనిరి॥

గీ. ఇటుల బంచవటికి నేగి, నిర్మలమైన
తావుఁ జూచి యచట దాశరథులు
పర్ణశాలఁ గట్టి బాగుగఁ బూజించి
యొనర నందుఁ జేరి రుత్సవమున.

వ. ఇట్లు పర్ణశాలయందు నివసించి మునుల సద్గోష్ఠితోఁ గాలక్షేపము చేయుచున్నంత—

సీ. అంతట లక్ష్మణుం డన్నకు వదినెకు
నుపచరించుచు నుండి, యొక్కనాఁడు
ఫలములఁ దేఁ బోయి వనమున దిరుఁగుచోఁ,
నురురుచుల్ దేలెడు నొక్కఖడ్గ
మభిముఖమైరాఁగ నదిగొని యచ్చటి
వెదురుజొంపంబును జిదురుపలుగ
నఱకె; నాచోటఁ దన్మయుఁడగు ముని చచ్చె;
సౌమిత్రి యాముని చావుఁ జూచి

గీ. వెఱచి, మూర్ఛిల్లి తెప్పిరి వెతఁగుడుచుచు
నన్నకడ కేగి నే బ్రహ్మహత్యఁ జేసి
నాఁడ! గతి యేమి యని చరణముల వ్రాలి
వగవ నూరార్చి శ్రీరఘువర్యు డనియె :

త్రో: అచటి మునులఁ గని, యయ్యా! ఇది యెట్లని రాముఁడు ప్రశ్నింప। బ్రిమరంబుగ వారలు స్వామీ! భయపడకు డంచు వారింప॥ రామ॥

వ. శూర్పణఖమగని విద్యుజ్జిహ్వుడను వాని లంకకుఁ గాపుంచి రావణుఁడు దిగ్విజయార్థంబుగాఁ జనినవాఁడు—

గీ. అల్లలంకఁ దాన యపహరింపఁ దలంచి
మాయ నేర్వ నెటకొ పోయె నతఁడు!
రావణుఁడు వచ్చి బావమఱఁది మోస
మెఱిఁగి కనలి వెదుకఁ దఱలె వడిగ.

వ. పాతాళంబున నున్న యతనిఁ జేరి యవక్రవిక్రముండై—

తో: తప్పక యావనితల మనుమాడియు దనపురి జేరెను మఱల; జుప్పనాకతోఁ జెప్పె నీ యిష్టముచొప్పున బొమ్మని యవల ॥ రామ॥

వ. శూర్పణఖ తనయుండు జంబుఁడను వాఁడు దండ్రిపగదీర్పుట కయి సూర్యునిగూర్చి బహుకాలంబుఁ దపంబుఁ జేయుచున్న,—

గీ. తపమునకు మెచ్చి ఖడ్గమున్ దపనుఁడంపె;
తాను రాకయ నినుఁబంపెఁగాన నొల్ల
నంచుఁ గోపించి పొదదూఱి దనుజుఁ డుండె;
నదియ సౌమిత్రిచేఁ బడినట్టి కత్తి.

వ. ఇట్లుపడిన ఖడ్గముఁ బూని మీాతమ్ముఁడు—

తో. వెదురుజొంపమును జిదుమగ జంబునిదు, విగతవదనుఁడై యొఱగె; నది గని ముని యని యదరుచు వచ్చెను ఇది మంచిది వేఁ తిరిగె ॥రామ॥

తోహార: ఈవిధిగానే రావణానులజయించి బ్రోవుమ మ్మనిరి; తావకచిత్తము దయ యుంచం డని తాపసు లెల్లరు జనిరి॥ రామ॥

క. అంతట సీతారాముల
నెంతయుఁ బూజించి ఫలము లిచ్చు యథేచ్ఛన్;
సంతుష్టులఁ గావించుచు
సంతతమును గొల్చుచుండె సౌమిత్రితగన్.

వ. అప్పుడు చుప్పనాక యథాప్రకారము సుతునకు బోనపుటికి గొనివచ్చి ఖండితతనుం డయియున్న కొడుకుంగాంచి దుఃఖించి

యగ్నిసంస్కారంబుఁ జేసి సమీపస్థులయియున్న మునులను గాంచి క్రోధతామ్రాక్షియయి.

బేహాగ్ : ఆదితాళము.

ఓహో పాపాత్ములారా! యిందు ద్రోహో మంచి ద్రోహో॥ సాహసమున నింత ద్రోహము సేసినా రయో॥ మారు లేక యే నా కుమారు జంపినయట్టి పీరు డెవ్వడో వాని పేరు దెల్పుడు నాతో॥ నో॥ మోక్షగుండశౌరి యీక్షణమున వారిపక్షమైనను గాని శిక్ష జేయక మాన॥ నోహో॥

వ. అని కరాళించి పంబుకి లఘించిన శూర్పణఖదెబ్బకుఁ దబ్బిబ్బునొంది జడదారులు వడవడ వడంకుచు,

ద్విపద. అనబోకు మమ్ముల నతివరో యొక్క
ముని కుమారుడు వచ్చి ముదమున వెదరు
జొంపంబు నఱకెడుచో నీసుతుండు
జంపంగ బడియె నాజడదారి పిదప
నాపర్ణశాలకు నరిగెను; నీవు
పోపొమ్ము వానిజంపుట కని పంపె
దీనికృతంబున దెగును రావణుఁడు
మానక గలుగును మనకు సౌఖ్యంబు
లని యుబ్బుచుండిరి యచటితాపసులు;
జనుదెంచె నాపర్ణశాలదగ్గఱకుఁ
జయ్యన నడుగులజాడ వెంబడినిన
నయ్యసురాంగన నప్పుడుగాంచి,

క. నవ్వుచు రాముం డనియెను:
నివ్వనమున కేలవచ్చి? తేందుండువు నీ ?
వెవ్వరిదానవు? తెలుపుము
నివ్వెఱఁగగు మాకు నేఁడు నిన్నుఁ గన్నంతన్.

వ. అనిన శ్రీరాముం డిట్లనియె,—

తో: పరసతిఁ దల్లిగ భావింతును దుర్భరములు నీదుర్భావముల్
సరగున నాయనుజన్మునిలక్ష్మణు సరసకేఁగి గనుమాశల్! ॥రాము॥

అనవిని యా దనుజాంగన సౌమిత్రినిఁగని వలపుల దెలిపెన్
మనమున శ్రీరాముని భావమ్మునుగని యాతండిటు లనియెన్ ॥రాము॥

మత్తకోకిల-నేను వీరికి సేవకుండను నేఁడు నన్ను వరించినన్
జాన నీవును దాసి వౌదువు! చాల సిగ్గులుగల్గెడున్
గాన రాముఁడె నిన్ను నేలను గోరుకొన్నన్ జనుమన్న నా
దానవాంగన రాముఁ జేరి ముదమంబునన్ రతిగోరినన్.

క. ఇద్దఱితోఁ బడఁజాలను;
ముద్దియ లేనట్టివాఁడు ముదితరో యతఁడే
వద్దన్న నేమి! యాతని
యొద్దకె చను మన్నఁ గనలి యుగ్రరవమునన్.

తో; అచ్చటి కిచ్చటి కలయ ద్రిప్పుచును హాస్యము లాడెద
రార చెచ్చెఱ నే నీ సీతను ద్రింగియు జెలగి నిన్ను దమితీఱ ॥రాము॥

తో: కూడుదు ననుచును గూయుచు గదిసిన కూళరక్కసిని
జూచి పోడిమిచెడి యాభూమిజ వడకగ బాసగ లక్ష్మణుడు లేచి॥ రామ॥

ఫరజు—ఆదితాళము.

కోరికను దీర్చెద - రారా వే చెలి॥ కో॥ నీరూపరేఖ నే గని
నంత సారెకు మోహాము మీఱె నే నీకు॥ కో॥ మది నే గందామని
యంటిని గామిని విసువగ గల నటవే నీకు॥ కో॥ మోతుకుండహరి
సాక్షిగ నీపని దీక్షగ నిప్పుడె తీర్చెదనే చెలి॥ కో॥

వ. అనిన విని కోపంబు విడిచి యానందంబున సౌమిత్రిని డగ్గ
ఱిన రామునానతిఁ గైకొని లక్ష్మణుండు—

తో: కరమున ఖడ్గము బిఱబిఱ దాలిచి కదియ జేరి కడు
నలుకన్, కఱకఱ నాసా కర్ణంబులుదెగ్గ్రనతికెనురక్తమ్ములుకన్ ॥ రా॥

వ. ఇట్లు ముక్కు చెవులుం దుదముట్ట గోసిన, రక్తంబేఱులై పాఱ, సిగ్గును దుఃఖంబును దనను ముంప శూర్పణఖ శీఘ్రయానంబున ఖరాసురుని యాస్థానంబునకుం జనిన, నవ్వికృతాకారంబుఁజూచి, ఖరాసురుండు—

క. నీ కీయవస్థ వచ్చుట
కేకారణ మమ్మ నాకు నెఱిఁగింపఁ దగున్;
శోకింపకు నే నిప్పుడె
లోకేశుల నైన క్షణములోన జయింతున్.

వ. అనిన, శూర్పణఖ యన్ననుగాంచి—

తో: రాముం డను నొక రాజకుమారుడు భీమబలుఁడు తమ్ముని తోఁ భామామణితో వచ్చి గౌతమీసామీప్యంబున ధృతితో ॥రా॥ నెమ్మది నుండగ నే జని వఁచిన సమ్మతి జూపక నేఁడు తమ్మునిచే కర్ణమ్ములు ముక్కును దఱిగించెను నన్ను మామా॥ రాము।

వ. అనిన, ఖరాసురుం డదరిపడి లేచి దూషణ త్రిశిరులు వెంట రాఁ జతుర్దశ సహస్రపరిమిత రాక్షసబలంబులఁ గూడుకొని కదలె. ఆ చప్పుడుప్పరంబు నిండి మెండుకొని దిగంతంబులు ప్రతిధ్వను లియ్యనది విని రాఘవుం డనుజుని జూచి,—

ఉ. రాక్షసకాంత పంపున దురంతకదానవు లొక్కపెట్టునన్
లక్షకొలంది వత్తురదె లక్ష్మణ, చూచితె! నేను వారలన్
శిక్ష యొనర్తు నంతకును సీతను నొక్క గుహాంతరాళమం
దీక్షణ ముంచి పోవు మిఁక నేగు మటంచును బంపి పిమ్మటన్.

వ. కోదండరాముం డఖండ ప్రచండ మార్తాండ సదృశకాండంబులు తండోపతండంబులుగాఁ గోదండంబున నంకించి యెదురు చూచుచున్నంతఁ దక్షిణంబున రాక్షసదళంబులు చుట్టుముట్టి,—

తో: కొట్టుడు తిట్టుడు పట్టుడు ముట్టుడు కోయుడు త్రోయుం డనుచు, నట్టహాసమున నసురులు తరు-శిల లంబులు వైచిరి తఱచు ॥రామ॥

వ. అప్పుడు,

తో. బాణపరంపర, బఱపి రాఘవుండు పటుతరసేనల నెల్ల, ప్రాణంబుల కెడబాపి నిముసమునఁ బరమమునులు రంజిల్ల ॥ రా॥

వ. అంత ఖరాసురుని యానతిఁ జిత్తంబునఁ గొని దూషణుండు భీషణంబుగాఁ జని,

కమాను: ఆదితాళము.

నీ వన నెంతరా! నరాధమా నాకు॥ నీ వన॥ కావరమా తీవ రమా చేవ చెడ బ్రేవులు ప్రోవులుగా విదలించెద॥ నీ వన॥ మానవులా దానవుల బూని రణక్షోణిఁ జయింపగ మానుము మానుము ॥ నీవన॥ కండలును గుండెలును జెండెదను దండిగ। శ్రీమోతుగుండ విభుని యాన॥ నీ వన।

వ. అని ప్రగల్భంబు లాడి కొన్ని శరంబుల ముంచి మహాట్ట హాసంబుఁ జేసిన నవ్వి శ్రీరాముం డిట్లనియె:

తో: నీవారలగతి నీ వెఱిఁగియు నిటు నీ వేటికి బ్రేలెదవు। చావు మూడి యిచ్చటికి వచ్చితివి గావున నిటు గూసెదవు॥ రామ॥

తో: మంచి దుండు మని మహనీయాస్త్రము మించి యు రంబును గాడ, నంచితముగ వేయంగ నవనిఁ బడి, యతఁడు నీల్గె నపుడాడ॥ రామ॥

క. పిమ్మటఁ ద్రిశిరుం డతి కో
పమ్మునఁ జనుదెంచి యోర బలవంతుఁడ వే!
రమ్మా నాయెదుటికి బీ
ర మ్మెల్లను గాంతు నని శరమ్ములు వైచెన్.

వ. నిర్వక్రపరాక్రమంబుగల శక్రద్వేషులు పెక్కండ్రు లెక్కకు మిక్కుటంబుగాఁ బిక్కటిల్లుచు నాచక్కికి వచ్చిన నొక్కొక్కరిని ముక్కలు ముక్కలుగా జెక్కి చిక్కు వాపినాఁడ ఎక్కడనో డాగియుండి యిప్పు డోకసుండ యిక్కడికి గ్రక్కున వచ్చితివి. తక్కక నీడొక్కఁజీల్చెద. నీకు ది క్కెవ్వఁడుంచురా దానవా! ఇదివఱకు నా ప్రతాపముఁ గానవా!

తో: అని యొకఘనశరమును సంధించియు నతిభీకరమున వేయు మనుకొని యాతనిమూఁడుశిరంబులు, దునిసి పడియె నాచాయ॥ రామ॥

వ. అంత ఖరాసురుండు కోపోద్దీపితుండై యెదిరించి వచ్చినఁ గాంచి, రాముఁడు—

పూరికల్యాణి: ఏకతాళము.

ఓరి దానవా, పోరగ మానవా! చేర వచ్చినావా! యూరక జనవా! ॥ఓ॥ మున్ను పోరి, మున్నుగూరి మృత్యువై యున్నవారి గన్న ఖ్యాతిపోక యేమన్న దీరి దన్ను మీఁటి మునికిని నన్ను జేరినన్ను జేరితివి॥ యోరి॥ దండి మోక్షగుండురక్షకుండ నైన నుండు కక్ష జంప రాక్షసుల నిలజెంపు దీక్ష నోంపుదీక్ష నెడపను; నుంపు రూక్ష నిండ శిక్షయగు॥ నోరిదాన॥

వ. అనిన ఖరాసురుం డిట్లనియె: దిట్టతనంబున లోకాధికుండగు రావణు తోఁబుట్టువు మొక్కట్టుమాటకై వచ్చిన నట్టహాసంబున నట్టియుపకారం బప్పట్టున గట్టిగ నొనర్చితివి! కట్టా యిట్టి చెట్టవాని నెట్టు సహింపఁ దగు. దెబ్బవగల మగవాని సంయున బిగువుతప్పక జగడంబునకుఁ దగులు పడుము. నే మగువను గాను. నీపొగరు దిగురఁ జేసెదఁ దుడువా! నాయెదుట నిలువగలవా! అని పలికి కలకులుమ్ములు పెక్కులువైచిన, సొలయక రాముండు—

పంచచామరము.

వృథాభిమానమైన పల్కు విఱ్ఱవీఁగి పల్కఁగన్
బథంబుగాదు; నీవు మేటి బంటవైన నిల్వరా
మథింతు నీకుమర్మముల్! ప్రగల్భంబునన్ రణోర్విలో
వధింతు నీశిరంబు నేడు వ్రయ్యువ్రయ్యలై పడన్!

వ. ఇట్లు పలికి యొక్క యమోఘాస్త్రంబు ధనువున సంధించి,

తో: ఆకర్ణాంతము లాగి విడువగను నది చని యాతని శిరము,
బాహ్యకటముగ నిలపైన గూల్చె సురవరులు మే లనఁగఁ గరము॥ రామ॥

వ. ఇట్లు ఖరాసురాది రాక్షసుల నిశ్శేషముగ వధించినపిమ్మట సీతాలక్ష్మణులు గుహాలోనుండి వచ్చి; నిహతులయిన రాక్షసుల గని యాశ్చర్యంబునొంది, రాముని నుపచరించి యిష్టగోష్ఠిగా నుండిరి.

తో: అంతశూర్పణఖ యాక్రందించుచు నపుడు లంకకును
నరిగె; సంతోషంబున సభకు జేరి రాక్షసపతిపదముల కెఱఁగె॥ రామ॥

వ. అప్పుడు రావణుండు దాని వికృతాకారంబుఁ జూచి,

బేహాగ్ : ఆదితాళము

అపకార మెవ్వరు చేసిరమ్మ! వారిపేరు జెప్పుము విందు కొమ్మ! ఈతీరున దుఃఖపడకమ్మ! నారి వారిఁ బోరి చంపుదు॥ నపకార॥ ఆఖండలాదులు వచ్చినారా! మోక్షగుండ హరి పంపినట్టి వారా! పౌలసుదింపు వేరడ్డపడరైరా! తుండెములుగ జెండినేసెద॥ నపకార॥

వ. అనవుడు, చుప్పనాతి యిట్లనియె:

క. మునివేషధారి రాముం
డను రాజకుమారుఁ డొక్కఁ డతివయు దమ్ముం
డనుచరులై తనుఁగొలువఁగ
జనుదెంచెను బంచవటికి సరభసలీలన్.

క. ఆతని యిల్లాలగు నా
సీతాసతి చక్కఁదనముఁ జెప్పం దరమే!

భూతలమున నాకంబునఁ
బాతాళమునందునైనఁ బ్రతి లేరుసుమీ!

బేహాగ్: ఆదితాళము.

ఆ సుందరి యందమే యందమండు! జగమందు నెందుఁగాన నా పసందు॥ ఆ సుందరి॥ మాటలచే మరుని ఘోటి నేలు! నెఱసీటు గల్గు వాల్ చూపులు మీలు! జిగి తేటలలయిన చెక్కు లద్దములు! దాని తోటి పొందే చేయు వేనవేలు! మరుని ఘోటి నేలు; వాల్ చూపులు మీలు-, ఆచెక్కుటద్దములు పొందే చేయు వేనవేలు॥ ఆసుందరి॥ కొండ లాసిబ్బెపుజనులతీరు! వేదండము తిన్ననినడకసౌరు ! మోక్షుగుండ శ్రీనాథుని సతినిమీఱు! బ్రహ్మాండములో దానికి సరి లేరు! సిబ్బెపుజనులతీరు; తిన్ననినడకపౌరు; శ్రీనాథుని సతి మీరు నలదానికి సరిలేరు॥ ఆ॥

తో: దాని నీకుఁ దేఁ బూని నేను జనఁగానే, తమ్ముని చేత నా నాసాకర్ణములఁ గోయించెను । నే నెటు లుందును భ్రాతా॥ రా॥

వ అంతఁ జింతాక్రాంతురాలనయి చని ఖరాసురుని యుద్ధఁ బునకుఁ బంపిన ఖరదూషణ త్రిశిరాది చతుర్దశ సహస్ర రాక్షసదళం బుల నొక్కండ విదళించె. వీర ననేల? జతుర్దశభువనము లెత్తివచ్చిన నమ్మహనీయునకు లక్ష్యమా ! రావణా! లోకవిద్రావణా!

కేదారిగౌళ: ఆదితాళము.

నిశాటకులవర్యా ! విను మిక॥ నిశాట॥ విశేషముగ నే విపరిం చెద విను॥ నిశాట॥ సీత లోకవిఖ్యాత రూపవతి; భూతలమున నీకే తగును, బ్రీతిగ నది యబ్బిన జాలును విను॥ నిశా॥ మోక్షుగుండ హరి పక్ష మేమొ కాని, రాక్షసవరులను శిక్షించె నీ క్షణమున నీ విద్ధి యొఱుంగుము॥ నిశాట॥

వ. అనిన మంచిదని చెల్లెలి నూరార్చి యింటిలోని కనిపి రావణుం డారాత్రి కాలోచిత కృత్యంబులు దీర్చి శయనించి కంటఁ గూరుకు రామిఁ దన మనంబున.—

తో: రాము డెవ్వరో రాగ గారణం బేమి గౌత మీాదరికి ? ఆ మానవు డీయసురుల జంపుట కేమికార్యమాతనికి॥ రామ॥ మానవులకు నీ మహిమ గలుగ సామాన్యమె యోజింపగను దానవకుల విధ్వంసము హరి యవతార మెత్తె నేమోను॥ రామ॥

క. కావున నాతని చేతను
జావిక సిద్ధంబు నాకు: సరి యటు లయినన్
ఆ వైకుంఠుం బలవడు;
నే వెరవుననైన దీని నెరుగంగఁదగున్.

వ. అని నిశ్చయించి ప్రభాతంబున రథారోహణంబు సేసి మారీచుని గృహంబున కరిగె. అప్పు డతండు మునిఁబోలి సమాధినిష్ఠుండయి పరాత్పరుని హృత్కమలంబునఁ గాంచుచు,

కీర్తన—రూపకతాళము.

పరమాత్మా ! పరమేశా! పరమానందస్వరూపా॥ గురుతర సహస్రారస్థిత గురుయసురుచిరదీపా॥ పర॥ నీలాంతర్లీలా మునిజాల సుహృత్ఖేలాసురలోలా శ్రీమోతుగుండపాలా రవిఫాలావర ॥ పర॥

వ. ఇట్లు నిశ్చలత్వంబున నీశ్వరారాధనంబుఁ జేయుచు మారీచుండు గన్నులు దెఱచి రావణుంజూచి సత్కరించి యిట్లనియె:

తోహర: ఏమిపనికి నీ విచటికి వచ్చితి వెఱిగింపుము దను జేంద్రా! శ్రీమీఱగ నేఁ జేయ గల్గినను జేయుదు గరుణాసాంద్రా॥

సీ. అనవుఁడు రావణుం డనియె: 'నో మారీచ !
తరణివంశజుఁ డయోధ్యావిభుండు
నగు దశరథునకు నాత్మజుం డగు రాముఁ
డనుజుండు భార్యయు ననుసరించి

చనుదేరఁ: దం(డియాజ్ఞను వచ్చి యాపంచ
వటియందు నిలిచి తీవ్రింబుగాఁగ
ఖరముఖ్యులను జంపి కడువడి మనశూర్ప
ణఖ ముక్కు సెవులును నఱికివైచెఁ;

గీ. గాన నాతనిసతిని దేఁ బూనినాఁడ;
నీవు మాయామృగంబవై నేఁడు పోయి
రాముఁ గొనిపొమ్ము మిగులదూరమున కంత
సీతఁ గొనివచ్చి లంకకుఁ జేర్తు నేను.

వ. అనిన నప్పుడు మారీచుండు (మ్రుళ్ళిపడి,—

శంకరాభరణము—ఆదితాళము.

అబ్బబ్బా! రామునిచేత దెబ్బ తిన్న వాడను! నిబ్బరము చాలదు మాయబ్బతోడు చాలును॥ అబ్బ॥ పిన్ననాడే వార్ధిబడ (వేసె బాణమునను! నన్నిప్పుడు బ్రతుకనిచ్చునా నామది మఱవను॥ అబ్బ॥ మోక్షగుండశౌరి యతడు మునిజన సమ్మతుడు! నీక్షితి నెగ్గాచరించి యెవరు (బతుక నేర్తురు॥ అబ్బ॥

తో: తర్వాతను నేదండకవనమున దగ నాతం డుండగను, బూర్వవైరమున బులిరూపంబునఁ బోయి తగిలితిని నేను॥ రా॥ తీవరమున నొకదివ్యశరంబును వైవ దప్పిపోగాను, జావు దప్పి నే సరగవచ్చి యిచ్చట మునినై యున్నాను॥ రా॥

క. రాముం డన, రత్నం బన,
రామామణి యన్నరవము రా జని యన్నన్,
రా మొదలను గలిగిన యా
నామంబులు విన్నఁ (గన్ననన్ భయపడుదున్.

వ. అవియునుంగాక యొక్కవిశేషంబు వివరించెద.

క. రాక్షసకులంబు నెల్లను
శిక్షింపఁగఁ బూని యతఁడు చెలగు నయోధ్యా

సుక్షేత్రంబునఁ బొడమిన
సాక్షాన్నారాయణుండు సర్వజ్ఞుఁ డగున్.

తో: కావున నాతనితో వైరంబుఁ జాలొందవును మనకెల్ల! దేవదేవు డని తెలిసి భక్తితో సేవించుట కడుమెల్ల॥ రా॥

వ. అని పలికిన మారీచుని యాధైర్యవచనంబులు విని రావణాసురుం డిట్లనియె:

బేగడరాగము:ఆదితాళము.

భయపడ నిదేటికి వేసుర॥భయ॥ నయముతొ నీవేళ నామాట మీఱకు॥ భయ॥ రాము డాపరంధాముడు చానైన నేమి వానిచే జచ్చితే ముక్తిగల్గును॥ భయ॥ నేను జయించితే వానియిల్లాలితో మానని సుఖములు మానుగ బొందుదు॥భయ॥ మోక్షగుండరఘుమూర్తి నేనురించి యీక్షణమున నేను నిలసుతఁ దెత్తును॥ భయపడ॥

తో: పొమ్మ్ము శీఘ్రమున బో సని యంటె పోరిగొందును నిన్ననగక, నెమ్మది హరిచే నీల్గుట మేలని సమ్మతించె దాఁ జనగక ॥రామ॥

వ. ఈపర్యాయము రాముని చేత నిశ్చయంబుగా మరణంబు గలుగునని తలంచి మారీచుండు రావణునిరథం బెక్కి యిరువురును మహావేగంబున బంచవటికి సరిగి రాముని పర్ణశాలను సమీపించిన నంత—

క. కాంచనవర్ణము, రజతన
మంచితమగు పొడలు, నీల మగునేత్రంబుల్,
మించుగ రత్నపుఁగొమ్ములు,
గాంచనమణి ఖురము లమరఁగా మృగమయ్యెన్.

వ. ఇట్లు మారీచుండు విచిత్రమైన యొకమాయలేడి యాకారంబు ధరించి పర్ణశాలచేరువకు రాఁగా గాంచి రాముండు సీత కిట్లనియె:

వ. ఇవ్విధంబున మోసంబు జేయుచుఁ జాలదూరంబు త్రిప్పిన
నది రాక్షసమాయగా నిశ్చయించి రాముండు కోపోద్దీపితుండై—

తో: చాలగ బ్రహ్మాస్త్రంబున మాయలు దూలవేయ నసు
రుండు, 'హాలక్ష్మణ!' యను నార్తారవమునఁ గూలె నవనిపై
నతడు॥ రామ॥

వ. ఇట్లు మారీచుండు గూలిన నతని తేజంబు పరాత్పరుండ
యిన రాముని యందుఁ గలిసె. అంత నాధ్వని విని సీతాదేవి భయా
కులిత చిత్తయై లక్ష్మణునిఁ జూచి,

హిం—తోడి: రూపకము.

పొమ్మా లక్ష్మణా! లే లెమ్మా లక్ష్మణా! నెన్నది రాముండు
పిలిచె నిన్నులక్ష్మణా!॥ పొమ్మా॥ ఏల పిలిచెనో ! చిక్కు లేమి గలి
గెనో! జాల మేల జేసెదవు చాలు లక్ష్మణా!॥ పొమ్మా॥ రాక్షసాళుల
చేత రాపుకలిగెనో! మోక్షగుండ శౌరి కయిన మొక్కు లక్ష్మణా
॥ పొమ్మా॥

వ. అను దీనాలాపంబులు విని లక్ష్మణుండు—

క. మారీచుఁడు మాయామృగ
ధారుండై వచ్చె నతని దఱుముచుఁ జని యా
శ్రీరాముఁడు చంపుటచేఁ
బేరెలుఁగున రాము నట్లు పిలిచెను నన్నున్.

తో: వాడు గాడు త్రిభువనములు పైఁబడి వచ్చిన భయమే
మమ్మా! కూడముట్టియును గూల్చుడె గడియలో। కొఱుఁవ లుండునే
యమ్మా॥ న న్నిచ్చట నుండ మనిచెప్పెఁ జనినను నాపయి గోపించు;
నన్ను యాజ్ఞ లేదు రాడ జాల నత డతివేగమె యేతెంచు॥ రామ॥

వ. అటువెనుక సీతాదేవి యత్యంతసంతాప కోపంబులు వ్యాపింప
మఱిదిని గాంచి,

స్రగ్వి. రాముఁ డాలీలఁ జీరంగ నాలింపకే
తామసంబేల ఖేదంబునుం జెందవా!
రాముఁ డిచ్చోటికిన్ రాకయున్నంత నన్
క్షేమ మం చీవు దక్కించుకోఁ జూతువా!

వ. దండకారణ్యంబుననుండఁగోదండరాముని బొమ్మని భూమండలంబుఁ దా నొక్కండ నేల భరతుండు గాంక్షించె. రాముని క్షేమంబుఁ గామింపక నామీఁది ప్రేమాతిశయంబుచేత ఈమాడ్కి యుపేక్షించి యున్నవాఁడవు. అన్న మేలు గన్నులఁ గనలేని మీయిద్దఱి సుద్ది బుద్ధికిఁ దద్దయుం దోఁచె; నీకేల యింతదుర్బుద్ధి! నాప్రతిజ్ఞ వినుము!

తో: గోదావరిలోఁ గూలి ప్రాణములు గోల్పోవుదుగా నికను; నేదక్కను నే నీకు! భరతునకు నే దని యేడువగాను॥ రామ॥
చేతులతో దన చెవులుమూసికొని, చింతాక్రాంతుం డగుచు; 'నోతల్లీ! నేఁ బోయెద రాముం డుండెడి చోటికి ననుచు॥ రామ॥

క. వనదేవతలారా! యీ
జనకజఁ గాపాడరయ్య! చనియెద నింకన్
నను దూలనాడె నీమెయుఁ!
గన నామెడఁ దప్పులేదు కంటిరిగాదే!

వ. అని యొప్పగించి దుఃఖించు మెల్లమెల్లగా నడచుచు రామ సహాయార్థంబుగాఁ జనియె: అంత నది తరుణంబుగా నెంచి యాంప్రాంతముల దాగియుండిన రావణుండు దండకమండలువులం ధరించి భిక్షుక వేషంబునఁ బర్ణశాలదగ్గరిన నతెసి యాంథార్థమునిగా భావించి సీతాసలి పర్ణశాలదాఁటి వచ్చి మహాపనయంబునఁ బూజించి,

తో: కందమూలములు ఘనముగనిడి భక్షణజేయుడు ముని వర్యా! అందముగా నాయధిపుడు వచ్చెదు నంతకుండు డో యార్యా॥ రా॥

వ. అనిన, భిక్షుక వేష ధారియిట్లనియె:

తో: ఎవ్వరు నీపతి యెఱిగింపుము సతి యిది రాక్షస సంవృతము; ఇవ్వనవాసం బేటికి గలిగెను నెవరు పంపి రన వినుము॥ రా॥

కాఫీః అటతాళము.

జానకి నాపేరు; జనకునికూతుర; మానుగ నయోధ్య మావి; శ్రీరాముడు నానాథుఁ డగు వినుు; నామరది లక్ష్మణు డౌను; దశరథుడె యగును మామామ॥ జానకి॥ తండ్రి పంపగ నన్ను దమ్మునితోడ్కొని దండకమునకు నాధవుఁ డరుదెంచెను దండిగ నొకపని యుండి పోయిరివార; లుండు డందాక మోతుకుండేశు దలంచుచు॥జా

వ. అనిన నతండు,

రావ-తోహార: లంకాధిపు డను, రావణుడను పౌలస్త్యసుతుడ; శూరుడను; బొంకముగా గొని పోదు నిన్ను మాపురికి వలచి యున్నాను॥ రా॥

క. మునివేషధారియగు రా
మునివీఁక విడనాడి నన్ను మోహింపుము; నీ
కనుకూలమైన సుఖములఁ
దనిపెద; వనవాసబాధ తలగును లలనా!

వ. అనువాక్యంబులు గర్ణశూలంబులయిన సీతయుల్లంబున భీతిల్లుచు.

కీర్తన: అటతాళము.

రణరంగశూరుడు రఘురాజకుల శేఖరుడు బ్రిణతార్తిభంజనుడగు రాము నెఱుగవు నీవు॥ రణ॥న న్ననరాని మాట లన్న నిక ఫలమేమి! నిన్ను నొక్కబాణమున నేడు ధరగూల్చు జూడు॥ రణ॥ ఉండు మిసుమంత మోతుకుండవిభు డే తెంచు వేదండమశకము లనఁ దగును నిన్నునతని॥ రణ॥

వ. అంతట—

వ. ఐన నమ్మహానీయుని సేవకుండగు నే నుండ, నీపుండరీకాక్షి కేమిభయము! మదీయతుండాగ్రముననీకండలు తుంటెములుజేసి యెండ వేయుదు! గుండెగల దండిమగండ వైన నుండుమురా! రండా నిలువగలవా! నాదండ నని రాక్షసుని నాక్షేపించి తత్క్షణంబునఁ దనపక్షయుగ్మంబు విసరి పైకెగసి తుండంబునం బొడిచి,

తో: రథము దుల్చి, గుఱ్ఱములగూల్చి, చూర్ణము గావించెను ధనువు, పృథుకోపంబున బిట్టుదాకి నొప్పించెను రావణుతనువు॥ రా॥

వ ఇట్లు విరథుండయి రావణుండు రోషానలంబు జాజ్వల్యమానంబుగా మండుచుండ,

తో: ఒక్కఖడ్గమున నొనర జటాయువు ఱెక్కలు గాళ్లను విఱుగ, గ్రుక్కినగ్రక్కున బక్కిఱేడు దా నృక్కిధరణిపైనొఱుగ॥ రా॥

క. మఱియొక రథమున సీతను
నురవడి నెక్కించుకొని మహోద్ధతి మింటం
బఱచుచు నుండగ మదిలోఁ
బురపురఁ బొక్కుచును వగచెఁ బొలఁతుక యంతన్.

సీత: హిందూస్తాని-రూపకతాళము.

ప్రాణనాథు డున్న వీ డీపాటు పడునా! ప్రాణములతో వీని నవలబాఱ నిచ్చునా!॥ ప్రాణ॥ జనకునిపుత్త్రినై దశరథుని కోడలనై యనయము కష్టము లొంద నాయెఁ బుడమిపై॥ ప్రాణ॥ పతిని బాసి దనుజునకును పట్టుపడగను, బ్రతిలేక విధాత నుదుటవ్రాసెగా బోలును ॥ప్రాణ॥ శ్రీమోక్షగుండేశుడైన శ్రీరామునకు నామాట నెఱిగించెడి పుణ్యాత్ము లెవ్వరో! ॥ప్రాణనాథు॥

వ. శ్రీరాముని కీపోబడి సూచించువఱకు నీజటాయువు జీవితుండయి యుండుగాక యని మనోవీథి నుద్దేశించి, మఱియు;

సుమిత్రాకుమారా! హా మహాధీరా!
లలోకములలోనా దోస మన కట్టిమాట
కాసుతో జూడకన్న! నికను మన్నింపుమన్న॥
లపించుచుండ రామలక్ష్మణులు వెంబడించి
చేత లంకాధిపుండు వాయువేగంబున వియ
చుచుం బోవుచుంటె జానకి యగ్గో ముఖ యులు

తు గిరిప్రదేశమ్మునఁ
గురు కపీంద్రు;
యందు సొమ్ములు మూటఁ
ట నట్టివైచె.
వార్త శ్రీరామున కెఱింగింపరా! యని సీతా
రి యెదుటఁ బడవైచె; నంత—
టి రయంబున లంకకు నసురేంద్రుఁడు చను
గడిమి నశోకవనంబులోపలను నుంచెఁ॥ రా॥
జట లోనగు రాక్షసాంగనలఁ బెక్కండ్రఁ

సీతకు
చి యెటుల నైనను నన్నునే
నటు న
నుచు మాటిమాటికిఁ దెలిపెఁ.
మన నాజ్ఞాపించి రాక్షసుఁడు యథార్థ రీతిగా
ుఁ జేయుచుండె. ఇక్కడ శ్రీరాముండు—
డును మాడి పర్ణశాలఁ జేర వచ్చుచుండగను,
దురపడఁ దమ్ముని గని యిట్లనెను॥ రామ॥

శంకరాభరణము: ఆదితాళము.

సుందరి నొంటిగ నందుంచి యిచటికి నెందుకు వచ్చితి వెఱిగింపు లక్ష్మణ॥ సుం॥ మనమీద గన రూపి దనుజులు సరుదెంచి వనితను నేమేమి వంత నొందింతురో॥ సుంద॥ నీమోము వాడినదేమో చింతించెదవు శ్రీమోక్షగుండేశుఁ డేమికావించునో! ॥సుంద॥

వ. అనిన లక్ష్మణుండు విన్నఁబోయిన మొగంబుతో నన్నకు నమస్కరించి,

శా. మారీచుం డిలఁ గూలుకాలమున రామా నీవలెన్ నన్ను దా
జీరెన్, నీవని యెంచి తోడుపడఁగా సీతమ్మపొమ్మన్న నో
నారీ! రాక్షసమాయలంచుఁ దెలుపన్ నా మాట లాలింపకే
దూరెన్ మిక్కిలి; నెమ్మది న్నపుడనన్ దూషించుచున్ వచ్చితిన్.

వ. అని తెలిపి యన్న పదంబులపయిఁ వ్రాలి,

క. 'నా వలన దప్పులే దిఁక
నా వనదేవతలె సాక్షి; యన్నయ్యా! నీ
సేవకుఁడ నన్ను దయతోఁ
గావు' మనుచు దుఃఖపడఁగఁ గరుణాన్వితుఁడై.

వ. లక్ష్మణు నూరార్చి లేవనెత్తి దేహంబు నిమిరి,

తో: తరుణిమాటలకుఁ దందర నొందుచుఁ దమ్ముడ నీవు రానేల! సరగున బోదము చాన చెంత నెవ్వరు లే రొక్క తే బాల ॥రామ॥

వ. అని యోజించుచుఁ దమ్ముని దోడ్కొని శీఘ్రయానమ్మున వచ్చి పర్ణశాలఁ జేరి యరసిన నందు సీత లేకుండినఁ దల్లడించుచుమూర్ఛపోయి కొంతవడికిఁ దెలిసి దిక్కులు పాఱఁ జూచి శోకావేశంబున—

తోడి: ఆదితాళము.

ఇక నేమి చేయుదు! నిక నెందు జూతును! అకట విధి నాదు ప్రియునను బాపెను॥ నిక॥ ఎవరు వచ్చినారో! యెవరు గొంపోయిరో!

వివరించనట్టివార లెవరును గనరారు!॥ ఇక॥ భువి మోక్షగుండధవు డనై యున్నను, నవిరళసుఖముఖ మనుభవింపగ బోనా! ॥ఇక నేమి॥

సీ. నినుఁ గూడి విహరింప వనవాస మాయాస
ముగ, దోఁపదాయెనే! ముద్దుగుమ్మ!
నినుఁ గూడి భుజియింప నవిఁ గందమూలముల్
షడ్రసోపేతమే సారసాక్షి!
నినుఁగూడి శయనింపఁ గను గుశాస్తరణంబు
హంసతూలిక పాన్పె యబ్జపాణి!
నినుఁగూడి వసియింప దినములు గడియలై
వడిఁ బర్వులిడియెనే ధన్యవాణి!

గీ. కంటగింపుమ మాయామృగంబు రీతి
వచ్చి మాటిమఁ జెడఁజూపె వనిత మసల!
నాదుతలవ్రాత యెంతహీనతకుఁ దెచ్చె!
నింక నొంటిగ నెటు చరియింతు నిచట!

వ. ఇట్లు దుఃఖించుచు సౌమిత్రిని గౌఁగిలించుకొని;

తే-రాగము: సమ్మి నావెంట వచ్చె నట్టడవిలోనఁ జొచ్చె దమ్ముడా! యెచట లేను తరుణి గానంగరాదు! సౌమ్మసిలె మేను చాల శోకమార్పంగఁ జాలా! నెమ్మదిని దెలియనైతి నెలతుకను గోలుబడితి!

వ. రాముఁ డిటుల శోకించుచుండ లక్ష్మణుండును గొంతవడికిఁ జింతించి పిమ్మట ధైర్యం బవలంబించి యిట్లనియె:

క. జగములు నీలో నుండును;
జగములలో నుండు వీవు; సర్వజ్ఞ! హరీ!
యగుణుండవయ్యుఁ బ్రకృతిని
దగులుటచే నొదవె శోకదైన్యాదు లొగిన్.

ల- తో: అజ్ఞానులవలె నడల నేల! మీయాజ్ఞపాదపనిగాదు యాజ్ఞోల్లంఘన మాచరించి యెవరాడు పంతిలను లేరు॥ రామ॥

వ. ఇట్లు కొనియాడి యతండుఁ బురంబునకుఁ జనియె. ఇక్కడ వీరు సీతాన్వేషణంబుఁ జేయుచు దక్షిణాభి ముఖులయి పోవుచు,

రాముడు-యదుకులకాంభోజి: అటతాళము.

శ్రీకంఠువిల్లు నే నీకొఱకై విఱిచి చేకొంటిఁగదె! జానకీ॥ జా॥ ననుఁబాయజాలక నావెంట వచ్చిన నిను గోల్పోయితి జానకీ!॥ జాన॥ గొప్పయింట బుట్టి గొప్పయింటఁజొచ్చి తిప్ప లొందవెనె! జానకీ॥ జా॥ ఆపద లనితోపవామెఁగూడ నీ వున్నంకుచేతను జానకీ॥ జాన॥ శ్రీమోతుగుండశౌరిని నే నై యుండి ని న్నేమఱితిని జానకీ॥ జాన॥

వ. ఇట్లు మాటిమాటికిఁ దలఁచుకొని దుఃఖించుచు ధైర్యంబు నొందుచుఁ బోవునెడ నొక్కచో వికృతాకారంబున వచ్చి తనుఁ గూడుమని లక్ష్మణుని వేఁడిన, నయోముఖికి నసిధారచేతఁ జుప్పనాతి కంటె గొప్పసౌఖ్యంబు లిచ్చి చనుచున్న, నొక్కచోట—

సీ. ఉదరంబు నోరును నొకటిగా నొప్పియుఁ
బాదముల్ శిరము జూపడఁగ లేక,
యోజనాయత మగు నురుబాహువులు గల్గి
యేది చిక్కినను బోనీక దినుచు
నున్నకబంధుని యురుభుజమ్ముల మధ్య
రామలక్ష్మణులు దిరముగఁ జిక్క,
'యన్న, నే వీనికి నాహార మయ్యెద;
నీవు సీతను జూడఁ నేఁగు' మనుచుఁ,
గీ. దమ్ముఁ డన, రాఘవుఁడు విచారమ్ము నొంది,
ఖడ్గమున వానిదక్షిణఘనభుజంబు
దెగించె; వామభుజంబు ఖండించె ననుజుఁ;
డంత నాతండు మీ రెవ్వ రనుచు నడుగ.

వ. రాముని యాజ్ఞచే లక్ష్మణుడు దమ వృత్తాంతముఁ జెప్పి నీ వెవ్వ రని యడిగిన,

కబం-తో: నే గంధర్వుడ; నిఖిలము నింద్రుల - నెతిగర్వంబున
క,। యోగియొకడు శపియించె నన్నునిటు నుగ్రకోపమున దనుక
॥ అసురుడనై నే నమరవిభునిపయి నరిగిన నాతడు వడిగ, వెస
వజ్రము వ్రేసె నాశిరము విపులోదరమున నడగ॥ రామ॥

వ. అప్పటినుండి శిరఃపాదవిహీనుండనైదీర్ఘ బాహుమధ్యంబున
చరించుజంతువుల బిగఁబట్టి మింగుచుఁ గబంధుం డన నిక్కడ
న్నాఁడ. మీవలన శాపముక్తి యగునని మున్ను మును లనుగ్రహిం
. నావికారశరీరంబు దహించి ననుఁ గడ తేర్పుఁడని వేడిన, వా
ంలజేసిరి. వాఁడు నిజప్రకృతిఁ బడసి గంధర్వుడయి పియన్మార్గంబున
చి యంజలి బద్ధుండయి,

తంగం మెట్టు: ఆదితాళము.

రామ ! రఘురామ! రవికులాంబుధిసోమ! నీమహిమను దెలి
నే నెంతవాడను!॥ రామా॥ పంచభూతములకుఁ - బంచకోశములను
చవర్ణములకుఁ బరుఁడవు గురుడవు॥ రామా॥ విశదముగను జతు
భువనము లసదృశముగ నీదివ్యదేహమునందు నిలిచె॥ రామా॥
మోక్షగుండవాస ! శ్రీధర చిద్విలాస ! భూమి నారాయణదాస,
శ ! శ్రీ శ్రీనివాస ! ॥ రామా॥

వ. ఇట్లు పొగడిన సంతోషించి శ్రీరాముం డిట్లనియె:

గీ. వినుము గంధర్వ, నీస్తోత్రమునకు నేను
సంతసించితి నీకలుషంబు దలఁగె;
దివ్యయోగంబు నొంది మదీయ దివ్య
ధామమును బొందు మింక శాశ్వతంబుగాను.

వ. అని యాజ్ఞాపించిన నానందించి రామునకు రావణుని
త్తాంతం బాద్యంతంబుఁజెప్పి, శబరి యాశ్రమంబునకుఁ బొమ్మని
త్రవ నూపి యతండుఁ బరమపదంబున కరిగె; ననంతరంబ—

తో: శబరియాశ్రమస్థలమునకును రామసౌమిత్రులు వోవగను,
ప్రబలమోదమునఁ బరికించియు వారిరాక కుబ్బి యెదురుగను॥ రామ॥

క. చనుదెంచి వారిపాదము
లను భక్తిని గడిగి తజ్జలంబు శిరమునం
దనువుగ నిడుకొని, యాశ్రమ
మునకుం దోడ్తెచ్చి పీఠముల నిచ్చి తగన్.

వ. మధురపక్వఫలంబులు సమర్పించిన భుజించిరి. పిమ్మట శబరికిరంబులు ముకుళించి,

శబరి భు॥ప్ర॥ పరంధామ మీదివ్యపాదాబ్జసేవా
పరత్వంబునన్ నిన్నుఁ బ్రార్థింప గంటిన్;
నిరాలంబ మీరూపు నేఁ డిందుఁ గంటిన్;
దురంతంబులౌ నాదుదోషంబు లారెన్.

వ. శ్రీమన్నారాయణుండు సాకేతంబున రాముఁడై పుట్టి దశకంఠ కంఠలుంఠనంబుఁ జేయ బోవుచో నీయాశ్రమంబున కనుజయుక్తంబుగ వచ్చి నిన్నుఁ గృతార్థనుఁ జేయఁగలఁ డని మద్గురువరుండగు మతంగ మహామునీంద్రుండు చెప్పియున్నందున,

తో: ఇక్కడఁ దపమొనరించుచు మీరాక కెదురుఁజూచుచున్నాను; గ్రక్కునఁ జనె బహుకల్పంబులు నేటి కక్కజముగఁ గన్నాను॥ రా॥ నాసంకల్పము సిద్ధిబొందినది; నా కిమ్మిక సద్గతిని, దాసకోటులకు దాసురాలనే దక్కువ జాతిని సతిని॥ రామ॥

వ. నిన్నుఁ గొనియాడు సమర్థత నాకుఁ గలదా, రామా! యని పలికిన విని దయారసం బొలుక రామచంద్రుం డిట్లనియె:

జంఝూటి: ఆదితాళము.

నాభక్తి యొక్కటి చాలు శబరి॥ నాభ॥ ఏభోగంబులు నీడుగా నేరని ప్రాభవమత్పదము సులభంబుగఁ జేరఁగ॥ నాభ॥ జాతి నాష్టా

శ్రీమలింగాదుల రీతు లడుగ వలవ దేరికి నైనను సరి॥ నాభ॥ మోక్ష గుండమున ముదమున వెలిగే యక్షయతేజమును వెలయంగను గల యగ! ॥ నాభ॥

గీ. యజ్ఞ దానముఖంబులౌనట్టికర్మ
లెన్ని చేసిన నాయందు తిన్ననయిన
భక్తిగుదురక శాశ్వతబ్రహ్మపదము
గడఁగి సుఖయింప శక్యంబుగాదు శబరి.

గీ. 'నీ వనాదినుండి నెలఁత నాపయి భక్తి
గలిగియుంటి గానఁ గలుగుముక్తి
సీతజాడ నాకుఁ జెప్పుము తెలిసిన
శబరి' యనుఁడు నామె సరఁగఁ బలికె.

ద్వి. నావల్ల వినఁ గోరినారంతె కాని। దేవ మీరెఱుగనిస్థితియేది గలదు?। రావణాసురుఁడు మీరమణి గొంపోయి। లావుచేఁ జేర్చెను లంకాపురంబు। భూవర, యిటకు దాపునను బంపాస।రోవరంబున్నది రూఢిగా, దాని।కడ ఋశ్యమూకాద్రిగలదు తద్గిరిని। గడిమిని వాలితో గలహించి వచ్చి। యున్నాఁడు సుగ్రీవు డోనర మీ రటకు। జన్న మీ తోడను సఖ్యంబు జేయు,। నతనిచేఁ గార్యంబు లన్నియు దీరు,। వెదకు లాఁడగ నేల? వెదలు డచ్చటికి;। చనుదును నేహుతాశనులోన జొచ్చి। ఘనకాయమును బాసి కాంతు మీపదవి। నని పల్కి వహ్ని ని నటు రవుల్ గొలిపి। తనమది రామమంత్రమును జపించి॥

కమాచ్ః ఆదితాళము.

మానసమా! మఱువకె! ॥మాన॥ అసదృశ పరమానందము యుని॥ మానసమా॥ నిత్యనిరంజన నిర్వికార సత్ప్రత్యగభిన్నబ్రహ్మం బుదు॥ మా॥ పిండాండబ్రహ్మాండంబులలో నిండి వెలుగు మోక్షగుండ

హరిని॥ మా॥ తాళ్ళపాక దాళ్ళూరి నారాయణకవి చారుమనోజ్ఞ విహా
రుని నిక॥ మాన॥

వ. అని పరంధామునిఁ దారకనాముని షడ్వర్గవిరాముని శ్రీరా
మునిఁ దనమానసంబున నిలిపికొని శబరి యగ్నిం బడి యవిద్యాకల్పిత
స్థూలకాయంబును దహింపఁజేసి—

క. శ్రీరాముని కృపచేతను
జారువిమానంబు నెక్కి శబరి మహాత్ముల్
నేరుపునఁ బొందుపదమును
నారూఢిని బొందె నిర్మలాంతఃకరణన్.

తో. అనిదాళ్ళూరి నారాయణకవి రామాయణమును హరి
కథను, అనుపమరీతి నరణ్యకాండమున్ వినిచె నోలగా(ఁ)సుధను॥రామ॥

ఇది వినువారల కిహసౌఖ్యంబులు గొదువలేక చేకురును; ముద
మునఁ దుదకును ముక్తి లభించును మోతుకుండ హరికృపను ॥రామ॥
రామా యనవే శ్రీరామాయణకథ వినవే గౌరీ॥ రామ॥

క. నాచేతనైన కొలఁదిని
జూచి రచించితిని దీని సుజనులు నెఱసుల్
దోఁచినయెడ దిద్దుదు రని
నాచిత్తములోన నమ్మినాఁడ వినీతిన్.

శ్రీమోతుకుండ రామాయణమునందలి అరణ్యకాండము

సంపూర్ణము.

శ్రీ రామచంద్ర గురు పరబ్రహ్మణేనమః.

అవిఘ్నమస్తు.

# శ్రీమోక్షగుండరామాయణము

## హరికథ.

## కిష్కింధాకాండము.

క. శ్రీరాముఁ డనుజయుతి వే
సారక పంపాసరస్సు సరగునఁ గనఁగాఁ
గోరి యనుదెంచి దాని యు
దారమనోహారతఁ గాంచి తమ్మునిఁ గనియెన్:

బేహాగ్: ఆదితాళము.

పంపాసరోవరము గనుంగొనుమ నేరితరము! సొంపుగ దీని వీక్షింపఁగ, నింపుఁ గ్రీడింపఁ గోరదే నిలింప సుభాంగనలు॥ పం॥ ఇంపైన గాలిచే గుంపులై యీనీటి తుంపురులెల్లఁ బరంగపరలుగ లేచెఁ॥ పం॥ తమ్ములు గలువ మొత్తమ్ములు జక్రవాకమ్ములు గోయష్టికమ్ములు నలరారు॥ పం॥ అంచితకుక్కుట హంస కారండవ క్రౌంచనాదముల మించి రహించు నీ॥ పం॥ మోక్షగుండపురాధ్యక్షుండ నే నాకు నక్షి పర్వముగ వీక్షింపఁ గల్గెను॥ పం॥

తో: మానసమును గంగానదియును మఱి దీనికిసరి రావనుము; మానితముగఁ గ్రోశమాత్రవిస్తృతంబై నెగడెను గనుగొనుము॥

మత్తకోకిల. ఈసరోవర తీరవృక్షము లెంతొ! యందములై తగెన్;
ఆసతోఁ జిగురాకులందు శుకాళులెల్లఁ బ్రియంబుగాఁ
గూసెడున్; మధుమాసముల్ సమకూడ దేఁటులు ఝంకృతుల్
భాసురంబుగ జేయు నెమ్మది పంపనై కనుఁ బట్టెడున్.

వ. మనోహరంబయిన యీ సరోవరప్రాంతంబుల నిట్టి వసంత సమయంబున విహరింపుచు సీతాసతితోఁగూడి క్రీడించు భాగ్యంబు నా కెన్నటికి లభించును ? లక్ష్మణా ! అంతఃకరణాలంకృతవీక్షణా !

కాంభోజి: ఆదితాళము.

తరుణి నెన్నఁడు జూతురా ! మదబారికోర్వదరమగాదేమి చేతురా! విరహము మీఱె; మేను బరవశ మొందెను; గనుల॥ దరు॥ ఒంటిగ నుండగ లేనురా ! లక్ష్మణనాకుఁ గంటఁ గూరుకు రాదురా! తుంటవిల్తుఁడు దూపు లంట వేయఁగఁ బూనె॥ దరు॥ పాతకు డింత చేసెను! నానుదుటను విధాత యిటుల వ్రాసెను! ఖ్యాతిగ మోక్ష గుండనేత కెఱుక యగును ॥దరు॥

గీ. జానకిని బాసియొకక్షణమైన నింక
నేను బ్రాణంబులను నిల్ప లేను; నీవు
మరలియు నయోధ్యకేగు లక్ష్మణ యటంచుఁ
బలుకు నన్నకు ననుజుండు తెలిపెనిట్లు.

తో: ఇంతిని గొనిపోయిన వానిని వధియించి యాతనిసాధించి, యంతట సుఖముల నందవలెనుగాక యదియెల్లను విడిపించి॥ రా॥

వ. అవార్యశౌర్య ధుర్యులగు మీయంతవారికి నధైర్యంబు నొందగాదు. ముందు జరుగవలయుదానిని యోజింతము. మీకు దెలుపునంత వాఁడనా!యన్నా! యనిన, నలరి రాముండు తెలివొంది,

చ. పదపడి రామలక్ష్మణులు బాణధనుర్యుత పాణులై వియ
త్పదము స్పృశించు ఋశ్యగిరిపార్శ్వమునన్ ఘనశాంతి దాంతి సం
పదనలరారు యోగితతిభాతిఁ జరింపఁగ వేగఁ గాంచి నె
మ్మదిఁ గడుభీతినొంది హనుమంతునితో రవిసూనుఁ డిట్లనున్.

బేహాగ్: ఆదితాళము.

హనుమంత హరిసి బరికించు॥ హను॥ ఎంతవింత, యంతరంగ మున॥ హ॥ ధీరులుమౌనికుమారులవలె నే వీరు జటాధారకులై తిరుగు

వ. అట్టి వానిని వెదకుచు నీప్రాంతములకు వచ్చినారము. నీసు శబ్దాన్వితవాగ్వైఖరి విన్న నీవువ్యాకరణ వేత్త వని తోఁచుచున్నది. నీవృత్తాంతముఁ గొంత ముచ్చటింపుము సచ్చరిత్రా ! అనివలుకఁగా నాంజనేయుండు—

గీ. వాలి సుగ్రీవులనుపేరి వనచరేంద్రు
లన్నదమ్ములు గలహించి; రందు వాలి
దఱుమ సుగ్రీవునకునిల్వ నిరవులేక
నలుగురాప్తులతోడ నీనగముఁ జేరె.

తో: అతనికి సఖుఁడను హనుమంతుడను ననిలనందనుఁడ నేను క్షితివర, మాసుగ్రీవుఁ డంప మీస్థితిఁ దెలియ వచ్చినాను॥ రా॥ అదటికి మీ రిపు దరుదెంచిన మీ కనుకూలముఁ జేసెదను; సుచరిత మీసతిచొప్పు దెలియుటకు, శోధించియు, నెఱిగెదను॥ రామ॥

క. అనివేడిన శ్రీరాఘవుఁ
డనుకూలము నొంది యటుల నౌఁగాక యనన్,
దనరూపముఁ జూపియు మా
పున వారిని మోచికొనుచుఁ బోయెను గిరికిన్.

వ. ఇట్లు వారిని నెత్తికొని కొండపయిఁజేర్చి యొకవృక్షంబు నీడను గూర్చుండఁబెట్టి సుగ్రీవుని జేరఁబోయి,

బ్యాండుస్వరము. ఆదితాళము.

మిత్రకులపవిత్రులు; ధాత్రికెల్ల మిత్రులు; మిత్రజ, రామ సౌమిత్రులు పుణ్యచరిత్రులు దశరథపుత్రులు నగుదురు॥ మి॥ మీరు వారు కలసిన మేలుకలుగు దెలిసిన; వారికార్యములుమీరును మీపని వారును సమకూర్ప వచ్చును సత్యము॥ మి॥ దండకావనంబునఁ దరుణి బాసి రయమునఁ గొండలు వనములు గుహాలును వెదకుచునుండి వచ్చిరి: మోతుగుండేశు లనవచ్చు॥ మిత్ర॥

తో: శ్రీరామా నాచెలిమి జేసితే సీతను జెఱగొన్నట్టి యా రావణువధకై సహాయముగ నరుదెంతును జలపట్టి॥ రా॥

వ. అనిపలికిన నంగుకు రాముండు నియ్యకొనియె; నంత—

తో: హనుమంతుం డగ్నిని జ్వలింపఁ జేసిన, రాఘవు డినఁ జుండు ననలుసాక్షి మైత్రిని మెలగుద మని యనుకొని రచ్చట మోండు॥ రా॥

వ ఇట్లన్యోన్యంబు సఖులయియుండునటుల బాస చేసికొని యనంతరంబు సుఖోపవిష్టులయియున్నంతః సుగ్రీవుండు దమ యుదంతంబు రామునకుఁ దెలుప నారంభించి,

క. మాయావి యనెడి దనుజుఁడు
మాయన్నను యుద్ధమునకు మార్గం మ్మనుచుఁ
గూయుచు వచ్చినఁ, గదనముఁ
జేయఁగ ననుఁ గూడిపోయి చెలఁగుచుఁ దాకెఁ.

కీర్తన: ఆదితాళము.

ఉండు దానవా! పోకుండు దానవా! ॥ఉం॥ ఉండుము పోక! యోరి పరాకా! గుండెలుదాకాఁ గ్రుద్దెద గాక॥ ఉం॥ వ్రేటుదగులును! నీ వీపు పగులును! సాటిగ బోరఁజాలుదు వేర! కాటికిఁ జేరఁగాఁ జేతు రార! ॥ఉం॥ ఉబ్బుమానవు! నా దెబ్బగానవు! మబ్బెల్లవీడు! మాయావి నేడు! గొబ్బున గోడు గుడిపింతు జూఁడు॥ ఉం॥ భీమబలుఁ డని విన వేమొ సుమ్మ నీవేమఱుగండ విదళింతునిండ శ్రీమోతుగుండ ధాముఁడు సూడ॥ ఉండు॥

వ. ఇట్లు బెదరించి యొకగ్రుద్దుగ్రుద్దిన నతఁడు బాఱిపోయి తన నివాసంబగు గుహఁజొచ్చె. అంత నాతని వెంటనంటి మాయన్నయు గుహలోఁ బ్రవేశించుచు మఱియొకరిని రాకుండఁ జేయునట్లు నన్ను గుహవాకిటఁ గావలియుంచి చనియె; ఆవెనుక.

చ. నెలయగునంత కేనచట నిల్చితి; బిమ్మట రక్తధార లే
ఖ లగతిఁ బాఱ నంతట విరోధుల నార్పులు బిక్కటిల్లఁగా
నెలమిని వాలి యీల్గెనని యెంచి ధరాధర మొక్కటిన్ మహా
బలిమినిదెచ్చి యాగుహకు బైటను సడ్డము త్రోచి వచ్చితిన్.

వ. ఇట్లు వచ్చి కిష్కింధఁజేరి,

గీ. వాలి చచ్చె ననెడు వార్తఁ దెలిపిన
బంధు లెల్లఁ జింత నొంది, పిదప
నన్ను రాజుఁజేయఁ గ్రన్ననఁ గిష్కింధ
నేలుచుంటి నాటి గోలె నేను.

తో: అక్కడ వాలియు నామాయావిని నడిచియు గుహవాకి
టికి। దక్కకచేరియు దద్గిరి నవ్వలఁ దన్నివచ్చె వెలుపటికి॥ రా॥

వ. ఇట్లు గుహవెడలివచ్చి నన్నెంత పిలిచినఁ బలుకకున్న
మహాగ్రహంబున గిష్కింధకుఁ వచ్చి రాజ్యపాలనంబుఁ జేయుచున్న
నన్ను రోషతామ్రాక్షుండయి కాంచి,

తో: ఓరిదురాత్మక యోరీనీచుఁడా క్రూరుఁడ వైతివి: నీవు!
కూరిమి నిచ్చట గూర్చున్నావా! కూడివచ్చెనీచావు॥ రామ॥ తమ్ముఁడ
వని నిను నమ్మి దానవునిఁ దఱుముచు గుహఁ జొరగానే, నిమ్మరక
టరాజ్య మేల వచ్చితివి! యిటులఁ జేయ మేలౌనే॥ రామ॥

వ. అని పలికి పిడికిట నొక్కపెట్టునఁ బొడిచిన సహింపలేక నేఁ
బాఱిన వెంటనంటి యెల్లలోకంబులుదిప్పె. అంతనేను మరల వచ్చి యి
క్కొండ నెక్కితి; ఇందు——

తో: వాలికి శాపము వచ్చియున్నదీశైల మెక్కరాకుండ
బోలఁగ నందున బోయె మరల బాఁ బురికిదిరిగి రాకుండ॥ రామ॥

క. ఈ గతిని నగరుఁ జేరియు
బాగుగ నాసతిని దమను బలిమిని గొని తా

భోగించుచు ధర నేలుచు
బాగుగ నున్నాడుఁ సుమ్మి బరవసమలరన్.

వ. ఇది మదీయ వృత్తాంతం బన, విని రాఘవుండు—

దర్బారు: అటతాళము.

వాలిని గూలిచి - వానరరాజ్యము మేలుగ నీచేత నేలింతుఁ జూడుము॥ వా॥ వెనువెంట ముట్టి నిను వెళ్ళగొట్టి వనితను బట్టి వలచి యున్నట్టి॥ వా॥ మోతుగుండపురాధ్యక్షుండ నానేను ద్రుక్షుండ గూడిన ఈత్రుణమందున॥ వాలి॥

వ. ఇది నిశ్చయంబోయి సుగ్రీవా యనవుడు, వానరేంద్రుం డిట్లనియె:

తో: వాలిబలము దుర్వారము దేవావళికిని శక్యము గాదు! లీలగాను గెల్చెద మని యనెదవు; చాల నమ్మకము లేదు॥ రా॥

వ. అతనియొక్క బలవిస్తారమును దెలిపెద వినుండు:

క. ముం దొకపరి మహిషాకృతి
దుందుభి యను రక్కసుండు దోర్బలమున సం
క్రందనజునిఁ జంపఁగ గి
ష్కింధకు జని పిలువ వాలి కినిసి వెలువడెన్.

వ. ఇట్లు చని కోపోద్దీపితుండయి వాలి వాని బిట్టుదాకిన నొం డొరులు—

తో: పదతాడనముల బాహుయుద్ధముల బలుపిడికిటిపోటులను। వదలక శతసంవత్సరములదాక వారు పోరి రావలను॥ రామ॥

గీ. అంత వాలి వాని నవలీలఁ బైకొని
క్రిందఁద్రోచి చంపి కేక లిడుచు
నతని శిరముఁ దన్ని నది యూడి రక్తంబుఁ
జిలుక యోజనంబు చేరి పడియె.

తో: అది మతంగమునియాశ్రమ మగుటను, నారక్తము పైఁబడఁగ, నెటలోఁ గనలుచు, నిది వేసినవాఁ డెవఁడో వాఁడిఁకవడిగ॥ రా॥ ఈ గిరిమీఁదికి నెక్కిన నీల్గుచు నిది నిశ్చయ మని యనుచు, వేగమె శాపము వెట్టెను గావున నిందు జనకుఁ డెలియును సూ॥ రా॥

వ అది కారణంబున వాలి యిమ్మహానగం బెక్కఁడు గావున నే నిం దుండి కాలంబుఁ గడపుచున్నాఁడ.

క. దుందుభితలఁ జూపుదుఁ దా
నిందున్నదు లేనిమీఁదు నిక్కముగా వా
లిం దునుమఁ గలరటంచును
సందేహము మానియుండు సారసనేత్రా!

వ. అనుచు రామునిఁ దోడ్కొని చని దుందుభికళేబరంబుఁ జూపించిన,

క. గిరిఁబోలిన శిరమును దన
చరణాంగుష్ఠమున రామచంద్రుఁడు చిమ్మన్
వెఱగున సుగ్రీవుఁడు గనఁ
బరువడి నదివోయి వడియెఁ బదియోజనముల్.

వ. అది పరికించి సుగ్రీవుండు రామచంద్రున కిట్లనియె.

హంసధ్వని— ఆదితాళము.

దినాధీశవంశోదయా! ఖరహరణ దయామయ! ॥దినా॥ మీ ధైర్యమును బలము నెలమిని గనుగొంటిని॥ దినా॥ వాలిదన్నిన పుడోలి రక్తమాంసాళిమిళిత మగుచు బరువై యున్నది సుమి॥ దినా॥ పౌలసతి శల్యావశిష్టముగా నిపు డలతల యెండినది కడు జులకన యగు గద॥ దినా॥ ఇలలో మోక్షపురీశ్వర తగ నీ బల మెక్కువ యను చును నెటునలె మదిఁ దలతు! ॥దినా॥

వ. ఐన నింకొక్క పరీక్షయున్నది చూపించెదనని,

తో: ఏడుతాళ్ళపై కెగసి యెక్కి మఱి యేకాన్త్రిగ వాలి।
కూడి యాకులను గోయుచు నుండును జూడుండు నాభూజాళి॥ రా॥

క. ఇది యొక్కశరంబున మీా
రవలీలను ద్రుంచివైచి నటులైనను నె
క్కువబలశాలి వటంచును
దవిలి మనమునందుఁ దలతు దశరథ రామా!

వ. అన విని రాముండు చిరునవ్వోలయ నొక్క యమోఘా
స్త్రంబు ధనువున సంధించి దృఢముష్టిని బిగించి గుఱిగా విడిచిన నబ్బా
ణంబుదాఁకి దశయోజనపర్యంతమున్న తాళంబులు చక్రాకృతిగా
నలరినఁ గాంచి,

క. తన పాదాంగుష్టముచే
ననుజుని పాదములపైన నప్పుడు రుద్దం
గను తాళద్రుమములు పె
ల్లున విఱిగెను భానుజుడు విలోకింపంగన్.

వ. అని తెలిపిన విని తత్కారణంబే మని పార్వతీదేవి యడిగిన
సర్వేశ్వరుం డిట్లనియె:

సురట: ఆదితాళము.

బాలికాతిలక! వివరించెద నీ వాలకింపుమా! నీ॥వాల॥ చాలతాళఫల
సప్తకమును-వాలిరాచె నోలి నొకగుహా! ॥ఓబాలికా॥ ఉరగ మొకటి
యవి హరియింపఁగ గని సరగ గనలి తరువులుగ నుండు మని బరువడి
నొక శాపము దానిడె సురవరునితనయుడు సుర॥ నోబా॥ అక్షయమున
నాయహిపతి బలికెను మోక్షగుండరక్షకుని సాక్షి యావృక్షహంత
యగు, వీరునిచే నీకు శిక్షయగు నని నీకు శిక్ష॥ యోబా॥

వ. కావున, నాశాపకారణంబునఁ దాళఫలంబు లేదును సర్పంబు
పంటినఁ దరువు లయియుండె నది గుఱుతెఱింగి,

౪. ఆదిశేషునంశ నవనిఁ బుట్టుటఁజేసి
లక్ష్మణుని చరణతలంబుసోకఁ
దలఁగెనాగరాజు తాళద్రుమంబులు
నొఱగె నొక్కపెట్ట నుర్విమీఁద.

సుగ్రీవుఁడు: హింసు-కాఫీ;రూపకము.

విను, మనుకులాబ్ధిచంద్ర! యొక్కమనవి చేసేదా!॥ విను॥
ఁదపంబుచేయ మెచ్చుకొనుమ నప్పుడు కశ్యపునకు నొక్కమాల
ఁగెఁ బురవిదారుఁడు॥ విను॥ అది పురందరునకు నిచ్చె నాముహా
డు; ముద మొదవ వాలికంఠమందునుంచె నాతఁడు॥ విను॥ వాలిని
వంగ నెంతవారివశ మగు గళమాలయున్న మోక్షగుండపాల
ఁగు॥ విను॥

వ. అని సుగ్రీవుండు నుడివిన రాముం డద్భుతమొంది సర్ప
ఁ గని,

ఁ. వాలిశాపంబునఁ దాళభూరుహముల
నిటుమోచుచుంటివి యిన్నినాళ్ళు;
తాళద్రుమంబుల ధరఁ గూల్ప నాచేత
శాపమోచన మయ్యె; సర్పరాజ,
ప్రత్యుపకారంబుఁ బరువడిఁజేయుము
వాలిదాల్చినకంఠమాలఁ దెమ్ము
హా మ్మన, శేషుండు వోయి యానిశియందు
వాలిని గ్రుంచెడుకాలమందు

ఁ. బాన్పుపైనున్న మాలిక పరగఁదెచ్చి
యినజునకు నిచ్చి రాముని కెఱుకపఱచి
ఫణిపతి యథేచ్ఛముగఁ జనె; భానుజుండు
సంతసంబున రాముని సంస్తుతించె.

కళ్యాణి: ఆదితాళము.

మామ్ పాలయ భువనాధీశ్వరా॥ మామ్ పా॥

ఈలోకంబుల నేలుచునుండే। నీలీలలుఁ గన, నేర్తునా!॥మామ్॥ సుతహితదారాన్వితసంసృతిలో నతికింతువు జీవాళిని॥ మామ్॥ మాయాబద్ధుని జేయకు నను నారాయణకవిహృన్మందిరా! ॥మామ్॥ సాక్షిరూప! వరమోక్షగుండపురరక్షక సత్కరుణాకరా! ॥మామ్॥

గీ. మధురవాక్కులచేత రామాయటంచు
నిమిషమేనియుఁ దుదకు ధ్యానించువారు
బ్రహ్మహత్యాదిసర్వపాపములనుండి
ముక్తు లగుదురు రామ సంపూజ్యనామ !

వ. కాఁబట్టి ఇది మొదలు నన్ను నీపాదసేవకునిగాఁ జేర్చుకొని ధన్యునిఁ జేయవలయును మహాప్రభో ! ఆపద్బాంధవా ! యని బహుభంగులఁ బొగడిన మెచ్చిరామమూర్తి యిట్లనియె:

తో: కొట్టెద వాలిని! బట్టము నీ కిఁక గట్టెద వానరవర్యా ! యట్టహాసమున నరిగిన యుద్ధమున కతని బిలువు పటుశౌర్యా !॥ రా॥

వ. అని పలికిన సుగ్రీవుండు శీఘ్రంబున రామ-లక్ష్మణయుతంబుగాఁ గిష్కింధనగరోపవనంబునకు వచ్చి వారి నొక్కవృక్షంబు చాటున నిలిపి, తానుబురద్వారంబుఁ జేరఁబోయి యాకసంబు బ్రద్దలగునటుల నుద్దండంబుగఁ బెద్దకేక పెట్టినఁ దద్దయు నాలించి తమ్ముని యెలుంగని తెలిసి, సింహనాదమ్ముఁ జేయుచు వెడలివచ్చె.

క. ఆక్షణమున సుగ్రీవుఁడు
వక్షస్థలముగులఁ బొడువ, వాలి యపుడు రూ
క్షేక్షణములఁ దనతమ్ముని
వీక్షించుచుఁ బొడిచె మరల వీరాంకుండై.

వ. ఇట్లన్యోన్యంబు సరాసరి బోరునెడ వృక్షంబు చాటున
యుండి రాముండు——

తో: ఒకటేవిధముగ నున్నారిద్దఱు నకటా! నాబాణంబు।
యెవ్వని వధియించునో యని వెఱయక యుండెను దనయంబు॥ రా॥

వ. అంత సుగ్రీవుండు నిరాశుండయి యెటులనో తప్పించుకొని
శరీరమాద్యంతంబు గంపంబు నొంద మెల్లమెల్లఁగా నడచుచు తిరిగి
తిరిగి చూచుచు రామభద్రునిఁ జేరఁ వచ్చి యిట్లనియె:

జంఝూటి: అటతాళము.

ఎంతవాడవు రఘురామా! యింతమోసము జేయనేటికిరామా!
ఎంతమా సద్గుణధామా! వంత నొందింప మీ వంటివారికిఁ దగునా!
ఇంత వాలిని వధియింపవైతివి॥ యెంత॥ రక్షింతు నని పంపి ఇటుల
రాక్షసుండేశ యుపేక్షింప మేల? శిక్షింపఁ దలచితివేల?యక్షయముగ
వాలి కప్పగించుటకంటె సాక్షాత్తుగా నీవే చంపగ రాదా! ॥ యెంత॥

వ. అనిన సుగ్రీవుని నిష్ఠురోక్తులు విని గాఢాలింగనము చేసి
కన్నుల నీరునించి యాదరంబున నిట్లనియె:

సగ్విణి. ఆతఁడున్ నీవు నేకాకృతిం బోల్తు రా
రీతి భావించి గుర్తింపగా లేమిఁగం
జాతమిత్రాత్మజా సంశయగ్రస్తతన్
భీతిచే బాణమున్ వ్రేయఁగా మానితిన్.

వ. అంతియేకాని వేరుగాదు, భానునందనా,

తో: సుమమాలిక గంఠమున ధరించియు సమయ మెఱిఁగి నీ
యతని। సమరంబున కీసారిబిలిచి పోరుము చూతువు నాధృతిని॥ రా॥

వ. ఇట్లు స్వామి యాజ్ఞాపించిన నొక పూమాల గళంబునఁ
జిహ్నంబుగా ధరించి సుగ్రీవుండు గిష్కింధ సమీపించి మహాట్టహా
సంబుఁ జేసిన, వాలియు——

తో॥ మఱల వచ్చె నీ తటి నీతని నే మార్గాన తెలియుము నను చుం। బరుగునబోయెదు వాలి కడ్డువడి పలికె తార వద్దనుచు॥ రా॥

హిందు. కాఫీరాగము: ఆదితాళము.

పోవద్దు ప్రాణేశ్వరా! యనికి॥ పోవద్దు॥ ఈవఱకు నీతో నోడి, యితఁడు మరలి వచ్చినాఁడు॥ పోవద్దు॥ బలవంతు లెవ్వారలో దోడు పడియుండు రేధీరులో! యిలను మోక్షగుండనగ రేశునిసాక్షిగ నీవు॥ పోవద్దు॥

వ. అప్పు డింద్రనందనుం డిట్లనుచున్నాడు:

క. పగతుం డాజికిఁ బిలువఁగ
మగువా పోవ ద్దనంగమది కొప్పునె! విం
తగ నతనికి బాసటయే
జగతిని న న్నెదురు ధైర్యశాలియెవండో!

వ. అనినఁ దార యిట్లనియె:

తో. అంగదుండు తెలుపంగ వింటినా సంగతి వివరించెదను। రంగుగ రఘుకులపుంగవులకుశ్రీరామలక్ష్మణులుదగను॥ రామ॥ తరుణి తోడ నీదండకాటవికి నరుదెంచిన రావణుఁడు। చెఱగొనిబిఱబిఱ సీతను లంకకుఁ జేర్చగ నారాఘవుఁడు॥ రామ॥

ఉ. తమ్మునితోడఁగూడి వనితన్ బరికించుచు వచ్చిఋశ్యమూ
కమ్మున భానుజున్ గలిసి గ్రక్కునఁ బాసలుసేసె నిన్ను యు
ద్ధమ్మున గూల్చి రాజ్యము హితమ్ముగ నాతని కిచ్చునట్లుగా:
నెమ్మది వింటి: దీని నెద నిల్కడగాఁ దలపోయు మిమ్మెయిన్.

వ. ఇది యసత్యం బయిన నీచేతఁ దఱుముబడిన వాని కింత శౌర్యంబు తనంతట గల్గునా! యోజింపుము వాలీ! బలవద్విద్విషా రణ్యకీలీ! యనంతధైర్యశాలీ!

గీ. యౌవరాజ్యంబు నినజున కీవయిచ్చి
సఖ్యమొనరించి రామలక్ష్మణులఁ గొలువు!
శుభము గలుగును; కులమును; సుతుని, నన్నుఁ
బ్రోవు మని పాదముల వ్రాలి లేవ కున్న.

వ. తిన్నగాఁ గరంబులఁ బట్టి లేవఁదీసి యాలింగనంబుఁ జేసి కొని తార నూరార్చుచు వాలి యిట్లనియె:

క. తెలియుదు రాముండై రవి
కులమున హరి బుట్టె నజుఁడు గోరిన కతనన్,
బలవంతుఁడైన రావణు
బొలియింప, నయోధ్యయందుఁ బొలతిరో నిజమే.

వ ఐన నేమి! అమ్మహానీయుండు నిరపరాధిని నన్నేల దండించు తారా! నఖనిర్జితతారా!

సురట—అటతాళము.

రాము డనగ బరంధాముడు లోకాభిరాముడు భక్తకాముడు॥ రా॥ తప్పు లేకయ నన్ను దండన జేయునె! చెప్పకు మిక రొప్పకు॥ రా॥ నావారు బెఱవార లనుభేద మతనికున్నాదటే! యిది వాదటే! ॥రా॥ మోక్షగుండ హరికి మ్రొక్కుచు సుగ్రీవు ముట్టెద జావ గొట్టెద॥ రా॥

వ. ఇంతియే! కాని యెంతమాత్రము సుగ్రీవుని మన్నింపను, తోహార. అని తారను నోదార్చి వాలి యయ్యన యుద్ధమునకు నడచి। కనుగవ గెంపులు; గదురగ సుగ్రీవునివీక్షించుచు గదిసి॥ రా॥

శహాగ—ఆదితాళము.

బోకురా పోకురా! సుగ్రీవా! యిక॥ బోకురా॥ భీకరముగనిన్నుజంపి పీడ వదిలించెదను॥ బోకురా॥ లగ్గ కెక్కినట్లు నిన్న డగ్గరి నీ వోడిపోయి సిగ్గులేక నేడువచ్చి తగ్గక నెదిరించెదవు! మొగ్గు లేక నిన్ను బట్టి మోక్షగుండ శౌరిచూడ నుగ్గునూంచ జేతునీదు। పెగ్గపెటఁగులఁ జేర॥ బోకురా॥

తోహర. అంతట నినజుం డతిరోషమ్మున నార్భటించుచును బోడువ! బంతను తో నావాలిముష్టిచే బలిమిని నెదపై నడవ॥ రామ॥

వ. ఇట్లిరువురు సమబలులయి నఖానఖి ముఖాముఖి బాహాబాహి బెనఁగునెడ శ్రీరామచంద్రుండు—

తో. ఐంద్రచాపమున నస్త్రము దొడగియు నాకర్ణాంతము దిగిచి, చంద్రయశుడు రామచంద్రుడు విడువగ సరగున వాలిని గదిసి॥ రా॥

క. ఉరమున గాఁడిన నాతఁడు
నురువడి నిలఁగూలి మూర్ఛ నొంది పిదపఁ దె
ప్పిరిలి రవితనయ లక్ష్మణ
పరివృతుఁడయి యున్న రామభద్రున కనియెన్.

రూపకము-భైరవి.

ఇదిమేరా! నానేర మే మున్నది రఘువీరా! ॥యిది॥ యెదుటికి రాగను డాగియు నెద నాటగఁ గదుపొక్కటి యిదే వ్రేయగ॥ నిది॥ భానుజుడు బంధువుడు నే నీకును బగవాడనె! వానరమాంసము గోరుటయేనీతియెయటానౌ నిక భూనాథుల॥ కిది॥ నాదాపును మోక్షగుండనాథ, చేరి వివరించిన, నాదనుజుని బాదమ్ములతోఁ దన్నియు నీదే విని నేదేనా! ॥యిది॥

ద్విపద-అని వాలి యారీతి నాడువాక్యములు । విని రాఘవుఁడు నవ్వి వేగనిట్లనియెః । బ్రీతిగా వానరవీర యాలింపు । కూఁతురు మఱఁదలుఁ గోడలు భగిని । సరి యని యందురు శాస్త్రజ్ఞులదియు । గురిగాఁగ నీవు గైకొనక కామమునఁ । దమ్ముని భార్యను దగగూడి నావు; తమ్మునిఁ బురివెళ్ళఁ, దఱిమితివీవు? । ఇన్నియధర్మము లెనసినీయందు। నున్నవిగాన నే నుర్విఁ గూల్చితిని; ।నీ యధర్మమె నిన్ను నీరుగావించె;। భాయక మంచి సెబ్బరలు పాటించి । శిక్షింపుమననిగాదె క్షితిశలేసు లకు!

పక్షపాతముల నేల బంధితునాకు! చాలింపు మని రామచంద్రుఁడు వలుక వాలి విజ్ఞానియై వైరంబు వదలి——

తో॥ హర: ఆపన్నత నే నాడినమాటకుఁ గోపింపకు మో రామ। నీపగయుగ్మము నెఱనమ్మితి మన్నించి ప్రోవు గుణధామా॥ రామ॥

జంఝూటి – అటతాళము.

శ్రీరామా, నీ వాదినారాయణుడవు॥ శ్రీ॥ రామామణియె యీ – సీతాదేవి యవు॥ శ్రీరామ॥ అవతరించితి రావణాసురులఁ జంప। దివిజుల మునుల మోదించి రక్షింప॥ శ్రీ॥ అవసానమందు నిన్నరయంగ గలిగె! నవిసె నాదుష్కృతములు; ప్రకృతి తలఁగె॥ శ్రీ॥ మోక్షకుండ వాస మునిజనోల్లాస అక్షయనారాయణకవితోష॥ శ్రీ॥

క. అంగదుఁడు బాలుఁ డగుగా
నం, గరుణింపంగవలయు; నాయన యిఁక నా
యంగము స్పృశించి నిర్మలు
నింగా నొనరించి ముక్తి నేఁ డొసఁగు హరీ!

క. శరవేదనఁ బడఁజాలను
సరగున నది యూడఁదీయు సర్వజ్ఞ యనన్
గరమున హృదయము నంటెను
శర మూడఁగఁ బెఱికె రామచంద్రుఁడు కరుణన్.

తో॥ రాముఁకరస్పర్శమున బునీతుండై మహనీయులు గోరే। ధామమునకు గపితనువు విడిచి యా తారాపతి దాఁ జేరె॥ రామ॥

ఉ. అంతట వానరుల్ చని రయంబునఁ దారను గాంచి 'యమ్మ! నీ
కాంతునిఁ జంపె రాఘవుఁడు గావున, నంగదు రాజుఁ జేయ నా
వింతగ, నాల్గువాకిళుల వ్రేయగఁ బంపుము! సూర్యనందనుం
డింతకు రాకనుండె యని యేర్పడఁ బల్కిన నామె చింతతోన్.

వ. మూర్ఛిల్లి భూమిపైఁబడి కొంతవడికి లేచి హస్తంబులచే శిరోవక్షంబులు మోదుకొనుచు వనచరులం గనుంగొని.

తో: నా నాథుఁడు లేనప్పుడు రాజ్యము నందనుండు నాకేల? మానక యిపుడే మగఁడువడిన కడఁ కేను బోదు నీవేళ॥రామ॥

వ. అని తత్క్షణంబున లేచి రోదనంబు చేయుచు వాలిపడియున్న చోటికిఁ జేరి పదంబుల పయిఁబడి,—

తోడి: ఆదితాళము.

నాప్రాణనాథా! యిక నాకేది దిక్కు కటా! పాపిష్టివిధి మనల బాపె నే మందు నిల॥నాప్రా॥ నే నెంతఁజెప్పినను నీమది కెక్కదాయె! హీనపునోము నోచినా నేమొ పూర్వమున ॥నాప్రా॥ శతమఖసుతుఁడవయి ప్రతిలేనిశూరుఁడవై క్షితి మానవునిచేత జెడ నాయెఁ గడపట॥నాప్రా॥ శ్రీమోతుగుండపురధాముఁడేఁ రాముఁ డని నే ముందుఁజెప్పలేదా! నామాట వినవైతి ॥నాప్రాణ॥

వ. ఇట్లు విలపించుచుఁ దలయెత్తిన ధనుర్ధరుండయిన రాముండు దృష్టిగోచరుండయిన నిష్ఠురంబుగా ననుచున్నది:

క. వాలినిఁ గూల్చిన కోలను
గూలిచి సురపురికి నతనిఁగూడఁగ నన్నుం
దోలుము: సుఖింతు; వాలికి
నేలేని సుఖంబు సుఖమె నిక్కము రామా!

వ. పత్నీ వియోగదుఃఖంబున వేగించుచున్న నీ విట్టి మేలు చేసితివి. తత్ఫలంబు శీఘ్రంబ పొందఁగలవు. నన్నును నొక్క బాణంబునఁ గూలిచి వాలిచెంతకుఁ జేర్పుము రామా! అని సుగ్రీవునిఁ జూచి,

తో: శ్రీరామునితోఁ జెప్పుము; నన్నును - శిక్షింపింపుము; వెనుక। నాపుమతో సౌఖ్యము లొందుము; నాపోరు లేకుండును గనుక॥రామ॥

వ. అని యిట్లు దిక్కుండోపక విలపించు తారకు వివేకంబుఁ గలుగఁజేయఁ బూని శ్రీరాముఁడు—

క. నావిభుఁ డని విలపించెదు!
జీవుఁడో ! దేహంబొ ! తెలుపు చెలి విభుఁ డనఁగా!
భావింప భూతధాతుమ
యావిర్భవమును జడమ్మె నగు దేహ మిలన్.

తో: జీవుఁ డాత్మమయుండై వినువిధమున నీవిశ్వము నంట
కను!దా వెలయును శుద్ధంబుగ; దేనికి నీవు వగచెదవు తగను॥ రామ॥

వ. దేహంబు సప్తధాతుమయము; పంచభూతాత్మకము; జడ
స్వభావము; దుఃఖరూపము:-నశించుచున్నది. జీవుఁ డన్ననో ! నిరామ
యుఁడు; నాత్మరూపుఁడు; లింగవిహీనుఁడు; నంతఃప్రకాశకుండు,-
దేనిని నంటువాఁడు కాఁడు. ఈదేహజీవుల రెంటిలో నీభర్తయెవఁడు !
నీవు చింతించుట దేనిని గూర్చి తెలుపుము కాంతా ! నిర్మలస్వాంతా!
యనిన తార కొంత మెఱుక గలిగి,

క. జీవుఁడు చిన్మయుఁ డాయెను;
దేవర, జడసంవృతంబు దేహం బాయెన్;
గావున సుఖదుఃఖంబులు
గేవలముగ దేని బొందుఁ గృపఁ దెలుపఁ గదే !

గీ. నన్నుఁ దెలుపు మనుచు, నాతండ్రి యడిగితి;
నేనుఁ దెలుపునంత దానసే ! క
టాక్షముంచి నిశ్చయంబు నిరూపించి
నా కనుగ్రహించి నన్ను బ్రోవు.

వ. అనిన, దయార్ద్రచిత్తుండై రాముండు తారను వీక్షించి,

ఆరభి: ఆదితాళము.

తరుణి ! దెలిపెదను వినుమా ! నీప్రశ్నకు నే॥ తరుణీ॥ ధరణి
జీవుఁ దేవళకు నహంకృతిఁ బొరయునో ! యంతకుఁ దఱుగదు సంసృతి
॥ తరుణి॥

తాత్పర్యము: జీవుం డెంతపర్యంతము నభిమానములోఁ గూడి యుండునో యంతపర్యంతమును సంసారము తెగిపోదు తారా.

కీర్తన. విషయాసక్తిని విడువ జాలకయ నృష యగు సంసృతి మెలఁగును జీవుఁడు॥ తరుణి॥

తాత్పర్యము: జీవుం డనాదిసంబంధముచేత విషయంబుల యం దాసక్తి విడువ లేక యసారమగు సంసారమందు నిత్యత్వబుద్ధితో మెలఁగుచుండును.

కీర్తన: అఖిలేంద్రియములఁ నభిమానించుచు సుఖ-దుఃఖంబులఁ జొక్కుచు నుండును ॥తరుణీ! తెలి॥

తాత్పర్యము: చతుర్ద (14) శేంద్రియములలోఁగలసి పరమార్థముగా భోగించుచు నావ్యాపారముచేత రాఁబడిన సుఖదుఃఖములచేఁ దాను బాధ్యుఁడయి జీవుండు సంతోష-సంతాపము లనుభవించుచుండును.

కీర్తన: మానుగ జగదభిమానము వదలిన, దానె మోక్ష గుండధవుఁడయి వెలయును॥ తరుణి॥

తాత్పర్యము: ఈ ప్రకారమున సంసారవ్యామోహితుండయి యుండు జీవుం డొకానొక కాలమునకు నీప్రపంచసుఖము లస్థిరములని సద్గురుకటాక్షమువలన దెలిసి, దేహేంద్రియములు దాఁ గాక మోతుగుండ మను సుషుమ్నానాడి శిఖామధ్యమందుఁ గోటిసూర్యప్రభాభాసితుఁడయి ప్రకాశించు ముఖ్యబింబమైన పరమాత్మయం దైక్యంబు నొంది తానే పరమాత్ముఁడై ముక్తుఁ డగును.

సీ. తార! నాదెలిపినతత్వవిచారంబు
శుద్ధమనంబుతోఁ జూచికొనుము
దుఃఖంబులెల్లను దొలగును; సంసార
కర్మబంధము లెల్లఁ గ్రాగిపోవు;
నీపూర్వభవమున నిర్మలభక్తి నా
యందు నుంచితివి; నీ కందువలన
దర్శన మిచ్చి యథార్థంబుఁ గఱపితి;
నాస్వరూపంబు మానసమునందు

గీ. ధ్యాన మొనరింపుమా సంతతము మదుక్త
మానితజ్ఞాన బోధంబు మఱవకుండు!
బహుళభవబాధభయమును బాయఁజేసి
శాశ్వతబ్రహ్మపదవి నొసంగువాఁడ.

వ. అని రామునిచే బోధించిన తార శోకంబుమాని మహానంద భరితురాలయి శ్రీరాముని జగన్నాథునిఁగా భావించి కరంబులుమోడ్చి నుతింపఁ దొడంగె.

కమాచ్: రూపకము.

అంతు దెలియ నెంతదానను భువనాధిప నీ॥ యంతు॥ అంతర్బా హ్యములందున నంతంబుగ నలరెడు॥ నీ॥ యంతు॥హరసురాదు లరయ జాలరు; సనకాదిమౌని వరులునైన నెఱుఁగనేరరు; తరుణిని విద్యార హితను గుఱుతెరుగను గుణహీనను॥ అంతు॥ మానితనారాయణార్చిత శ్రీమోక్షగుండశ్రీనివాస లోకవందితా! మానవుఁ డని మది నెంచితిఁ గాని నిజము గననైతిని॥ యంతు॥

వ. అని ఇట్లు స్తుతించిన సంతోషించి యాదరంబునఁ జూచె. అప్పుడు రామబోధితమయిన జ్ఞానవాక్యములను సుగ్రీవుండు విని నిర్మ లాంతఃకరణుండయి రాముని సమీపించినం గాంచి,

తో: అంగదుచే మీయన్నకు సంస్కారములు విధివంతముగ సాంగం బగునటు సలిపింపుము వెలయంగ నీవు శీఘ్రముగ॥ రాను॥

వ. అని యిట్లు రాముం డాజ్ఞ యిచ్చిన మంచిదని సుగ్రీవుండు వాలి కళేబరంబు నలంకరించి విమానంబుపై నుంచుకొని వానరుల చేత మోయించుకొని యంగద తారాసహితంబుగఁ జని యగ్ని సంస్కారాది కర్మంబులు సాంగముగా నెరవేర్చి స్నానంబుజేసి మరల రామసన్నిధానంబునకు వచ్చి నమస్కరించి,

తో: పాదసేవకుఁడ భటుడను నే మీ. సోదరుబోలినవాడన్ । వదిచేయు మనియెదరో చేయుద నెఱిగింపుము దయతోడన్॥రా।

రాముడు:—

హంసధ్వనిరాగము: ఆదితాళము.

పోవోయీ యినజా! నీవిక కిష్కింధను నేలఁగ॥ పోవోయీ॥ నీవిరోధుని జావ నేసితి నేవి లేవు। విఘ్నము లదరక॥ పోవో॥ వాలి సుతునకు మేలు గలుగఁగఁ జాల యువరాజ్యంబును గట్టుము॥ పో॥ ఘన లడగిన వానరులతో జానకిని గనఁగా నరు దెమ్మిఁక॥ పో॥ ఈమహాద్రిని ప్రేమ నుందుము; రాము మేము గ్రామంబులకు॥పో॥ వృక్షచర, సౌమిత్రి వచ్చును మోక్షగుండ రక్షకుఁ దలఁచుచు॥పో॥

వ. అని పలికి సౌమిత్రిని గూడఁ బంపిన వారిని కిష్కింధకుఁ జేర్చి యొక్కశుభలగ్నంబున సుగ్రీవునకు వానరరాజ్యాభిషేకం బొనర్చి, యంగదునకు యువరాజ్యంబుగట్టి వారిచే విశేషసత్కారంబులు వడసి లక్ష్మణుండు మరలి యన్నను జేరి నమస్కరించిన, రాముం డిట్లను చున్నాఁడు:

శహానరాగము: ఆదితాళము.

వానకాలము మునుకొనెను లక్ష్మణా, ఈనగమందు గుహాలో నిరవుగ నుందామా॥ వాన॥ ఎల్లెడలను వాన జల్లులు బిక్కటిల్లె మెల్లన గొండలపై మేఘము లావరించె॥ వాన॥ పగవారిపైనఁ బోవు పని గా దీరెండు నెలలు; దగనిందు మోక్షగుండధవు గనుచుందు దాము॥ వాన॥

వ. ఇట్లిరువురు నాలోచించి మంచి యుదకములు మంచిఫలములుగల యొక్కచో గుహాయొక్కటియుండ వర్షబాధా నివృత్తికొఱకు నాగుహను శుభ్రముఁ జేసికొని మునులబోలి యందు నివసించి తత్త్వవిచారంబుఁ జేయుచుండిరి. అక్కడ సుగ్రీవుండు రుమాకాంతా తారలఁతో గలసి కామోపభోగంబుల మైమఱచియుండె నదిగని యాంజనేయుండు—

క. రాముసకుఁ జెప్పి వచ్చిన
దేమీ! యదిమఱచియుండు టేమీం! యిటునీ
వేమఱియుండిన మనపను
నామహానీయునకు రాదె యాగ్రహ మినజా!

వ. వారికిఁ గోపంబువచ్చిన భరింపనా రెవ్వరో! చూడు మని పవనజుండు పలుకఁ దెలివొంది సుగ్రీవుండు—

తో: సకలదిశలకును జనుదెంచిన తరుచరులను బిల్వఁగఁబంపు; మిక రాముని పని కేగుద మన్నియు నేర్పాటులు గావింపు॥ రా॥

వ. అని యుత్తరు విచ్చిన హనుమంతుండు సమాచార మంపి డెబ్బదిరెండు వేల వానరసైన్యమును బోగుచేయుచుండె. ఇక్కడ రాముండు—

నాటకురంజి: రూపకము.

సీతజాడ ప్రీతితోడ నాతో జెప్పవా రేరిల! పాతకుని చేత నెంత! బాధనొంది బడలినదోర! ॥సీత॥ నాతిని రక్షించుకొనఁగ జేతగాక పోయెనుర! యేతెఱంగునను వలపు ద్రోతు నెటుల సైతునుర ॥సీత॥ మోక్షగుండాధ్యక్షుతనయుఁ డిక్షుధనువు నెత్తెనుర! యక్షయకుసు, మాస్త్రములు వక్షమందు నాట నేసెనుర॥సీత॥

వ. నాయంగనను దొంగిలించిన దనుజపుంగవుని మీఁదికి మనము మాతంగంబుపయికిసింగంబు జొగున లంఘించు భంగిఁ గదిసి పొంగడంగఁ జేయంగవలెనని క్రోధం బంతరంగంబున నుప్పొంగుచున్నది. రంగు మీఱ నాజాడ నెఱుంగఁజేయుసంగడికాఁడు లేఁ డాయెఁ గదా! తమ్ముఁడా! సౌమిత్రి! కనుగొంటివిగదా! శతపత్రమిత్రపుత్రునిమైత్రి.

పంచచామరము.

స్వకార్యమైన మీఁద సూర్యసంభవుం డహంకృతిన్:
ఒకింత యైనఁ దొంగిచూడకున్న వాఁడు గంటివా!

యుఁకన్ సహింపరాదు వానియేపు రూపుమాపి వా!
లికిం బ్రియంబొనర్తు నేఁడు లీలతోడ లక్ష్మణా!

వ. అనిన, లక్ష్మణుండు. —

పంచచామరము.

భటుండనైన నేను వెంటఁ బాయకుండ నుండ మ
ర్కటాధముర్ జయింప మీరు రాగ నేల? పంపినం
తటన్ దటాన నేను బోయి తాఁకి వానిఁ గూల్చి మి
క్కుటంబుగాఁ బురంబునెల్లఁ గొల్లఁబెట్టి వచ్చెదన్.

వ. అనిన రాముం డలరి లక్ష్మణునిఁ గాంచి,

కేదార: రూపకము.

సోదర! పోగదరా! మోదముతో నాతని మర్యాదగ నీ వాదరముగ నాతని గను॥సోద॥ సునుసూదుగ నతనిన్ జెనకకుమీ మనమేలును మఱచినగతి గనబడినను దునుమాడుము॥సోద॥ అభయ మిడితి గానన్, ఉభయులకున్ శుభముగలుగ మోతుపురప్రభువు కరుణ బడయఁగవలె॥సోద॥

తో: పోలఁగ సుగ్రీవునిర మ్మనియెను! చాల నతఁడు రాకున్నన్ వాలినిఁ గూల్చిన బాణము గల దని వచించియు ర మ్మనినన్ ॥రా॥

క. కాలాగ్నిరుద్రుఁడో యనఁ
గేల ధనుశ్శరము లూని గిష్కింధకు న
వ్వేళఁ జని పురము వెలుపటఁ
జాల నిలిచి చేసె నపుడు జ్యానినదంబున్.

వ. అమ్మహాధ్వనికి విభ్రాంతులై కపిసైన్యంబులు కిచ కిచ ధ్వనులతోఁ జని చూచి లక్ష్మణునిగా నెఱింగి పోయి యంగదున కెఱింగించిన, నతండు సత్వరంబుగాఁ జని పాదంబులకు నమస్కరించి సౌమిత్రి ఇట్లనియె:

తో: నీపినతండ్రికిఁ గోపఘూర్ణితుఁడ - నేను వచ్చుటను పలికి! ప్రాపుమీఱ నాపజ్జనుఁ దోడ్కొనిరమ్మన, నంగదుఁ డులికి॥ రాము॥

వ వేగంబునంజని సుగ్రీవునిం గని యతీక్ష్ణరోషతామ్రాక్షుండై లక్ష్మణస్వామి వచ్చి తన సముఖంబున కీక్షణంబున నిన్నుఁ బిలుచుకొని రమ్మన్నాఁడు. వృక్షచరాధ్యక్షా! విపక్షకుంజరహార్యక్షా! యను పలుకులకు నులికిపడి సుగ్రీవుండు హనుమంతునిఁ గని.

తో: అంగదుండును నీవు గడువడి రఘుపుంగవుతమ్మునిఁజేరి! పొంగుచు మ్రొక్కియుఁ బురములోనికిఁ జేర్పంగవలయునుదిఁగోరి॥ రా॥

వ. అని పంపిన వారు చని లక్ష్మణుఁ గని నమస్కరించి దేవా! రాజభవనంబునకు దయసేయవలయు రాజకాంతలు తనుదర్శనము కొఱకు వేచియున్నారు. సుగ్రీవుని యిష్టంబిది యనుచు, వల్లె యని వచ్చునప్పుడు మధ్యకక్ష్యాంతరంబునఁ దార యెదుర్కొని మ్రొక్కి.

శ్రీరాగము : రూపకము.

రామానుజ! రక్షింపుము। మిానుతుని మిత్రసుతుని ॥రాము॥ మీామదిఁ గనిపించి యతఁడు క్షేమంబని చేయును గద! ॥రామా॥ వన చరులకు వార్తబంపె; వత్తురు రేపో! మాపో! పనులన్నియు మోక్ష గుండ ఘనునాజ్ఞను సమకూరును॥ రామా॥

వ. ఇట్లు పొగడిన హర్షించుచు సుగ్రీవుని భవనద్వారము సమీపించె. అప్పటికి రుమాకాంత చెంతనుండి లేచి రాకున్నఁ గోపిం లక్ష్మణుండు.——

తో: చాలఁగ నినజుఁడు స్వామిద్రోహుఁడు, సంపన్నమదాంధుండు, వాలిని గూల్చిన వరశర మెక్కడ బోలేదున్నది జుండు॥ రా॥

వ. అను లక్ష్మణుని ఘర్షణవాక్యంబులు విని కంపంబునొందుచు నర్ఘ్యపాద్యంబులుగొని సుగ్రీవుండు సౌమిత్రి కెదురేగి పూజించి నమస్కరించి తోడ్కొని పోయి సింహాసనాసీనుం జేసి కరంబులు ముకుళించి——

క. వనచర సేనల నెల్లను
నోసఁగూర్చుచు నున్నవాఁడ; నోగి రా నున్నా
రనఘా! రాముని దర్శన
మున కేగుద మింక మనము మోదముతోడన్.

వ. అని లక్ష్మణున కనురాగంబుగాఁబలికి యంగద హనుమంత సుషేణ నల నీల జాంబవంతాదులు వెంటరా సుగ్రీవుఁడు లక్ష్మణ సహితంబుగా రామదర్శనార్థమై మాల్యవంతంబున కరిగి రాముని పదంబులకు మ్రొక్కి.

కళ్యాణి—ఆదితాళము.

దండము రవికులచంద్రమా నీకు॥ దండ॥ కొండల వనముల నుండిన కోతులపిండును గూర్చుచు నుంటి॥ దండము॥ వానలు వెలిసిన వత్తుననుచును నే నుంటిని గరుణించు॥ దండము॥ తడసితి నని కోప పడకు మోక్షపురియొడఁ యడదాసుఁడ నోదు॥ దండము॥

వ. అను వినయోక్తులకు నలరి లేవ నెత్తి గాఢాలింగనంబుఁ జేసి గొని రాఘవుం డిట్లనియె:

గీ. నాకు దాసుఁడవును నాకార్యపరుఁడవు
ననుచు గాదె నిన్ను నెనసినాఁడ!
నిప్పటికిఁ బ్రయత్న మేమిచేసితివయ్యా!
తెలియఁ జెప్పు మనగఁ బలికె నతఁడు:

మధురగతిరగడ.

పల్లవి॥ వచ్చిరి మీ సేవకొఱకై। వనచరు లోదేవ! పవన సమారుఁడు బనసుఁ డంగదుఁడుగవయుఁడునీలుఁడు,గంధమాదనుఁడు। సముఖుఁడు గేసరిజ్యోతిర్ముఖుఁడును విముఖుఁడు దారుఁడు వినతుఁడు గజుఁడును నలఘుఁడు ద్వివిదుఁడు నాగవాక్షుఁడును। నలుఁడును బావక నయనుఁడు హరుఁడును। నంబురాశిసుతుఁ డంబురసుషేణుఁడు।

జాంబవంతుఁడును శతబలి శరభుఁడు । మైందుఁడు, మొదలగు మర్కట
వీరులు । సుందరవంతులు శూరులు యోధులు । తమతమ హితులును
దమ్ములుఁ దనయులుఁ । దమబంధువులును దమతమ మనుమలుఁ । దగ
వెంబడిరా ధరణి నిండఁగను । నగణిత సంఖ్యల నార్భటించుచును॥
వచ్చిరి॥

తో. వీర లేమి గావింపఁగవలెనో వివరింపుము రఘువర్యా!
సారెకు మీ యాజ్ఞానుసారముగ నలిపెద మందరధైర్యా! ॥ రామ॥

వ. అనిన, రాఘవుండు—

క. సీతను వెదుకఁగ వీరిని
ప్రీతిగఁ బంపించు మోకపిప్రవర! యనఁగ
జేతంబున ముద మొందుచు
ఖ్యాతిగ నాతండు పంపెఁ గపిసైన్యములన్.

క. ప్రాచిఁ బ్రతీచి నుదీచిని
జూచుటకై వినతు నబ్ధిసుతుని సుషేణున్
ధీచతురిని శతబలి నటు
వేచనుఁ డని లక్షలక్ష వీరులతోడన్.

తో. గజుని గవాక్షుని గంధమాదనుని గవయు నంగదునిఁ
దారు। విజయుని భల్లూకవిభుని మైందు నలు ద్వివిదుని బవనకుమారు॥ రా॥
కని మీరలు దక్షిణమున కేగుడు జనకజపోఁబడిఁజూడ, బనివడి నెలలో
పలను జూచి రావలయును తప్పిన నీడ॥ రా॥

వ. మిమ్ము మన్నించుట లేదు. రాముని సమక్షంబున శిక్షిం
తును బొం డని సెలవిచ్చిన, సుగ్రీవుని శాసనంబుల వనచరులు ప్రయా
ణంబులయి రామునకు నమస్కరించి,

బ్యాండు—ఆదితాళము.

పోదుమా మేము! పోదుమా మేము! మీదేవిని జూడనో రామ!
ద్వీపములెల్లను దిరిగి చూచెదము! దేశములన్ని ద్రిమ్మరి కాంతుము శ్రీప
మోక్షగుండపురీశ, భూపుత్రి జూడ నెప్పుడు నూరక రాము॥ పో॥

వ. అని ప్రయాణోన్ముఖు లగుచుండ నందఱిలో హనుమంతుని స్వకార్య నిర్వాహక ప్రసిద్ధునిఁగా బుద్ధినెంచి యొద్దకుఁ బిలిచి ముద్దుటుంగర మిచ్చి రాముం డి ట్లనుచున్నాఁడు;

క. ఈయుంగరమును గొని చని,
వాయుజ, జనకజకు నిచ్చి, వచ్చును రాముం
డీయెడకు; యుద్ధయత్నము
జేయుచు నున్నాఁ డటంచుఁ జెప్పుము శుభముల్.

వ. నీకు మేలు గలుగుఁగాక! శీఘ్రంబున నడవుమన వాంజనేయుం డంజలిచేసి గంతులు వైచుచు నంగుళ్యంబు శిరసావహించి యంగదాదులతోఁ గలసి దక్షిణదిశకుఁ బోవ నుద్యోగించి,

ద్వి. భానుజునాజ్ఞను బటుతరవింధ్య ప్రాంతంబుల వెతకుచును వానరులుండఁగ వారియెదుట నొకదానవుఁ డగపడి యనెను॥ రామా॥

వ. మారీచుని కుమారుఁడ బౌరుషశాలిని. మీ రెవ్వరో కాని నావనంబున కేల దూఱివచ్చెదరు? మిమ్ము మ్రింగుదు నన, నంగదుం డాగ్రహించి పిడికిట నడిచిన నొక్కఁగుద్దునకే పెద్దనిద్దుర జెందె. అంతవారు వనంబునఁ దిరిగితిరిగి డస్సి దాహంబుఁగొని యెక్కడ నీరుగానక—

ఫీలురాగము. ఆదితాళము.

దాహ మాయె! నయ్యో! తాళగలమే యిఁక! దేహములు డస్సె! వైదేహి నెట్లుగాంచనగు॥ దాహ॥ నీరుఁ జూపు పుణ్యు లేరు లేరుగా నిట! దారిదోపదాయెను! నోరు లెండిపోయెఁగటా!॥ దాహ॥ భూమి మోతు గుండ స్వామికార్యమునకుఁ బ్రేచు వచ్చినారము; విఘ్నములు గలుగ నేల॥ దాహ॥

వ. అని నీరువట్టుచేత మేనులు సుడివడ వచ్చుచు జని వింధ్య పర్వత తీరముం దొక బిలముఁ గని జలపక్షులు తిరుగుచున్నందున

నని యెంచి యంధకారమ్మునగ నుండు నాగుహాలోనికి
బోయిరి. అందు నాచీకటి విరిసి ప్రకాశమైన యొక
బడిన, సంతసం జొచ్చి చిత్రంబుగాఁ గనుచు;
ాయం దీనగరం
రచియింపబడెనొ! యిది యెవ్వరిదో!
తీనగరంబో!
గ నున్నయది దీనిపనితన మహాహా!
ని వర్ణించుచు నాపురంబులోఁ దిరుగుచుండ నొక్కచో
యం బయిన సౌధంబు గనఁబడిన నచ్చెరువంది—

కమాచ్: రూపకము.

మైన యీమేడ నిందుఁ గట్టినట్టి ఘను లెవరో! యొసఁ
తనమును! ముందెవరుగా బొందుగ నన వినము బలే!
ం కాంతవేసులు, గంధసంపుగోడలకు నిలిపిన సుందరంపు
పసంపు గనగా విం దగు జూపులకు బలే!॥ యం॥
ంబర దివ్యమైనమాడువుల కీ డగు మోతుకుండ రత్న
నీత్మితి నిం కెవ్వరి కెఱుగనగును బలే! ॥యంద॥
న్నాశ్చర్యపడుచు నామేడలోఁ బ్రవేశించియందు దపంబు
నొక్కకన్నియం గని మ్రొక్కి వారిలో హనుమంతుం

ఎవరమ్మా! నీ విచ్చట నొంటిగ నేల దపముఁ జేసెదవు?
యీభవనమెవ్వరిది? వివరింపుము సొంపొదవు॥ రామ॥

ఎన, నాతపస్విని యిట్లనియె.
మయుఁడను వా డీమందిరమును నిర్మాణము జేసియు
హేమను మాభిఖ్యతరుణితో వెలయ జేసికొనువిందు ॥ రా॥

వ. ఇట్లుండ దేవేంద్రుండు వచ్చి వానిం జంపి హేమను గొని పోయి యామె తండ్రియగు విశ్వకర్మకు నిచ్చె; వినుము—

క. హేమకుఁ జెలికత్తెను; నే
నేమంబున దపమొనర్తు నిరతం బిచటన్;
భూమండలిని స్వయంప్రభ
నామముగలదాన నిదియె నా తెఱఁ గరయన్.

వ. మీ రెవ్వ రిం దేల వచ్చితిరి? నావల్ల గాఁ దగిన ప్రయోజ నం బే మనిన, హనుమంతుం డామె కిట్లనియె:

క. దశరథతనయులుఁ బాండుర
యశులును నగు రామలక్ష్మ ణాఖ్యు లడవికిన్
విశదంబుగ వచ్చినచో
దశకంఠుఁడు రాముతరుణిఁ దా గొనిపోవన్.

వ. సుగ్రీవుం డను వానరరాజుతో సఖ్యంబుఁ జేసిన, నతండుఁ దనబంటుల మగు మమ్ము సీతను వెదకుటకయి పంపె. దాహంబు గొని నీరు గానక యీబిలంబులో నయిన నుదకంబు దొరకునేమో యని వచ్చినాము. మాదాహంబు దీర్చి వెలుపటికిఁ బోవు త్రోవఁ జూపుము తల్లీ!

గీ. అనిన ఫలము నిచ్చి యాకలిదప్పులుఁ
బాయఁ జేసి, కనులు మూయఁ జేసి
బిలము బయటఁ జేర్చి ప్రియమున రాముని
జూడఁ బోయె నామె వేడు కలర.

వ. ఇట్లు చని రాముని సందర్శించి నమస్కరించి యి ట్లని ప్రార్థించుచున్నది:

**కీర్తన: ఆదితాళము.**

రామ భూమిజామనః కామా! సామజనుతనామ! రా॥ రామ॥
జగదభిరామ! దనుజవిరామ! నుతసుత్రామ! నిరతము! నామనోజ్ఞ

సీమ నీదు తారకనామ మేమారక తపము వేనురుఁజేసితి ॥రామ॥ హృన్మఖంబున నిన్నుఁ జిన్మయు నెన్నగఁ గనుగొనకున్న సద్గతి సున్న యనుచు నెన్నశ్రుతు లని బుధు లన్నవిన్నఁ, గన్నతండ్రి, నన్నికఁ బ్రోవవే॥ రామ॥ మోక్షగుండాధ్యక్ష సజ్జనపక్ష సురమునిరక్షణాను నకు రాక్షసులను శిక్షజేయుటకును నీ వీక్షితి మానుషదేహ మెత్తితి వోజయ॥ రామ॥

వ. అనిన,

క. మానిని, నీభక్తికి నే
మానసమున మెచ్చినాఁడ; మఱియేవరమున్
మానుగఁ గోరెదవో యను
మానము లేకుండ నడుగుమా! యని యుత్తుఁ.

వ. అనిన, నామె యిట్లనుచున్నది:

తోహర: దాసురాలిపై దయఁగలిగి కృతార్థత జేయఁగ మది నెంచి, నీసుదర్శనము నేటికిచ్చితివి నిశ్చల తపము ఫలించె॥ రాము॥

కమాచ్ రాగము: ఆదితాళము.

ఏవరంబు లేలనో దేవ రాఘవ యీవరంబు జాలు! మోక్ష మీవె రాఘవా! కేవలాత్మమయుఁడవైన నీవు నీతమ్మునితో దేవితో నశాంతిమును భావమందుఁ దోపవే ॥ఏవరంబు॥ ఈక్షితి నీమీఁద జన్మ మెత్తఁజాలవు గావునన్ మోక్షగుండమందు నీసముక్షమునఁ జేర్పవే! ॥ఏ॥

గీ. అనుచుఁ బ్రార్థింప సంతోషమంది రాముఁ
డనియె: 'యోగిని, బదరికావనమునందుఁ
జేరి నానామజపమును జేయుచుండు;
మంత్యమం దైక్యమగుదు నాయందు నిజము.'

వ. అని కటాక్షించి నంతఁ దక్షిణంబున నామె బదరికావనం బున కరిగి యచట రామనామస్మరణంబు జేయుచుఁ గొంతకాలంబుండి

ప్రారబ్ధవిమోచనసమయంబున శరీరంబు దొఱంగి స్వయంప్రభస్వయం ప్రభయం దైక్యం బయ్యె. ఇక్కడ నంగదుండు దక్కిన మర్కటులతో ననుచున్నాఁడు:

వసంతరాగము: అటతాళము.

ఎందుఁ బోవుదము సీతను గన॥ నెందు॥ ఎందుఁ బోయిన గార్య మేమిలేదు; మన మందఱ మిచట మృతిబొందిన మేలగు॥ నెందు॥ అటుఁగాక యూరక నటుఁబోవగాను మర్కటరాజు దండింపఁ గటకటా! యింకమీఁద॥ నెందు॥ గురుతరముగ మోక్షగుండనివాసుని కరుణలేక గష్టకాలము వచ్చెను॥ ఎందు॥

వ. అనినఁ గొందఱు వానరు లిట్లనిరి:

క. సీత కనుపించ లేదని
ప్రీతిమయే నతఁడు చంపుఁ; బోవఁగ నేలా!
యాతరుణి యున్న బిలమున
ఖ్యాతిగ నివసింతి మదియు నతిగోప్య మగున్.

వ. స్వయంప్రభ యుండిన యీబిలంబుఁ బ్రవేశింప హరిహ రాదులకైన నగోచరంబు గాన, నందు దాఁగియుందము. రం డని యత్నించుచున్న వనచరుల కాంజనేయుం డిట్లనియె:

తో: రాముం డనఁగా సామాన్యుండని మీ మనముల నెంచితి రో! కామజనకుఁ డగు;గమలజ జానకి; భూమిని యోధ్యాపురిలో॥ రా॥ అవతరించినా రమరులఁ బ్రోవను, నసురుల ద్రుంపను మనము భువి ద దాజ్ఞచేఁ బుట్టితి మమరుల పూర్ణాంశంబుల నిజము॥ రామ॥

వ. ఆయనకుఁ దోడుపడఁ బుట్టిన మన మిట్లు దాగవచ్చునా! అమ్మహనీయుని ప్రభావ మెఱుంగరా! మనకు వాలి మరణంబే సాక్షి.

కీర్తన—ఆదితాళము.

రామునివీరపరాక్రమ మెఱుంగక యీమాడ్కిని బలుకుట మేలా! యామేటికి భూమండలి నేమాత్ర మాటంక మేమున్నది॥ రాముని॥

కొండబిలములోన నుండుటకాదు; బ్రహ్మాండములో నెం దుండినను దండిగ నాతండు గన కుండునా! శ్రీమోక్షగుండేశుఁడౌ॥ రాముని॥

వ. అనుహనీయుని కార్యంబు నెఱవేర్పకున్న మనకు నరకంబు దప్పదు. స్వామికార్యంబునందు మెలంగుచు దుర్ఘటమైనచో మరణించిన వైకుంఠ పదవి కలదు. ప్రాణములేల! దాపవలె రండని ధైర్యవచనంబు లాడిన, నందఱు లేచి క్రమముగా సీతపోబడి విచారించుకొనుచుఁ గొన్ని దినంబులకు దక్షిణసముద్రతీరంబున నున్న మహేంద్రాద్రికిఁ జేరి సముద్రంబును దిలకించి,

హిందూస్థానిభైరవి - అటతాళము.

ఇది దాటుటకు నిం దెవ్వరితర మగు నేమి తోపకయున్నది యంతులేదు॥ ముదమున మన మీ యుదధి దాటిగాదా చేసుదును లంకను గనుడీ! యంతులేదు॥ ఇది॥ ఏమో సులభముగ నెంచి భానుజుఁడంప నేతెంచితి మిచటికి! శ్రీమోక్షగుండేశు భామిని సాధింప లేము! సాగర మరసిన నంతులేదు॥ యిది॥

వ. ఇట్లాలోచించి యధైర్యంబు నొంది నిర్విణ్ణులయియున్న వనచరులకు హనుమంతుం డిట్లనియె:

క. నెలదాఁటిన సుగ్రీవుఁడు
నెలకొని దండించు; మనము నెలలోపలనే
జలజాక్షి దొరకలే దని
మలయుచుఁ జని చెప్ప నతఁడు మన్నించుఁజుఁడీ !

వ. అనిన, నంగదుం డిట్లనియె:

గీ. తగినవారల నెల్లను దక్షిణమున
కంపియున్నాఁడు చేతగాదనుచు మనము
పలికి నంత నతడుగొట్టిఁబంపు మనల
గాని మన్నింపఁ బోఁడు నిక్కంబు వినుఁడు.

వ. రాముని కార్యంబు నెఱవేర్తు నని పలికియున్నాఁడు. కాన మనమీదఁ గనికరము కలుగదు. వానిమనోధర్మంబుఁ జెప్పెదవినుఁడు.

తో. తనయన్నను జంపిన రామునకును దా సహాయపడునటుల। నని చని రాజ్యమదాంధత్వంబున నవియు మఱవడే యవల॥ రా॥

వ. లక్ష్మణుండు యుద్ధంబునకు వచ్చినప్పుడు గదా లేచి వచ్చినాడు ! ఎంత కృతఘ్నుఁడో ! చూడుము మారుతీ !

తో: వాలిని జంపియు వాని రాజ్యమును వనితను గూడను కొనియు। నేలుచు నున్నాడిట్టి దురాత్మున కేమికరుణమది వెలయు॥ రా॥

వ. కాబట్టి నానిశ్చయము మీ రందఱు వినుఁడు.

బేహాగ్ - ఆదితాళము.

నేరాను నేరాను పోం డిఁక మీరు॥ నేరాను॥ నారీమణి జాడ గననేరక యూరక నటకు॥ నేరాను॥ పోయి వానిచేత శిక్షఁబొందు దానికంటె నిచటఁ బ్రాయోపవేశముచేతఁ బ్రాణము బాసినమేలు ! శ్రీయుతముగ మోతుగుండనాయకుని పాద మాన॥ నేరాను॥

వ. అప్పుడు యువరాజు మనోనిశ్చయంబున కందఱు మంచిదని యొక్కచో దర్భశయనంబు లేర్పఱుచుకొని వాని యందుఁ జేరి ప్రాయోపవిష్టులు గాఁదలంచి యున్నంత మహేంద్రగిరిగుహానుండి ఱెక్కలు లేని యొక్కగ్రద్ద వికృతాకారంబుగా వెడలి వచ్చి వారినిఁ జూచి,

సంపా: తో: నా కిర దొరకె యీనాఁటికి నిక గొన్నాళ్ళకు భీతిమొలేను । చేకొని నే భక్షించెద ననియది పైకిరాఁగనామీఁద॥ రా॥

వ. వానరులు భీతచిత్తులగుచు,

వా: ద్వి. అక్కటా! దీనికి నాహారముగను
జిక్కెడటంచువ్రాసెనో బ్రహ్మమనకు!

నిట్టి బలిష్ఠపుగ్రద్ద
రాంపైదెస నెటిగియున్నామె!
ఋ గోరెడు మనకోర్కెఁ దీర్ప
ాబైమిత్తి వచ్చెఁగానోపు!
బలవంతు లను పేరుఁగాంచి
లోఁబడఁ గా నాయెఁ దుదకుఁ
ౖకులమును గడపట మనలఁ
ం బిట్లు కాఁ చున్నయది;
ిట్లు వగచెడు నావానరులకు
ధైర్యము నొంది యంగదుం డపుడు.

శంకరాభరణము: ఆదితాళము.

పు జెందఁగవలదు కపులార! యిక॥ వగ॥ తగజావఁగఁ
ల దని యాభగవంతుఁడె దీనిఁ బంపె మేలాయెనిక
ార్యార్థమై రావణుతోఁ బోరి; భూమి జటాయువు
ిక॥ వగపు॥ వినుఁడు మోక్షగుండ విభునికార్యములో
ైన మంచిదికాదే! యిక॥ వగ॥
ా ప్రస్తాపముగా జటాయువును బ్రశంసించిన నాలించి
వనచరులఁ డగ్గరి యిట్లనియె:

ాయువు తమ్ముఁ డగునాకు; నాతని
నెవ్వరుంగుదురు? మీ రెవ్వరయ్య?
ాలమునకు మద్భ్రాతృవార్తను వింటి;
ఘనసుదినంబు నిక్కంబు నేఁడు;
ార, తన్మృతిహేతువుఁ జెప్పు డ
నంగఁ, జెప్పఁ దొడంగె నంగదుండు
ాద దశరథవిభునిసూనులు రామ
లక్ష్మణు లనువారు లలనతోడ

గీ. దండకాటవులకు రాఁగ దశముఖుండు
వారి వంచించి కొనిపోయె వనిత నంత
దారిలోన జటాయువు దాకి పోరి
డస్సి రావణుచేత నడంగె నతఁడు.

వ. తర్వాత నవ్వార్తయెఱింగి రాముండు వచ్చి యతనిదహనంబుఁ జేసిన, నతఁడు కృతార్థుండయ్యె. పిమ్మట రాముండు సుగ్రీవునితో సఖ్యంబుఁ జేసి వాలిని జంపి కపిరాజ్యంబు సుగ్రీవున కిచ్చిన నతండు రాముని భార్యయగు సీతాదేవిజాడఁ దీయుటకు వానరుల మయిన మమ్ముఁ బంపిన వచ్చితిమి.

తో. ఎక్కడఁజూచిన నింతిజాడమా కెఱుకపడదు గావునను, జక్కఁగ లంకకుఁ జనవలె ననిమే మిక్కడఁ జేరి యుండగను॥ రా॥

వ. లంకయెక్కడ నున్నదియు నెఱుంగక, సముద్రంబు దాఁటు సమపాయంబు దొరకక, మరలిపోయి యధిపతిచే దండింపఁబడుట కంటె నిక్కడనే ప్రాయోపవిష్టులమై కాఁబోవుచున్నాము దయానిధీ మీ రెఱిగియుండిన సీత పొలకువ సెలవియ్యవలయు నన, జటాయువు మరణవార్తవిని సంపాతి నెమ్మనంబున—

హిం॥ కాఫీ: ఆదితాళము.

సోదర! నిన్నికమీద ఁజూడరా యకటా ॥సోదరా॥ సోదుగా బ్రహ్మవ్రాత! పూర్వమందు మన మేకోదరులము కూడియుండి బాసితిమి హా!॥ సోదర॥ అక్కట స్వయంకృతమైన కర్మముచేత తెక్కలు గమిలి నే నిక్కడఁ జిక్కితి హా!॥ సోద॥ అహారహమును నిన్నను కొనుచుంటి నీ మహానీయులచే మరణవార్త వింటి॥ సోద॥ రాక్షసవిభునిచే రణమునఁ దెగితివి మోక్షగుండపతి ముఖ్యపదము గలిగె॥ సోదర॥

వ. ఇట్లు కొంతవఱకు దుఃఖించి పిమ్మట ధైర్యంబు దెచ్చుకొని వానరులతో నిట్లనియె:

తో: అన్నదమ్ములము అరుణనందనుల మాజటాయువును నేను;
నన్ను నీటిచెంతకు గొనిపోయిన స్నానము గావించెదను॥ రాము॥

వ. అనంతరము మీకోరిన సంగతులకుఁ బ్రత్యుత్తరముఁ జెప్పెద
ననవుఁడు మంచిదని వారంద ఱతని మోసికొనిపోయి సముద్రములోనికిఁ
జేర్చిరి. సంపాతిస్నానంబు జేసి జటాయువునకు జలంబు విడిచి తీరం
బుఁజేరి,—

గీ. నూరుయోజనములదూరంబు వార్ధిలోఁ
బోవ లంక గలదు; రావణుండు
జనకసుత నశోక వనమందు నుంచి యు
న్నాఁడు; దూరదృష్టి నాకుఁ గలదు.

తో. కాన, నంతయును గనఁబడుచున్నది నేను బోవఁగా గలను।
మానుగ రావణు మర్దించియు నే మానిని గొనిరా గలను॥ రా॥

వ. నాకు ఱెక్కలు లేనందునఁ గొంచెము చిక్కినాఁడ. మీ రీ
యుదధి దాఁటి సీతను వీక్షించి వచ్చుటకు సమర్థులరే కాని వ్యర్థులరు
గారు. పోయి రండు. రామునిచే రావణుండు దునియఁగలఁడు— అనిన,
నంగదుం డిట్లనియె:

క. చక్కఁగఁ బక్షుల కెల్లను
ఱెక్కలె యుండంగవలయు; ఱెక్కలు లేమిన్
జిక్కువడినట్టి కారణ
మక్కజముగఁ దెలుపవలయు నని యడుగుటయున్.

సంపాతి— కళ్యాణి-అటతాళము.

నాపూర్వవృత్తాంత మీపట్లఁదెలిపెద: నాపేరు సంపాతి నగచర
వర్యా! యేపుచే నాతమ్ముఁడును నేను బౌరుషముచేఁ పై కెగసి, విను
వీధికిని బారఁగను బోనుబోను రవిదాపుగలుగుటచేత ఱెక్కలు దగ్ధ
మై వింధ్యాద్రిఁ బడితి॥ నాపూర్వ॥ మోక్షగుండేశుని సాక్షిగ నేమూర్ఛ

మునిఁగి తెలివొందితి మూఁడునాళ్ళకును; బక్షములు లేనందువలనను నెగురంగఁజాలక నీక్షితిని దొర్లాడుకొనుచును బోయి వోయి కడుదీక్ష తోఁ జంద్రముఁడునా ముని దివ్యమగు నాశ్రమముఁ జేరితి॥ నాపూర్వ॥

వ. అప్పు డమ్ముని వల్లభుండు నన్నుఁజూచి యిట్లనియె:

తో. ఎందుకు నీ కీవికృతాకారం బేర్పడెనో! సంపాతి! క్రిం దట ని న్నెఱిఁగిన కతమున నడిగితిఁ దెలుప నరుణసూతి॥ రామ॥

వ. అని యడిగిన నమ్మునికి నాస్వయంకృతాపరాధం బంతయుఁ దెలిపి దుఃఖించుచు నిట్లంటిః

తో. అనఘా! యీవికృతాకారముతో మనియుండఁగ నేఁజాల। మునివర, యిక నీతనువును గాలిచి నను గడ తేర్చ మీవేళా॥ రామ॥

వ. అనిశోకింప దయామయుండైన యమ్మునివరుం డిట్లనియె:

బేహాగ్: రూపకము.

ఏల జాలి నొందెదవు కాలగతికి! మానుము: చాల దుఃఖమునకు మేను మూల మగును దాళుము॥ యేల॥ కర్మము దేహంబునకుఁ గారణమని యెఱుగుము! కర్మ కహంకార మగును గారణము దెలియుము॥ ఏల॥ ఆయహంకారం బవిద్య; యందు వేగ గలిగెను బాయ కందు మోతుకుండప్రభువు చాయ నిలిచెను॥ యేల॥

గీ. ఇట్లు తోఁచినట్టి యీశ్వరచ్ఛాయను
జీవుఁ డనుచు బుధులు సెప్పుచుంద్రు;
దినదినం బతండు దేహాత్మబుద్ధిచే
సకలకర్మములను సలుపుచుండు.

వ. తనమూలంబు గుఱ్తెఱుంగక విషయాసక్తుండై పుణ్యాపాప కర్మంబు లనంతంబుగా నాచరించి, యూర్ధ్వాధోలోకంబులకు నెడ తెగక దిరుగుచు, నందుఁ బ్రాప్తించు సుఖదుఃఖంబులకు బద్ధుండయి యనుభ వించుచుండు; నెట్లనిన—

క. క్రతువులు మొదలగు సత్క్రియ
లతిభక్తిని నాచరించి యంతంబున స
ద్గతి కరిగి యచట సౌఖ్యము
లతులితముగఁ బొంది పుణ్యుఁడఁగిన మీఁదన్.

తో. ఇందుమండలమునందు జేరి హిమబిందువుతో జతగలిసి।
క్రిందనుబడి యీక్షితివ్రీహ్యాదులయందుఁ జొచ్చికడు వెలసి॥ రామ॥

కీర్తన :ఆదితాళము.

అరుణసుతా తరువాతన్ అది యన్నముగా మారున్; బురుషుని గర్భము జేరున్; వర రేతంబై యలరున్; సతులున్ బతులున్ సురతంబునందుఁ గూడగా జారున్॥ అరు॥ బుతురక్తముతో గలియన్ హితవుగ నొక దినమునకున్ క్షితి గలలగువలెఁ బొలుచున్, ధృతి బంచాహ్నంబులకున్ దిరుగన్ సరగన్ మితమయిన బుద్బుదాకృతిని నిలుచున్॥అరుణ॥ పదునైదవ దినమునకున్ మృదుమాంసపుఁబిండము గన్ ముదమునఁ బొదలుచు నిది యలరారున్; మోక్షపురీశునికరుణన్ దలఁపన్ బిదపన్ బదినాళ్ళ కంకురంబు బ్రిభవించున్॥ అరుణ॥

సీ. మెడయును దలయును మెడవంపులును వెన్ను
నుదరంబుఁ గలుగును నొక్కనెలకు;
బాణిపాదంబులు పార్శ్వముల్ కటి జాను
వులు మాసయుగమున కెలమిఁ బొడము;
మూఁడవనెలయందు మొలచును దనుసంధు;
దలరు నాల్గవనెలయందు వ్రేళ్ళు;
ముక్కు వీనులు నేత్రములు గల్గు నైదవ
నెలను; జీవుం డంను నిలిచియుండు;

గీ. దంతపఙ్క్తి నఖంబులుఁ దగ జనించు;
నాభి గుదగుహ్యములకు రంధ్రంబు లాఱు

నెలల కేర్పడుఁ; దలవెంట్రుకలును రోమ
ములును నేడవ నెలయందు మొలచు నవల.

వ. ఎనిమిదవమాసంబునకు సర్వావయవంబులు సంపూర్ణ మగును. పిమ్మట మాతృభుక్తాన్నసారంబు నాభిసూత్రాల్పరంధ్రంబునఁ బరిగ్రహించి యభివృద్ధినొందుచు గర్భస్థజీవుండు జఠరానలతప్తుండలై స్వకృతకర్మంబును గుఱించి యిట్లని చింతించుచుండు:

కమాచ్: ఆదితాళము.

కడతేరే దెన్నడో! దరిఁజేరే దెన్నడో!॥ కడ॥ ఘోరమయిన యీకూపములోపలఁ జేరితి! వెడలంగ దారి దొరక॥ కడతేరే॥స్వకృత కర్మమున సకలయోనులం దకటా! పుట్టుచు నడఁగుచుంటి;॥ గడతేరే॥ న్యాయముదప్పి ధనంబు గూర్చి నిజజాయాసుతుల కొసంగుచుంటి; ॥గడ తేరే॥ అస్థిరమగుదేహాదిప్రపంచము సుస్థిరముగ గని చొక్కు చుంటి॥ గడతేరే॥ మోతుగుండపతిముఖ్యచింత నాపేక్ష వదలి నే ద్రేలు చుంటి॥ గడతేరే॥

తో: కావున, నే నీగర్భనరకమున గడువడిఁ బడియున్నాను, దోవ దొరకి యిందుండి వెడలితే నావెనుక మఱవకయె॥ రామ॥

సర్వేశునిసంస్మరణఁ జేయుచును సంసారాంబుధిఁ బడక, నిర్వా ణంబున కుర్వడి జని నే నిలిచియుందు నికఁ జెడక॥ రామ॥

వ. అని చింతించుచుండునంతలో నవమాసంబులు నిండి ప్రసవ సమయంబు ప్రాప్తించిన—

గీ. భూమి దుర్గంధయుతమైన పుట్టిమునిఁ
క్రింద నరగునఁ బడునట్టి క్రిమి విధమున
యోనియంత్రప్రపీడితుఁ డైన దేహి
మాయికోఁ గూడి క్రక్కున మహిని బడును.

వ. ఇట్లు వసుంధర మాయ గప్పుటచేఁ బూర్వజ్ఞానంబు మఱచి బాల్యాదిసుఖంబులు సర్వంబు గుడుచుచు, దేహమే నేనను భ్రమచే

జిక్కి వ్యర్థంబుగాఁ గాలంబుఁ బుచ్చుచుఁ, బలుమాఱుఁ బుట్టిచచ్చుచు గర్భనరకాద్యవస్థలు సారెసారెకు ననుభవించుచు నుందు. ఇట్టి దుఃఖ భాజనం బగు దేహంబు రాకుండఁ జేసికొనవలయునది. ఎట్టులనిన :—

కీర్తన : ఆదితాళము. (పురను నలం) వలె.

పుట్టుక లేనట్టివిధం బిట్టిది యెఱుఁగ దగదు; నే నీ పట్టునఁ దెలి పెద॥ పు॥ ఇట్టి దట్టిదింతిం తని యన రానట్టివాని బూర్ణముగను గాంచుటె॥ పు॥ శ్రీగురుని వేగ గని సాగిలి మ్రొక్కులిడి, యోగము తత్వరహస్యార్థము విని, యోగయోగభోగాదులయందు విరాగచిత్తుఁడై యాత్మను దెలిసిన॥ బు॥ క్షీరంబున్ క్షీరమునన్, నీరము నీరమునన్, జేరుప, నొకటిగ జెలఁగిన విధమున వేరుగాక శ్రీమోక్షుగుండ రఘువీరునితో దావెలయఁ గలయుటే !॥ పుట్టుక॥

వ. ఈవిషయం బిట్లుండనిమ్ము. జరుగబోవు కార్యంబు వివరించెద.

క. వగవ బనిలేదు త్రేతా
యుగమున హరి రాముఁడై యయోధ్యను బుట్టున్
దగ నతఁ డడవులకును రాఁ
బగఁ గొని రావణుఁడు వానిపత్నిని గొనిపోన్.

గీ. అంత సుగ్రీవుతోఁ జేరి యతనిభటులఁ
గపులఁ బంపించు వెనుక నోఖగవరేణ్య!
తెరువువారికిఁ జూపించి తేని నీకుఁ
బక్షములు వచ్చు; నిజ మని పల్కుటయును.

వ. అమ్మహానుభావునికి మ్రొక్కి మెల్లఁగా నిమ్మహేంద్రగిరి గహ్వరంబుఁ జేరి బహుకాలముండి వాసముఁ జేయుచు సంప్రాప్త భోజనుండనై మీరాక గోరుచున్నాఁడ. ఇందులకు దృష్టాంతముగ—

తో. ఇవిగో నాకును నెఱకలు వచ్చెను నిక నే నెగిరెదన నుచు దివికిని నెగిరియు దివ్యవాక్యములు దెలిపెను వారినిగనుచు॥ రా॥

కీర్తన - ఆదితాళము.

విను డిక వానరవిభులారా! వినిపించెద నోఘనులారా! ఘనముగ వారిధి గడచి లంకకును జని రాలేమని సంశయపడకుడు॥ విను॥ శ్రీమహీశాపతి నామము నిరతము భామరులైనను బఠియింప క్షేమంబుగ సంసృతిసాగరమును దాము దరించి కృతార్థులగుదురిల॥ విను॥ మోక్షగుండపతిముఖ్యభక్తులై యీక్షితిలో జరియించెదు మీ కక్షయబలులకు నంబుధి దాటుట లక్ష్యమె యవలీలగ దాటెదరు॥ విను॥

వ. అని తెలిపి సంపాతి యథేచ్ఛం జనియె. అంతవానరు లధైర్యంబు వదలి శతయోజనవిస్తీర్ణమయిన సముద్రంబు దాటి లంకకుఁ బోవ నిశ్చయించి యున్నంత నంగదుండు వానరులతో నిట్లనియె:

తో. ఎంతదూరమెవరెట్లు పఱతురో! యెఱిగింపుడు నాతోడ! వింతగ మీజవవిధమును విని సంతోషింతునుజూడ॥ రాను।

వ. అనవిని గజ గవాక్ష గవయ శరభ గంధమాదన మైంద ద్వివిధ తారులు క్రమంబుగఁ బది యిరువది ముప్పది నలువది యేబది యరువది డెబ్బది యెనుబదియామడల దూరముఁబోఁ గలమనితమగమన జవంబు కొలఁదుల౯ బలికిరి. అంత జాంబవంతుండు.

హిం. కాఫి- రూపకము.

అంగద వినుమా! పొంగుచు నాబలము గనుము!॥ యంగ॥ చెంగున సప్తాంబుధు లెగురంగల బూర్వంబున నే॥ నంగ॥ తిరిగితి నిట్టు త్రివిక్రమ దేవునిచుట్టుదిరిగితి॥ఇరువదియొకమాఱు గిరులు విరిగి కొచ్చె జరణంబులు॥ అంగ॥ అది మొదలుగను నలసితి ముదుసలిని నేను నదియయినను నిప్పటికి దొంబ। దామడ దాటంగ గలను॥ యంగద॥ ధారుణిలోన నారాయణకవినుతముగ॥ ధారుణి॥ గూరిమి విహరించు మోక్షగుండవిభుని పాదమాన॥ యంగ॥

వ. అంత నలుండు తొంబదియేడామడదాట జవంబు దనకుగల దని పలికె. అప్పు డంగదుండు—

క. శతయోజన మెగురుసమ
ర్థత నాకును గలదు; మరల రాలే నేమో
యతిసంశయంబు గలిగెడు
గతియే మని పలుక భల్లుకప్రభు వనియెన్.

క. నీవు యువరాజ వగుదువు
కావున, సుగ్రీవసమముగా దే మాకున్
సేవకులము మే ముండఁగ
నీ వేగఁగవలెనె! వలదు నిలువుమువత్సా!

వ. అని యిట్లువారు మథనచేయ నేమియుఁ జెప్పక యూరక గూరుచుండె. ఆంజనేయుని దగ్గిరి జాంబవంతుం డిట్లనియె:

బేహాగ్: ఆదితాళము.

పవమాననందఁనుడవు నీవు; అసమానబలుడ వనఁ దగినావు: అనుమాన మేటికి లేచి రావు? మౌన మూన నౌనా! లేలెమ్ము! చిన నాఁడే ఫల మని భ్రమఁజెంది కమలబాంధవు మ్రింగఁబోయి కందినిల నోడి యిలపైన బడి నుంది చూడఁ జూడ వాడి జెడవు॥ పవ॥ నీవం శ్రీమోక్షగుండ కాంతు కార్య మంత దీర్పగ నని వచింతు హనుమం నీ చెంత మాకుప్పిగంతు లెంత! వింత! సంతసమున॥ బవమాన॥

వ అనిన నుప్పొంగి బలివిధ్వంసనకాలంబున వామనమూ వలెఁ బర్వతాకారుండయి మహాట్టహాసంబున బ్రహ్మాండంబు భేదిల్ల సింహనాదంబుఁజేసి హనుమంతుండు శ్రీరామకార్య ధురంధరుఁడయి యిట్లనియె:

పంచచామరము.

హాళాహళిన్ ధరాత్మజాత నట్టె చూచి; రావణున్
గళత్రపుత్రబాంధవాదిగా వధింతుఁ! గానిచో

గళంబులందుఁ ద్రాడుగట్టి గట్టిగాను నీడ్చుచుర్
జెలంగి లంకతోడ వానిఁ జేర్తు రాము ముందటర్.

తో: ఈలవణాంబుధి గాలువఁబోలియు- నే లంఘించెదఁ జూడు!
ఆలంకాపురి నాద్యంతంబును గాలిచి వేసెద నేఁడు॥ రామ॥

పంచ. సురాది దైత్యవీరు లొక్క- చోప్పునన్ శరించినన్
హరాజముఖ్యులెల్ల వచ్చి యాజ్ఞచేయఁబూనినన్
జరాచరప్రపంచ మొక్క- సారివచ్చి తాఁకినన్
ధరాత్మజాత జాడఁబట్టెదన్ శుభంబు విన్నెదన్.

వ. అనిన, మ ానందంబున జాంబవంతుం డనియె:

క. నీ వంతచేయువాఁడవు
గావా! నీకడ్డమేది గలదు ధరిత్రిన్!
వేవేగమె భూపుత్రిని
భావించియుఁ గాంచిరమ్ము పవనతనూజా!

వ. అనంతరము శ్రీరామచంద్రమహాప్రభువే సమస్త కార్యం
బులు దీర్పఁగలఁడు. నీకు శుభంబగుఁగాక. పోయిరమ్మని జాంబవం
తాదులు దీవింపఁ గైకొని లంకాపురప్రయాణోన్ముఖుఁడై—

క. అంతట, హనుమంతుఁడుఁ గడు
సంతోషముతో మహేంద్రశైలాగ్రముపైఁ
బంతమున నెక్కి- యుదియొక
గంతున దాఁటం గడంగెఁ గలశాంభోధిన్.

ఆశ్వాసాంత—తోహర.

అని తాళ్ళూరి నారాయణకవి రామాయణమును హరికథను,
ఘనముగఁ జెప్పెను గద! గిష్కింధా కాండము జిలుకును సుధను॥ రా॥

ఇది వినువారల కిహసౌఖ్యంబులు గొదవలేక చేకురును; ముదమున
నుడకును ముక్తి లభించును మోతుకుండ హరికృపను॥ రామ॥

క. నాచేతనైన కొలఁదిని
జూచి రచించితిని దీని సుజనులు నెరసుల్
దోఁచినయెడ దిద్దుదు రని
నాచిత్తములోన నమ్మినా ననయంబున్.

మోతుకుండరామాయణమునందలి కిష్కింధాకాండము

సంపూర్ణము.

---

శ్రీ రామచంద్ర గురు పరబ్రహ్మణేనమః
అవిఘ్నమస్తు.

# శ్రీమోక్షగుండరామాయణము

## హరికథ.

## సుందరకాండము.

క. శ్రీరాముని కార్యార్థము
మారుతి చనునపుడు తనకు మంగళ మగు న
ట్లారూఢిఁ దలఁచి మంగళ
హారతులను వాడె వేడ్క నారామునకున్.

కమాచ్: రూపకము.

స్వామి! సీతారామ మంగళం ! నిటలాక్షవినుతనామ ! దివ్య
ధామ! మంగళం! నేమంబున నీనామము గామించితి నామనమున॥స్వా॥
భూతకోశాతీత ! మంగళం ! శ్రీమోక్షగుండ నేత ! భక్తోపేత ! మం
గళం! ఖ్యాతిగ నారాయణకవిచేతోయుత ! జ్యోతిర్మయ ! ॥స్వామి॥

వ. ఇట్లు మంగళంబులుపాడి తనతండ్రికి నమస్కరించి, రాముని చరణారవిందంబులు హృదయారవిందంబున నిలిపికొని వానరులం గని యిట్లనియె:

ఉ. వానరులార, రాఘవుని బాణపరంపర నూటినేగు న
ట్లేను వియత్పథంబున యథేచ్ఛ సముద్రము దాఁటి పోయి, యా
జానకిఁ గాంచి మ్రొక్కి వడిస్వామిని జేరఁగవత్తు మీరలున్
బూనికతోడఁ జూడు డిఁకఁ బోయెద నేను గృతార్థుఁడన్ జుడీ!

గీ. ఏమహాత్ముని స్మరణసంస్మృతి మహాబ్ధి
దాఁటి భక్తులు పరమపదమ్ముఁ గాంతు,

రామహాత్మ్మని యాజ్ఞ నీయబ్ధిఁ బిల్ల
కాల్వవలెఁదాఁటి తత్కటాక్షమ్ముఁ గాంతు.

వ. అని పలికి తత్క్షణంబున హనుమంతుండు—

చ. అడుగులు నద్రిపై నిలిపి, యంగము గ్రుంగఁగఁజేసి, కన్బొమల్
గడువడి నెత్తి నిక్క నటు గర్ణయుగంబును లేపి, వార్ధినె
ల్లెడఁ గలయంగఁ జూచి. మెడఁ యెత్తియు, దోకఁ గదల్చి, నెమ్మదిన్
వడి చెడ నీక మారుతి జవంబున దాఁటె సముద్రమత్తఱిన్.

వ. ఇట్లు వియన్మార్గంబున వాయువేగంబున సముద్రంబు మీఁదుగఁ జనుచుండ దేవత లందఱు—

గీ. ఆంజనేయుని ధైర్యంబు నరయు వేడ్క
నురగులం గన్నతల్లియౌ సురసఁ గాంచి
పవనజున కడ్డపడి వానిబలముఁదెలిసి
రమ్మనీ వన్న, వికృత దేహమ్ముతోడ.

తో: అడ్డముగాఁ జని, యహాహా! నే నిపు డాకలిగొని యున్నాను। గ్రుడ్డురీతిగా గుటుకున మ్రింగుదుఁ గోరి నిను నే నను॥ రా॥

హనుమంతుఁడు—

హిం. తో: రూపకము.

అమ్మ ! నేను రాముని కార్యమ్మునకును, బోవుచుంటి । గమ్మర సీతమ్మ నరసి నమ్మకముగను నేతెంతు॥ నమ్మ॥ ధారుణి శ్రీ మోక్ష గుండధాముని కీవార్తదెలిపి చేరవచ్చి నీకు నే నాహార మగుదుఁ దరలాక్షి॥ యు॥

వ. అని వేడికొనిన సురస వినక—

కమాచ్: ఆదితాళము.

నీ మాట వినను; మో మోట మేలను మాటికి నీవి బూట కములు నాతోటి పలికెదవు! పాటిగాదు॥ నీమాట॥ సామాన్యుల వలె జౌకగ జూచితి వేమో! చిక్కితి వికను విడువ॥ నీమాట॥ ఆకలిగొం టిని నారగించెదను గాక, వచ్చుసందాక నిలువ॥ నీమాట॥ పోతు గుండపతిసాక్షిగ విను నిన్ని క్షణముననే భక్షించెద॥ నీమాట॥

వ. అని ఖండితంబుగఁ బలికిన,

సీ. వనితరో, నేను బోవలె వేగ నీనోరు
దెఱవుము తెఱవును పఱతుదూఱి
అని శరీరం బొక్క-యామడ పెంచిన,
నైదామడలు విప్పె నదియు నోరు;
పదియామడలు పెంచెఁ బవనుజుఁ డంగంబు;
నిరువదియామడల్ దెఱచెనదియు;
ముప్పదిరెట్లుగా మొనయ నాతఁడు పెంచె;
నేబదియామడ లింతి దెఱచె;

గీ. నంత నంగుష్ఠమాత్రుఁడై యందు దూఱి
వెలుపలికి వచ్చి నిలిచిన వెలఁది మెచ్చి,
వినుఁ బరీక్షింపదేవత లనుప వచ్చి
నాను నాపేరు సురస; మంగళమునీకు.

తో. రాముని దేవిని రయమున గనుఁగొని రాఁగల విశఁద్వర గాను। ఓమారుతి! నేఁ బోయెద నని యాభామిని వేగమె చనెను॥ రామ॥

వ. అంత హనుమంతుం డరుగుచున్నఁగని సముద్రుండు మైనా కునితో నిట్లనియె:

జంఝూటి-ఆదితాళము.

మారుతి లంకాపురమునకు జేరఁబోవుచు నుండెనుగా; సాగరు నీవేగి కడువిశ్రాంతిఁ జేయుము లెమ్మనెగా॥ మారుతి॥ సాగరముచే వృద్ధినొందిరి సగరులెల్లను గ్రిందటగా; బాగుగ దత్కులజుఁ డగు రఘువరునికార్యముఁ జేయఁగదా॥ మారుతి॥ మోక్షగుండపురీశుకరుణా వీక్షణంబున జేకుఱు; ఈ క్షణంబున నీవు జేయుము దీక్షతో సత్కారము॥ మారుతి॥

వ. అని యిట్లు సముద్రుండు చెప్పిన మైనాకుండు నరాకృతితో బయికిఁ బెరిగి యాంజనేయునిం గని,

తో. వారధిపనుపున వచ్చినాఁడ నాపే రిదె మైనాకుండు। మారుతి, కొంచెము మార్గాయాసము దీర్చిపంతునిటనుండు॥ రాను॥

వ. నను స్తవస్తువులు ఫలములును దెచ్చినాఁడ. ఇవి గ్రహించి కొంచెము విశ్రమించి పోవలయు నని కోరిన, నతండు—

క. వారధి మధ్యను నిలువక
బారెద నని శపథమూని వచ్చితినట మా
వారలతో; నటుగావునఁ
గూరిమితో విశ్రమింపఁ గూడునె నాకున్?

వ. నీయిష్టప్రకారము వచ్చి నా హస్తమునుమాత్రము శిఖరంబున నుంచెద. హస్తస్పర్శముచేత సంతోషింపుము అని యట్లుచేసి యవతలఁబోవ దశయోజనంబుల వెడల్పు సహస్రయోజనముల నిడుపు గల సింహిక యను ఛాయాగ్రహంబు వచ్చి యాంజనేయుని మ్రింగుచుండె.

క. జంతువులు పైనఁ బోవఁగఁ
బంతంబున ఛాయ పట్టి భక్షించియు దా
నంతట వారిని మ్రింగున
దంతయు దా నెఱిఁగి మారుతాత్మజు డలుకన్.

తో: అకటా! యిదియొక టడ్డము వచ్చెను నాశ్చర్యంబుగ ననుచు, బ్రకటితముగఁ గ్రిందికి జని దానిని బదమున దన్నెనుగనుచు.

చ. ఇటువలె దానిదన్ని మడియించి వియత్పథగాముఁడై సను
త్కటబలుఁడౌచు దక్షిణపుదట్టుగ మళ్ళియు బోయి పోయి యం
తటను త్రికూటపర్వతము, దానిపయిన్ వెలుఁగొందు లంకయున్
దటుకునఁ గాంచె మారుతి ముదంబున డెందము పొంగుచుండగన్.

వ. ఇట్లు గాంచి పగటిపూట లంకాపురప్రవేశము జేయ గూడదని సువేలాద్రిపై నివసించి, రాత్రికాలంబున నుత్తరద్వారంబున సూక్ష్మరూపుండై ప్రవేశింపఁబోయిన లంకిణి యడ్డము వచ్చి—

పూరికల్యాణి: ఆదితాళము.

నీ వెవ్వడవురా! నీపే ర దేరా! వేవేగఁ జేర నీవేళ రానుపోర! ॥నీవె॥ ననుగెల్చి లంకఁగన బొమ్మ బింకము నడంతు నింక బొలియింతు గింక కుంక ॥నీవే॥ లంకిణి నేను; లంకగాచేను, బొంకముగా నిను బోనీను మానుమాను॥ నీవె॥ ధరమోతుగుండపురహరియుండ జొరబో నీకుండ గోరుకుదు గండకండ॥నీవె॥

వ. అనిపలికి కాలితోఁ దన్ని పోనీక యాపినఁ బొడగునఁ బెటిగి గ్రుడ్లెత్తజేసి యాంజనేయుఁడు—

తో: వెడదవక్షమున నెడమపిడికిటను బొడిచిన రక్తము గ్రక్క పుడమిమీదఁ బడి పొరలి లేచి యాపడతి పలికె దామ్రొక్కి॥ రా॥

వ. ఓమహానుభావా! జగదేకవీరా! నీకుజయ మగుగాక! నీవు లంకలోనికిఁ బోవలసినది. పూర్వ మొకపరి బ్రహ్మ నాకు జెప్పినదియే మనఁగా; నీక నిరువది యెనిమిదవపర్యాయము త్రేతాయుగము వచ్చినప్పుడు శ్రీమన్నారాయణుండు రాముఁ డన రఘుకులంబున బుట్ట గలఁడు. అతనిభార్యయగు సీతను రావణుడు దెచ్చి లంకలో నుంచునప్పుడు రామునిప్రేరణమున వెదకుచు నొక్కవనచరుండు రాత్రికాలం

బునవచ్చి నీచేత నాపఁబడి నిన్ను దండింపగలండు. నీ వెప్పుడు పరిభవము బొందునాటితో లంకయు, నందున్న రక్కసులును జిక్కువడి నశింతు రనియె. అదినిజం బయ్యె, వినుము—

తో: రావణు డుండెడు రమ్యసౌధనమున కావల గల దొక వనము; నావనమున ఘనమైన శింశుపం బనుచె ట్టున్నది కనుము ॥రా॥ అందు ఘోరదనుజాంగన లలజడి నొందింపగ దైన్యమున గుందుచు నాతరుమూలంబున సీత వందురు గనువేగమున॥రా॥

చ. జనకజవార్త రామునకుఁ జయ్యనఁ జెప్పి, దురం బొనర్ప నా
ఘను నిటుఁ దోడితెచ్చి దశకంఠుని గూలిచి లోకజాలముం
మనుపుమటంచుఁ దెల్పు జనమాన్యనకుం రఘురామమూర్తికిన్
దనుజులు గ్రుంగి రంచుఁ గ్రమతం దలపోయుము వాయునందనా!

వ అని పలికి యతని వీడ్కొని రామధ్యానంబు సేయుచు లంకిణి యభీష్టం జనియె. అంత హనుమంతుండు సూక్ష్మతనుండయి లంకఁబ్రవేశించి

కేదార: రూపకము.

దీనిసొంపు గానగను అనిలింపులైన భ్రమపడరే! మానసంబులోన ముద మొదవెను! శ్రీనిధియైచెలగుచున్నదియపురా॥ దీని॥ మూడులోకములయందు జూడ దీనిజోడు పురి కలదే! నాడెమైన మందిరములు జిత్రము! వేడుకతో వెలయుచు నున్నది యపురా॥ దీని ॥మోక్షగుండా ధ్యక్షునితోఁ గక్షగట్టె గాన, నీనగరము రాక్షసుండు దీక్షగను నేలుచు నీక్షితిపై నిక సుఖపడగాఁ జాలఁడు॥దీని॥

వ. ఇటువలె బురం బభివర్ణించుచు గూఢచారుండయిచని,

మధ్యమగతిరగడ.

వెదకెఁ బవనసుతుఁడు! లంకను క్షితికుమారి నపుడు। వరరథశాలలువైద్యశాలలును, హరికరిశాలలునస్త్రశాలలును,।వీరభటులుగ్ర

విపులగేహములు । శూరులు నిలిచిన సుందరగృహములు । వీధులు దిన్నెలు విపణిమార్గములు। సౌధంబులు రచ్చలు గోపురములు । దేవాలయములు చెలియనిగొందులు, సావడులును సుస్థిరమగు సందులు ॥ వె॥ వందిమాగధుల వాసస్థలములు। నందము లగుగాయకుల గృహంబులు । వారకామినుల వరమందిరములు।పౌరాణికశుంభన్మందిరములు। మంత్రివరుల నిర్మలతరవసతులు । తంత్రజ్ఞుల సుందర సద్మంబులు। గడిసి సుమాలాకారులయిండ్లును । వదలక చని దైవజ్ఞులయిండ్లను॥ వె॥ కుంభశ్రవణునిగోష్ఠపు నెలవును । గుంభనికుంభుల గురువాసములును। అతికాయుని దివ్యంబగు సౌధమును । బ్రతిలేని యకంపనుని సౌధమును గంపనునగరును ఖరసుతుభవనము । దెంపునఁ జని యాత్రిశిరునిభవనము నక్షయు నలువగు హర్మ్యతలమ్మును । నక్షయమగుధూమ్రాక్షు మందిరము । దూరి యింద్రజిత్తుని గేహంబును । దారుచుదేవాంతకు గేహంబును । నామహోదరుని యతులమందిరము । నామహాంగుడున్నట్టిమందిరము । సొరిది మహాపార్శ్వునివాసంబునుఁవరుసను పార్శ్వుని వరనిలయంబును । గడమ పెక్కురాక్షసులసదనములు । అడరులేక దివ్యాంతఃపురములు॥ వెదకె బవనసుతుఁడు॥

వ. ఇట్లు వెదకి మెక్కుడను గాఁన గ్రమంబున రావణుని దివ్యసౌధంబుఁ జేరి, యందలి పనితనంబునకు నచ్చెరు వొందుచుఁ గావలి యున్న వారల బరిశీలించుచుఁ దిన్నని నడకలతో నంతఃపురంబుఁ జేరి యచ్చట;

తో. చెలఁగి రావణుఁడు—చెఱ దెచ్చిన యాస్త్రీలు వానితో గలసి। పలువిధసుఖముల వడసియు నిద్రాపరవశు లగుచును॥ సొలసి॥

వ. కోకముడులు బిగించుకొనకయు, గంచుకంబులు మరల ధరింపకయు, విమానంబుమీఁదనే యొరిగి నిద్రించుచుండు వారలఁ గని యాశ్చర్యకలిత చిత్తుండయి హనుమంతుఁడు—

క. ఇట్టి నెఱజాణలుండియుఁ
గట్టా! దశకంధరుడు కాకుత్స్థునసతిన్
నెట్టన జెఱవట్టెనుఁ దన
చెట్టతనంబునన తాన చెడిపోవుట కై.

వ. అని కొంత చింతించి,

తో. స్వామికార్యమును, సలుప వచ్చి జవ్వనులవిలాసముగంటి రామునింతి వీరలలో వెదుగక రాదు కలుషమును గొంటి॥ రామ॥

వ. ఇం దుండఁ దగదని యెంచి యవతలఁబోయి యొక్క రత్నవేదికపై బువ్వుపానుపునఁ బవ్వళించి నిద్రపోవుచున్న రావణునిఁ గనుంగొని యతని యుభయపార్శ్వంబుల—

తో. ఆడియు బాడియు నడపముఁ గట్టియు నాలవట్టములు వట్టి। వేడుకతోడుత వింజామరములు వీచుచు నిద్రలుముట్టి॥ రామ॥

వ. దేవ గంధర్వ దైత్య కాంతలు వాండ్రు నిద్రించిన పిమ్మటఁ దమ చేతి సాధనంబులు గౌఁగిలించుకొని మయిమఱచి నిద్రింపుచుండఁ జూచి రావణుని విభవంబున కద్భుతపడి తలయూచి యింతలో—

తో. అతనిగౌఁగిటను నలరి రతులఁ బెల్లలసి సొలసి నిదురించు రతిఁ బోలిన మందోదరిఁ గనుఁగొని కుతుకమునంది పరికించు॥ రా॥

వ. సీతను గంటి నని యానందించి గంతులువైచి వాలాగ్రంబు జుంబించి కంబంబుల కెగబ్రాకి జాతివికారంబులం గొన్నింటిఁ నగపఱచి యనంతరంబ,—

జంఝూటిః త్రిశ్రజాతి.

నే నెంతో మోసపోతి! నే నెంత వెఱ్ఱి నయితి! యీసీమ తరుణినిఁ జూచిఁ జానకి యని తోచి భ్రమసికానక తలచితిని యీ పతివ్రతాతిలక మన్య గవయ గోరునే! మది తప్పఁదలచెను॥ నే నెం॥
కడుమోహతగుండవిభుని విడనాడి యీరావణుని కొడబడి యీరీతిని

బుడగిజ మధు వాని చెడునా! తడబడి యెంచితిని, పరమమూఢుఁడ
బాపకర్మ మొడిఁగట్టితి! నేరమ్ము జేసితి॥ నేనెంత॥

వ. అనియిట్లు చింతించి యనంతరము మధుమాంసయుక్త
బగు పానీయశాల లరయుచుండె నవి చెప్పిన విని శాంకరీదేవి శంకరుఁ
కిట్లనియె:

క. జానకి పతివ్రతగఁ దనమానసమున
నెఱిఁగి యుండి మందోదరినా
వానరుడు గాంచినప్పుడు దా
నేల భ్రమించె మదిని ధరణిజ యనుచున్.

వ. ఆకారణంబేమో వివరంబుగ నాకు సెలవిమ్మని ప్రార్థిం
చిన, శర్వాణి కీశ్వరుం డిట్లనియె:

తో. సిరిరూపమువలె హరిచే మందోదరిని నిర్మింపఁగబడియెన్।
సిరియంశంబున, సీత యవతరించినది కాన సరిపడియెన్॥ రామ॥

వ. అది యెటు లనిన రమాంశ సంభూత సీతగదా! మందోదరి
జన్మకథ వినుము.

గీ. ఘనగుణోపేత మాల్యవద్గర్భజాత,
ప్రణుతకాంతాసమేత రావణునిమాత
వీతపాతక దుఃఖంబు చేత జిత్త
మందుఁ బొగులుచుఁ దనయున కనియె నిట్లు:

కైకసి—

ధన్యాసి: ఆదితాళము.

ఓతనయా! విను మొకదుఃఖము నా కొనగూడెను నేడు!
ఆతెఱఁగే నని యడిగెద వేమో! యాతరి నేవచించెద సర్వము॥ నో॥
శేషోచ్ఛ్వాసముచే నాలింగము చేరె రసాతలము, । శేషభూషణు భజిం
చుచు నందున నేసతతం బదె నిలిచి పోయె నిక॥ నో॥ ఇమ్మహి

నుక; యుట నుండను నే గనుక; నటుపయి నాగ్రహాపడక; రమ్మ
హొమ్మ త్రుటిలోన మోక్షగుండపతికృపను॥ కమవడిగను॥

వ. అని స్పష్టముగాఁ బలికిన సమ్మతించి లింగంబు విప్రునిచేతి
కిచ్చి మూత్రనివృత్తికొఱకు రావణుం డావలఁ జని,

క. మూత్రము విడుచుట మఱియక
రాత్రించరుఁ డనిః రీతి రాకుండిన నా
ధాత్రీసురుండు లింగము
ధాత్రి నిడెఁ బశ్చిమాబ్ధితటమున నపుడున్.

వ. ఇట్లుంచి నారాయణుండు స్వీయలోకంబునకుఁ జనియె.

సీ. రావణుఁ డంత యథావిధి మూత్రవి
సర్జన జేసి యచ్చటికి వచ్చి
విప్రుండు లేకున్న వెదకి లింగంబును
గదలింప నేమియు గదల కావు
చెవిబోలుగ త్రంబు శిరమున నేర్పడ
గోకర్ణ మనుపేరు ప్రాకటముగ
గలిగె నాస్థలమున; కలఁతఖిన్నమనస్కుఁ
డయి దశాననుఁడు నెయ్యమున బయలు

గీ. దేఱి పాతాళలోకంబుఁ జేరి, యచట
మయగృహంబున నున్నట్టి మగువఁగాంచి
డెందమందున మెచ్చి యానంద మొంది
యతనితో నిట్లు పలెక స్నేహంబు గదుర.

ముఖారి. ఆది (వలద చటికి) దరు.

మమ! తనయ నిమమమా దయజూమమయ! ॥ మయ ॥
నయమైన సదన్వయజుఁడ రావణాహ్వయుఁడ లంకాధీశుఁడ, ప్రఖ్యా
తియుతుడ॥ మయ॥ నాకు నీడగు చెలి నాక-మర్త్య-వరలోకములో లేక

వ. కపటవిప్రుఁడు నవ్వుచు నిట్లు పలుకుచున్నాఁడు:

కీర్తన: రూపకతాళము. (ఎందుబోతివయ్యా)వలె.

మంచిచెడ్డ లిందు నీవు గాంచవైతివి! రావణ॥ మంచి॥ వంచన గావించె నీశుఁ డెంచవైతివి యేమాత్రము॥ మంచిచెడ్డ॥ శైలసుతను దాచెను: రసాతలమునను మయునింటను; బోలఁగ గపటంపు సతిని హేల నొసఁగెను నిను గొనుమని॥ మంచి॥ దేవమర్త్యలోకములు నీ వెఱుంగుట గాంచెద వని తావడి బాతాళమందు దాచె మఱుఁగ వంచనముగ॥ మంచి॥ ఈక్షణమున మయునింటి కేగిజూడుము కనవచ్చు సతి! మోక్షగుండ దేవుసాక్షి మోసపోకుము॥ దశకంధర॥

వ. అనిన నామాట నమ్మి రావణుడు దిరిగి కైలాసంబునకు వచ్చి,—

క. శంకరకపటంబున నీ
పంకజముఖినాకునిచ్చి పాతాళమునన్
శాంకరిని దాచితివి నే
గొంకకనటకేగి తెచ్చుకొనెదను గనుమా!

వ. ఈకృత్రిమకాంతను నీవే కొనుమని పార్వతీ! నిన్ను నా కర్పించి లింగముం గొని చనుచు ముందు వచ్చియున్న విప్రునితోఁ గలసి,

తో! అల్పశంక కే నరిగి వచ్చెదను నంతవఱకు లింగమును॥ నిల్పుము నీకరనీరజమున నవనీసుర యని పలుకగను॥ రా॥

వ. బ్రాహ్మణుం డిట్లనియె:

కీర్తన. ఆదితాళము (వగపేటికి) వలె.

కడువడిగను రావలెను; గ్రక్కున నే జవవలెరుఁ దడ వయినను లింగమును ధరమీదను వైచెదను! వినుము చనుము; చెడిపోవుగాదె కార్య మావలను॥కడు॥ ఘటికాద్వయ మగుదనుక గనిపింతును నావె

నుక; యిట నుండను నే గనుక; నటుపయి నాగ్రహపడక; రమ్మ్ము
పొమ్ము త్రుటిలోన మోక్షగుండపతికృపను॥ కదువడిగను॥

వ. అని స్పష్టముగాఁ బలికిన నస్మ్మతించి లింగంబు విప్రునిచేతి
కిచ్చి మూత్రనివృత్తికొఱకు రావణుం డావలఁ జని,

క. మూత్రము విడుచుట మఱియక
రాత్రించరుఁ డని యీరీతి రాకుండిన నా
ధాత్రీసురుండు లింగము
ధాత్రి నిడెఁ బశ్చిమాబ్ధితటమున నపుడున్.

వ. ఇట్లుంచి నారాయణుండు స్వీయలోకంబునకుఁ జనియె.

సీ. రావణుఁ డంత యథావిధి మూత్రవి
సర్జనఁ జేసి యచ్చటికి వచ్చి
విప్రుండు లేకున్న వెదకి లింగంబును
గదలింప నేమియు గదల కాపు
చెవిబోలుగ త్రాంబు శిరమున నేర్పడ
గోకర్ణ మనుపేరు ప్రాకటముగ
గలిగె నాస్థలమున; కలఁతఖిన్నమనస్కుఁ
డయి దశాననుఁడు నెయ్యమున బయలు

గీ. దేఱి పాతాళలోకంబుఁ జేరి, యచట
మయగృహంబున నున్నట్టి మగువఁ గాంచి
డెందమందున మెచ్చి యానంద మొంది
యతనితో నిట్లు పల్కెఁ స్నేహంబు గదుర.

ముఖారి. ఆది (వలదచటికి) వలె.

మయ! తనయ నిడుమయా దయజూడుమయ! ॥ మయ ॥
నయమైన సదన్వయజుఁడ రావణాహ్వయుఁడ లంకాధీశుఁడ, ప్రఖ్యా
తియుతుడ॥ మయ॥ నాకు నీడగు చెలి నాక-మర్త్య-వరలోకములలోలేక

యె నిటువచ్చినాను॥ మయ॥ లక్షణమైన దీలగ్నమునందే పోతు
గుండేశుకృపను ముదిత నీఁ డగును॥ మయ॥

వ. అని ప్రార్థించిన హరివలన సర్వము ముందే యెఱింగియున్న
వాఁడు కావున, మయుండు మంచి దని కన్య నిచ్చి పెండ్లి చేసి,

తో. అరిభయంకరం బగు నొక శక్తిని సరణంబుగ నర్పించి। తరు
ణిని దశకంధరునివెంట దానరుగఁ బంపె మోదించి॥ రా॥

క. మందోదరమున నొప్పుట
మందోదరి యనుచు జనసమాజ మునఁగ నా
సుందరి యొప్పెను రావణుఁ
డందంబుగఁ జేరె లంక కతిపయ దానర్క.

గీ. ఇట్లు లంకఁ జేరి యింటఁ బ్రవేశించి,
తల్లికడకుఁ బోయి, దండ మొసఁగి,
యెల్లసంగతులను దెల్లంబుగాఁ దెల్ప,
నాలకించి యామె యాగ్రహించి.

వ. అంగజ విభంగునడిగి లింగంబుఁ దె మ్మని యెఱుంగ జెప్పి
పంప నాసంగతి భంగపఱచి దొంగజాడలఁ జని యీ యంగనను
దెచ్చి ప్రసంగంబుఁ జేయ వచ్చితివి! బంగారువంటివంగడమున వెంగలివి
పుట్టితివి. చేలా! నీ కీ యధైర్యంబేలా! అని తృణీకరించిన రావణుఁడు
లజ్జించి,

తో: గోకర్ణమ్మునకు నరిగి పద్మజు గూర్చి తపము జేయగను।
ఆకమలజు డత్యంతప్రేమఁ బ్రత్యక్షమైన మ్రొక్కుచును॥ రాను॥

పూరికల్యాణి: అటతాళము.

కంజోద్భవా! కావవే! ॥ కం ॥ అంజలిజేసి భక్తి రంజిల్లగఁ
బ్రమొక్కెదను ॥కంజో॥ నాకుఁ ద్రిలోకవశీకరణైక బలాకృతిఁ గైకొనక
లోకేశ్వర చేకూర్పుము ॥కంజో॥ పోలఁగ నేఁ జిరకాలము లంకను నేలగ
నాకపురపాలసుత! వర మీయుము ॥కంజో॥

వ. అని వేఁడి వరంబులు వడసి వచ్చి దిగ్విజయంబుసేసి సర్వ సుఖంబు లనుభవించుచుండె; నదికారణంబున—

క. వైదేహి యనుచు నామం
దోదరిఁ గని బ్రమసె నైన పొనరిచె నిది; యా
మీఁద హనుమంతు శోకపని
మోదంబున జేసి చనియె మోసవిధముగన్.

వ. అది యేమి యనిన మయునకు బంధువుఁ డగు గయుఁ డను రాక్షసుండు బ్రహ్మను దపంబున మెప్పించి వరంబువడసి పరాక్రమ వంతుఁ డయి వచ్చి.

క. రావణునను మతమున లం
కావరనగరంబునందుఁ గాపుర ముండెన్;
గావున నాతనివస్త్రము
పావని రావణునిశయ్యపైఁ బడవైచెన్.

తోహార: దశవదనుని వస్త్రము విభీషణుని తల్పముపైఁ దా నుంచెన్। విశదంబుగ గపివీరుం డిది యొకవింతచేసి యరుదెంచెన్.

క. రావణునగళ్ళు మొదలుగ
దేవాదులయిండ్లు గలయఁ దిరిగిన సీతా
దేవి కనఁబడమి నెఱుకుచుఁ
బావని చని యశోకవనమున కపుడున్.

వ. లంకనంతటఁ దిరిగి యెందును గానక లంకిణి చెప్పిన గుర్తుప్రకార మశోకవనంబున కరిగి,

శా. నానాపక్షిమృగాకులంబు నవరత్నస్థాపితామూల్యసో
పానభ్రాజితవాపి యుక్త మనులప్రాసాదరమ్యంబు నా
నానూనద్రుమశోభితంబసురదైత్యస్త్రీసమాకర్ణము
ద్యానంబందున వాయుజుండు వెదకెన్ హర్షంబునన్ జానకిన్,

వ. ఇట్లు ప్రతివృక్షమూలంబున వెతకుచుం బోయి మణిమయ శత స్తంభసంభరితం బయిన భవ్యహర్మ్యంబును గని యాశ్చర్యంబు నొంది యచ్చటను సీతను గానక నెమ్మదిని నధైర్యంబు దోచి,

హిం. తోడి: చాపు తాళము.

సీతజాడ నాకు నెందుఁ జిక్కదాయెరు! భూతలేంద్రు చెంత కెట్లు పోవువాడను॥ సీత॥ దానవేంద్రుమందిరంబులోన జూచితి; వాని పుత్రు లున్నయిండ్లు పూని చూచితి॥ సీత॥ సందుగొందులందు బోయి చాల జూచితి; బొందుగ వనంబునందుఁ బొంది చూచితి॥సీత॥ చక్కగ శ్రీమోక్షగుండస్వామిదేవిని ఎక్కడ గన్పింప దన్నియెడల గంటిని॥ సీత॥

తో: వనచరావళిని వదలి నన్ను శూరునిగా రాముఁడు మెచ్చె! జనకజపోబడి గన జాలుదు వీవనుచు నానవా లిచ్చె॥ రామ॥ కాన వచ్చితిని కార్యము దీర్చెడు వానిరీతి నే డిచట మానినిపోబడి గాన రాదు వేమఱు వెదకితి నేఁ డకటా ! ॥రామ॥

వ. లంకిణి చెప్పినవిధంబున నీయశోకవనంబున నెంత వెదకినను సీత యుండుతావు దొరకదయ్యె దైవమా !

ఫీల్ రాగము: అటతాళము.

ఇఁక నేమిచేయుదు నెక్కడలేదు! ఇక నెందు వెదకుదు నింతికన రాదు॥ ఇ॥ విసివిప్రాణములు విడిచెనోకాక, యసురునిచే దప్పి యబ్ధి నిబడెనో॥ ఇ॥ తనమాట విన కున్న, దానవవిభుఁ డు మనిమెనో ! దను జులు దినినారో కాక॥ ఇ॥ ఒరులకుఁగాన రాకుండ రావణుఁడు బరదేశ ములనుంపఁబంపెనో వీడు॥ ఇ॥ భూమిజ జూడక శ్రీమోక్షగుండ ధాముని కడ కెట్లు దగఁ జేరువాఁడ॥ ఇ॥

వ. నేమ వృధాగ జని సీత దొరకలే దనిన భార్యావియోగ దుఃఖంబుచేఁ బొగిలి తత్క్షణంబున—

తో: చచ్చురు రాముఁడు; జచ్చు లక్ష్మణుఁడు— సరగున నది విన్నంత జచ్చును భరతుఁడు శత్రుఘ్నుండును; జత్తురుబంధువు లంత॥ రామ॥ ఇనకుల మడఁగును; నిటువలె నది గని యినజుఁడు జచ్చును పిదప; వనచరు లందఱు వరుసగ జత్తురు వనితలే దనుచుఁ దెలుప॥ రా॥

వ. ఉభయకులంబుల వ్యర్థంబుగ నీరు జేయుటకయి నే నచటికిఁ బోవుట కన్నను,

క. వానప్రస్థుని విధమునఁ
గానలకుం జేరి తపముఁ గావింతును; గా
దేని జలనిధిని దుముకుదుఁ
గాని యెటన్ వహ్నిఁజొచ్చి కడువడిఁ జత్తున్.

వ. అంతేకాని ప్రాణంబుల పయి యాసవడి తిరిగి పోయి అంత మందిని జెరుపఁ దగ దని కొంతవడువుఁ జింతించి పిమ్మటఁ దనంతటఁ దాను ధైర్యంబు దెచ్చుకొని,

కమాచ్: రూపకము.

నే మానుదునా కనక నేమానుదునా॥ రాముసికగుణాసారము నామీఁదను బ్రసరింపఁగ, నీముల్లోకంబులతో నెగుండినఁ బరికింపక॥ నే॥ స్పష్టంబుగ భూజాతను దృష్టికి జూపింపుడనును సప్తదిశాపతులను నే నల్లాడించెదనుగాక॥ నేమా॥ కుమ్మరిసారెవిధంబున, నిమ్మహి కుల గిరియుతముగ దిమ్మదిరుగ గిరగిర మని త్రిప్పియు దిప్పలు పెట్టక॥ నేమా॥ నాలావురు మోక్షగుండనాథుఁడు విని చయ్యనగను నీలంకా పురినసురులతో లవణాంబుధి ముంపక ॥నేమా॥

వ. ఏదోయొకవిధంబుగ సీతను గాంచి మఱిపోదునుగాని యాలతింబోలె నూరక పోదునా! యని నిశ్చయించి యతిలాఘవంబున నామేడపై కెగిరి యవతల నిదానంబుగా నుపలక్షించిన నచ్చట.

తో॥ ఎండజొచ్చుటకు నెడములేక గడుమెండుగ నాకులు బలిసి దండిగ గుబురై యుండిన శింశుపతరుమూలంబున సొలసి॥ రా॥

క. దానవతరుణుల మధ్యను
దానును మలినాంబరంబు ధరియించి మదిన్
దీనత్వంబునరాము
ధ్యానము నొనరించుభూసుతన్ గనుఁగొనియెన్.

వ. ఇట్లు కనుఁగొని యావృక్షంబుపైకి నెగిరి యాకులనడుమ స్వల్పరూపంబునఁ గూర్చుండి చూచుచు,

కీర్తన. ఆదితాళము.

ఆనందం హృదయానందం! పరమానందం నిత్యానందం! జానకి గంటిని జయము చేకొంటిని నేనుకృతార్థుఁడ నిశ్చయముగను॥ఆనం॥సీత కుశలమును శ్రీరామునితోఁ జేత మలరఁగను జెప్పుటకుఖ్యాతిగనాభాగ్యంబున గలిగెను! నాతప మెల్ల నీ నాడే ఫలించెను॥ ఆనం॥ వృక్షచరులు వే వేలుండఁగ వారి వీక్షింపకయ కటాక్షమున మోక్షుఁడ పతిముద్రికనాకును దక్షత నిచ్చెను ధన్యుఁడ నైతిని॥ ఆనందం॥

వ. ఇట్లానందంబు నొంది జనకతనయతో భాషించుటకుఁ దరుణంబు వేచియున్నంత; రాముని యాజ్ఞచేత నొక్కవనచరుండు వచ్చి సూక్ష్మరూపంబున వృక్షాగ్రంబున నుండఁ జూచినట్లు రావణుఁడు గలఁ గని తత్క్షణంబున లేచి,

తో: కొన్నికలలు నిక్కువ మగుచుండును; కొన్ని యబద్ధంబగును; నిన్నిటికిని నిది యెటు లగునో కనియెద నని తీవ్రంబునను ॥రా॥ రాక్షసాంగనలు రయమున గొలువఁగ రావణుఁడవనిజఁ గనను, దక్షుఁ డగుచు రా దశవదనంబులు దగ నిరువది భుజములును॥ రా॥

క. కాటుకకొండను బోలు ని
శాటుని గని వాయుతనయుఁ డాశ్చర్యమునన్
జా టగునటు లాకులగుమి
నాటునఁగనుచుండె నసుర మాయాచేష్టల్.

వ. అంత రావణుండు సీతను డగ్గరి భయంకరవాక్కులతో బెదరించుచు,

ఫరజు: ఆదితాళము.

నామాటను మీరకు నలినాక్షి యింక ॥నామా॥ వేమఱు గానసీమల దిరిగె । రాముఁడు లంకకు రాఁగలఁడా ! యిక॥ నామా॥ మూఁడు లోకముల నోడక నాకెను రాముఁడాతు లేరని చూపనీవు ॥నా॥ దానవకులనేతను బలవంతుడ నైన నన్నుబో నాడఁగునుయింక ॥నామా॥ రమణి, మోక్షగుండరమణునిపై నిరతభ్రమనొందిన దానఫల మేమి ? యిక॥ నామా॥

వ. నిరంతరము నితాంతానంతశ్రీమంతుఁడనై దిగంతంబుల వంతనొందించి సాధించిన బలవంతుని నన్ను నావంతయైన నంతనంబునఁ జింతింపక; యెంతయు డస్సిన యొక్కబక్కమానవుని పయి నింత భ్రాంతి నొందెదవు పంతమా ? ఇంతట నయిన నాయుదంతంబు విని కంతుకేళియందు నాయంతరంగంబును నంతసింపఁ జేయుము ! నీకేల యింతచింత !

తో: బాళిమీఱ దిక్పాలుర నెల్లను బంటులజేసెద నీకు; దాలిమితోఁ దత్కాంతలు బానిస తన మొనర్చెదరు నీకు॥ రామ॥ ఈ రాక్షసరాజ్య మిచ్చి నీకు నీయిష్టముచొప్పున నుంతు; దిరుగబట్టపు దేవిగని న్నిడి మేరవిడుచు నేలింతు॥ రామ॥

వ. అని యానిర్భాగ్యుండు గర్భనిర్భేదనకరములగు దుర్భాషలాడిన దుర్భరం బనక నిర్భయంబున రత్నగర్భార్భకతృణంబు చేఁబూని వానిఁ దృణప్రాయంబుగ నెంచుచు నధోముఖయై ప్రత్యుత్తరం బిచ్చుచున్నది:

కళ్యాణి: అటతాళము.

ఓరిరావణ! యాఁడువారిముందర నిట్టిపౌరుషములు పలుకఫల మేమి చూడు ! శూరుఁడవు నీ వయిన రామునితో నెదిరించి నన్ను

జేరితివా ! నీవు ధీరతతో ఘనము వినుము రఘువీరుఁ డేమఱియున్న దొంగిలి పాఱివచ్చుట బాటుతనమా॥ యోరి॥ సాగరశయనుని సాగి రాకుండ నీసాగర మేమాత్ర మాగును వినుమా! వేగశర వహ్నులను సింకించు; లేకున్న నడ్డముగాఁగ సేతువు బెరయఁ గట్టించు; వచ్చుఁజొచ్చు నీభోగములు నీపురము నిన్నును బుత్రమిత్రులతోడఁ గూలుచు॥ నోరి॥ ధారణిఁ దాళ్ళూరి నారాయణాత్మ విహారుఁ డౌ మోక్షగుండాధీశ్వరుఁడు గోరితన్మనితోడ నిను గదిసి దల లన్ని యిలపైఁ గూల జేయునాడుగా తెలిసి। మొగ్గు తగ్గు గనువారికే యెఱుకౌను నిరువుర తారతమ్యము చెప్పనలెనా! యోరి——

గీ. అనిన జానకి పరుషవాక్యముల కలిగి
కనుల నిప్పుకలొలుక రాకాసిఱేఁడు
ఉఱిమిచూచుచు నామెపై కురవడించె
వాలుజళిపించి తనసతి వలదనంగ.

వ. మఱియు మందోదరి యిట్లనియె:

కీర్తన: ఆదితాళము.

ఇదేమిా పరాక్రమము ! సిదానిం చి యోజింపుము॥ ఇదే॥ అదేమి యాడుదానిపైకి దూరిపోయె దౌ బళా! ఇదేమంచిదా నెమ్మదిఁ దెల్పేదర॥ ఇదేమి॥ సురాంగనాది రామలఁ వరించి పొందరాద యీనరేందీవరాక్షిఁ జెరఁ బెట్టగా॥ నిదేమిా॥ కరంబు మోక్షగుండ సత్పురేశ్వరుండు రాముఁడౌ పరాకా చిరాకా పరం బొంచవా॥ ఇదేమిా॥

తో: అల్పభోగమునకై చెడ నేటికి నతివలు నీ కిక లేరా ! తెల్పుము మఱి మోకతెతో నీకోరిక తీరదే మొ! యిదిమేరా!॥ రామా॥

వ. నీయందు బ్రియంబులేక విముఖురా లయియున్న యీపతి వ్రతను బలాత్కారముచేయుట మర్యాద కాదు. పరాంగనాసంగమంబు పాపంబుగ నీ వెఱుంగవా! నిన్నుఁ గామించియున్న మావల్ల నెల్ల

సౌఖ్యంబులు వెల్లంబుగఁ బొందరాదా? చాలదా? ప్రాణనాయకా, మానుము. స్త్రీహత్య చేయక ఇంటికి రమ్ము; నామాటఁ ద్రోయక.

వ. అనిన మందోదరి వాక్యంబు విని సీతను జంపుటుడిగి యురువడి కన్నులనగ్నికణంబు లురుల నుఱిమి చూచి అయోముఖి హేమాస్యహారిజట త్రిజట మహోదర్యాది రాక్షసాంగనలఁ దక్షణంబున బిలిచి,

బేహాగ్: ఆదితాళము.

మీరు గంటిరా! వింటిరా! చెలులారా! కలకంఠిమాట యెంత కఠిన మారా! వెంటనంటి భయ నయములుమీఱ వాలుగంటిని దోడ్తెండు నన్నుఁజేర॥ మీరు॥ ఇక రెండు నెలలు జెప్పినదనుగాని విన కుండెనేని పిమ్మట దీనిఁ గోసి కండలు దినుడు పంచుకొని, మోక్షగుండహారి యడ్డుపడిన గాని॥ మీ॥

క. రావణుఁ డసురాంగనలకు
 నీవిధమున నాజ్ఞయిచ్చి యింటికి జనఁగా
 నావెలఁదులు భీకరముగ
 భూవరసుతఁ జేరి తెలుపఁ బూనిరి బుద్ధుల్.

పంచ:—అరణ్యమందు నిన్ను రావణాసురుండు దెచ్చుచో
 దిరంబుగా నెఱుంగకున్న దీనమానవుండు నీ
 వరుండు వానిమీఁద నింక వాంఛ మాని, రాక్షసే
 శ్వరుణ్ వరింపు మెల్లభోగ శాలి వాడు వంగనా!

వ. తమ్ముండు రాజ్యం బపహారింప ననదవోలె నీమగండు వనంబులఁ గృశించుచున్నాఁడు. మా రావణుని ప్రతాపంబు వినుము.

హిం. కాఫీ: అటతాళము.

జగదేకవీరుఁడు పద్మజాతకులసంభవుఁడు నగజాపతి సేవకుఁడు; నవమన్మథసుందరుఁడు॥ జగదేక॥ మించి దిగ్విజయము గాంచి యన్ని

టిని సాధించి యీలంకను బాలించి గీర్తిఁ గాంచినట్టి॥ జగదేక॥ ఎందు॥ జావులే కుండగ ముందె బ్రహ్మచేత వరమందినాఁడు, వీనిగూడు సుంద రిదె వైభోగము॥ జగదేక॥ భూమిలోనమోతుగుండధాముఁడగు రాము పయిఁ బ్రేమమాని రావణునిఁ గామింపుము కాంతామణి॥ జగ॥

తో: మామాటలు వింటే మంచిది నీకు మేము సేవచేసె దము। కోపలి వినకుంటే మతినిలువునఁ గోయుచు భక్షించెదము॥ రా

వ. అని యిట్లు చుట్టుకొని బాధించుచున్న రాక్షసాంగనల నిర్లక్ష్యముగ వీక్షించి సీతాంగన దీనత్వంబున,—

హిం. కాఫీ: ఆదితాళము.

ఇంతపంత మేలనమ్మ యింతులార మానరమ్మ! చింతద్రోయ మేలటమ్మా! చెలగి కరుణజూడరమ్మా॥ యింత॥ బలము లేని మనుజుఁడైన బధిరుఁడైన నంధుఁడైన; తెలివి మాలినట్టివాఁడయిన జెలువునివిడ నాడనౌన ॥యింత॥ భూమిలోన మోతుగుండధాముఁడయిన శ్రీకోదండరాముఁడే! విభుడనుచు నుండ; నాపుది వేరొనె పొండ ॥యింత॥

వ. అని వేడుకొనిన దీనాలాపంబు లాలింపక భీకరంబుగ గేకలు వేయుచు,—

తో: చెప్పిన విన దీచేడెను నఱికియు నిప్పుడె రక్తము బీల్చి। చప్పరింతమా! సరగున గండలు చవిచూచెదమా! నిల్చి॥ రా॥

ఇక గొన్నాళ్ళు భూరక బోధించుచు నిటులనె బెదరింతామా! యొకట రెంట గని యోర్పు గలిగి మన మొప్పనటుల జేయుదమా॥ రామా॥

వ. ఈ పరికారంబున మనఃక్షోభంబు జేయుచుండఁ ద్రిజట మాత్ర మది సహింపక వేఱొక్కచో శయనించి నిదురించి కల గని లేచి రాక్షసస్త్రీలను బిలిచి యనుచున్నది:

నవరోజు: ఆదితాళము.

కల గంటి నే నొక్క కలఁ గంటిని; కలలో ననేకములు గనుఁ
టిని॥ కల॥ రాముఁ డేనుగ నెక్కి రాఁ గంటిని; సౌమిత్రి వచ్చిన
జాడఁ గంటిని॥ కల॥ లంకఁ జొచ్చి రావణుఁ గూల్పఁగ గంటిని;
రు విభీషణుఁ డేలఁగఁ గంటిని॥ కల॥ రావణునిపుత్రు లెల్లఁ జావఁ
ని; వేవేగ దక్షిణదిశకు నేఁగఁ గంటిని॥ కల॥ భూమిజ నయోధ్యకు
పోవఁ గంటిని; శ్రీమోక్షగుండేశ్వరునిఁ జెలఁగఁ గంటిని॥ కల॥

వ. అని తనస్వప్నవృత్తాంతంబుఁ జెప్పిన నాలించి భీతచిత్తలై
స్మను వదలి యొక్కచో నందఱుఁ బడి నిదురించుచుండిరి. సీతా
విలాపంబున—

వ. మీ రిట్లు క్రౌర్యంబు జూపుచున్నారు! దైవమా! దిక్కు
వాన నైతిని! ఈకష్టం బెటులభరింప నగును!

జంఝూటి: రూపకము.

అంత వానిభార్య నయ్యు నడలవలసెను! జంతతోడ వీరిచేతఁ
వలసెను నే॥ నంత॥ తెల్లవార నన్నుబట్టి తిందు రందఱుఁ బిల్లి
క చందమాయె! భీతి నొంతురు॥ అంత॥ మోక్షగుండరాఘవుఁ
క్షజేసెను! రాక్షసుల బోనులోన రాటుపెట్టెను॥ అంత॥

క. అని శోకావేశంబున
గనుగవలను నీరువరదగాఁ గాఱఁగ నా
వనజాక్షి శింశుపాతరు
ఘనశాఖను జేతనూతగాఁ గొని లేచెన్.

వ. ఇట్లు లేచి నిలువంబడి దిక్కులు పరికించి చూచుచు,

వసంత – అటతాళము.

వీరిచేతలకు బడజాలనే! వీరిబాధలకు క్రూరరాక్షసులచేఁ
లుటకన్నను, వీరవనితనై భువి వీడుటమే లగు॥ వీరి॥ వేవేగ

మెడకు నా వేణియురి వెట్టి యీ వేళ నిచ్చట జీవము విడిచెద॥ హీరి॥
భూమి మోతుకుండధామునకుగాని యీ మేను నిలిచిన నేమి పోయిన నేమి॥ హీరి॥

వ. అని మరణంబునొంద నిశ్చయించి తనజడను గంఠంబునకు నురివెట్టుకొన నిశ్చయించి యుండిన, జానకి విపత్తును దీర్చుట కిదియ కదా తరుణం బని యోచించి హనుమంతుండు సీత వినునట్లు సూక్ష్మ స్వరంబుతో ని ట్లనుచున్నాఁడు;

ద్వి॥ అవనీతిలక మయోధ్యాపురి నున్న। రవికులుం డగు దశ రథరాజమణికి। వరరామలక్ష్మణ-భరత శత్రుఘ్న। సురుచిర నాములు సుతు లుదయించి;। రందు జ్యేష్ఠుండు రామాఖ్యుడు తమ్ము।డుందరుణి యునుదోడుగ రాగఁ దండ్రి।పనుపున దండకావని కరుదేర । దనుజాధ ముం డగు దశవదనుండు । చని, రాము డట లేని సమయంబునందె। జనకజఁ గొనిపోవ జాడదీయుచును । అంజటాయువు సెప్ప ననువు లెటింగి । కలంతల బుశ్యమూకమ్మున విడిసి । వాలి సుగ్రీవులు వడి గలహింప । వాలిని జంపి తీవ్రమున సుగ్రీవుఁ। గపిరాజ్యమున కధికా రిగాఁ జేయఁ। గపిపతియాజ్ఞచేఁ గదలి మర్కటులు । దిక్కు-దిక్కు లకు వై దేహిని జూడ । గ్రక్కునఁ బోయి రిక్కడికి నే నొకఁడ । శత యోజనమ్ములు సంద్రమ్ము దాఁటి। ప్రతిలేని లంకాపురంబును జొచ్చి। పురమెల్ల వెదకి గొబ్బున వనమందు। బరువడి నొకశింశుపామూలమును । నుగుదుఃఖకలితమై యున్న సీతమ్మ। నరసితి ధన్యుఁడనైతి నే ననిన.

వ. అవ్వాక్యంబులు శ్రవణానందంబులైనఁ దన యుద్యమంబు మాని చెట్టునకెగఁజూచి, యెవరుఁ గనబడనందున నెమ్మనంబున—

జంఝూటిః అటతాళము.

ఔరౌర యిదియెంతో వింత! కారణ మెఱుగను గానిసుమంత!
లేరెవ్వ రితరు లీచెంత; వారక నాకాశవాణిపలికెను! లేక ఘోరరాక్ష

సులే! యిట్లూరక యనిరో! నే॥ డో॥ కలయేమో! చిత్తవిక
లమో! కల యొక్కడిది! నిద్రగాన నిశ్చయమో! తెలివిలో భ్రమ
రా దిదేమో! యిల నారాయణకవి నేలు మోక్షగుండ నిలయుని
కెఱుకగు నిశ్చయ మెఱుగ నే॥ డో॥

వ. అని యిట్లు డోలాయమాన మానసయై యిట్లనియె.

క. శ్రీవణానందముగా రా
ఘవుకథ వాక్రుచ్చినట్టి ఘను లెవ్వారో!
ప్రవిమలముగ దర్శన మిడి
వివరింపఁగ రాదె యెల్లవృత్తాంతంబుల్.

వ. అని మనోభావంబు వెల్లడిచేసిన నానందించి జిట్టెడు
పొడుగుగల వానరాకృతితో హనుమంతుండు చెట్టు దిగి వచ్చి సీతా
దేవియెదుట నంజలి బద్ధుండయి నిలిచిన జానకి భీతినొంది.

తో: వనచరరూపంబున దానవుఁ డెవ్వాడో! రావణు డనుపఁ!
జనుదెంచెను రాక్షసమాయ లటం చనఁ దలచియు గనుగొనక॥ రా॥

వ. అధోముఖియై యూరకుండిన నాంజనేయుం డిట్లనియె:

కాఫి: అటతాళము.

వాయుతనూజుడ; వానరజన్ముఁడ; మాయలుగా వివి;
మానుము శంక॥ వా॥ ఖ్యాతిగ సుగ్రీవుదూతను సచివుడ; మాతరో!
నే హనుమంతా భిఖ్యుడ॥ వా॥ దండిగ శ్రీమోక్ష గుండేశుడై కోదండ
రామునకును దాసుడ నమ్ముము॥ వా॥

వ. అనిన. సీతాదేవి యనుచున్నది:

తో: మీరు వానరులు; వారు మానవులు; మీకును వారికి
నెటుల। చేరువదొరకెనో! స్నేహముగలిగెనో! చెప్పుము తెలిసెడు
నటుల॥ రా॥

వ. అనిన, హనుమంతుం డిట్లనియె:

సీ. నిను( బాసి వెదకుచు నీభర్త ఋశ్యమూ
కాద్రిచెంతకు రాఁగ నర్కసుతుఁడు
సుగ్రీవుఁ డనువాఁడు చూచి యచ్చెరువంది
చేరువకరుదెంచి చెలిమిచేయ,
వానిభార్యను గొన్నవాలిని వధియించి
కిష్కింధ నిచ్చె సుగ్రీవునకును;
నతఁడు ప్రత్యుపకృతి నాచరింపఁగఁ బూని
నినుజూడ బంపించె వనచరులను;

గీ. వారిలో నన్నుఁ బిలిచి నీవల్లభుండు
గుఱుతుగానిచ్చె ముద్దుటుంగరముఁ దీని;
నీయుమనికి నారయుచు జడనిధిదరించి,
వచ్చి ని న్నిందుఁ గంటి మద్భాగ్యవశత.

వ. అని చెప్పి మఱియు,

కీర్తన. ఆదితాళము.

రాముముద్రిక గొనుము ! రామముద్రిక రామనామాక్షరము లున్న రమ్యముద్రిక॥ రాము॥ నిన్నొసంగెడునాడు నీదుజనకుడు పన్నగ నల్లునకు నిచ్చిన భద్రముద్రిక॥ రాము॥ భానుతనయుడు మము బంపు నప్పుడు నానవాలు రాము డిచ్చినట్టిముద్రిక॥ రా॥ అక్షయంబుగ గడు ననర్ఘమైతగ మోతుకుండదేవు వ్రేల మురియు ముద్రిక॥ రాము ముద్రిక॥

వ. అని యర్పించిన, నయ్యంగుళీయకమును గైకొని కన్నుల నద్దికొని యానందబాష్పములు రాల ని ట్లనుచున్నది:

తో. ప్రాణదాన మొనరించితి వన్నాపవన నందనా! నాక దీనసైన నేనేయుపకారము బూనిసేతు నీకు?॥ రా॥

తో: బుద్ధిమంతుఁడవు, పుణ్యపురుషడవు, శుద్ధమనస్కుఁడ వనఘా! యుద్ధచరిత! నాయిడుములెల్ల నీ విపుడు గంటిగద సరగ॥ రా॥

హిం. తోడి: ఆదితాళము.

మారుతీ! శ్రీరామునకు నామారుగా వచియింపుమా! చేరిదను జులు బాధచేయ గృశించె నని వచియింపుమా॥ మా॥ రెండు నెల లగు నంతకును మని యుండు నని యెఱిగింపుమా! మోడిరక్కసి మూకచే దినగండ మని వచియింపుమా! ॥మా॥ జాగువలదని పలుకుమా! వేవేగ ర మ్మని తెలుపుమా! బాగుగా నీరావణుని వైభోగ మును వినిపింపుమా॥ మా॥ రాక్షసేంద్రుని తలలు ధరఁ బడ రాల్చు మని వాక్రుచ్చుమా! మోక్షగుండపురీశ నీకుచు మ్రొక్కె నని ప్రకటింపుమా॥ మారుతీ॥

గీ. నేర్చి నేరమి నెగ్గులునిన్ను బలికి
యనుభవించితి తత్ఫలం; బదియు మఱచి
యన్నతోఁ గూడి వచ్చినన్నాదరింపు
మనుచు నాముద్దుమఱదితో ననుమువత్స!

వ అని కడువినయంబున నుడివిన బుడమికుమారి నుడువుల కలరి యాంజనేయుండు—

బేగడ: చాపు.

సంశయింపకు స్వాంతములో నీవు॥సంశ॥ వింశతిబాహుని విక్రమ మదియెంత॥ సంశ॥ ని న్నెగ్గులాడుటఁ విన్నా నే నప్పుడె; తన్నఁబూని వెనుతగ్గితి; సైచితి॥ సంశ॥ ముల్లోకములకుఁ దల్లి వౌ నిన్ దెచ్చు టెల్లప్పు డీలంక యేలంగనుట కేన ॥సంశ॥ శ్రీమోక్షగుండ శ్రీరాముని లక్ష్మణు వామాక్షి, తోడ్తెచ్చి వానిఁ జంపించెద॥ సం॥

తో: పుత్రపౌత్రహితముఖ్యులతో దెగు మొఱకుడు రావణుఁడు। ధాత్రి నయోధ్యకు ధవుడును నీవును ద్వరగాఁ జేరుదు రనుడు ॥రా॥

సీత- తో: మంచిది రాముడు మఱి లక్ష్మణుడునుమర్కటసైన్య ములెల్ల। నెంచక వారధి నెటులదాటగల రెఱిగింపుము విలసిల్ల॥రా॥

వ. అనిన,

హ-క. రాముని సైన్యయుతంబుగ
నామూపున మోసికొని ఘనంబుగ నుదధిన్
భామిని, యవలీల గ నే
ధీమతి దాటింపఁ గలను దివిజులు మెచ్చన్.

వ. ఇంకను గార్యంబులెల్లను స్వల్పకాలంబున నెఱవేర్పఁ బడును. ముద్దుటుంగర మిచ్చితిఁగదా! మరల రాముని కొసంగుట కొక్కయానవా లిమ్ము తల్లీ! భక్తజన కల్పవల్లీ!

క. అని పలికిన ముదమందుచుఁ
దనజడలో నిమిడియున్న తలమానికముం
హనుమంతుని యంజలినిడి
జనకజ వెండియును బలికె శంకాన్వితయై.

వ. అనంతబలసంపన్నులగు రాక్షసుల నింత స్వల్పశరీరంబుగల మీ రెట్లు జయింతురు? అదియొకగొప్ప సంశయం బనిన, జనక నందనతోఁ బవమాననందనుం డిట్లనియె:

తో. పూర్వరూపమున బొడగట్టెదనో! పౌలతీ, కనుగొనుము నుచు। బర్వతాకృతిగఁ బావని పెరిగిన బరికించి భయంపడుచు॥ రామ॥

వ. జానకమ్మ కనులుమూసికొనిన నతం డెప్పటివలె సూక్ష్మ రూపంబున నుండె. అప్పుడు కనులు దెఱచి.

కళ్యాణి: రూపకము.

పవనతనయ, రాము జేర బయనమగుమికవివరంబుగనావార్తను వినిపింపుము దయతోడను॥ పవన॥ నీజవంబు వింటి; నేడు నీబలంబు గంటి; ఆజికి జాలిన మేటివి యవురా సరి యతివేగము॥ పవన॥ మోక

గుండపతికి నీవు ముఖ్యభటుఁడవైతి; నీక్షణమున మాణిక్యము హృదయేశున కర్పింపుము॥ బనన॥

వ. ఇదిగాక యింకొక సమాచారంబు చెప్పెదవినుము.

సీ. శ్రీరాముఁడును నేను జిత్రకూటాద్రియం
దుండఁగ వంచించి యొక్కకాకి
నన్నంట, నలిగి తృణం బొండు వైచిన,
బ్రహ్మాస్త్రమై వెంటఁ బడి జగత్ర
యంబు ద్రిప్పిన, శరణం బెందుఁ గానక
కావుకావు మటంచుఁ గాకిసురల
వచ్చియుఁ దనప్రాపుఁ జొచ్చిన, దయగల్గి
యొకకన్ను నస్త్రంబునకు నొసంగు

గీ. మనుచు రక్షించె; నట్టి దయాంబురాశి
రావణుం డిట్టి క్రూరకార్యం బొనర్ప !
నూరకుండుట కిపుడు నానేర మేమొ!
చాలవినిపింపవయ్య వాతూలతనయ!

వ. అనిన హనుమంతుం డిట్లనియె:

క. అమ్మా యింక దవ్వరలేఁ గా
ర్యమ్ములు సకలంబు దీర్తు నాకలిఁ గొంటిన్
నెమ్మది నీవనమందు ఫ
లమ్ములు దిని పోవఁగా సెలవు నా కిడుమా.

వ. అనిన మంచి దటులఁజేసి త్వరగఁ బొమ్మన వల్లె యని జానకికి వందనం బొనర్చి కదలి తాను వచ్చి పోవుట రావణున కెఱుక పఱచువాఁడై ——

తో: ఆయశోకవనమందు సీతయున్నట్టి చెట్టు దక్కఁగను ।
బాయక యన్నియు వాయుతనూజుఁడు. పడఁద్రోసెను చక్కఁగను॥ రామ॥

వ. ఇట్లు చుట్టుముట్టి వనం బంతయుఁ బెకలించి యార్చి పేర్చి యెదిరించిన వనపాలకుల నెనిమిదివేల మందిని యొక్కపెట్టునఁ గూల్చిన, రాక్షసస్త్రీలు నివ్వెరగంది సీతను గనుంగొని,

కమాచ్: ఆదితాళము.

అతఁ డెవరో! జానకీ! ॥యత॥ వివిధవృక్షముల, విఱచి వేయు॥ నత॥ వనచరునిరూపము! గేసరిప్రతాపము! ఉరుబలవీరుల నుక్కడంచె॥ నత॥ నినుఁ గాంచి పలికెను; నిటనుండిపోయెను। యెంచ మోతుకుండేశుని చెలి॥యతఁడెవరో॥

వ. అనిన నామె యిట్లనియె:

తో. శోకముచేతను స్రుక్కుచుంటి నిట నా కెటు తెలియును నదియు। బాహ్రికటముగ మీరాక్షసమాయలు మీకే తెలియగ వలయు॥ రా॥

వ. అని పలికిన వారు భయంబును బొందుచుఁ ద్వరగాఁ జని రావణుఁ గని మ్రొక్కి యిట్లనుచున్నారు:

కీర్తన: ఆదితాళము.

మీరు గృహము జేరిన మీద నచట జరిగిన కారుబారు లిప్పుడు గరుణఁ జిత్తగింపుడు॥ మీరు॥ కోతి-యొకటి వచ్చెను; సీతతో భాషించెను; భీతి మేను బెంచెను; బిట్టువనము దున్రించెను॥ మీరు॥ రాక్షసులను గూల్చెను; రమ్యహర్మ్య మెక్కెను; మోతుకుండహరి కిని ముఖ్యుడంచుఁ దోఁచెను॥ మీరు॥

వ. అని పలికిన రావణుండు మహాశ్చర్యకోపంబులు పెనఁగొన, యెనుబదివేల రాక్షసదళంబులబలవంతులఁ బంపె. వారు చనిరి. అంతలో సూర్యోదయం బగుటయు,

సీ. పంక్తికంఠుఁడు దనపర్యంకమున నున్న
కటిబంధనము గని, గయునిదిగను

గుర్తించి, తనపత్నిఁ గూడినాఁ డని యెంచి
ఖడ్గంబు గొని చంపఁ గవిసినంత
స్త్రీహత్యవల దనిచెలులు నివారింప
నుడిగి యాగయునింటి కురువడించి
వీనిచే మృతి విధి వానికి లిఖియించెఁ
గాన నిద్రితుని ఖడ్గమునఁ దునిమె;

గీ. సంతఁ దన పాన్పుపైనున్న యంబరంబుఁ
గని విభీషణుఁ డన్నదిగాఁ నెఱింగి
సరమను వధింపఁ జంద్రహాసంబుబూనె;
వలదు స్త్రీహత్య యని స్త్రీలు దెలుప మానె.

వ అది మొదలు రావణుని సాంగత్యంబువదలి యెట కేనియుఁ బోవ సంకల్పించుచుండె. ఇక్కడ రావణప్రేరితరాక్షసదళంబులు చను దెంచి.

తో: తోరణకంబము తుది గూర్చుండిన మారుతిపై బాణములు। సారెకు బఱపిన, సరకుగొనకదా సరగ జేసె శకలములు॥రా॥

వ. ఇట్లు శకలంబులు జేసి వారిపఱికి గప్పించి దుమికి క్షణమాత్రములో నందఱను ముష్టిఘట్టనలచే మ్రందించిన, హతశేషులచే నవ్వార్త తెలిసి యచ్చెరువొంది రావణుఁడు వక్రనాసుఁడు బింగళాక్షుఁడు దీర్ఘజిహ్వుఁడు నశ్మవక్షుఁడు, శార్దూలముఖుఁడు ననుపేరులు గల యైదుగురు సేనాధిపతులఁ బంపిన; వారు చని.

తో: కేకలువేయుచు మూకలుగట్టి శరాళిఁ దీవ్రగతి వ్రేయ। భీకరముగ గపివీరుఁడు బెదరక, తోకతోడఁ బొడిసేయ॥రామ॥

వ. వారును బోక చుట్టుకొనినఁ దోరణస్తంభముచేత నొక్కొక్కని మోది చక్కాడిన, నది తెలిసి దశకంఠుఁడు రక్తరోమ శతజిహ్వ రుధిరలోచన స్తనితహస్త శూలదంష్ట్ర దుర్ముఖ వ్యాఘ్రముఖబలులను నేడుగురు బలశాలురఁ బంపె. వారుం జని—

కీర్తన: ఆదితాళము.

ఎక్కడికోతివి-యెటి గింపు నీడొక్క చించెదము నై మిక్కిలి నీమెఱ-మెచ్చులుసూపక॥ యెక్కడి॥ తొక్కిన త్రొక్కి ముక్కున నోటఁగ్రక్కున నెత్తురు-గ్రక్కెదవు॥ యె॥ కండలు గుండెలు చీలిచి వండి తిందుము, వచ్చిడిగ॥ యె॥ మోక్షుగ రక్షించినను రాక్షసులను జేరఁగ దరమా॥ యెక్కడి।

వ. ఇట్లు ప్రగల్భంబు లాడుచు బాణపరంపరల ముంచి మంతయుం డట్టహాసంబున.

తో: ఉరగంబులపై కురికెడు గరుడునికరణిని బైఁబడ ద రథహయముల నురుముచేసియమ పురి జేరఁగ వారి నూకి॥ రా

వ. భుజాస్ఫాలనంబు జేసి నిలిచిన, నదివిని ప్రహస్తు డనంత ప్రతాపనిర్జితాంశుమాలి యగు జంబుమాలి రావణ వెడలి వచ్చి "వేదండతుండనిభం బగు నుద్దండభుజాదండంబున । డంబుననుండిన కొండలనైనఁ బిండిపిండిగఁ జేయఁజాలిన దండి నగు నాదండకుఁ బుండరీకాక్షుండైన రా నోపఁడు. నీకండ లో కయిన జాలవే! ముంచి దుండుము! భండనంబున నీగుండెలు దండధరుని యుండకు బంపెద మొండీ! నామాట బహుళు యనిన, విని యాంజనేయుండు- "ఖండేందుమౌళి కోదండంబుఁ చేసిన కోదండపాణిభటుండ! చండాంశు సుతునిసచివుండ! నేయుండ! భండనభీముండ! గుండెగల శూరుండ వయిన నిండు వే రారా రండా! ఇప్పుడే! మోయింతు నీనుండ! చేసెద మరల వ కుండ!" ననిన,

తో: జంబుమాలి రోషంబున బటుబాణంబుల పైఁబ కంబుజెడక సాలంబుచేత ఖండంబు జేసికడుజేవ॥ రామ॥

వ. పయి బడఁదుమికి రథరథ్యంబులఁ జూర్ణంబుజేసిన,

తో: అడిదముఁ బలకయు నతఁడుఁ బూని పైనడరిన నంతటి లోన। బిడికిటఁ బొడిచిన బీరముచెడి వడిఁ బడియె నాతఁ డిలపైన॥రా॥

వ. ఇట్లు జంబుమాలి యీలిగిన, నావార్త విని చింతించి రావణుండు విరూపాక్ష భాసకర్ణ దీర్ఘజిహ్వ ప్రఘునాదయులను పంచసేనాగ్ర నాయకుల ననికిఁ బంపిన, వారు ప్రతాపం బినుమడింపఁ జని,

బ్యాండు: ఏకతాళము.

మావనంబు బీకవైవ నీ వెవండవు? పోవా! లేవా! యీవిధిగా జావగా దేవుఁడు నుదుటగా దిరముగ వ్రాసెగా గావునఁ దెగువగా॥మా॥ లేరారారా! చేరగగా బోరఁగగా శూరుఁడ వైనగా। ఘోరశరములుగా సారెకు వెడలెగా॥ మావనంబు॥ చుట్టుముట్టు పట్టఁగగా గట్టిగన్ నెట్టి లాగఁగగా, జుట్టము లెవరు తట్టున బాపగా॥ మావనంబు॥ మోక్షగుండా ధ్యక్షుని పక్షమై రాక్షసులపంబు దక్షుడ వగుదుగా దండు వెడలితో ॥ మావనంబు॥

వ. అనిన నాంజనేయుండు తగ్గుమొగ్గు తెలియక నెగ్గులాడుచు నాదగ్గరఁ జేరిన రక్కసులు నుగ్గునూచముయిరి. మీారు సిగ్గులేక పెగ్గెలు దీయుచు నగ్గలంబుగఁ జుట్టుముట్టితిరి. ఇప్పట్టున మీాపొట్టలు పగులఁ గొట్టి తట్టునఁ బొడ్డిపట్టి పట్టణంబునకు నెట్టకున్న నేజెట్టినా! వట్టివిగా ద ట్టిట్టుఁబోక దిట్టంబుగ నిలువుడు రాక్షసాధములారా! అని పలికి,

తో: వారిపైన గదువడిఁ బడ దుమికియు వారిబాణములు గొనక। దోరణకంబమునుతో నొక్కొక్కనిఁ దునమగడఁగె నటు వెనుక॥ రామ॥

వ. ఇంతయువిని రావణుం డక్షకుమారునింజూచి,

తో: వనచర మొక్కటి వచ్చి చొచ్చిమన వనమెల్లను బెకలించి। దనుజుల జంపెను! దగఁ జని గూల్పుము తడవుసేయకు కౌదిరించి॥ రామ॥

వ. అనిన మంచి దని యక్షకుమారుఁడు బహుసైన్యయుతుంబుగ రథారూఢుండయి నడచి తోరణ స్తంభంబుపయి ప్రళయార్కుని పగిదినున్న హనుమంతునిఁ గని,

పంచచా॥ దురంబునందు నెంతవానితోడనైన బోరి బల్ । పరాక్రమంబుఁ జూపునట్టి పంక్తికంఠు పుత్రుఁడన్ ! బరాకుమాని యుండు నిల్వు పాఱిపోకు! వచ్చె నా । శరంబు లక్షయంబుగా! వశంబుగాదు చూడుమా !

వ. అని పెక్కుమ్మ లొక్కుమ్మడివైచిన,

హ. పంచచామరము.

పరేశుఁడైన రాముదేవిఁ బట్టితెచ్చినట్టియా । దురాత్మునట్టి తుంచు తెంపు తోడవచ్చినాడ నీ। శిరంబు దుంచి నేడు విందుసేతు భూతపాళికిన్ । దరంబుగాదు నన్నువీఁక దాఁకి మళ్ళి పోవఁగన్.

వ. అని పలికి పైకి లంఘించి యతండు వైచిన బాణంబులు చూర్ణంబుజేసి,

తో. హుంకరించి వానియురమున రాముని కింకరుండు పొడువగను । బింకము చెడి విలవిల దన్నుకొనుచు విడిచెను దనప్రాణమును॥ రా॥

వ పిమ్మటఁ గాలఁ జేత మట్టి యతనిసైన్యమును బిఁుకు మార్చిన నక్కుమారుని మరణవార్త హతశేషులవలన విని రావణుండు నిర్విణ్ణుండయి.

పున్నాగవరాళి: ఆదితాళము.

ననుఁ బాసి పోయితే ! నిను గోలుపోయితిన్! అక్షతనయ! ॥నను॥వనచరు డెవ్వఁడో! చనుదెంచెమృత్యువై । యక్షతనయ ! ॥నను॥ బలశాలి వనుచును, బరికించి చూతును అక్షతనయ ! ॥నను॥ శ్రీమోతుగుండశ్రీరాముఁడు పంపెనో యక్షతనయ ! ॥నను॥

వ. ఇట్లు విలపించు తండ్రికి నింద్రజిత్తు మ్రొక్కి యిట్లనియె:

క. సీతనయునిచావునకై
యీలీరున దుఃఖపడిన నిది మే లగునా!
నాతండ్రీ సెల విచ్చిన
నాతని నేఁబట్టి తెత్తు నరనిముసమునన్.

వ. అనిన ధైర్యంబునొంది,

తో: సురపతిఁ గెలిచిన-జోదువు నీ వతి శూరుఁడ వగుదువు కాన। సరగున నావనచరుని బట్టి నాసన్నిధి కిఁక దెమ్మనిన।। రాను।।

వ. ప్రళయకాలాభీలజాజ్వల్యమానమహానలంబు చందంబున మండిపడుచు దండిభటు లనేకులు గొలువ రథారూఢుండై చని తోరణ స్తంభాగ్రంబున నుండిన మారుతిఁ గని కోపాటోపంబున—

కీర్తన: ఆదితాళము.

ఉండుండు ముందుము రా! కోతివాఁడ! ॥యుండు॥ ఉండుండు బహురణపాండిత్య మున్నట్లు మెండుగ దిరిగేవు! తుండెములుగఁ జేతు।। నుం।। శ్రీమోక్షగుండేశుని సతతము సేవించువాడ వని నామదికిని దోఁచె! న న్నెదిరించుము! నే మేఘనాథుడ! నీజిడ్డు వదలింతు।। నుం డుండు।।

వ. అని పలికిన హనుమంతుండు—

తో. రామునిదూతను; రాక్షస వినరా-భూమిజ పొడగన వచ్చి। వేమఱు నిచ్చట విహరించితి నావిక్రమంబు గనఁబఱచి।। రా।।

వ. ఇదివఱకు వచ్చిన మీవారలలో నినుఁ గలిపెద రా రమ్మనుడు, మేఘనాథుం డతని శరీరంబుపై బాణవర్షంబు గురిపించిన, లక్ష్యపెట్టక దక్షిణాంబునఁ గ్రిందికి వచ్చి తనలావు మెఱయ—

తో: అతనిరథంబును నవనిఁగూల్చి మఱి యశ్వములను మడియించి। ధృతితో భటుల వధించిన మఱియొక తేరు నెక్కి యెదిరించి।

బ్రహ్మాస్త్రంబును బరువడి వైచియు బవనతనయు బంధించి। బ్రహ్మాదులు విభ్రమపడ రావణబ్రహ్మచెంగటికి నించి॥ రా॥

వ. అనేక విధంబులఁ గొట్టుచుఁ దిట్టుచు బాధించుచుఁ దోడ్కొని వచ్చి రావణుని యెదుట నిలిపిరి. బ్రహ్మచే మున్ను వరముఁ గొనియున్న హనుమంతుని బ్రహ్మాస్త్ర మేమియు బాధింపదయ్యె. అప్పుడు రావణుని యాజ్ఞచేఁ బ్రహస్తుం డిట్లనియె:

దర్బారు: అటతాళము.

ఎవ్వరివాడవుర! యెఱిగింపు రాజుతోడ! నివ్వేటి కెందు కొఱకే తెంచినావుర॥ యెవ్వరి॥ వన మెల్ల బెరుకగ దనుజుల దునుముఁగ బనియేమి నిక్కముగ బలుకు నీవే రేమిర॥ యెవ్వరి॥ వెఱవక ఈ లంక పురినిఁ జొచ్చుటకును హరిహరులకు నైన నలవిగా దంచెఱుఁగవ॥ యెవ్వరి॥ ధారుణి మోతుగుండధాముడో! శంకరుడో! సారసగర్భుడేనో! సరగున బంపినది॥ యెవ్వరివాఁడవుర॥

వ. అని యడిగిన నాంజనేయుండు రావణుని దిక్కు నభిముఖుఁడయి యిట్లనియె:

క. ఓరీరావణ! వినరా!
యీరేడు జగంబులెల్ల నేలెడు శ్రీమ
న్నారాయణాంశభవుఁ డగు
శ్రీరఘురామునకు నేను భృత్యుఁడ సుమ్మా.

గీ. జనకనందన నెమకుచు వనుల వెంట
నలజడుల రామలక్ష్మణు లరుగు దెంచి
ఋశ్యమూకాద్రిఁ జేరి సుగ్రీవు జెలిమి
గనిరి; నన్నంపిరటకు జానకిని గాంచ.

తో: దశదిక్కులను ధరణినందనుఁడు దఱిమెనుగపిసైన్యముల విశదంబుగ నేవెడలి జానకిని వెదకుచు సత్వము మిగుల॥ రామ॥

వ. సముద్రంబునొక్క కాలువంబోలె దాఁటి నీనగరంబుఁ బ్రవేశించి వెదకుచు నశోకవనంబుఁజొచ్చి, శింశుపావృక్షంబుక్రిందఁ గూర్చుండిన—

తో: సీతను గని రాము క్షేమము జెప్పితిఁ బ్రీతిగ నుంగర మిచ్చి; । భీతినెగకయ-నా తెఱగంతయు వివరింపఁగలోఁదలచి॥ రామ॥

గీ. వనము గ్రుంచి, వేగ వనపాలకులఁ జంపి
నీచు సేననెల్ల నీరు చేసి
పరగనింద్రజిత్తు బ్రహ్మాస్త్రమునకును
జిక్కి నీముకడకుఁ జేరినాఁడ.

తో: చావను బ్రహ్మాస్త్రంబుచేత నటుగావున జిక్కితినేను;। భావింతువొ నను బాధపెట్టఁగా రావణ, వాయుసుతుండ॥ రామ॥

కాఫీరాగము: అటతాళము.

దానవ, రామప్రతాపము నీమదిగానవు నీవటుగావున దుర్మేధ ! నే నెఱిగించెద ! నిన్నుజయించిన । వానిని వాలిని వధియించె జూడుము॥ దానవ॥ ఖండేందుధరుని కోదండము విఱిచెను; దండిగ భృగురాముదర్ప మడంచెను; ఖండించెఁగఱకఱ ఖరముఖులను మోక్షగుండ విభుని పయిఁ గ్రూరము మానవు॥ దానవ॥

ఉ. ఉత్తమ భూసురుండవయి యుత్తరదిక్పతి సోదరుండవై
చిత్తజవైరిబంటవయి, చిత్తము సత్యము సత్వసద్గుణా
యత్తముఁ జేయలేక యనయంబునఁ దామసివై చరింతు వు
ద్వృత్తిని మించి; యింతయవివేక పరత్వమె పంక్తికంధరా!

కీర్తన: ఏకతాళము.

మాయాసన్నిర్మిత మగును గాయము నపాయంబగు ధాతుమయము హేయము॥ నిజ॥ వనితలున్ దనయులున్, దనువులున్, ధనములున్ దనవి యనుచు గనును జీవుఁడు॥ నిజ॥ జలమందుఁ గలుగు

బుగ్గలరీతిన్ బ్రీతిన్ దోచి యడగును॥ నిజ॥ ఎన్నెన్నితనువులు న్నెత్తి యుంటిమో! యిక నెన్నితనువు లిల నెన్నగ దిన్నగ బన నెత్తుదుమో!॥ నిజ॥ లేకుండు నుండు లేకుండు। బ్రాకటకౌము దిః గను॥ నిజ॥ కలలో ననేకదేహచయము గానుపించుచున్, ఆలోన్న బోనోయదృశ్యము లౌనటుగా నెంచుచు॥ నిజ॥ ధరమోక్షగుండవః రాధ్యక్షుం డీతనువులున్ సాక్షియైదీక్షతోడగరుగోనున్॥ నిజమా॥

తో: ఆకాశమువలె నంతట నిండిన యచలుండుపరమాత్మ బ్రాకృతతనువుల బటుజీవుం డనం బరగి సూక్ష్మముగ నుండు॥ రావ

గీ. అట్టిజీవాత్ముండీ శరీరాభిమాన
మునను, దేహంబె! యాత్మగా బుద్ధి నెంచి
తనర సంసారవార్ధిలో మునిగియాత్మ
కర్మఫల భోక్తయై యైహికమునం గడపు.

వ. ఇట్లుండి కాలాంతరంబున——

తో: తను విం కొక్కటి దాను ధరించును దృణజలూకవ బోలి। కనుంగొన నెన్నంటికిని నాద్యంతము గనంబడకుండును బాళి॥

వ. కాంబట్టి వివేకవంతుండు నిత్యానిత్యవస్తువుల విచాః యనిత్యంబులయం దాసరోసి, నిత్యమయిన యాత్మ నెఱింగి యా యందుం గలిసినగదా జన్మరాహిత్యంబు! రావణా! యట్టి యా స్వరూపుం డీరాముండని కనరాదా!

కీర్తన: ఆదితాళము.

పురాణపురుషుం డవ్యయుండు రాముండు, మానిమానసాబ్జసంస్థ ధాముండు, తానే తానై తనరునాతండు ॥పురా॥ అనంతనామరూప లు, నీయంతమై సంతతంబు జేసి తాను నంతర్యామియై, శాంతి దా వంతుం డయి తగు॥ పురా॥ అజాండకోట్లయందు దా నఖండ చండకిరణురీతి మోక్షగుండనిలయుండై, దండి నిండి యుండు నచలు పురాణపురు॥

వ. అట్టిపురాణపురుషుఁడు దుష్టనిగ్రహ శిష్టపరిపాలన కొఱకుఁ బ్రతియుగంబున నేదేనొక రూపంబున నవతరించుఁ గాన, నట్టియవతారమూర్తి యీరాముం డని తెలియుము !

గీ. ఇంతటను నయిన యమ్మాల్యవంతమందు
రామలక్ష్మణు లున్నారు; రాక్షసేంద్ర,
సీతఁ గొనిపోయి యిచ్చి తత్సేవ జేసి
కులము నెల్లను రక్షించుకొని తరింపు.

వ. అటు లొనర్పక గర్వించితేని వినుము—

హిం. కాఫీః అటతాళము.

భండనభీముం డగుకోదండపాణి యేతెంచును! నిండుధైర్యముతోడ నీపురి ముట్టడించు॥ భండన॥ ధాటిగ నాకన్నను మేటు యగుకపిసేన కోటానకోటులు దను గొల్చుచు వెంటరాఁగ॥ భండన॥ ఖాడి తనుగను మోక్షగుండపతి సీతలఁ జెం: లాడుగాదా నీకుఁ జెప్పెఱను దెలిసెడిని॥ భండన॥

వ అని ఖండితంబుగఁ బలికిన వానరేంద్రుని వాక్యంబులు విని కోపోద్దీపిత మానసుఁడయి కన్నులయందు నిప్పు లుప్పతిల్ల బ్రహస్తాది మంత్రులఁ దిక్కు జూచి,

తో: వింటిరె మీరలు నీనిప్రతాపము నీనిప్రగల్భము లెల్ల !! నొంటిగ నుండియు నోడక నాకెదు రొడ్డి కూసెడిని చెల్ల! । దిక్కుల గెలిచితి; దిక్పాలురునను, దేఱిచూడ వెఱచెదరు; చక్కగ మనుజుని శరణుఁజొచ్చు మని సరిగా నీఁ డిటు వదరు ॥ రామ॥

వ కాబట్టి వీనిని గట్టిగాఁ బట్టి పొట్టకొవ్వుఁ గరగించి దిట్టతనంబున పట్టివేసియుఁడు. మంత్రులారా! సమస్తకార్య స్వతంత్రులారా! అనిన వా రందునకు సన్నద్ధు లగుచుండ బుద్ధిశాలియగు విభీషణుం డన్నసన్నిధికి వచ్చి నమస్కరించి యిట్లనియె:

నవరోజు: ఆదితాళము.

సరిగా దీపని రావణా॥ నీకు సరిగా దీపని॥ సరగున దు దరుణుల బాలుర ధరణీసురలను జంప॥ సరి॥ దూతలు దమ నేతల యనుమతిఁదొడరి చేయుచురుగాదే॥ సరి॥ ఊరక విడు కొప్పకున్న నొక తీరుగ దండనఁ జేయు॥సరి॥ గుండెగలుగు శూ వైన మోతుగుండ విభునిపై కేగు॥ సరి॥

వ. ఇట్లు బోధించిన విభీషణుని వాక్యముల కామోదించి మంతునిజంపుమని చెప్పిన తలంపును వదలి మంత్రులకు మరలనిట్లు

తో: వానరులకు లాంగూలమె మూలము గాన వీనితోఁక॥ నూనెగుడ్డలను మానుగ జుట్టియుఁ బూని కాల్చి విడు డనెను ॥ ల

వ. ఇట్లు కఠినంబుగ నాజ్ఞ యిచ్చె. రావణుని శాసనంబున సులు చెలరేగి యాంజనేయుని బాశబద్ధుని జేసి యింటింటఁగల గుడ్డ యుం దెచ్చి నూనెతోఁ దడిపి తోఁకను జుట్టి నిప్పంటించి వాద లతోఁగూడఁ నపహాస్యంబుఁ జేయును,

తో: దనుజులనదంటెఁ దఱిమియు గఱచిన వనచరకీటక మి మనచే దొఱకెను మర్దింపుం డని మట్టుచుఁ గొట్టుచుఁబగతో॥

వ. పురవీథులెల్లఁ గలయఁ ద్రిప్పి పశ్చిమ ద్వారంబుక జేర్చి, నింతలోఁ గొందఱు రాక్షసాంగన లావార్త యెఱింగి సీతవగచుచు,

హిం. తోడి: అటతాళము.

ఎంతకష్టము వచ్చెను! నేమిచేయఁగ వచ్చును! ఎంత యని పింతును! జంత యెటువలె దోలితును॥ ఎం॥ మాయనాది దైవ మాకునీవు సహాయము జేయ నోరువ డాయెను! జిక్కులే కలిగిం ॥ఎంత॥ సాక్షియైన నారాయణ శర్మను రక్షించిన మోతుగ దేవుని ముఖ్యభక్తుఁడ వయిన నీ! కెంతకష్టము॥

వ. అని కొంత చింతించి యనంతరంబు ధైర్యంబున నగ్నిని గూర్చి నమస్కరించి,

క. అనిశము నిజనాథుని పద
వనజమ్ముల నాత్మఁ బూజ బఱుపుదు నేనిన్
అనలుఁడు శీతలతం బా
వని నంటక కనికరించి భద్రమొసఁగుతన్.

వ. అని నియతిమై యగ్నిని బ్రార్థింప, నమ్మహాపతివ్రత వాక్కుల కలరి జాతవేదసుండు శీతలభావమున నాంజనేయుని బాధింప కుండె. ఇక్కడ హనుమంతుండు —

తో: ఔరా నన్నీయగ్నిదహింపమి కారయఁ గారణమేమో।
శ్రీరఘూద్వహుఁడు నాయెడ జిలికెను కారుణ్యామృతరసమో! ॥రా॥

వ. పతివ్రతాశిరోమణి యగు సీతాదేవి యమోఘాశీస్సుగా నుండవచ్చు. సీతారాములకునమస్కరించి బ్రహ్మమంత్రంబుపఠించిన మాత్రంబున బ్రహ్మాస్త్రంబు వదలిపోయె. ఇంతలో నినుండ స్తమించుటయు,

గీ. పర్వతాకారముగవాయు పట్టి పెరిగి
చుట్టుముట్టిన దనుజుల నుగ్గుజేసి
క్షణములోపల నాకాశమునకు నెగిరి
పక్షికంఠుని మేడపైఁ బరగ దుమికె.

తో: అతనినగళ్ళకు జతికిలద్రోయుచు, హనుమఁ డనలమంటించె;।
హుతవహుండు పురినెల్ల కడలఁ దనయుగ్రాకృతిఁ బఱపించె॥రామ॥

వ. ఇట్లంజనాపుత్రుండు విజృంభించి వాలంబుపెంచి లంకానగరంబు, విభీషణగృహంబుదక్కఁ, నలుమూలలఁ గాల్చె. పలాయన మగుటకు శక్తి చాలని స్త్రీ బాల వృద్ధాదులు దేహంబులు గాలుచుండ నొకరి నొకరు కౌఁగిలించుకొని,

శంకరాభరణము: ఆదితాళము.

అయ్యయ్యో! చూడరే! యెంతయన్యాయము గూడెనో! చయ్యన రావణునకు జావే మైన మూడెనో! ॥అయ్యో॥ పరకాంతను బతివ్రతను జెఱఁబట్టి తా దెచ్చెను! బురముగాలె! దత్ఫలముఁ బొందు వేళవచ్చెను॥ అయ్యో॥ సుతు లన్నదమ్ములు హితులు బతులు సతులు ననుచును వెతకికొనఁగ వ్యవధిలేదు! బ్రతుకు దూర మాయెను ॥అయ్యో॥ మోతుకుండ రాఘవునిపైఁ గక్షకట్టుకుండిన, రాక్షసవరుల కాపురము లకు జే టొదవునా! ॥ అయ్యో॥

వ. ఇట్లు పురజనులనెల్లఁ జీకాకుపడఁజేసి సముద్రంబునందు వాలంబుఁ జల్లార్చుకొని హేమవర్ణంబుగ నలరారు లంకానగరభూమిని గని హనుమంతుం డాశ్చర్యంబు నొందె నని చెప్పిన శివునకు భవాని యిట్లనియె:

తో: హేమవర్ణముగ నేటికి లంకాభూమి యలరె విన నెనరు। స్వామి, తెలుపుమన హైమవతికి శశిశేఖరుఁ డనె నిటు లోలయ.

క. ఉరగుల కమృతముఁ దెచ్చుట
కరుగుచు గరుడుండుఁ గడు క్షుధాతురుఁడై శ్రీ
హరిని గని మ్రొక్కి యాఁకలి
దీరఁగ తెలుపుం గడుగ నాయధోక్షజుఁ డనియెన్.

శహాన: ఆదితాళము. (వనమునుజూడంగ) వలె.

విను వినతాపుత్ర! నీకు విస్తరించి తెల్పెదన్: మునుకరి మకరము లెనసి పోరఁగ రి నను వేడగ మకరిని నేదునిమితి॥ విను॥ కరీంద్రుడపు డాశరీరమును వేదొరంగి శాపము దీరగన్ దిరంబుగాఁ జనె; ధరిత్రి నవి యొక సరోవరముకడ జాల నున్నయవి॥ విను॥ ఘనంబుగను దత్కళేబరంబులు దినంగ నాకలి దీఱును; చనంగ నగు మోతుకుండపతియాజ్ఞ నచ్చటికి నీక్షణంబులో నిక॥ విను॥

వ. ఇట్లు తెలిపిన హరి యనుమతి వడసి తార్క్ష్యుండు తత్క్షణంబున నాపుణ్య సరోవరంబుకడకుఁ జేరిన.

క. గజ- నక్రకళేబరముల
భుజియింపగ వచ్చియున్న భూభ్రిభంగుని ద
ద్గజనక్రంబులఁ గైకొని
భుజగారివియత్ప్రధానఁ బోయె యథేచ్ఛన్.

వ. భ్రూభంగ నామగృధ్రపతి గరిమకరములను రెండుపాదములఁ దగిలించుకొని భక్షించుటకు విశాలస్థలం బరయుచుఁ జని క్షీరసముద్రతీరంబున నున్న సహస్రయోజన పరిమితిగల జంబూవృక్ష శాఖమీఁదఁ గూర్చుండిన,

తో: గరుడుని భారము కడుదుస్సహమై తరుశాఖ తునుంగగను। ధరఁ బడకుండగ దానిముక్కునను దగగొని నెమ్మనమునను॥ రామ॥

హిం. తోడి. అటతాళము.

ఏమితోఁప దెందుబోయెద! నిది యెచ్చోఁ బారవైచెద॥ నేమి॥ దీని భూమిపై నుంచిన భూతకోటులకు వేమరుఁ గీడౌదవు॥ యేమి॥ అందు మునీంద్రులు వెందఱోగలరు॥ యేమి॥ బొందుగ వారి తపోభంగమైన నేమందురో! శపియింతురో! ॥ యేమి॥ ఆకలినిల్పలేక హరి దెల్పవీనిఁ జేకొనిపోయి భుజింపగ బోయిన నీకొమ్మ విఱిగె నయ్యో! ॥ యేమి॥ శ్రీమారుతి గుండస్వామి నాయందు లేదేమొకో! యాపద లేతెంచె! బాపగ నెవ్వరగపడరు॥ యేమి॥

వ. అని యిట్లు ఖేదపడుచుఁ బోయి యొక్కచోఁ దపంబు చేయుచున్న కశ్యపమహర్షినిఁ గని వినయంబున నిట్లనియె:

మ. జనకా ! యీతరుశాఖ యెందిడుదు? నీజంతుత్రియం బెచ్చటన్
దిని నేఁబోదు ననంగసర్వముఁ దపోదృష్టిన్విలోకించి యా
యన 'వత్సా! వినుము, నూఱుయోజనము లీయంభోధి లంఘించినన్
గను పట్టు న్విజన ప్రదేశ మగు లంకాద్వీప మం దొప్పఁగన్.

వ. వీనిని భక్షించి యీకొమ్మయం దుంచి పొమ్మని దీ:
పంపిన వేగంబున నచ్చటి కేతెంచి.

ద్విపద॥ ఆజంతువుల దిని యస్థి చయంబు। రాజితముగ మూ
రాసులు చేసి । యామీఁదఁ దరుశాఖ నమరంగ నిలిపి । ధీమం
వైనతేయుండు చనియె,। నది త్రికూటాచల మున నలరారె; । బ
యందుఁ దపం బొనరించు, । వాలఖిల్యాదు లర్వది వేలఋషు
పోలంగ దపములు పూర్ణమై ముక్తి । పొందిరి యంత జాబూఫల:
మందు ఘనీభవమై పాచిపట్టి । యుండె నాపై బురంబొందు నిర్మి
యుండిరి రాక్షసు లొగి గాపురముగ; । హనుమంతుఁ డది కాల
రాళ్ళు కఱగి । కనఁబడె నాభూమి కనకమయముగ.

వ. అంకట హనుమంతుండు మరల సీతమ్మ సన్నిధి
యిట్లనియె:

తో: తల్లి నేను వనమెల్లను బెఱికితి; దగుల బెట్టితిని పురి
అల్లాడించితి నసురుల; సెల విమ్మరిగెద నే నిత్తఱిని॥ రాము॥

వ. నీభర్తను సుగ్రీవాది వనచరయుతంబుగాఁ దోడి
నీముదుములు నివారింపఁ జేసెదను. ధైర్యంబున నుండు మని చె
సీత యిట్లనియె:

తో: రాముని వార్త కర్ణామృతముగ నీచే వింటిని! నే విం
మీఁదను। నే నిక్కడ నగపుర నెటుల గడపుదును నొంటి॥ రాము।

వ. అనిన హనుమంతుం డిట్లనియె:

తో. నిను నాభుజమున నెక్కజేసికొని వనధిదాటి శీఘ్రమ:
దినకరాన్వయుని రాముఁ జేర్తు రమ్మనుచు పలికె నెయ్యమున॥ ర

బ్యాండుస్వరము : ఆదితాళము.

మారుతీ! యీరీతి ధీరతఁ జేయగ శూరుఁడ వగుదువు సు
గ్రీవు! నీరావణు శ్రీరాముడు జేరి వధించు నిక నెన్నడు॥ మా॥ శ్రీమో

గుండ పురీశుని కీర్తి యీభూమిని స్థిరముగ బాదలగవలదా ఆమా
న్యుని సౌమిత్రిని శ్రీమీఱ దోడ్తెమ్ము శీఘ్రముగ॥ మారు॥

వ. రాముఁ డవతరించి రావణవధ చేసినాఁ డను యశస్సుభూమి
యందు స్థిరముగ నుండవలయును గాన, నీవు దర్వరగాఁ జని వారధి
దాఁటి రామలక్ష్మణు లిటకువచ్చు సన్నాహంబులు జేయుము.

తో: ఈముద్రిక శ్రీరామచంద్రునకుఁ బ్రేమ మలర నిమ్మనుచు
భూమిజ యిడి యిక బొమ్మన మారుత పుత్రు డామె వీడ్కొనుచు॥
రామ॥

వ. వేగంబున వెడలి సువేలాద్రిపంఙు కెక్కి యావలిదరికి నెగు
రఁబోవు నంత,

క. హనుమంతుఁడు లంకాపుర
మున జరిపిననటన సర్వమును వ్రాసిముదం
బున రామున కిమ్మని పా
వనిచేతికి నిచ్చె బ్రహ్మ పరమప్రీతిన్.

వ. ఆకమ్మగైకొని యానందించి బ్రహ్మసెలవుఁ బొంది మారుతి
కుప్పించి యెగసి యుదధి మీఁద వచ్చుచుండ ముప్పదియామడల దూ
రంబుననుండి వినంబడెడు ధ్వని విని యీగట్టున నున్న యంగదాదు లు
ప్పొంగుచు,

తో: కృతకార్యుండై కేసరిపుత్రుడు క్షేమంబుగ వచ్చెడిని॥
ధృతితో నటుగా దేని యింతధ్వని దేనివలన గలిగెడిని॥ రామ॥

వ. అని నిశ్చయించు చుండిరి. అంతలో నాంజనేయుండు స్వకృత
కార్యనిర్వాహకప్రభావంబున భావంబునఁ గించిద్గర్వసమావేశుండై
వారిని లక్షింపక వేగంబునఁ గొంతదూర ముత్తరదిశకుఁ జని, యందుఁ
దపంబొనర్చు మునివరేణ్యుని పురోభాగంబున ధరాతలం బదర దుమికి
నమస్కరించి యనుచున్నాఁడు;

కేదార: రూపకతాళము.

మునివరేణ్య వినుమా, ననుఁ గృపార్ద్రదృష్టిని గనుమా॥ వ
జన కాత్మజయిక్కవజాడను నే గని చనుదెంచితి॥ ముని॥ ఆహా దా
జూపగ జాలను॥ ముని॥ నీరంబుగ్ గ్రోలంగ జారుజలాశయ
చేరువునుండిన జూపుము॥ ము॥ ఆలస్యము వలదు! చాలాశ్రమపడ
బాలింపగ దగుదు! నేలాగున జనుదు! యేలవే దయాలవాల॥
శ్రీమీరగ మోక్షపురస్వామిని గన నే జనవలె॥ మునివరేణ్యా॥

వ. అనివేడిన నమ్మౌని మౌన మూనినవాని వలె సర
మున్న దిక్కుతర్జనితోఁజూపిన నెఱింగి, యుంగరమును గమ్మయు
మణియు నచ్చటనుంచి దాహంబుదీర్చుకొని వచ్చులోపల—

గీ. ఒక్కకపివచ్చి రాముని యుంగరంబు
మునికమండలువందుంచి చనియె నంత
నాంజనేయుండు గ్రమ్మఱ నరుగుదెంచి
యంగుళీయక మెందున్న దనుచునడుగ.

వ. మునీంద్రుండు భ్రూసంజ్ఞచేఁ గమండలువుఁ జూపె.

తో: అందు గన్నరా మాంగుళీయకము అగణితముగగన
నిందలి ముద్రిక లెవరివి నాయది యం దున్నది యెమ్మనిన॥ రా॥

వ. మునీంద్రుడు చిఱునగవు గదుర నిట్లనియె:

బిలహరి:రూపకము. (ఘోరపా)వలె.

వినుము దెల్పెదను వనచరోత్తమ! సర్వంబును॥వినుము॥ ఇం
మును పెంతమందియొ! వింతగ హనుమంతులు సీత నెంతయుఁ
యే తెంచుచు నా చెంత జేరుదురు॥ వినుము॥ అచ్చట సీత యి
ముద్ర యిచ్చట నుంప, నిం కొకకపి మచ్చిక నీకమండలువున వే
తా వైచెను॥ వినుము॥ దీక్షతో నీవు దెచ్చియుంచిన మోక్షగుం
ముద్రిక యేదో వీక్షించి దాని వేగ గైకొను వృక్షచరాగ్రణి॥ ॥వినుు

వ. అని తెలిపిన నాశ్చర్యంబుతో నాంజనేయుండు—

చ. 'మునివర, సీతనాకిడిన ముద్రికయిక్కడఁ బారవైచి రా
మునికడ కెట్లు బో నగును మోదముతో? వివరింపు' మన్న, నో
వనచర, యీకమండలు వవశ్యము శోధనజేసి నీవు దె
చ్చిన మొహరుంగరమ్ముఁ దగఁ జేకొని రాముని జేరఁ బోవుమా!

వ. అనిన మంచి దని హనుమంతుం డంజలితోఁ గమండలువు నందున్న యుంగరంబు వెలుపలికి తీయుట కారంభించిన నంతము లేకుండ వచ్చుచుండె; నప్పుడు—

తో; అన్నిటె నరసిన నందు రామనామాక్షరసహితము లగుచు। నున్న గనుంగొని యన్ని యందులో నుంచి యి ట్లనుచు దలచు॥ రామ॥

కానడః చాపుతాళము.

ఎందఱొ రాకా! ముందు నావంటివా॥ రెంద॥ సందియమువీరె డెందమునకు॥ మున్నెందఱొ॥ ఎందఱో హనుమంతు లేతెంచి యుండగ నిందులో నా దేటిగణన యగు॥ నెంద॥ నేనిదేదురభిమానముతో నుంటిఁ గాని స్వతంత్రాధికారము లే దార॥ మొ॥ మోక్షగుండేసుని ముద్రిక లెన్నగ నక్షయ మగుటయె సాక్షియౌ నీవర॥ కెంద॥

వ. అనియాలోచించి గర్వంబు సర్వంబు విడిచి మునికి నమస్కరించి పీడ్కొని శిరోరత్న లేఖనముల మాత్రము గొని.

గీ. తత్క్షణంబున నచటికి దక్షిణమునఁ
గలమహేంద్రగిరి ప్రాంతముల వసించి
ఆతురతఁదన రాకను నరయుచున్న
యంగదాదుల కడకు నెయ్యమునఁ జనియె.

వ అట్లరుదెంచిన యాంజనేయున కెదురుగఁ జని యంగదాదులు గాఢాలింగనంబుఁ జేసికొని సుఖాసీనుం జేసి,

జంఝూటి: ఆదితాళము.

వాయుజా పోయినకార్యము కాయో! పండో! కడు దెల్పుము॥ వా॥ చేయగ నీచేతగాని దీ యవని నేదికలదు! సాయక వంతుఁడవు॥ వా॥ ధారణీతనయను గనుగొని జేరి మిగుల భాషి తివా? నీవు॥ వా॥ శూరతను జూపితివా? కోరికతో మోతుకుండ శ్రీ ముని జేరరమ్ము॥ వాయు॥

వ. అని యడుగుడు,

తో: కాంచితి సీతను; ద్రుంచితి వనము; భాషించితి రావణుతో మించితి లంక దహించితి నిట కరు దెంచితి రాముని జూడ॥ రా॥

వ. అని యందఱుఁ గలసి రామదర్శనార్థముఁ జనువాఁ యుత్సాహంబుతోఁ గదిలిపోయి కొండొక దూరంబుననున్న సుగ్రీ మధువనంబునకుఁ జేరిన నప్పుడు,

తో: ఆఁకలిదప్పులు నడఁగ ఫలంబులు నారగించి తేనియ జేకొని పానము జేతుము సెల విచ్చి నని యవ్వనచరులు॥ రా॥

క. అంగద హనుమంతుల నడు
గంగావారియ్యకొంచుచుఁ గానిమ్మనుడున్
బొంగుచు వనమున వానర
పుంగవు లటుచొచ్చి కొల్లపుచ్చిరి కడిమిన్.

వ. ఇట్లు ఫలంబులు తిని తేనెలు ద్రావి కొమ్మలువిఱిచి కులమునింగి యిచ్ఛావిహారంబుగ వానరులు వర్తింప వనపాలుఁడగు ముఖుండు కోపోద్దీపితుండయి,

తో. ఎవ్వరియాజ్ఞను నివ్వనవాటిక-నిపుడు జొచ్చితిరి మీ కొవ్వుసెడఁగ నేఁ గొట్టిన నడ్డం బెవ్వ రనుచు బలుమారు॥ రా

వ. వారిని మర్దించిన, వారు పోయి మనవిచేయ, హనుమ దాదులు దధిముఖుని గుండె లవియునట్లు నులిమిన, భయపడి వ వాపోవుచు సుగ్రీవునిఁ జేరి నమస్కరించి,

ఫీల్ రాగము: ఆదితాళము.

కపికులనాథా! కపికులనాథా! కృప జూడుము నను గపికుల నాథా॥ కపి॥ అంగదుండును హనుమంతుండును పొంగుచు గొల్ల పుచ్చిరివనము॥ కపి॥ వద్దని నేను వారినినాగ, గ్రుద్దిరినన్ను గ్రుడ్డెల్ల గాను॥ కపి॥ శ్రీమోక్షగుండ ధామునియాన నే మీకు దెలుప నేతెంచినాను॥ కపి॥

వ. అనిన, నతండు మహానందభరితుండయి శ్రీరామునిడగ్గఱి,

స్రగ్విణి: జానకిన్ గాంచియున్ సంతసం బందుచున్। వాన రుల్ గ్రమ్మఱన్ వచ్చునట్లున్నదా!। కానిచో గేళికాకాననం బందునే। తేని వర్తింతురే ధీరులై దేవరా!

వ. సీతజాడ దొరకకుండిన దీనులై వత్తురు గాని ధీరులై వత్తురా! మధువనం బంతయు నిర్మూలంబు చేయుదురా! దాశరథీ! సత్కృపాశరథీ! యనిన రాముం డట్టిన వారినిఁ ద్వరగాఁ బిలుపింపు మనుడు, దధిముఖునిగాంచి సుగ్రీవుం డిట్లనియె:

తో. రామునికార్యధురంధరులై చని శ్రమపడి వచ్చిరి కాన!। నే మన గూడదు. ఇక జని వారల నిటకు దోడి తెమ్మనిన॥ రామ॥

వ. అతివేగంబునం దధిముఖుం డరిగి హనుమదాదులకు మ్రొక్కి సుగ్రీవునాజ్ఞ దెలుప నందఱుఁ గదలి మహానందంబునఁ బోయి సుగ్రీవ లక్ష్మణయుతంబుగ నున్న శ్రీరామప్రభువునకు సాష్టాంగ నమస్కారముచేసి వారియనుమతంబున నందఱు నాసీనులైరి. అప్పుడు రాఘవుండు వారలం గని,

క. మీ రేగినకార్యము నెఱ
వేరినదా! యనుచు రామవిభు డడుగుటయున్
ఊరకయుండిరి యందఱు;
మారుతి యిట్లనుచుఁ బలికె మన మలరంగన్:

కేదార: ఏకతాళము.

కాంచి వచ్చితిఁ గనులారా॥ గాంచి॥ మించి సంపాతి గించి పాప వార్ధి లంఘించి, లంకశోధించివివరించి భావించి సేవ కాంచి॥ భూరిమలినాంబరధారన్ మోతుగుండవిహారున్ బాగడెట శరీరన్ సువిచారన్ గతధీరన్ శ్రీమీారన్॥ గాంచి।

వ. అని విన్నవించిన శ్రీరామమూర్తి యాదరంబునఁ ౯ యిట్లనియె:

తో: ఎటువలె బోయితి! వెటుల గంటివి! యెటువలె భా తివి!। కుటిలాలక నీకెఱిఁగించిన ముచ్చటలు దెల్పు హితమతివి॥ ఏ

వ. అని యడిగిన నాంజనేయమూర్తి యిట్లనియె:

గీ. స్వామి, మీాయాజ్ఞ దలఁదాల్చి జనినమేము
ఘనుఁడు సంపాతితెలుప మార్గంబుదెలిసి
వరుస నూ రామడలుగల వార్ధి నీదు
దయను వనచరు లరయుఁగ దాఁటినాఁడ.

వ. ఇటుల దాఁటి రాత్రికాలంబున లంకఁబ్రవేశించి ర కుంభ కర్ణాదియోధుల గృహంబులెల్ల నరసి మీాదేవిని గానక ం కారామంబులోనికిఁ జని పరిశీలించిన నొకశింశుపావృక్షుంబుక్రింద-

తో: దీనాననయై దివ్యముగా రామ! ధ్యానం బొనరించుచ దానవకాంతలు దనజుట్టును జలమూని నిలువ నొప్పుచును॥ రామ

వ. ఉండగాఁ గాంచి సీతగా నెఱింగి తదీయవృక్షుంబ సూక్ష్మరూపంబున నిలిచి తటివేచి,

తో: తమకథ యాద్యంతము నుడివిన విని, ప్రమదంబున జేరి। క్రమమున నంతయు గద్గానందముగా వచింపు మన జేరి॥ త

వ. మీారును మాకును గలిగిన సాంగత్యవివరంబును మీావ బంపఁబడి నేఁ జనుటయు లోఁయగా సర్వంబుఁ దెలిపి తమ ముద్దు గర మిచ్చిన,

క. కనులను బలుమఱు నద్దుచుఁ
దనతలమానికము నిచ్చి తగఁ బొమ్మనుచున్
నను బంపించెను మీతో
ననుమనె నొకకొన్నిమాట లాశ్రితవరదా!

జంఝూటిః అటతాళము.

పదినెల లాయెను బతిబాసి యనెను; మదిలోన నిక దనను మఱవ వద్దనెను॥ పది॥ రెండునెలలకు రాకుండిన నికను ఖండించు నీదశగళు డని యనెను॥ పది॥ కూ్రరులపాల్ చేసి యూరకుండినను వీరధర్మముగాదు వినిపింపు మనెను॥ పది॥ రాక్షసులను జంపి రక్షింపు మనెను; మోక్షగుండేశ్వర, మొ్రక్కితినననెను॥ పది॥

తో: కడువడితో నను గాకము జీరినఁ గర మలిగెనుగద మును పు। ఎడబాపెను నను నీరక్కసుపై నేల గినియ వని తెలుపు॥రా॥ ఆలక్ష్మణుతో నను మనియెను బర్ణ శాలచెంతఁ దా ననిన। బాలవాక్యములు భావింపక దనుఁ బాలింపగ వేగమున॥ రామ॥

వ. అన్నతోఁ గలిసి వచ్చి పుత్రుమిత్రామలతోఁ గూడ దశ కంఠుని నలిమి తనచెఱబాపు మన్నది. సుగ్రీవునితో దన కష్టంబు దెలిపి చాల యడిగితి నని చెప్పుమన్నది. యంత నామెచే దీవన లంది సెలవుఁ బొంది,

క. నే వచ్చి పోవుసంగతి
రావణునకుఁ దెలుపఁ గోరి రయమున వనమున్
వేవేగమె పెకలించియు
దేవారుల గొందఱను వధించితి నలుకన్.

వ. అంత రావణుం డింద్రజిత్తుచేత నన్నుఁ బట్టి తెప్పించి యడి గిన నాసంగతి యంతయు స్పష్టముగఁ జెప్పిన విని యలిగి నావాలంబు నకు నూనెగుడ్డలు జుట్టించి కాలిపించిన వాలంబుఁ బెంచి లంకాపుర మంతయుఁ గాల్చివేసి సముద్రములో ముంచి తోక చల్లార్చుకొని,

తో: వారిధి దాఁటియు వానరులను గూడివచ్చితి మీసన్నిధికి॥ వారక యిదియే వార్త యనుచు నానవాలిచ్చిన గొని యలికి॥ రామ॥

వ. సుగ్రీవునిఁ గని రామచంద్రుం డిట్లనియె:

కాంభోజి: అటతాళము.

ఈమానికమ్మునే నెటులను వీక్షింతు? నేమిచేయుదు భానుజా! కామించి మాపెండ్లి కాలంబునందు మామామకూతున కిచ్చె మం గళప్రదముగ॥ నీమానికము॥ అప్పటినుండి తనకొప్పులో ధరియించె; నిప్పటి కిటుబంపెను! యెప్పుడో మోక్షగుండేశుడ నా నే నాయొప్పుల కుప్పను దప్పకగాంతునో!॥ ఈమానికమ్ము॥

వ. అని వగచుచుండ,

క. వగవ బనిలేదు రాఘవ
మిగిలినకార్యమున కింక మేకొనియనిలోఁ
బగతురను జంపి చెలువా
పగ దగు మీదేవికడియ ప్రకృతంబగుటన్.

వ. అని సుగ్రీవుండు దెలిపిన దుఃఖంబు విడిచి ధైర్యంబుఁ బూని యాంజనేయుని గాఢాలింగనంబు జేసికొని,

తో: శతయోజనవిస్తారం బగునాసాగర మెటు దాటితివి?। అతి ధైర్యంబున నాలంకాపుర మరసి యెటుల వచ్చితివి॥ రా॥

వ. అనిన హనుమంతుండు—

గీ. శాఖపైనుండి మఱియొక శాఖపయికి
నెగురుశాఖామృగంబుల కెంతశక్తి!
తలప నిరుమారు లాసముద్రంబుదాఁటి
వచ్చుటెల్లను నీప్రభావంబగాదె!

వ. అనిన రాముండు—

తో: అంతమంది యోధానుయోధు లా యసురులు గనుగొన హెచ్చు। చింతింపక గాల్చిచివి లంక యిది యెంతధైర్య మనవచ్చు॥ రా॥

వ. అనిన దానికి నాంజనేయుండు—

తో: జానకి నిశ్వాసంబున నీకోపానలమున నాలంక । కానగ ముందే కాలిపోయె; నేఁ గాల్ప గలనె యకలంక॥ రామ॥

వ. అను వాక్యంబులకు శ్రీరాముండు పరమానంద భరితాంతఃకరణుండై,

గీ. ఎంత కార్యంబు జేసితి విద్ధచరిత!
పరమబంధుఁడ వగుదువు పరఁగ మాకు!
నరయ మత్పద మిచ్చెద! నంతకంటె
నన్య మేమున్నదయ్యా నీ కనుచుఁ బలికె.

వ. అంత హనుమంతుఁడు నయ వినయ భయంబులుఁ దోఁపఁ శ్రీరామచంద్రునకు సాష్టాంగనమస్కారంబు లొనరించి యంజలిబద్ధుండై యనుచున్నాఁడు—

శహాన: ఆదితాళము.

రామా భానువంశజలనిధిసోమ! శుభామలకామా ॥ రా॥ హైమవతీజపితదివ్యనామ! నుతామరస్తోమా! ॥ రా॥ నేమది దెలియగ నేరక దనుజవిరామ, యొక్కయపరాధ మొనర్చితి॥ రామా॥ జనకజ నీ కిమ్మని యిచ్చిన పావనముద్రిక యొకమునితా గైకొనె॥ రా॥ అమ్మని యెవ్వరో! క్రిమ్మటియియ్యక పొమ్మని బంపెను బొసగ మోక్షపుర॥ రా॥

వ. అని పలికిన వాక్యంబులు విని రాఘవుండు నవ్వుచు నిట్లనియె,

తో: నే నేముని నై పిలిచితి నక్కడ నీగర్వం బుడుపఁగను వానరవర, యెవ్వరిపనిగా దది; మానుము సంశయ మికను॥ రా॥ ఇదిగో జానకి, యిచ్చిన యుంగర మిపుడు వ్రేల దాల్చితిని, ముదమున గనుమన ముద్రిక గనుగొని మదిలో గర్వము మాని॥ రామ॥

వ. శ్రీరాముండు సాక్షాన్నారాయణుం డని యాత్మ నెంచి హనుమంతుం డిట్లని పొగడుచున్నాడు:

కీరవాణి : రూపకము.

తపనకులజ ! దాశరథీ యపరాధిని గాపాడు॥ తపన॥ అపరిమితానుపమ వచోనిపుణ దీనపాలక॥ తపన॥ నిగమజాలమైనను నీ నిజము దెలియదనుచు విబుధు లగుణునిగా దలపోసి యఖిలమును గాంతురు నే నగచరుండ మూఢుండ దెలియగ నేర్తునె! మోతుగుండనగరనిలయ నారాయణనామశర్మవినుత రామ॥ తపన కులజ॥

వ. అని యనేక విధంబులం బొగడిన శ్రీరామచంద్రమహాప్రభుడానందవార్ధి నోలలాడి హనుమంతునియందు పరిపూర్ణ వాత్సల్యముంచె.

ఆశ్వాసాంతము: తోహర.

అని తాళ్ళూరి నారాయణకవి రామాయణముచు హరికథను। ఘనముగం జెప్పెను గద యిది సుందరకాండము చిలుకును సుధను॥ రా॥ ఇది వినువారల కిహసౌఖ్యంబులు గొదవ లేక చేకురును। ముదమున దుదకును ముక్తి లభించును మోతుగుండహరికృపను॥ రామా॥ రామా॥

క. నాచేతనైనకొలందిని
జూచి రచింతిని దీని సుజనులు నెఱసుల్
దోంచినయెడ దిద్దు రని
నాచిత్తములోన నమ్మినా నన యుంబుః.

మోతుగుండరామాయణహరికథ యందు సుందరకాండము
సంపూర్ణము.

శ్రీ రామచంద్ర గురు పరబ్రహ్మణేనమః
అవిఘ్నమస్తు.

# మోక్షగుండరామాయణము

## హరికథ.

## యుద్ధకాండము.

రామమూర్తియటుల న
రకృపారసము చిలుకఁ బలికినపలుకుల్
ండై వాయుకుఁ
మారుఁడు వాగడంగఁ దొడగె మన మలరంగన్.

**తోడి: రూపకము.**

రి కోరి భజియింతు సారసాక్ష! సేవింతు! మారకోటిమంగళ
ర! తారహార! మేరుధీర! ॥శౌరికోరి॥ మోక్షగుండఖేల! పృథు
మచేల! ప్రతిపక్షమదవిఘాల! నిటలాక్షవినుతశీల! గుణజాలా!
! బుధరక్షక! నారాయణకవిపక్ష! వరకటాక్ష! సమదరాక్షస
క్షశిక్షదీక్ష మోక్షదక్ష ॥శౌరి॥
ని కొనియాడిన రాముఁడు
మున నలరారి యపుడుమారుతి వినఁగా
జుని గనుఁగొని పలికెను
నఘా యిఁకఁ జేయనలయునది యెటు లోకో!
: వారిధి మన మెటువలెను దాటుదుము! క్రూరరాక్ష
రి మెటుల జంపుదుమో! మన మెటు భూసుత గం
॥ రా॥

తో: తారకలను సికతంబును వర్షపుధారలనైన గణింపం
గా ని కపివీరులసేనల దీఱినువా లెక్కింప॥ రామ॥

క. పదులును నూర్లును వేలును
బదివేలును లక్ష కోటి పదికోటులు న
ర్బుదములు న్యర్బుదములుగా
గొదువలు లేకుండ వెడలెం గోతుల గుంపుల్.

తో: చెట్టులనుండియు గుట్టలనుండియుగట్టులనుండియుం
పుట్టబగలి నట్టట్టహాసమునం బొదలుచుం జేరెను బ్రబలి॥ రామ॥

వ. ఇట్లు వానరసేనలు నేల నింగియు దిశలను బట్ట
నసంఖ్యాకంబుగాం గిచకిచధ్వనులచే దిగంతరాళంబు భేదిల్లంజే
వచ్చిన, సంతసించి యుద్ధయాత్రకు సాగం దొలు మని నీలున
పించి, రాముండు హనుమంతుని, లక్ష్మణుం డంగదుని నెక్కి
వ్రుండు దోడరాం, బ్రవాహంబుపొంగి పాఱినట్లు గతిపయ ప్ర
ణంబుల వచ్చి సముద్రతీరంబగు మహేంద్రాద్రికిం జేరి రాముం
చున్నాండు:

కళ్యాణి:రూపకతాళము.

వనధి దాటి లంకం జేర నళము మనకును! హనుమంతుం
బోయెనో! మనమున కాశ్చర్యంబగు॥ వనధి॥ నింగి ముట్టి
తరంగంబులు సుడులు రంగుగ వెంబడి వెంబడిం బొంగుచు నేతె
॥పీవనధి॥ భీకర సకరములు, జలు తీ కగుమీనములు ప్రాకటముగ
డపుడు పైకిని బొడగట్టి మునుగు॥ వనధి॥ ఎంతదూర మరయ
కంతు లేదు తెలియ! సంతతమును మోక్షగుండకాంతుండ
యుండిన॥ వనధి॥

వ. అని శ్రీరాముండు డోలాయమానమానసుం డగు
లక్ష్మణుండు——

క. శ్రీరామ, నీను సేవా
పారీణులె దాటుచుంద్రు భవసాగరమున్;
ఊరక బలికెదుగా కీ
వారధి యన నెంత నీకు వశముగు టరుదే!

వ. అని పలుకుచుండ నింతలో సూర్యాస్తమయమైన సైన్యం బులెల్ల నియామకస్థలంబుల విడిసిరి. రామ లక్ష్మణ సుగ్రీవులు గాలోచిత కృత్యంబులు దీర్చి యొక్కచో శయనించి జానకిని దలంచుకొని, రాముఁడు——

తోడిరాగము: అటతాళము.

ఎన్నఁడు గాంతునో నిన్నిఁక జానకి! కన్నులకు బాడగట్టును వక్కట!॥ యె॥ ఒంటిగ నుండఁగ నోపనినీ కిటువంటి విపద్దశ వచ్చెనె భామిని!॥ యె॥ బాపురె! మనలను బాపినకూ్రరుని నాపగ దీక్షగ రూపడగింపనె!॥ నె॥ మోక్షగుండపు రాధ్యక్షుఁడనయ్యును రాక్షసమాయకు భ్రమపడిపోయితి॥ నెన్నఁడు॥

వ. ఇటుల విలపించుచున్న రామచంద్రున కుపచరించుచు లక్ష్మణ సుగ్రీవు లిటు లనుచున్నారు.

శా. నిత్యానందమయుండ వై తనరు నీనేర్పుల్ విమర్శింపఁగా
సత్యాధీశునకైన దీఱ దనుచో, సర్వేశ, మే మెంత! నీ
వత్యంతంబును దుఃఖ మొందెదవు జాయాభ్రాంతి లీలార్థమై?
శృత్యంతంబున వెల్గు నీచెయువులున్ జోద్యంబు లౌ నీశ్వరా!

వ. లోకవిడంబనార్థము అవతరించినాఁడవు గాన, లోకానుగుణముగ నటించుచున్నాఁడవు. నిదురింపు మన్నా అని పలికి యందఱు నిదురించిరి. అంతనుదయం బయిన నిక్కడ లంకలో రావణాసురుండు గొలువుకూటంబు జేరి మంత్రుల నందఱ రావించి యిట్లనుచున్నాఁడుఁ

గీ. మంత్రులార, వినుఁడు మర్కటం బొక్కటి
లంకిణిని జయించి, లంకఁ జొచ్చి,

వనము బెఱికి వైచి, వైదేహి బొడగాంచి,
పురముఁ గాల్చి దనుజవరులఁ ద్రుంచె;
తో: మన చే జిక్కియు మఱి వంచకుడై వనధి దాటి వేగము జనియె: రాములక్ష్మణులఁ గపుల జయ్యనఁ దేఱఁగ మోహమున ॥౭

వ. చనుదెంచి సముద్రతీరంబున విడిసినట్లు చారులవలన వింటి నెటులనైన రాముండు వారధి దాటి రాకమానఁడు. దీని కేది సమపాయంబు యోజించి తెలుపుఁ డని పలికిన మంత్రు లుద్దండంబు బొబ్బ లిడుచు నిటు లనుచున్నారు.

కేదార: ఆదితాళము.

ఏల యిట్టులడలుచుండెదె మొనవు రాక్షసరాజ! ॥ యేల॥ చాల దిక్పాలుర నవలీల గెలిచి నట్టిబలశాలివి శాత్రవగజసింహకేసరివి నీవు। బేరీతిబలుక కింకఁజాలు మనుష్యు బంపిన నీవేళబోయి పగతుర గీలాఖీ మొనరింతుము॥ యేల॥ ఖండితముగను మోక్షగుండ శ్రీకోదండపాదండఁజేరి దండికోతిపిండుతో గూడఁ జెండి పంపుకొని మేనువం కడుపునిండ దిని, నిండు వేడ్కతోడ సత్తుముంనుము నీ డెందముః నేల॥

వ. అని మంత్రులు పలుకు నంతలో నింద్రజిత్తు ప్రహస్త శమాయ మహాకాయ అతికాయ మకరాక్ష యూపాక్ష విరూపాక్ష ధూమ్రాక్ష శోణితాక్ష ఖడ్గరోమ వృశ్చికరోమ సర్పరోమ కంపనఅకంప కుంభ నికుంభ మహోదర అగ్నికోపన దుర్ముఖ దేవాంతక విద్యుజ్జిహ్వాదిరాక్షసవీరు లక్షయబలశౌర్యధైర్యంబు లవార్యంబు లగుచుం సింహనాదభుజాస్ఫాలనంబులు చేయుచు రావణబ్రహ్మ కనుచున్నారు.

బేహాగ! ఆదితాళము.

ఇక మానుము మానుము నీ వీచింత! యీ మానవులు వానరులన నెంత! మనము చూచి చూడకుండ విడువ నాఁడు వాఁడు లే

తప్పించుక పోయినాడు! మే మేచి వెంబడిఁ బడినేఁడు వారిపీచ మడం చివచ్చెదము చూడు॥ మిక॥ పటుశౌర్యవిక్రమధారు లనుచు,నని వార్య శస్త్రాస్త్రనిపుణు లనుచు, గన కాహార్యసమధైర్యపరు లనుచు, నసుర వర్య, మా ప్రతాపములు గనుచు॥ నింక॥ పెద్దకొండలు బిండిచేయు దుము! ఆఖండలాదుల దోలెదము! కపితండముల నుగ్గుజేయుదుము! మోక్షుగుండహారిని బట్టి కూల్చెదము॥ ఇకమా॥

వ. ఇంతలోఁ గుంభకర్ణుం డాదినంబున నిద్ర లేచియుండి యన్న దర్శనంబునకు విభీషణయుతంబుగా వచ్చిన, గారవించి వారికి దగిన పీఠంబుల నివసింప ననుజ్ఞయిచ్చి, రావణుండు కుంభకర్ణున కిట్లనియె:

క. తమ్ముఁడ, నీ వెఱుగవు; చి
త్రమ్మగు నొకవార్త గలదు; రాము డనంగా
నిమ్మహిఁ గల డొకభూపతి
సమ్మదమున వానిభార్య జానకి యనఁ గన్.

వ. దండకాననంబున వా రిద్దఱుండఁగా నతని నేమఱఁజేసి యా సీతను దెచ్చి, కూడ యత్నించుచున్న నొప్పనందున రాక్షస స్త్రీలఁ గావలిపెట్టి,

తో: మనయశోకవనమున నుంచిన,రాముని ప్రేరణమున మొన్న। వనచరుఁ డొకఁడు వచ్చి చూచి పురమును దహించి తాజన్న॥ రా॥

వ. వాఁడు జాడఁ జూపింపగా ననేకవానరులఁ గూడి రామ లక్ష్మణులు వచ్చి సముద్రంబున కవ్వల విడిసి యున్నారు. దీని కేది యోజన యున, నవ్వి కుంభకర్ణుండు—

జంఝూటి: అటతాళము.

రఘురాముని సామాన్యనరు డని రావణా యెనకు ఓ రావణా యెనకు! నిర్లక్ష్యముగ గనకు॥ రఘురాముని॥ గోపించఁడే యతడా యె; లక్ష్మిసుందరియే సీతా శ్రీసుందరియే సీతా వరసుగుణవిఖ్యాతా॥ రఘు

రాముని॥ ఆమునుని సతి జెఱబట్టులే రాక్షసులు చెడి రనుకో! రాక్షసులు చెడి రనుకో! ధరమనుటలే దనుకో॥ రఘు॥ శ్రీమోక్షగుండక్షరీశ్వరునితోఁ గక్ష యేటికి! బ్రతికక్ష యేటికి! సరిగాదు మాటికి॥ రఘురాముని॥

వ. అని కుంభకర్ణుం డనునంతలో మహాపార్శ్వుం డను రాక్షసుండు రావణునితో నిటు లనుచున్నాఁడు:

క. సీతను గూడుటకై నీ
పీతీరున భీతినొంద నేలా! బలిమిన్
బ్రీతిగఁ బట్టి రమించిన
నా తెఱవ మ తేమిచేయు నయ్యా! యనఁగన్.

వ. అమ్మాటకు మనంబున నానందంబునొంది మహాపార్శ్వునిఁ జూచి యించుకంత దీనత్వంబుదోఁత రావణుఁ డిట్లనుచున్నాఁడు.

జంఝూటి: అటతాళము.

వినరా మహాపార్శ్వ, విశదముగాను! మును బ్రహ్మసభ కేను బోవు చుండగను॥ వి॥ పుంజికస్థల యను పువ్వుబోణిని రంజింప బలిమిమై రమి యించితిని॥ వినర॥ అది విని మోక్షగుండాగ్నిశసుతుడు నెదలో గిన్నసి శపియించె నాయజుఁడు॥ విన॥

వ. ఇది మొదలగు మది నొప్పని మదవతుల గదిమి మదనకదనంబునఁ బొదలించితి వేని నీ పదితలలు పదిపదులతునియలై పుడమిం బడుగాక యని వనజభవుండు శపించె గాన, మునుపటివలె విచ్చలవిడి మచ్చకంటుల జోలికి బోజాలరా! యనునంతలో సుగుణభూషణుండగు విభీషణుండు మృదుభాషణంబుల నన్నరు నభిముఖుండై యిట్లనుచున్నాఁడు.

హిందూస్థాని తోడి: అటతాళము.

అన్న! నే నొనరించు విన్నప మాదరింపుము రావణా! తిన్నఁగా నీమంత్రివర్యులుఁ దెలుప నేరరు రావణా!॥ అన్న॥ సీతను దెచ్చుట

నాశనహేతు వనుకో రావణా! నీతిమాలి జరించుటే కడుపాతకంబగు రావణా!॥ అన్న॥ రాక్షసులను నమ్మి మది గర్వంబు నొందకు రావణా! మోక్షగుండాధీశు నెదిరి మోహరింతురె! రావణా!॥ యన్న॥

వ. అని నుడువు విభీషణుని దూషణ వాక్యంబులకు రోషించి భీషణంబుగా నవలోకించి యశనిపాతసదృశంబు లగు పరుషవాక్కులతో నింద్రజిత్తు గద్దించి కొలువుకూటంబు దద్దరిల్లునట్టుగా నిట్లనియె:

అఠాణ: ఆదితాళము.

నన్నుఁ బేలగ గంటివా! నన్ను - గన్నతండ్రిని యంటివా! నీవు ॥నన్ను॥ పిన్నబ్బ యని యూరకున్నను గాని లేకున్న నోరుతునే నీ వన్న మాటలకు॥ న॥ గిరి జగడము జేయఁ గోరి యే తెంచి సభవారిముందర యేమో దూరి తెలిపేవు నీవు॥ నన్ను॥ భీమబలమున సుత్రామాదు లను గెలిచి యీమహిం నింద్రజిత్తు నామము దాల్చినట్టి॥ నన్ను॥ మోక్షగుండేశ్వరుని పక్షముగాను నిలిచి రాక్షసవీరుల నుపేక్షగా నాడెదవు॥ నన్ను॥

తో: వంచుదు నాదిక్పాలకులను! దొర్లించుదునా కులగిరుల! దంచుదునా దిగ్దంతుల బట్టి కలంచుదు నా యంబుధుల ॥రా॥ కొట్టుదునా యుడుకోటులు రాలఁగ! మట్టుదునా యురగులను! బట్టుదు నా శశిభాను బింబముల ! నెట్టుదు నా ప్రమథులను॥ రా॥

వ. ఏ రందఱు వినఁగ నాముందర రఘునందనుని వందిబృందం బులచదంబున నభినందించెదవుఁ : తొందరపడకు. కపి సందోహంబులఁ జిందరవందరఁ జేసి యమ్మనుజుల ద్రుంచి మాతండ్రి డెందంబు నానం దంబు నొందింపకున్న నే నింద్రజిత్తునా ! విభీషణా ! అప్రచ్ఛసంభా షణా ! యనిన పలుకులు ములుకులవలెఁ జెవిసోకిన నులికిపడి కనుఁగొ లకులు గెంపులొలుక నలుకతో విభీషణుండు——

కళ్యాణి: అటతాళము.

రణభీషణుఁడైనరాముని విక్రమ మణుమాత్రమును నెఱుఁగ కాడెద విటుల; ననిమిషేంద్రు జయించునటుగాదు దహనాంతకాసుర వనప పవనుల గెల్చినటుగాదు! ధనదేశులను బై కొని సదా బెదరించినటుగాదు! నీకెఱుక లేదు! దనుజులను బొలియింపఁగా నావనజ నాభుడు రఘుకులంబున జననమొందెను రాముఁ డనఁగా; మనుజ మాత్రునిగా దలంతువా!॥ రణ॥ పుడమి నా రావణుకడుపు జెడ బుట్టితివి ! కొడుకవు గా వీవు ! కులనాశకుడవు ! చెడుగుపనులకుఁ జెడ్డవఁటినావు ! నీకూతలకు లోబడెను దశకంధరుఁడు జెడిపోవు ! శ్రీ మోక్షగుండ యొడయఁ డెక్కువ యనుకొనఁగలేవు ! మీకిక జావు తడవుజరుగదు! గపులగూడియు వెడలి రాముఁడు లంక జొచ్చియు గడియలోపల మృత్యువాతను బడగ జేయక యూరకుండఁడు॥ రణ॥

వ. ఇట్లు పలుకుచున్నంత రావణుండు నితాంత కుపితస్వాంతుం డయి దిగంతంబులు ఘూర్ణిల్ల నిట్లనియె:

క. మానవులను వానరులను
బూనికతోఁ బెద్దజేసి పొగడెద విచటన్!
మానవభోజను లగుసీ
దానవులను సరకుగొనవు తగునా నీకున్!

ఉ. రాముఁడు దైవ మంచును దిరంబుగఁ బల్కెదు ! దైవమైన దా
భూమిజఁ గూడి కానలకుఁ బొక్కుచువచ్చె నె! నేను వేగమే
ధీమతి నేగి సీతగొనితే నెదిరించి జయింప కుండునే!
నీమదిఁ గానలేక మము నిందగొనర్తువుగా విభీషణా!

తో: దాక్షిణ్యంబున దమ్ముడవని యూతప్పును గాచితిగాని, కక్షగట్టి పరపక్షము లాడిన శిక్షింతును దయ నూని ॥రావ॥

వ. అనిన విభీషణుండు —

తో: ఈరాక్షసకులమెందుకు జెఱుతువు? ఏలనీవు జెడియెదవు? శ్రీరామునకును సీత నిచ్చి రక్షింపు మనుము బ్రదికెదవు॥ రా॥

ఫరజురాగము: ఆదితాళము.

రామామణి నిమ్మల రామునకు సిఁక॥ రామా॥ నా మాటలు వినినను బ్రతికెదవు! నీ మతమును మానిన మేలు సుమి॥ రామా॥ రాముడు నీదు శిరంబులు వడిగా భూమిని గూల్పక ముందుగను నీవు॥ రామా॥ తరుచరు లంబుధి దాటి వచ్చి యీపురముకు జెఱుపక ముందుగను నీవు॥ రామా॥ పుడమి మోక్షగుండ, యొడయనితమ్ముని కడుకోపాగ్నులు వెడలక ముందే ॥రామా॥

వ. ఇట్లు నొక్కి చెప్పిన రాక్షసరాజు కోపోద్దీపితుండై దిక్తటంబు లటునిటుఁ జలింపఁ, బెటబెటఁ బండ్లుదీటుచుఁ గుంభినీతలం బద్రువఁ, గుంభీంద్రుండు మ్రొగ్గ నంభోనిధు లింకఁ, గుంభినీధరంబులు సెదర విజృంభించి యిది యొకవిలయకాలంబో! యని సభాసదులు భయభ్రాంతస్వాంతు లగుచుండ దిగ్గన గద్దియడిగ్గ నుఱికి వేగంబ కరవాలంబు జళిపించుచు భీషణంబుగా విభీషణువే్రియఁ బోయి, మాని, వక్షస్థలంబు పయి నొక్క తన్ను దన్నిన వజ్రనిహతంబగు గిరింబోలె నేలంబడిలేచిన తమ్మునిఁ జూచి.

ఫీల్: ఆదితాళము.

పోరా! పోరా! యిక లేచి పోరా! చాలును పోరా! ఛీ యటు ॥పోరా॥ పోరా! యిక మాపురిలో నుండక, పోరుమాని కాపురము లేచి ॥పో॥ పట్టుగ రాముడు జుట్టమైన నీపట్టున జని మొఱవెట్టుకొనగ లేచి ॥పో॥ తమ్ముడ వని నిను నమ్మ దగదు చిత్తమ్మున దెలిసితి! దాయాదివి లేచి॥ పోరా॥ మోక్షగుండకమలాక్షుని నిన్నును శిక్షింపక నేనీక్షితి విడువను॥ పోరా॥

వ. అని ఖండితముగాఁ బలికినవిభీషణుండు రోషించియనలుం నలుడు, హరుఁడు, సంపాతి యనునలుగురు సచివులతోడఁ బ్రయాణంబయి కాకుత్స్థుని కొలువునకుఁ జనుఁ వాడయి,

తో: నీకు హితమ్మును నే నెఱిగించినఁ గైకొనవైతివి నేఁడు తాకి వచ్చినంతటనైనను జిత్తమున దలంతువునాడు॥ రాము॥ ఇదివర నిను విడువ దలచి నే నేమో నిలిచితి గాని। యిదిగో పోయె దినకులేశు సేవించుటకయి మది బూని॥ రాము॥

వ అని తత్క్షణంబు లేచి తను తల్లి మందిరంబునకుఁ జ నమస్కరించి యిట్లనుచున్నాఁడు:

క. అమ్మా రామునితో స
ఖ్యమ్మున మను మనుచుఁ బఙ్క్తికంఠునితో నే
నెమ్మది బోధించినఁగో
పమ్మున నాయెడదఁ దన్ని పరిభవపఱిచెన్!

వ. ఈదురాత్మునిఁ గనుచు నే నిం దుండజాల కరుణాశరధి యగు దాశరథిముఖుగుఁ జేరెద. సెల విమ్మ మాతా! త్రైలోక్య విఖ్యాతా! యనిన గైకసి చింతాక్రాంతయయి కొంతవడికి వివేకంబు నొంది యిట్లనియె:

బ్యాండుస్వరము: ఆదితాళము.

పోయిరా విభీషణా! యిఁకఁ బోవమ్మ సుగుణభూషణా! హాయక శ్రీరామభద్రుని కృపను దీర్ఘాయురారోగ్య మహైశ్వర్యములు గల్గు ॥పో॥ నిన్ను జేరదీయును; శర ణన్నవారి గాచును; మున్ను నీతండ్రిచే విన్నా: నయోధ్యలో వెన్నుడు రాముఁడై వెలయు నటంచును ॥ బోయిరా॥ మోతుగుండవాసుఁడై మునిముఖ్యహృదయ భాసుడై రాక్షసులను గూల్చి, రావణు వధియించి, యీక్షితి లంక నిన్నేలించు నిజముగ॥ బోయి॥

వ. ఇట్లు దీవించి పంపిన నామె సెలవుగైకొని, మంత్రులు దానును బ్రయాణంబయి,

తో: రావణదనుజుని ప్రాణపంచకం బీవిధి జను నన్నటుల। వేవేగంబున నెగిరి వియత్తలవీధిని బోయిరి యిటుల॥ రామ॥

క. అంబుధిని దాటి వారలు
నంబరపదమునను రాఁగ, నది గనిగపిసై
న్యంబులు భానుజునకు దెలు
పం బరికించియును రామభద్రున కనియెన్.

కమాచ్: ఆదితాళము.

వచ్చేవారెవ్వరో! పరికింపుము రామ!॥ వచ్చే॥ హెచ్చుగను జెచ్చెరను నిచ్చటికి విచ్చలవిడిగా ముచ్చట లాడుచు॥ వచ్చే॥ దనుజపతి యనుమతిచే మనపయికిఁ జనుదెంచు నరాశనవరులేనో!॥ వచ్చే॥ మోక్షగుండాధ్యక్ష, మము నీక్షణమే దీక్షతో బంపిన శిక్షయొనర్తుము॥ వచ్చే॥

వ. ఇట్లు పీ రాలోచించుచుండ దివినుండి విభీషణుండు—

తో: రావణు ననుజుఁడ దావకభక్తుఁడ నేవిభీషణాఖ్యుఁడను। దేవరవారికి దేవి నియ్యుఁమని తెలిపిన విననుని దాను॥ రామ॥

గీ. నన్ను నుగ్రదృష్టి గ్రన్నన నారసి
తన్నెఁ గొలువులోన దానవేశు!
డంత నతని విడిచి యాప్తమంత్రులఁ గూడి
వచ్చినాఁడ నీదు ప్రాపుఁగోరి.

కేదార: రూపకతాళము.

దేవ దేవ! సేవకుండఁ గావు మింక నన్ను! గరుణాకర నీవు దప్పరక్షకులు లే రిక; భావములో భావింపకుమా వేఱుగ॥ దేవ॥ అక్షయనారాయణదా సాఖ్యమనః కంజవరసదనా! మోక్షగుండవాస! శశివదనా! రాక్షసు డని శిక్షింపకు రక్షింపుము॥ దేవ॥

వ. అని పలికిన వాక్యంబులకు రాముం డాలోచించుచు సుగ్రీవుండు గ్రమ్మఱ నిట్లనియె:

తో: అసురులమాయల కంతులేదు మీరెదెసను వ చున్నాఁడు। పనమీఱఁగఁ గాపాడఁ దగున చంపగ దగునా! ం నపుడు॥ రా॥

క. శరణన్న పగతునయినన్
ఖరకరకుల సంభవులకుఁ గాచుటయ వ్రతం
బరియగు రావణు తమ్ముని
నరయుదు సౌమిత్రి బోలె ననుజప్రేమన్.

వ. అట్లయిన వీఁడు వంచించునని భయపడుదు వేమొ సుగ్రీవా !

తో: క్షణమాత్రంబున జగము సృజింపఁగ బెనుప నడప నొ తనరు కర్తనగు నను జెనకఁగ నెటుదనుజుల కగు రేపి?॥ రా॥

సం. వ. అనుచుండ, నాంజనేయుం డిట్లనియె:

ముఖారి: ఆదితాళము-(వలదచ.) వలె.

తగదు వీనిపై నలుగు శ్రీరామచంద్ర॥ తగదు॥ పగవానిగఁ పగ వల; దీతఁడు సుగుణాఢ్యుఁడు ఘనుడు దగునీతిపరుడు॥ తగదు॥ తను జూపిన దోష మనుచు జ్యేష్ఠభ్రాతకు దెలిపె నాడు;విడిపించినా ॥తగదు॥ మనపక్షము నగుమాటలు బోధించు మనుజాశనపతితో గె వక ధృతితో॥ తగదు॥ మోక్షగుండేశ్వర, మోసము రా దిక దీక్ష నభయ మిడుము॥ తగదు॥

వ. అని తెలిపిన హనుమంతుని పలుకుల కలరి జలజా కులుండు జలజాప్తనందనున కిట్లనియె:

తో: అభయం బిచ్చెద నావిభీషణుని నరసితోడితె మ్మనఘా సభయుల నెల్లను సమ్మానించుట ప్రభువులపని పొ మ్మనగా॥ రా॥

వ. వల్లె యని సుగ్రీవుండు పంపు కెగిరి విభీషణుని మంత్రి యుక్తంబుగాఁ గొనివచ్చి రాముసిం జేర్చి నంతఁ దత్పాదారవిందంబుల శిరంబు మోపి సాగిలిపడి,

బిలహరి: ఆదితాళము.

శరణు దివాకరకులజా ! చరణవినిర్జిత వరజలజ! ॥శరణు॥ ఇతరము నే నెఱుఁగనయ! గతి నీ వనుచును గనినాను॥ శరణు॥ అక్షర, నాకభయ మిడి మోక్షగుణాధిప, బ్రోవు వడి॥ శరణు॥ శ్రీయుత నారాయణదాసా యతహృదయ విహార సదా॥ శర॥

భుజంగప్రయాతము: నమోనంతరూపా! కనచ్చక్రదీపా ! నమో వేదపాదాసు నాదానుమోదా! ।నమోలోకనాథా! ఘనజ్ఞానబోధా!। నమోభూతరక్షా! సనందాదిపక్షా!

కీర్తన: ఆదితాళము.

నీమయ మంతయు రామా! రామా! యేమిలేదు గద రామా! రామా!॥ నీ॥ సోమసూర్యులును, సురలు దిక్పతులు, భూమిముఖాఖిల భూతచయములు॥ నీ॥ మునులును బుధులు, ద్విమాతృజులు గ్రహములు, దనుజ- మనుజ- మృగతరు విహగములు॥ నీ॥ నిగమాగమములు నిఖిల విద్యలును నగములు వార్ధులు నదులును నిధులు॥ నీ॥ మోక్షగుండమున సాక్షిగ వెలసిన యక్షర, నారాయణకవివినుతా॥ నీ॥

వ. అని పొగడిన యానందించి శ్రీరామమూర్తి కృపారసంబొలుక యిట్లనియె:

తో: దానవ నీప్రార్థనను మెచ్చితి గాన, నీమదిలోను । దేని గోరి నను దాని నిచ్చెదను దెలుపు మనఁగ నతఁ డనెను॥రా!

క. నీవరరూపము గంటిని
గావున నావంటి శుచియు ఘనుఁడును ధన్యుం
డీవిశ్వంబునఁ గలడే!
యీవే నీధ్యానమును వివేకము ముక్తిన్.

కాంభోజి: అటతాళము (నిన్నునమ్మి.) వలె.

కోర నేర వేఱు కోరికలు మది; జేరి నీదు సేవ జేయుభ
దప్పు॥ గోర॥ ఘోరము, ర్వారని స్సారసంసారాబ్ధి దాటి మునింగె
వారి సాంగత్యము॥ గోర॥ నారాయణశర్మాధారా, మోతుకుం
గార, నీదుకొల్వుకన్న నన్య మేమి॥ కోర॥

వ. అని వేడిన రాముండు సంతసించి,

ఉ. నన్నుభజించుభక్తుల మనంబులనే విహరింతు సీతతో,
నెన్నిక నీకు భక్తునకు నిచ్చితిఁ గొమ్మభయంబు నింక నీ
యన్నను బిల్కుమార్చి నినునావృతి లంకకురాజు జేయుదున్!
సన్నుతిఁగన్న భానుకులజన్ముల ఖ్యాతికి వన్నెవెట్టుదున్.

వ. అని తెలిపి హనుమంతునిచేత నిసుకతో లంకాపురిని నిర్మి
ంచేసి యందు విభీషణుని గూర్చుండఁబెట్టి లక్ష్మణునివలన సముద్రో
దకంబులు దెప్పించి యతని కభిషేకంబుఁ జేసి,

కీర్తన: త్రిశ్రిజాతి. (సంతతంబున) వలె.

ఓవిభీషణా! యోవరభూషణా॥ యో॥ నీవు మనుము చిరంజీ
వగుచు నిక నావచనమ్మున॥ నో॥ ఎందాక రవితారకేందులు నుందుర
యందాక లంకారాజ్యం బేలుచుండుదు॥ వో॥ ఎందాక నాకథ యి
యుర్వి నుండునో యందాక లంకారాజ్యం బేలుచుండుదు। వో॥ మో
గుండేశుని ముఖ్యభక్తుడవగు చక్షయలంకారాజ్యం బేలుచుండుదు॥ వో

వ. ఇట్లు విభీషణునకుఁ బట్టంబుఁగట్టి దీవన లిచ్చిన పిమ్మట
సుగ్రీవుండు విభీషణునితో—

తో: రాముడు నీకును రాజ్యమొసగె గద! రావణవధకుని
నీవు। స్వామిపనికి బాసటయయి నిలువగ వలె ననగను సుగ్రీవు॥ రా॥

వ. కనుంగొని విభీషణుం డిట్లనుచున్నాఁడు:

కీర్తన: రూపకము.

అందఱికిని దొడగునానందమయునకు నింపొందగ దోడ్పడగ శక్తియున్నదె మనకు!॥ నందఱి॥ మీ సమానముగను నేను మెలగ నేర్తును రామదాసుడనై, యెపుడుసేవ దవిలి సేతును॥ అందఱికి॥ ప్రీతిగను మోక్షగుండవిభునిపనులలో నేను జేయనైన రీతి దిరిగి జేతు నవనిలో ॥ నంద॥

వ. అని యిట్లు చెప్పుకొనుచుండునంతలో రావణుని పనుపున శుకుండను చారుండు వచ్చి యాకాశవీథిని నిలిచి యందఱు వినుచుండ సుగ్రీవున కిట్లనియె:

తో: రావణు డెఱుకపఱుపు మను వాక్యము లీవిధముగు వినుమినజా! వేవేగమె! కపివీరుడవైనరు సేవింగ నేల యనుజా॥ రామ॥ నన్ను జేరుమా, యన్నివిధంబుల మన్నన జేసెద నేను; గ్రన్నన నీలంకకుఁ జనుదేఱుము కపిసైన్యంబులతోను॥ రామ॥

వ. అని తనమాఱుగాఁ బలుకుచున్నాఁ డను నంతలో వనచరులు జుట్టుకొని యొక్కతన్ను తన్నిన, దూతను పరాభవించుట నీతిగా దని రాముం డుడిపె. అంత వాఁడు మరల సుగ్రీవునితో రావణున కేమి చెప్పుదు నన వుడు,

కీర్తన: ఆదితాళము.

అన్న వాలి నాకు; నతడు మొన్న రామచేతఁ జచ్చె! నన్నఁ నే ననెడుమాట యధమ! మానరా! ॥యన్న॥ లంకకు రమ్మని య లంకముగఁ గోరినావు; లంక కేగుదెంచువిధము లలిని వినుమురా॥ మోక్షగుండవిభుని మోసపుచ్చినావు కాన నిన్ను శిక్ష జేయ రాఁగూడి చేర వత్తురా॥ యన్న॥

వ. అని చెప్పుము పోరా! రాక్షసాధమా! యని పలికిన, వాఁడు చావుతప్పించుకొని లంకకేగులోపల శార్దూలుం డను రక్కసు

వలనఁ గపిసైన్యంబుల బలంబును రాముని పరితాపంబును విని కొలుఁ
చాలించి రావణుం డంతిపురి కరిగె. ఇక్కడ రాముండు సముద్రుని
గదిసి,—

పూరికళ్యాణి:—రూపకము.

దారి యొసఁగరాదా! వారినాథ! నెనరు లేద! ॥దారి॥ పో
జగత్కంటకుఁ డగు క్రూరుని దశకంఠుఁ ద్రుంచి ధారుణిభారంబు బా
గోరితి; లంకకు జేరఁగ॥ దారి॥ సకలపుణ్యవాహినులును బ్రకటంబు
నేలోపల నొకటిగ జేరఁగఁ గైకొని యకలంకుఁడ వగుదు! నాకు॥ దా
వెలయఁగ నారాయణకవివినుతుఁ డగు మోతుగుండనిలయునకుఁ
దూఁతు నిచ్చి చెలఁగిన శాంతాత్మ నాకు॥ దారి॥

వ. ఇటువలె రాముం డెంత ప్రార్థించినను సముద్రుండు మిన్న
కుండిన నాగ్రహించి,—

తో: విను, లక్ష్మణ, వీఁ డెంతదురాత్ముఁడో! విశ్వసింప డెం
యును! ఘనముగ నిప్పుడె గ్రాగించెద గనుగొను నాప్రతాపము
॥రా॥

వ. అని పలికి తమ్మునిచేనున్న విల్లమ్ములు చేకొని బ్రహ
స్త్రంబు సంధించి,—

పంచచామరము.

అహో సముద్ర! కొంచె మైన నాదరంబు లేక నీ
వహంకరించి యున్నవాఁడ! వైన నేమి! యుండు నా
మహోగ్రకాండవహ్నిచేత మారణంబు చేసెదన్!
సహింపు మంతె చాలు ధైర్యశాలి వైన నిచ్చటన్.

వ. అని యస్త్రంబు విడువ నుద్యోగించిన, నతనికోపాగ్ని
జగంబులు గడగడ వడంకె. హద్దుదాఁటి సాగరోదకంబులు యో
మాత్రంబింకె. తిమితిమింగిలములు జంకె. అయ్యవసరంబున,—

క. రత్నాకరుండు రవికుల
రత్నమునకు బహుమతులుగ రమణీయములౌ
రత్నంబులు గైకొనుచు బ్ర
యత్నంబున వచ్చె దివ్యమగు నాకృతితోన్.

వ. ఇట్లరుదెంచి యాశరధి దాశరథికి నమస్కరించి యుపాయనంబులు సమర్పించి,

హంసధ్వని: ఆదితాళము.

కళ్యాణగుణగణమ్ నమామి॥ కళ్యా। కమలదళాంచితఘనమృదు చరణమ్ కల్మషహారమ్ కరుణాభరణమ్॥ కళ్యా॥ కటితటరంజితకాంచన చేలమ్ । కుటిలమదాసురకోటి విఫాలమ్॥ కళ్యా॥ మోక్షగుండసత్ప్రవిభు మఖిలాధ్యక్షమ్ నారాయణకవిరక్షమ్॥ కళ్యా॥

వ. ఈపగిది బ్రార్థించిన శాంతుండగు సీతాకాంతుండు సరిత్కాంతున కిట్లనియె:

తో: నే దొడిగిన యీనిశితసాయకం బేదిక్కునకు వైచెదను। పోదు వృథా పాథోధినాథ! తెల్పుము నా, నత డిట్లనెను॥ రామ॥ ఉత్తరదిక్కున నున్నకిరాతుల నుక్కడంచు రఘువీరా। పొత్తుగలిగి యెప్పుడు నను బాధింపుచు నుందురు రణశూరా!॥ రామ॥

వ. అన, మంచి దని, సముద్రుని బాధింపుచున్న యాభీరుమండలంబుపయి నమ్మహనీయాస్త్రంబుఁ బ్రయోగించిన, నది వారిని దునిమి పోదిఁ జేరె. పిమ్మట సముద్రుండు—

జంఝూటి: ఆదితాళము.

వారధిఁ గట్టగ నీకపివీరుల బంపవె యోరఘుకులవర ॥వారధి॥ ఓరుపుతో నేరుపుతో భూరుహభూధరములు జేరుతు రపారముగ ॥వారధి॥ దీనికి విశ్వకర్మవరసూను డయిన నలు డౌను సమర్థు దీనికి భూనుతమై మానితమై కానవచ్చు, మోక్షగుండశ్రీన వానితోఁ గలిసి॥

వ. ఈనలుండు చేతముట్టి వైచిన నెంతభారమగు వస్తువైన నీటిమీఁదఁ దేలును. పిన్ననాఁడు గణ్వమహామునివలన నితఁడ వరంబువడసిన్నాఁడు కాఁబట్టి యతని సేతువు గట్టుపనికినియమింపుఁ తక్కిన కపు లందఱుఁ బర్వతాదులు దెచ్చియిత్తురు.

క. ఈ తెఱఁగున వినిపించిన
సీతాపతి యలరి నలునిచే నీటిపయిన్
సేతువుఁ గట్టింపఁగఁ దాఁ
జేతంబునఁ దలఁచి యిటులఁ జెప్పె నతనికిన్.

వ. ఇట్లు నియమించి నవపాషాణంబులన్ నవగ్రహములఁ బజించి యచ్చటఁ దనపేర లింగస్థాపనంబుఁ జేయఁదలంచి హనుమంత కిట్లనియె:

కానడ:ఆదితాళము. (నజరభిర) వలె.

పవనతనయ! యిక లెమ్మా! జవమున గాశికి జని రమా పవన|| లింగద్వయమును దెమ్మా! శివలింగము మంగళకరముగ వకిమ్మా నీవు|| పవన|| తడవులేదు లగ్నమ్మా! ఇక దడ వడిగా రావసుమ్మా నీవు|| పవన|| చాలభక్తితోడ నుండు నీవు జాల నిన్నేలుమోగుండేశుండు నీవు|| పవన||

వ. అనిదెలిపిన రామాజ్ఞ శిరసావహించి వాతూలసుతుం ప్రయాణంబయి,

క. ఆకాశమార్గమునఁ దీ
వ్రాకారతఁ బరువువాఱె వారాణసికిన్;
శ్రీకంఠుని విశ్వేశునిఁ
బ్రాకటముగ నభినుతించెఁ బ్రబిమలభక్తిన్.

వ. ఇట్లు పొగడిన సంతసించి యాంజనేయునికిఁ బ్రత్యక్షంబఁ యతని యభినుతం బెఱింగి రెండులింగంబు లిచ్చి నే నిట్లంటి:

క. మును కుంభసంభవున కి
చ్చిన నావాక్యమును దీర్ప శ్రీరామునిద
ర్శనమున కిదె దక్షిణదిశ
కనిలసుతా, వత్తుఁ బదప్రియంబున నింకన్.

వ. అనిన, హనుమంతుం డిట్లనియె:

తో: మును పిచ్చితివే మని వాగ్దానము మునివర్యున కని యడుగన్, హనుమంతుని కి ట్లని యాకథయాద్యంతము దెలిపితి వడిగన్ ॥రా॥

కీర్తన: ఆదితాళము. (వర పేటికి) వలె.

విను, కడచిన వృత్తాంతమును దెలిపెద హనుమంత! మును, వింధ్యనగము చెంతకును నారదు డత్యంతవీణా గానమున మున్నడై చు జేరఁగానంత॥ విను॥ అమ్మునిచంద్రుని గాంచి, యద్రీశుఁడు మోదించి, సమ్మతి సమ్మానించి, సాష్టాంగము లర్పించి! యెంచి మించి నెమ్మొ మునందు బాణి జోడించి ॥విను॥ మోక్షపురీశునికరుణన్, మునివర, నీవరుదేరన్ ఈక్షితి బావము లాఱెన్; ఇదె శుభములు జేకూరెన్ మీ రీ దారి లక్షించి వచ్చు టేల నను జేరన్? ॥విను॥

వ. అని వింధ్యాద్రి ప్రశంసించిన,

క. నిట్టూర్పు విడిచె నారదుఁ;
డట్టియెడన్ గారణం బహో యే మొకొ, యా
గట్టులయెకిమీ డనఁ జూ
పట్టితి నే నవనియందుఁ బరికింపంగన్.

వింధ్యుండు

శహాన:ఏకతాళము. (కామినిసామినివలె.)

ఏధరణీధర మీఁడగు నా కీధారుణి॥ నేధర॥ సాధువరా మీపద సాక్షిగ నే నాడెద॥ నేధర॥ అల్లశర్వాణీతన యాత్మజయగుట శివుఁ డల్లుడై రంజిల్లుటను శీతాద్రి కొంచెము జేరొకానంబడె॥ నేధర॥ మేరు

గిరి స్వర్ణమయమై రంజిలు నని దేవాగార మని ప్రఖ్యాతి నొందెను; గాని నాతో సాటి యగునే॥ ఏధర॥ కొండలెన్నియొ లెక్కకుండె; నవి యేల! మోక్షగుండపతి కృప నిండ, నే నొక్కకొండ దండిముగండఁ జూడవే॥ యేధర॥

సీ. ఉదయధరాధర ముదయాశ్రితంబు; మం
దేహాద్రి దేహసందోహ మరయ;
నిషధాద్రి నోషధీ నిచయంబులే వయ్యె;
నస్తమితప్రభ లస్తగిరిని;
నీలకాంతులఁ బొల్చు నీలమహీధ్రంబు;
మందాకసహితంబు మంధరంబు;
మలయాచలంబున వెలయుఁ బాములగుంపు;
రైవతకాద్రి నిర్ధనము గాదె!

గీ. మాటమాత్రంబు లగుచు త్రికూట హేమ
కూటములు భారమును మోసియ నోటువడును
సహ్య కిష్కింధ; క్రౌంచాది శైలపతుల
కన్న నేబొల్తు మేటినై యార్యవినుత.

వ. ఇట్లు దుర్వారగర్వంబున నప్పర్వతంబు పలికిన నహింపమి నారదుండు మనంబున—

తో. శిఖరదర్శనముచే మోక్షంబిడు శ్రీశైలానము వెలయ,। నఖిలగిరుల నితఁ డవమానించుట యాశ్చర్యంబగు దలియ॥ రా॥

వ. అని యెంచి యతని గర్వంబు బాపు వాఁడై—

కానడ: రూపకము.

ఏది నీసాటిశైల మీజగంబున! నేఁగాన॥ నేది॥ ఆదిత్య ముఖ గ్రహము లాశ్రయించుతు దను నటించు మోహంబున మేరునగము ముఖ్యంబుగ నిక్కు గాని॥ యేకి। వింధ్యాని నిదె నరుఁ బొలను వింధ్య

శైల మని యెప్పుడు! నిన్నవమానించుచుండ నిట్టూర్పుందుకె విడిచితి॥ నేడి॥ మావంటివారికేల మదియందున నుండనిమ్ము! పోవలె శ్రీమోక్షగుండ దేవుని సేవింపగాను॥ నేడిసీ॥

వ. అని యిట్లుపలికి కలహాశనుండు యథేచ్ఛం జనియె. అంత వింధ్యధరాధరంబు—

శా. ఔరా! మేరుధరాధరంబు గడు గర్వాయత్తచిత్తంబుతో
నీరీతిన్ ననుఁ దూలనాడె నట! కాని మ్మెంతదో తప్పిదా
పారూఢింగని సంతసింతు నెద! సూర్యాదిగ్రహాళుల్ తనన్
జేరన్ వచ్చుట దెట్టు లొక్కయనుమన్ జిత్రింబుగా నత్తఱిన్.

వ. అని నిశ్చయించి తనశరీరంబు రెండువేల యిన్నూట రెండు యోజనంబుల పొడవుఁ బెంచి సూర్యసంచార మార్గంబు నిరోధించిన నది యొక విలయకాలంబై,

తో. పూర్వోత్తరములఁ బొల్చువారికెప్పుడుసంతాపముగలిగె। పర్వననిద్రలఁ బండగ దక్షిణ- పశ్చిమస్థులకు గలిగె॥ రామ॥

వ. ఇట్లొప్పిన సమస్తయజ్ఞాది క్రియలభావం బయిన దేవేంద్రాది దేవతలు బ్రహ్మసహితంబుగా వారాణసికి వచ్చి నన్నిట్లు ప్రార్థించిరి.

భీల్ రాగము: ఆదితాళము (కామునుని)వలె.

దేవదేవ రావె! నీవదిక్కు-కావవె! కేవలాంధకారమైయీవిధంబు దోచె నిదే॥ దేవ॥ కాల మెఱుంగలేని కారణంబుతో జనపాళి సర్వకర్మలు నోలి మానియుండి రిల॥ దే॥ హవ్యములు లేక మే మకట! యెట్లు నిల్తుమో యవ్యయ! శ్రీమోక్షగుండాధినాథ మమ్మేలవే! ॥ దేవదేవ॥

వ. అని బహుభంగుల ప్రార్థించిన దయామయహృదయుండనై వింధ్యాద్రికి గురువగు నగస్త్యమహామునిని వీక్షించి యిట్లంటి.

క. లోకోపకారమునకై
యోకుంభజ! దక్షిణాశ కురువడి జని నీ
వాకుధరేంద్రుని గర్వముఁ
బోకార్పుము కాశి నుండఁ బోలదు నీకున్.

వ. అనిన వాక్యంబులు విని దుఃఖాక్రాంతు డగుచు నగస్త్యుం డిట్లనియె.

హిందు. కాఫీ: ఆదితాళము. (ఈ విపరీత)వలె.

కాశిని బాసి విశ్వేశా! పోవ్మన నగునా!॥ కాశిని॥ ఓశివా! నీదుకడ నుండక నాదక్షిణాశకు బోవ గాల్యాయెనె నా కికఁ॥ కాశిని॥ ఇమ్మహాస్థలమున నెమ్మెరు బాసిన గ్రమ్మటి జన్మము గలుగ దందురు గదా!॥ కాశిని॥ ఖండితంబుగ బలుకఁ గారణ మేమిరా! మోక్షగుండ నాయక చెంత నుండ దగనే శివా!॥ కాశిని॥।

వ. అని వగచుచుండిన నగస్త్యునకు నే నిట్లంటి:

క. ఈవారాణసి, నీగం
గా వాహినితటము, డుంఠిగణపతిపదముల్
దేవివిశాలాక్షిక నను
బోవిడువం జాలకిటులఁ బొగులుదు వనఘా!

గీ. పొమ్ముపొమ్మల్ల వింధ్యాద్రిపొడ నడంచి
దక్షిణధ్రువమున సేతుతటమునందు
నిలుము! శ్రీరాము పూజమన్నింప వత్తు;
దర్శనమ్మిత్తునీ కగస్త్యా! మునీంద్ర.

వ. అని యొడంబటిచిన, మంచి దని యగస్త్యముని లోపాముద్రాయుతంబుగాఁ గాశిం బాసి దక్షిణాభిముఖుండై వింధ్యగిరి సమీపించి వచ్చిన,

క. ఇనమండలపర్యంతం
బును పెరిఁగిన వింధ్యశిఖరి మునివర్యుని రా

కనిరీక్షించి యెదుర్కొని
మానసమున భయభక్తులొదవ నుతిఖర్వుండై.

వ. ఇట్లు క్రుంగినరూపంబుతో నమస్కరించి వింధ్యుం డిట్లనియె,

కల్యాణి:అద్రితాళము. (మనవినిచే) వలె.

శరణు కృపాజలధీ! గురువర! ॥శరణు॥ ధరణిని తమసందర్శనమున నే ధన్యుడనైనాను! గురువర ॥ శర॥ మావంశము జన్మము గేహంబును బావన మాయె నహా! గురు॥ శర॥ యేమికోరి మీ రేతెంచితిరో స్వామీ! వచియింపు! గురువర ! ॥శర॥ మోక్షసుందరాముని పదాబ్జముల సాక్షిగ నవరింతు ! గురువర ! ॥శర॥

వ. అనిన వింధ్యగిరికి మునివర్యుం డిట్లనియె:

క. ఈనాసతితో దక్షిణ
కోణమునకుఁ బయన మయితి; గురుతరభక్తిన్
మానితుఁడ వగుట, నుండుమ
ఆనతి మామరలివచ్చునంతకు వింధ్యా!

వ. అదిమొదలు గర్వంబు లేక వింధ్యుండు గుజురూపంబుననుండి పంద్రెం డేండ్ల కొకపర్యాయము మునిరాకఁ గోరి నిక్కి చూచుచు, రాకుండిన యథాస్థితినుండుచుఁ, గాలంబు జరుపుచుండె,

తో: అప్పటినుండి నిరాటంకంబుగ నర్కుడు విహరింపగను। ఎప్పటివలె నైమిత్తికముల జనులెలమి కెలిలి వర్తింపగను॥రామ॥

వ. అట్లు లోకోపద్రవంబుఁ బాపి కుంభసంభవుండు దండకావనంబున నిలిచి నారాక నిరీక్షించుచుఁ దపంబుఁ జేయుచుండె గావున,

హుసేని:ఆదితాళము (ఈరాజా) వలె.

నే నేతేరెదను, నీ వరిగిన వెనువెంబడిగను॥ నేనే॥ మా వర్యుని మాటదీర్పగ జానకీశు మానక జూడగ॥ నేనే॥ లింగములు ౽

పుంగవునకు జెలంగ మంగళంబుగనొసఁగుము॥ నే నే॥ పోతుగుంటాధ్యక్షు
నకు బ్రత్యక్షమై నిరీక్షింపగ నిక ! నేనే।

వ. అని చెప్పి వీడ్కొలిపిన, నాంజనేయుండు లింగంబులు గొని
వాయువేగంబునఁ గించిద్గర్వ సమావృతుండయి వచ్చుచుండె. అది
యెఱిఁగి రాఘవుండు సుగ్రీవునిఁ జూచి,

తో: వాయుసుతుడు రాడాయె ముహూర్తము వోయె నటుల
గావునను। ఈయెడ దడయక నిసుకలింగమును నెలమిఁబ్రతిష్ఠించెదను.

వ. అని సర్వవానరులుఁ గనుచుండ మునులసమక్షంబున సైకత
మయలింగంబును బ్రతిష్ఠఁజేసి,

తో: తనకౌస్తుభమును దలచి వచ్చెను దపనకోటిభావమున,
మనుకులుండు గని మన మలరగ నమ్మణిని దాల్చె గ్రీవమున॥ రామ॥

వ. ఇట్లు మణిని ధరించి తన్మహిమచేఁ గల్పింపఁబడిన ధేనుధన
వస్త్రాభరణాన్నదానంబులచే సభ్యులఁ దృప్తులం జేసి పంపిన, వారు
స్వాశ్రమంబులకుఁ బోవునెడ మార్గమధ్యంబున—

తో: మారుతి యెదురై వారిని గని యెవ్వారివలనబూజితులై।
వారలు మీరన నపుడ తెలిపిరా పాఱులు ముదమున మేదినీసురులు
నతులై। ॥రామ॥

క. రామేశ్వరమ్మునవిన రఘు
రాముఁడు లింగప్రతిష్ఠ రహిఁ జేయుచు ను
ద్దామామాడిక సత్కృతులచే
ధీమతి వీడ్కొలుప వచ్చితిమి కపివర్యా!

వ. అనిన విని కోపావిష్టుండయి రాముని యెదుట భూమిపయి
బదద్వయచిహ్నంబులేర్పడ దుమికి యాంజనేయుం డిట్లనుచున్నాఁడు.

కమాచ్: రూపకము. (వేటాడకు)వలె.

నన్నెఱుగ వహో! రామ! ॥నన్నె॥ మొన్న లంకకేగి దనుజ
ముఖ్యుల నే నరకగొనక యెన్నగ సీతావార్త నమున్నతమతి నెఱి

గించిన ॥న॥ వ్యర్థంబుగఁ గాశి కేగి వచ్చితి లింగము గైకొని సార్థక మే మయ్యె వృథా శ్రమబడితిని రఘునందన॥ న॥ ఒక్కటినీకై తెచ్చితి, నొక్కటి నాకొఱకు దెచ్చి; తెక్కడఁబడ వైతు జెప్పు మివి మోక్షపురాధీశ్వర॥ న న్నెఱుగ॥

గీ. ఇంత త్వరపడువాడఁవి శ్లీల నన్ను
దిప్పితివి కష్టతమదూర దేశమునకుఁ!
జెలగి యీరీతిహాస్యంబుఁ జేయుటకునొ!
దొరల మాటల కెమురు లేదో తలంప!

వ. అని నిష్ఠురంబుగా మాట్లాడిన పవనతనయునకు రవికులభవుం డిట్లనియె:

మత్తకోకిల.

నీవు పల్కినపల్కులెల్లను నిశ్చయంబగుఁ గావునన్
బావనీ! యిదిమత్ప్రతిష్ఠితభవ్యలింగము; దీని నీ
లావుమై దలఁగించి నీవు చెలంగి తెచ్చిన లింగమున్
ధీవరుల్ మదిలోనమెచ్చఁ బ్రతిష్ఠచేయుదు క్రమ్మఱన్.

వ. అని నయంబున వాక్రిచ్చిన సమ్మతించి యమ్మేటి లేచి పోయి,

తో: లింగంబును గదలింపగ బోయిన లేశము గదలక యున్నను । లాంగూలము మెల్లగను జుట్టి తనలావున లాగుచు నున్నన్ ॥రా॥ వాలము మూలమువఱకు దునిగి సరివారుగనగ నాలోన । నేల బోరగిలఁదూలి మూర్ఛితుండై లేవక పడియున్న॥ రాము॥

వ. వానరులు హాహాకారంబులు చేయుచు మూఁగి సేదదీర్చి లేపిన, గొంతవడికి లేచి దురభిమానంబు వదలి శ్రీరామభద్రునిఁ బరబ్రహ్మంబుగా భావించి, సాష్టాంగనమస్కారంబు లనేకంబు లర్పించి కొనియాడు చున్నాడు:

పూరికల్యాణి: ఏకతాళము. (జానకీపతి)వలె.

మైథిలీవరా! మన్నింపుదేవర!॥ మై॥ సాధుజనాధార ! సత్యవా క్యసార!॥ మైథిలి॥ మంచిప్రోడ వంచు వేడలేక భ్రమించినాఁడ। నెం తోడకను నను గొంచెకా డటంచు నీఁడ కిక గరుణించిజూడ మించ జూడఁ దగు॥ మైథిలీ॥ పిన్నగొప్ప లన్న చొప్పడచి నాయున్నత ప దెన్న జెప్పఁ బోలదు! నిన్నుదప్ప నన్య నెప్పటికి నేనన్న నెప్ప నన్నొ నొప్పఁదగు॥ మైథిలీ॥ మోతుగుండరక్షకుండ; మఖిలాధ్యక్షకుండ; వక్ష రుండ వరుమను దీక్షమెండపేక్షయుండ, నిడితి బరీక్షనిండ! లక్షదండ ములు॥ మైథిలీవరా॥

వ. అని యనేకవిధంబులఁ బ్రార్థించిన, నానందించి దయాకలిత హృదయుండై రాముండు—

గీ. 'వినుము నీ వేగి తెచ్చిన విశ్వనాథ
లింగమును నిల్పు రామేశ లింగమునకు
నుత్తరంబున' నన్న, నట్లొప్ప నిలుపఁ
గాంచిసంతసమంది రాఘవుఁడు వలికె.

హిందూ కాఫీ: ఆదితాళము. (వందనం చతు) వలె.

చెప్పెదన్ బవనాత్మజా! యిప్పటినుండియు జరుగు నిచ్చటి యేర్పాటులు॥ చె॥ ముందు నీలింగమునకు పూజింపక,నాలింగము నెందు బూజించినపూజలెల్ల నిష్ఫలంబులు॥ చెప్పెదన్॥ నాకు దెచ్చినట్టిలింగ మీకోవెల యందుండును గాక! కాలాంతరమున గావింతుఁ దత్ప్రతిష్ఠ॥ చెప్పెదన్॥ ఛిన్నపుచ్ఛగుప్తపాదచిహ్నమున నీవిగ్రహ మెన్నటికి జెడక యుండ నిమ్ము జనులు సూడగ॥ చెప్పెదన్॥

వ. అని యానతిచ్చిన నటుల నే తెగినతోఁకయు గుప్తపాదంబులు గలిగిన హనుమద్విగ్రహమును నిజాంశచే నిర్మించి హనుమంతుం డందు నిలిపినఁ గాంచి,

పూరికల్యాణి: ఏకతాళము. (జానకీపతి)వలె.

మైథిలీవరా! మన్నింపుదేవర!॥ మై॥ సాధుజనాధార ! సత్యవాక్యసార!॥ మైథిలి॥ మంచిప్రోడ వంచు వేడలేక భ్రమించినాఁడ। నెంతోడకను నను గొంచెకాఁడటంచు నీఁడకికగరుణించిజూడ మించజూడఁదగు॥ మైథిలీ॥ పిన్నగొప్ప లన్న చొప్పడచి నాయున్నత ప్రదెన్న జెప్పఁబోలదు! నిన్నుదప్ప నన్యనెప్పటికి నేనన్న సెప్ప నన్నొప్పఁదగు॥ మైథిలీ॥ మోక్షగుండరక్షకుండ; వఖిలాధ్యక్షుకుండ; వతిరుండ వరుమను దీక్షమెండపేక్షయుండ, నిడితి బరీక్షనిండ! లక్షదండములు॥ మైథిలీవరా॥

వ. అని యనేకవిధంబులఁ బ్రార్థించిన, నానందించి దయాకలితహృదయుండై రాముండు—

గీ. 'వినుము నీ వేగి తెచ్చిన విశ్వనాథ
లింగమును నిల్పు రామేశ లింగమునకు
నుత్తరంబున' నన్న, నట్లొప్ప నిలుపఁ
గాంచిసంతసమందె రాఘవుఁడు వలికె.

హిందూ కాఫీ: ఆదితాళము. (వందనం చతు) వలె.

చెప్పెదన్ బవనాత్మజా! యిప్పటినుండియు జరుగు నిచ్చటియేర్పాటులు॥ చె॥ ముందు నీలింగమునకు పూజింపక,నాలింగము నిందు బూజించినపూజలెల్ల నిష్ఫలంబులు॥ చెప్పెదన్॥ నాకు దెచ్చినట్టిలింగమీకోవెల యందుండును గాక! కాలాంతరమున గావింతుఁ దత్ప్రతిష్ఠ॥ చెప్పెదన్॥ భిన్నపుచ్ఛగుప్తపాదచిహ్నమున నీవిగ్రహ మెన్నటికి జెడక యుండ నిమ్ము జనులు సూడగ॥ చెప్పెదన్॥

వ. అని యానతిచ్చిన నటులనే తెగినతోఁకయు గుప్తపాదంబులు గలిగిన హనుమద్విగ్రహమును నిజాంశచే నిర్మించి హనుమంతుం డందు నిలిపినఁ గాంచి,

క. లోకభయంకరముగ నిపు
డేకాకృతి లింగ మొకటి యేర్పడె దీనిన్
బోకార్చి శుభము జేయుము
శ్రీకంఠా యనఁగఁ గరుణచే నే నంతన్.

వ. త్రిశూలంబులచే నామహాలింగమును పండ్రెండుభాగములుగా ఖండించిననవి జ్యోతిర్మయంబులై ఓంకారేశ సోమనాథ త్ర్యంబక మల్లికార్జున నాగేశ వైద్యనాథ విశ్వనాథ కేదారేశ మహాకాళేశ భీమేశ ఘుసృణేశ గంధమాదన- నామంబుల లింగంబులైయొప్పె నంత-

కమాచ్: ఆదితాళము. (ఇటురమ్మా) వలె.

రఘువర్యా! వినుము తెల్పెద ఆర్యాప్రియు డని యంతట నమ్మునివర్యులు నానిజవార్తఁ దెలిసి ॥రఘువర్యా॥ క్రమ్మఱలింగము గలుగు ననుచు శాపమ్మును ద్రిప్పిరి భక్తిచేత॥ రఘువర్యా॥ అప్పుడు మోక్షపురాధిపలింగము నెప్పటివలెనే యేర్పడెనో॥ రఘువర్యా॥

సీ. గంధమాదన మను కడపటిలింగంబు
కనకాద్రికీశాన్యమున రహించి
ప్రళయానిలముచేతఁబడి ప్రవాహమువెంట
దక్షిణాంబుధిఁజేరి దరిని నిలిచె;
రామ, నీగూర్చిన రామేశ్వరస్వామి
నీశాన్యమున గల దిదిగో చూడు
మింతపర్యంతంబు నెవ్వ రెఱుంగరు;
దీనియం దలరు; మత్తేజ మింక

గీ. రామలింగేశు నంచుగరంబు జేర్చి
యుందు వసించుచు జనులు రామేశ్వరము నె
పూజసేయుదు రిది మొదల్ పూజ్యమును మఁ;
బదియురెండవ లింగమై పరఁగు నిదియె.

తో: కలశజునకు వాగ్దత్తము జేసితిఁ గావున, గాశిని విడిచి। మెలమిని వచ్చితి నింమువసించెద నీలింగంబున వెలసి॥ రామ॥

వ. ఈస్థల మునకు వచ్చి సున్మయం బగు నీ తేజో లింగంబు నర్చించు వాఁడు బ్రహ్మహత్యాది మహాపాప విముక్తుండు కాఁగలడు. రామా, నీవును నిమ్మహాస్థలమునకు వరంబు లియ్యవలసిన దని శివుండు దెలిపిన శ్రీరాముం డిట్లను చున్నాఁడు.

కీర్తన: రూపకము. (మంగళ మగు) వలె.

విను శంకర, విను శంకర, వివరించెద నెంచి! మనుజులు చయ్యన నిచ్చట మజ్జన మొనరించి ॥విను॥ సంకల్పము సలిపి యిచటి సైకతమును గొనియు బొంకంబుగ బుద్ధినిండఁ బూరించుక జనియు॥ వి॥ శ్రీయుత కాశీస్థలమును సేవించి ముకుందు నాంయిసుకఁ బ్రయాగనుంచి యక్కరండమునను॥విను॥ గంగాంబువు గైకొని యీలింగముకడ జేరి, యంగంబున నభిషేకము నటు జేసియు వారి॥ విను॥ భారంబును వారి ధిలోఁ బడవిడిచిన నంత వా రుంకురు మోక్షగుండవరవాసునిచెంత ॥విను॥

వ. ఇదియునుంగాక.

క. అయనువున సంకల్పము
జేయక రామేశ్వరంబుఁ జేరదుగంగా
తోయం బది యొకకతమునఁ
బాయక చేరినను బూర్వభవకృతము ముగుఁ.

వ. ఇది నిశ్చయం బనుచు రామచంద్రుండు వలికె. అచటి కగస్త్యముని యేతెంచి శివరాములకుఁ బ్రణామంబులాచరించి.

తో: కటాక్షమున నీకాశీసుని నేను గంటి రఘురామా!। నా కొఱంత లేనంటికిఁ దీఱెను, నాకేశ్వరనుతనామా! ॥ రాము॥

వ. అని పొగడి శ్రీరామ-శంకరులచే ననుజ్ఞాతుండై యగస్త్యేశ్వర మనుపేర నొకలింగంబును రామేశ్వరలింగంబున కాగ్నేయదిక్కున

స్థాపించి యందుఁ బురాతనముగ నున్న గంధమాదనలింగంబు నుదర్శించి సేవించి వారిపీడ్కొని యగస్త్యుండు నిజాశ్రమంబున కరిగె; అంత—

క. నలుఁడును రామాజ్ఞను దన
దలమోచియు వార్థిగట్టఁ దలపడి కపు లి;
చ్చలు దెచ్చెడు కొండలు వి
చ్చలవిడి చే నంది గర్వసక్తుండగుచున్.

వ. కట్టుచున్న వైఖరిజూచి శ్రీరామచంద్రుండు దనమునంబున.

తో. తన కొక్కని కీపని నియమించితి నని గర్వంబున వీడు। వనచరావళుల నిర్లక్ష్యముగాఁగని మెలంగుచున్నాఁడు॥ రాము॥

వ. కావున దానినుడుపఁ దగు నని యెంచి,

చ. ఒకశిల నీట నిల్పి, మఱియొక్కటిదెచ్చెడు నంతఁ గొన వీ
చిక లటుఁద్రోవఁగాఁ దొలగు జేతికి జిక్కక; యయ్యవస్థచేఁ
గకవికలొంది యానలుఁడు గర్వము సర్వము దక్కి, రాముచెం
తకుఁ జని తత్పదంబులకు దండము వెట్టి వినీతి నిట్లనున్;

బిలహరి: రూపకము. (ఏమిసేతుం) వలె.

ఏమికారణమో! కామించి కట్టఁ బ్రేమతోఁ గట్ట, స్వామి, నియమించితి॥ రే॥ శిల లిందు వేయ నలల త్రాకు నటునిటు బోవ నలవియే కట్టుట॥ కేమి॥ వార్థి మోసమున వ్యర్థపుచ్చగ నర్థి నెంచెనో! నిర్ధారణ దోపద॥ దేమి॥ తామసింపకయ శ్రీమోతుగుండ రామ! యుపాయ మేమైన సెల వొసగు మి॥ దేమికారణమో॥

వ. అని ప్రార్థించిన సంతసించి జానకీపతి యిట్లనియె:

తో. రామనామమును రాతిరాతికిని వ్రాయుచు నతికించినను। క్షేమంబుగ నవి, చెదరకుండునటు చేయు ముసుచు చెప్పగను॥ రా॥

వ. నలుండు రామధ్యాననిష్ఠాగరిష్ఠుండయి తదాజ్ఞాప్రకార ముండె. అంగద హనుమంత నీల సుషేణ మైంద ద్వివిధ శరభ శతబలి

తార గజగవయ గవాక్ష గంధమాదన దధిముఖ జాంబవంతాదులు లగ్గల కెక్కినట్లు చెలఁరేగి,

రగడ.

వారిధి గట్టగను బూనిరి వానరు లందఱును
వింధ్యపర్వతము వేదాచలమును,
గంధమాదనము గరుడాచలమును,
కాంచనశైలము కైలాసంబును
క్రౌంచాచలమును, రైవతకంబును,
శ్రీగిరివరమును సింహాచలమును,
నాగోవర్ధన మస్తాచలమును,
వరుణపర్వతము నాహిమవంతము,
నురగశైలమును నుదయపర్వతము,
మలయపర్వతము మాల్యవంతమును,
నలరుచున్నద్రోణాద్రి యంజనము,
హేమకూటము మహేంద్రశైలమును,
సామజశైలము సహ్యభూధరము,
మందరశైలము మాల్యశైలమును,
సుందరమగు నా శోభన నగమును,
చిత్రకూటమును క్షీరశైలమును,
చిత్రపునీలక్షితిధరవరమును,
మొదలగు పర్వతముల కేతెంచియు,
వెదకి శిఖరములు వేఁ బెకలించియు,
గొని వచ్చిరి కపికోటులు కొందఱుఁ;
గొని వచ్చిరి ప్లవగులు మఱి కొందఱు;
కొందఱు మూపులఁ గొందఱు శిరములఁ,
గొందఱు భుజములఁ గొందఱు కరముల

నెత్తుక నెగురుచు నెలమిని దెచ్చిరి;
మొత్తము లగుచును ద్రోయుచు వచ్చిరి
చేరువ దిరిగియు, జెచ్చెర దెచ్చిరి,
దూరమునకు జని తొలగక దెచ్చిరి
వంతులు లేకయు వడిగా దెచ్చిరి;
గంతులు వైచుచు గ్రక్కున దెచ్చిరి;
యిటువలె తెచ్చిన యిన్ని కొండలును,
నిటువలె దెచ్చిన యిన్ని మ్రాకులును,
జేరి నలుండును జేతులనందుక,
శ్రీరామునినుతిఁజేయుచు దడయక,
బారావారముపైని పసందుగఁ,
గూరిచి కట్టఁగఁ గూర్మిని బొందుగ,
నాపనితనమ్ము నారసి మెల్లగఁ,
జూపరు లిదె మెచ్చుచు రంజిల్లఁగ
వారిధిగట్టగను బూనిరి వానరు లందఱును.

సీ. మొదటిదినంబునఁ బదునాలుగామడ,
లిరువదియామడ మఱుదినంబు;
నిరువదియొక్కటి యొసఁగమూఁడవనాఁడు,
పిదపదినం బిరువదియు రెండు,
పంచాహ్నమున నిరువదిమూఁడు,—నిటువలె
శతయోజనంబులు చాపునందు,
దశమాంశము వెడల్పుఁ దగియుండ సేతువు
గట్టె నలుండు లాఘవము మెఱయ;

గీ. నంత రాఘవుఁ డూర్మికాకాంత రావ
ణాను జార్కజ వాయుసుతాంగదాదు
లనుసరింపుచు రాగహర్షాబ్ధిఁ దేలి
గట్టుపై సంచరించెడు కాలమందు.

తో: ఉడుత యొకటి చిప్పన నేతెంచి మహోదధిలోపల మునిగి తడియారకమును బొడియిసుకను దాఁబడిపొర్లాడియు జెలగి॥ రా॥ కట్ట పయికి జనిగ్రక్కున రాల్చియుఁ గ్రమ్మఱి నటుల నె సలుప। నట్టెకాంచి సీతాపతి యారవిపట్టిలోడ నది దెలుప॥ రామ॥

క. ఇంత బలవంతులకు నిది
యెంతయు దుస్తరముకార్య మిట్లుండగనీ
జంతువు స్వల్పం బయ్యును
జింతింపగ భక్తిచేతఁ జేయుచు నుండెన్.

వ. అంతియేకాని యీమహాకార్యంబున నిది చేయుసహాయం బెంత! దేవరవారియం దింతభక్తి దీనికిఁ గలుగుట జన్మాంతర సుకృతంబుగాదా! శ్రీరామభద్రా! అనంతదయాసముద్రా! యని కొని యాడిన రాముఁ డలరి, సుగ్రీవా! దాని నిందుఁ గొని రమ్మనుఁడు,

గీ. భానునందనుఁ డరుదెంచి దానిఁదెచ్చి
రామసన్నిధినుంప హర్షమున నతఁడు
మూఁడువ్రేళుల దానివీఁపునను నిమిరె;
రమ్యముగను ద్రిరేఖ లేర్పడియె నంత.

వ. చందన మందార పనసామ్రాదిదివ్యతరుశోభితం బగు నొక్క వనమధ్యంబున విడిపించు నట్లాజ్ఞయిచ్చి పిమ్మట శ్రీరాముండు——

క. మునివేషమ్ముల నమర
మ్మనకరుగుట యొప్పదని సముద్రుఁడు, మణిహా
రనికర మంబరములు నిడ
ఘనముగ నవి దాల్చివెడలెఁ గదనంబునకున్.

కాంభోజి: రూపకము. (భూమిపాలనము) వలె.

దండు వెడలె లంకపయి కోదండరాముడు సానుజుడై॥దండు॥ నిండిదెబ్బది రెండువెల్లువల దండికపులు దండములై తనుగొల్వగ

॥దండు॥ భటులచటులార్భటులకు దిక్తటము లదరగ దశవదనుని పుట భేదనమున ననేక కుటిలభయోత్కటవిపరీతములు గలుగ॥ దండు॥ శరణు మోతుగుండనిలయ శరణురాఘవా! జయజయయని సురకిన్నర వరు లంబర చరులై సుచుభక్తితంబుగ వర్షింప॥ దండు॥

వ. ఇట్లు సేతువుమీఁదుగాఁ నడిచి మనుకులుండు సువేలాద్రికిఁ జేరి సైన్యంబుల నక్కడ విడియించె.

తో: అంతట గపుల మహారావములు దిగంతంబులు భేదించెన్; బంతితలలదొర బాగుగ విని తన మంత్రులతో యోజించెన్॥ రామ॥ కట్టా! రాముడు గపికోటులతో ముట్టడించె మనపురము! । నెట్టుల జేయుద మిక ననుచుండగ నింతలోన వేగిరము॥ రామ॥

వ. రావణునితల్లి కైకసి తనతండ్రియగు మాల్యవంతునితోఁ గూడి రావణుని కొలువుకూటంబునకు వచ్చి వానిచే సత్కరింపబడి యుచితాసనంబునఁ గూర్చుండి యిటు లనుచున్నది.

జంఝూటి: త్రిశజాతి.

నామాట మీఱవద్దు । నాపట్టియనుచు బుద్ధు లీమాడ్కి దెలుపగాను నిదె వచ్చియున్నాను మాను! నీమేలు గోరెదను ॥నామాట॥ రాముని దేవిఁ దెచ్చి కామించి చెఱలోనుంచి, సామాన్యు లనుచు నెంచి. సాధింపగను దలచినావు నెమ్మదియోజించి॥ నామాట॥ రాముడు మోక్షగుండ శ్రీమాధవుడు గాడా! భూమిజ కమలగాదా! యేమియు నెఱుక లేదా! వాదా! భామను విడరాదా!॥ నామాట॥

క. నీదాడికోర్వఁ జాలక
యాదేవత లాశ్రయింప, నభయకరం బా
శ్రీదయితుఁ డొసఁగి, నరుఁడై
మేదిని జన్మించె నిన్ను మృతినొందింపన్.

వ. జగదీశుని యానతిచే దేవతాంశంబులఁ గపిసైన్యంబులు గలిగెగాక ఇంత బలపరాక్రమంబులు గల కోఁతుల నెన్నఁడయినఁ గంటివా! కుమారా!

తో: మనుజు డనుచు నీమది నిర్లక్ష్యముగను భావింపకు వినుము। నినుగెల్చిన వాలినిజంపిన శూరునిగా నెఱఁగను గొనుము॥ రా॥

వ. ఆమేటి సామర్థ్యంబునకన్న నీనుగంటిమే యెక్కుడయిన నామనుజుని భామినినిఁ దెచ్చుటకు నెదిరించి పోఁగూడదా! యేను జంచి తెచ్చుట భయపడికాదా! పుత్రా! దేవతాజైత్రా! రాక్షసకుల పవిత్రా!

తో: ఏటికి జెడియెద వికనయినను నామాటను ద్రోయకు నేడు। తాటకహరునకుఁ దరుణి నొసంగుము దయనినుబ్రోచును జూడు.

వ. ఆదయానిధి శరణాగతులఁ గాపాడు బిరుదుగలవాడు కాన నీయందసూయనొందక జేరఁదీయు. అతనిసేవకన్న శుభావహము లొండు లేవు: హా మ్మనుడు, సవ్వి యతం డిట్లనియె:

కమాచ్: రూపకము.

మాటాడకుమా నాతో॥ మాటా॥ హాటకచేలుడు రాముం డయ్యెను సేవింపు మనుచు మాటికి బోధించెదు నీమాత్రిము నే నెఱుఁగ నేమొ!॥ మాటా॥ హేయం బగు నీతనువున నాయన నర్చింపజాల; బాయకయని జేసి యొడలువాసి పరమునందు గొలుతు ॥మాట॥ ధారుణిలో మోక్షగుండ శ్రీరాముని నీపిన్నకుమారునితో జేరి కొలిచి మని యుండుము చిరకాలము॥ మాటాడ॥

వ. దిగ్విజయుండనయి బహుకాలం బిహలోకసౌఖ్యంబు లను భవించితి.ఒకరికి వెఱచి శరణుజొచ్చి యెఱుఁగఁ దురంబున నతని బారిగొన లేకున్న నాశరీరంబు దొఱఁగి పరంబు గాంచెద. స్థిరంబుగ ధరాతలంబు విభీషణుని చేత నేలింపుము. తల్లీ! మఱల నాతో తెలుపకు.

తో: అనవుడు, విధికృత మనుభవింపు మని చనెగైకశితన యిచ్చుఁ,మనుమని గని యమ్మాల్యవంతు డిట్లని బోధింపగ జొచ్చెఁ.
రా॥ సామాన్యునిగా రాముని గని తద్భామిని జేరబట్టితివి! నేమముగల రజనీచరకులమును నెసుచేయ బూనితివి॥ రావ॥

క. నారాయణుఁడే రాముండగు;
శ్రీరమణియె సీతయగు; ధరిత్రినివారల్
కారణజన్ములు; నిర్జర
వైరులఁదునుముటయె వారి వ్రతమనుమూరా!

కీర్తన: ఏకతాళము.

నిర్నిమిత్తవైర మేల నీకు రావణా! దుర్నిమిత్తములు జాల దోచె రావణా! ॥ నిర్ని॥ సామజాళిసత్వములు సమసె రావణా! హోమధూమములుగ్రుంగె నేమొ రావణా! ॥నిర్ని॥ గుంపులైవరళ్ళుగవిసి కూసె రావణా! సొంపుపెంపు లడగె రాక్షసులకు రావణా! ॥నిర్నిమి॥ నేడిమి నెత్తురులు గురిసె వేగ రావణా! జూడ నులకలెల్లరాలఁ జొచ్చె రావణా ॥నిర్ని॥మోతుకుండశౌరిమీద ముట్టిరావణా! రాక్షసులు జెదుదురు దిరంబు రావణా ॥నిర్ని॥

గీ. 'సీత నర్పించి రాముని సేవజేసి
లంకఁబాలింపు మెల్లకాలంబుఁ జెలఁగి,'
యనిన నమ్మాల్యవంతున కాగ్రహించి
పటుభయంకర మూర్తియై పలికెనిట్లు:

కీర్తన: ఆదితాళము.

మాతామహు డని నిన్ను మర్యాదగ జూచుచుండ నీతిమాలి మాటలాడేవు॥ ఓమాల్యవంత॥ భీతి దెల్పి బెదరించేవు! హీనమానవుని సేవకేను పోవుదునె కులస్థానపౌరుషముల నెంచవు॥ ఓమాల్యవంత॥ కానిపోని వెల్ల నెంచేవు! నన్ను జంప మోతుకుండనాథుఁ డవతరించి

శరణన్న నెటులఁ జంపకుండును॥ ఓమాల్యవంత॥ ఉన్న కర్మ మెటుల మానును॥

వ. కాఁబోవునది కాక మానదు. క్షణభంగురదేహమును శాశ్వతముగా నమ్మి కానిపోనిపనులకు నే నేల చొత్తు! పలు పలుకులుడుగు తాతా! దానవకుల ప్రదాతా! అనుచుండ.

క. దానవపతి యానతిచే
భానుజుకడ కేగి శుకుఁడు పరువడి మగుడన్
దా నరుగుదెంచి మ్రొక్కిఁద
శాసనుతో నిటుల; బలికె సతిమోదమునన్.

తో: విను రావణ నేఁ జనిన విభీషణుఁ డనువుగ దెలుపుటచేత। నను జంపగ వానరులు జతనపడ మనుకులుండు దయచేత॥ రామ॥ దూతను జంపినదోష ముంచు న న్నాతతి విడిపింపఁగను భీతిలేక నే నేతెంచితి గడు నీతితోడ నిను గనను॥ రామ॥

వ. అనంతసత్వసంపన్నులగు కపిసైన్యంబులచే వారిధి గట్టించి దాని మీఁదుగా వచ్చి సువేలాద్రిమీఁద రాముండు సేనాపరివృతుండై యున్నవాఁ డనిన, నాశ్చర్యపడి రావణుండు——

క. శుకుఁడును సచివులు గొలువగ
నొకప్రాసాదాగ్ర మెక్కి యురువడిఁ గని యో!
శుక! నీ వెఱుగుదువు గదా!
ప్రకటంబుగఁ దెలుపుశత్రుబలములవరుసన్.

రావణ-శుకసంవాదము : కీర్తన.

॥రా॥ మేలైనచూపుల మిఱుమిట్లుగొలుపు నాసీలాంగు డెవరుశుకా!
॥శు॥ ఆలలితాంగుడే యసురేంద్ర! రామభూపాలు డగును దేవరా!
॥రా॥ పొందుగా నాతని ముందర నిలిచిన మగు రెవ్వరోయి శుకా!
॥శు॥ విందుగ విను రవినందన లక్ష్మణ విభీషణులు దేవరా!

॥రా॥ మోటుగుండేశుని మొనలను పేర్కొని మునమున జూపు శుకా!
॥శు॥ అతిశయమైనట్టి యవి యెన్నదరమె బ్రహ్మాదులకును దేవరా!

వ. అయిన నే నెఱింగినమట్టుకుఁ బ్రధానకపుల వివరించెద రావణా!

గీ. లక్ష మర్కటు లెపుడుఁ జెలంగి గొలువ
ఘనపుళిందానదీతీరమున వసించి
యుండుమేటిబలుండు నీలుం డతండె
సవితృసుతుదళవాయి నిర్జరవిరోధి.

తో: వేయికోట్లకపివీరులు గొలువగ వేగవంతు డనువాడు। పాయకయుద్ధము చేయయత్నపరుఁడై యున్నాఁ డదే చూడు ॥రా॥

క. గురుతరవింధ్య సుదర్శన
గిరులకు నాథుండు ఘనుఁడు గిరీశసఖుం
డురురణకౌతుకవిపులో
గ్రరణసమారంభుడఁతఁడు రంభుఁడు గనుమా!॥

హిం॰ కాఫి: ఆదితాళము. (రామ నంపిన) వలె.

వాఁడే కను మంగదుడు । వాలినందను డల్లవాఁడే॥ పిడు వాలి కన్న మొనగాడు! పనివాడు గద॥ వాఁడే॥ ఏకాదశశతపద్మప్రకట మర్కటు లతిభీకరముగను గొల్వఁ దోక గదలించుచున్న॥ వాఁడే॥ తానొక్కడే మోటుగుండధాముకార్యము దీర్చువానివలె నుత్సాహము బూనియుప్పొంగుచున్న॥ వాఁడే॥

చ. ఘనముగఁ జందనాద్రికిని గాంతుఁ డనం దగి వేయికోట్లపై
నెనుబదిలక్షసంఖ్యగల యెల్లకపుల్ దను నాశ్రయింపఁగాఁ
దినరి, ఖరారియానతిని దా దఁగ గట్టను నిన్న సేతువుః
కనుగొను మాతఁడే నలు! డ ఖండబలుండు! సురారిశేఖరా!

తో. నలువదిలక్షల నాల్గువేల వానరులు గొల్వగాఁ దెలపు। బలమును జూపుచు బరగెను శరభుం డలవాఁడే పరికింపు॥ రామ॥

క. కుముదుని శాత్రవమానస
కుముదుని దశకోటి ప్లవగ గురుసరసనరః
కుముదుని రాఘవకార్య
భ్రమదుని సంకోచనాద్రి పతినిం గనుమా!

తో: కోరి యెపుడు బదికోట్లమర్కటులు గొలుచుచుండగా నెగడు! । పారియాత్రగిరిభర్త యగును నాపనసుని గను మల్లతఁడు॥రా॥

గీ. కోటిభల్లుకవర్యులుఁ గొలుచుచుండ
దమ్ముఁడగుధూమ్రుఁడత్యంత ధైర్యశాలి
తనకుఁ దోడ్పడ మనదికుఁ గనుచునుండు
జాంబవంతుని జూడు రాక్షసవరేణ్య!

క. డెబ్బది డెబ్బది లక్షల
నిబ్బరపుంగపులుగొలువ నేర్పరులై తా
ముబ్బెదు కోర్థనగనయుల
నబ్బా కనుఁగొంటె! రాక్షసాధిప వారిన్!

వ. మఱియు నింద్రజాల గజ గంధమాదన గవాక్ష శతబలి మైంద ద్వివిద సుషేణ దధిముఖ సుముఖ విముఖులు లోనుగాఁగ పేంద్రు లనంతబలసమన్వితులగు మర్కటబలంబు లసంఖ్యాకంబుగాఁ గొలువ యుద్ధసన్నద్ధులంబు కాలు ద్రివ్వుచున్నారు. చూడుము నిశాచరేంద్ర!

కేదారః ఆదితాళము. (కోరియుం) వలె.

చూడు!మారుతనిఁ । దనుజేశా! చూడుమారుతనిఁ । నాడు లంక జొచ్చినాడు నగరము గాల్చినాడు! యోడక దిరిగినాడు! చనినాడు మొనగాడుగద నేడు॥ చూడు॥ మేరుభూధరసమధీరుఁ మారుతవర కుమారుఁ సారపిశంగాకారుఁ రణశూరుఁ మణిహారుఁ గపివీరుఁ ॥జూడు॥ మోక్షగుండ పురాధ్యక్షుఁ దీక్షతో గొలుచుదక్షుఁ యక్షగజహార్యక్షుఁ బృథువక్షుఁ రిపుశిక్షుఁ ఫలభక్షుఁ॥ జూడు॥

సీ. వేయికో ట్లొకసంఖ్య వెలయఁగనవిలక్ష
కోట్లు మహాసంఖ్య కొమరుమిగుల
నవిలక్షయగుబృంద; మవిలక్షయగు పద్మ
మవిమహాపద్మాఖ్య యగును లక్ష
యవి లక్షయగు ఖర్వ; మవిలక్షయగు మహా
ఖర్వ; మవియు లక్ష కడుసముద్ర
మవిలక్షయయిన మహాసముద్రం బగు
నవిలక్షయగు మహదాఖ్యయవియు

గీ. నూఱులక్షలు గలవు భానుజునిముఖ్య
సేనకడమవి చెప్పఁగాఁ జేతగాదు;
ఇట్టిసేనలఁ గూడుచు నినకులుండు
లంకపయి దండు వెడలె నిశ్శంకతోడ.

వ. ఇంకొక విధంబు వినుము.

సీ. పదివేలకోట్ల ప్లవంగము లొకగంతు;
గంతులు సాహస్రగణనము గమి;
యాగమికోటి కోట్లగు నొకమొత్తంబు;
శతకోట్ల మొత్తంబు జగతి పీదు;
వెలయ లక్షక్షోణి పీదులైనను సాదు;
సాదుద్వి సప్తకసంఖ్య మూక;
శతకోటిమూకలు సంగడినాఁజెల్లు;
నవియును నూరుకోట్లగును దట్ట;

గీ. దట్ట లొకయాఱు గూడినఁ దగును వెల్వ
నిండివెల్వలు డెబ్బదిరెండు గొల్వ
రామచంద్రుండు సీతకొఱ రణ మొనర్ప
నరుగుదెంచి సువేలాద్రి యందు విడిసె.

మత్తకోకిల-'మేకమాంసము బెట్టు నాకును మేదినీసుర' యన్న, నాఁ
గాక నా శుకభార్యరూపము గ్రక్కునన్ ధరియించియున్
బాక మొప్పఁగఁ జేసి యమ్మని వచ్చినంతనె పెట్టె దా
జోకతో నరమాంస మన్నముసూపశాకపదార్థముల్.

వ. భుజించి శుకునిపైఁ గనలి యయోగ్యం బగు నరమాంసంబు నాకుఁ బెట్టించితివి! నీవు రాక్షసుండవు కమ్మని శపించిన, నతండు నేను నిరపరాధి నని వేఁడె. దివ్యదృష్టిచేత నది రాక్షసకృత్యం బని తెలిసి,

సురటః ఆదితాళము.

సరే సరే నిను శపించితిని నిరపరాధి వనుకోక, మదిలోఁ బరం బెఱుగలేక॥ మదీయవాక్యము వృథాపోదు; నెమ్మదిన్ దెలిసి కొమ్మ! ఇదితప్పదంచు ననుకొమ్మ॥

సురారిరూపము ధరించి దశకంధరున్ గొలుచుచుండు; మిఁక ముందరన్ మేలు గూడు । ధరన్ మోతుగుండరాఘవుని సోదరాన్వితంబుగను గాంచిన హరించు శాపమును॥

ఉ. వానరసేనఁ గూడిరఘువర్యుఁడు తమ్మునితోడ లంకపై
దా నరుదెంచినప్డు సముదారత వారినిఁ జూచి వచ్చి యా
దానవ భర్తకున్ దెలిపి తత్త్వవిచారము బోధచేసినన్
మానెడు శాపమంచుఁ గరుణన్ గలశోద్భవుఁ డానతిచ్చినన్.

వ. ఆప్రకారమాచరించి శుకుండు శాపవిముక్తుండై చనియె. పార్వతీ! యంత రావణుం డెప్పటిచోటఁ గొలువు దీరియుండె. అక్కడ రాముండు లంక చతుర్ద్వారంబులఁ గపులు ముట్టడించునట్లు చేసి యుద్ధమునకు ముందొక్క బుద్ధిమంతుని సంధికిం బంపిన బాగని యెంచి నీతికుశలుండగు నంగదుని గని యందఱు విన నిట్లనియె:

క. అంగద, రయమున రావణు
చెంగటికిం బోయి భీతిచెందక నీవు

ప్పొంగుచును గొన్నికొన్ని ప్ర
సంగంబులు జేసి రమ్ము సత్వరయుక్తిన్.

హిం. కాఫీ: అటతాళము.

ఇనకులుం డగు రాము డిదె దండెత్తినా డను మంగదా! నిను సుతామాత్యాళితోడను దునుము గల డను మంగదా! ॥ ఇనకు॥

ధాతచేఁ గొన్నట్టివరములు దప్పె నను మోయంగదా! సీత నిచ్చియు శరణుజొచ్చిన జెఱుపురాదను మంగదా!॥ ఇనకు॥

పౌరి తఱుమగ దేవమానులు గారటాచను మంగదా! గారవించి విభీషణునకుఁ-గట్టె లంకను మంగదా!॥ ఇనకు॥

మోక్షగుండపురీశుతోఁ ప్రతికక్ష వద్దనుమంగదా! దీక్షతోఁ గార్యాంతమున జింతింప వద్దను మంగదా॥ ఇనకు॥

అంగదుని రాయబారము.

వ. ఇట్లు తెల్పిన నంగదుఁ డత్యానందభరితుండయి శ్రీరామునకు నమస్కరించి సుగ్రీవాదుల యనుమతంబు వడసి పర్వతాకారుండై లంకఁ బ్రవేశించి పురశృంగారంబు దిలకించుచుఁ బోయిపోయి రావణుని గొలువుకూటంబుఁ జేరినఁ గాంచి.

క. ఎవ్వరివాడవు వానర?
ఎవ్వరు పంపంగ వచ్చి తిప్పుడునీ? విం
దెవ్వరితోఁ బనియున్నది?
యెవ్వరు నీతల్లిదండ్రు లెఱిఁగింపుడు తగన్.

వ. అనిన, నంత డిట్లనియె:

కళ్యాణి: రూపకము.

వినర రావణా! రఘువీరుఁ డంపినట్టి భటుడను నే॥ వినర॥ నినుఁ జలంబుమీఱ వాలమున నను గట్టి వార్ధులందు ఘనత ముంచినట్టి వాలి కిని సుతుండ నాడు; । నంగదుడను॥ వినర॥ గట్టిగా నినున్ జయించి

నట్టికార్త వీర్యజంపినట్టి పరశురాము గెల్చినట్టి మేటిశూరు డగు రఘుపతి॥ వినర॥ మోక్షగుండ దేవునాజ్ఞ దీక్షనీతో మాటలాడ రాక్షసుండ వచ్చినాడ రాజసంబుతోడ దెలుపుదు నిక ॥వినర॥

వ. అని పలికిన విని రావణుండు దురాగ్రహుండై యిట్లనియె:

చ. మును పౌక కోఁతిఁ వచ్చి తనముచ్చట లెల్లను జూపి తానున
మ్మనుకులదూత నంచు హనుమంతుఁడ నంచు వచించి మేనుదం
డన మొనరింప సిగ్గుపడి నాటికి బోయెను; నేఁడు నీవు రా
మునకును దూతనంచు ఘనముగ్ దలపోయుచు వచ్చితో బళీ!

క. ఆకోఁతికి శుభమే! గద!
నీకథ లేవియొ వచింపు నేర్పుగ నిచటన్
మేకొని దూతలఁ జంపఁగ
రాకునికిన్ బ్రేలెదరు పరాకున మీరల్.

వ. అనిన నవ్వి యంగదుం డిట్లనియె:

తో: రావణునకు నోడి రయమున వచ్చితి వీ వని కపులందఱును। నావనచరు నపహాస్యము జేయఁగ నతఁడు చనియెఁదందరను॥ రా॥ వానిని నన్నును భానువంశజుని సేనలలో నినజుండు। హీనబలుల మని యెంచి యిట్టిపను లైనఁ జేయుడనుచుండు॥

వ. కాఁబట్టి వచ్చుచున్నాము. తక్కిన విషయము నీ కేల! వచ్చిన ముచ్చట యుచ్చరించెదఁ జెచ్చెర వినరా! రావణా!

తోడి: ఆదితాళము.

ఓరి రావణ! చూడుమురా! ప్రియమున నాలింపర॥ యోరి॥ లోకంబులకును దల్లి జనకసుత నీకు దల్లిగా దటర దురాత్మక! ప్రాకటముగ నీకులము జెఱచుటకు చేకొని వచ్చియు జెఱఁబెట్టితివట ॥రోరి॥ నీదు పుత్రమిత్రాది బలంబులు నీల్గకముందే యెఱుకగలిగి యమ్మోదినిసుతనిడి మోక్షగుండపతి పాదపద్మముల ప్రాపున జేరుము!॥ ఓరి॥

తో. బలవద్వైరము బాగుగాదు చలపాదితనంబును మాను। అలవిభీషణునివలెనే రాముని నాశ్రయింపు మే లౌను॥ రామ॥ విను నాబుద్ధిని; వినకుండిన నీవు మనుట యబద్ధము ధరను। అనుఁగు జెలులఁ జుట్టాలఁ జూచికొను బుణము బాయుముందరను॥

వ. శ్రీరాముని కోపాగ్నికి నెదురులేదు. నిర్భయంబున నుండకు రా దౌర్భాగ్యా! కార్యాంతమునఁ జింతించి ప్రయోజనము లేదు. అని నుడివిన, నంగదునిపయి నలిగి రావణుం డిట్లనియె:

కీర్తనః అటతాళము. (కలియుగ) వలె.

త్రిజగద్భయంకరు డని, తెలియ వేమిర నన్ను॥ త్రిజగ॥
నిజముగ నిర్భయముగ నిలిచి మాట్లాడెదవు॥ త్రిజగ॥
కైలాస మగలించితి! దిక్పాలకుల జయించితి!
పాలించితి బహుకాల మెదు రేమి లేక॥ త్రిజగ॥
వేధోదత్తవరమున సాధించితి లోకములు!
బాధించితి మునుల; నరాధము లెంతటివారు॥ త్రిజగ॥
ఔను సీతంబ్రియగ యైన దలంపక నీవు
వానిఁ గూడినావు! నిను నే నటుల జేయుదునే!॥ త్రిజగ॥
అంగదా, నాముందర బొంగి మోక్షగుందరఘు
పుంగవుని భట్టువలెఁ బొగడెదవు సిగ్గుమాలి॥ త్రిజగ।

క. పగవాఁడు దండువెడలిన
జగడమునకు దీడుకొనుట చదురగు; నిటులన్
జగతీశులెల్ల నవ్వఁగ
మగఁటిమిచెడ సంధిసేత మగతనముగునే.

తో: నగుబాటని మెన్నక నాతమ్ముఁడు నాకనలిగి యటు బోయి। బెగడున రాముని శరణుజొచ్చెఁ సీతగవుచాలుఁ బోవోయి!॥ రా॥

## అంగద-రావణసంవాదము.

సురటః అటతాళము.

అం- రామప్రతాపము రాక్షస యిసుమంత నీమది దెలియ వే మది॥
రా- రామసామర్థ్యము నాముందు వర్ణింపరాకుము పలుక బోకుము॥
అం-వేడుకతో చిన్ననాఁడె తాటకఁ జంపినాఁడురా! వినుమ బోఁడురా॥
రా-అదుదానిని జంపినట్టిశూరత్వము బాడకు యిచట వేడకు॥
అం-నీ వెత్తలేనట్టి నిటలాక్షువిల్లుద్రుంచె నేర్పుగ కడునోర్పుగ॥
రా-ఆవిల్లు మోపెట్టు టదియెంత! ప్రాతది యౌనుగా విరిగిపోవుగా॥
అం-పరశురాముని బాహుబల మడగించిన బంటురా! యేల కంటురా॥
రా-ధరణీసురుని ద్రుంచుదర్పము జెప్పకు! తాళురా యికఁ జాలురా॥
అం.మోతుకుండేశుఁడే ముదమున నిను జంపఁ బుట్టెను బడగొట్టును!॥
రా-ఈక్షితి నెటులైన మోక్షము దప్పదిం కేటికి దెలుప మాటికి॥

క. బలవంతుడైన వాలికిఁ
గలిగిన నీయంతవాఁడు కడునీచముగా
బలహీను లయిన నరులను
గొలువఁగ ఫల మేదిరోరి కులనాపకుఁడా!

తో: వైరి దప్పనెవ్వారు దొరలు భువి లేరా! కొలువొనరింప। నేరవు రాముని నేమ విడిచి యిఁక రారా నను సేవింప ॥రామ॥ వచ్చిన నీకును వానరరాజ్యం బిచ్చెద వారినిఁ గెలిచి; ఇచ్చగ సుఖమ్మగ నిరువుర ముందము; ఎఱిఁగించితి దయఁదలఁచి॥ రామ॥

వ. అనిన, నంగదుండు——

కీర్తనః అటతాళము, (రామకృ) వలె.

చాలుర చాలుర చాలుర రావణ! మేలుగ నీ యనుకూలము నాకిక ॥జా॥ కాలము దీఱెను గావున నీ విటు పేలెదు పి న్నవి, పె కనుకొనక; ॥జాలుర॥ తల్లియుఁ దండ్రియు దాతయు దైవము నెల్లరు

శ్రీరఘువల్లభుఁడే యగు॥ జా॥ మోక్షగుండేశునిచే క్షణమందున రాక్షస చెడెదవురా మునుమ్మాటికి! ॥జాలుర॥

వ. అనిన రావణుండు కోపోద్దీపితమానసుండయి రాక్షసులం గని యీపరపక్షపాతి నీక్షణంబున బట్టి కట్టుండని యాన తిచ్చినవారు జెలరేగి మూఁగిన దనలావు గనఁబఱుచుటకయి యంగదుండు జిక్కి పిమ్మట—

తో: ఆకాశంబున కప్పుడె యెగసియు నటు నిటు విద లింపగను, వేఁగూలిరి పదివేలరాక్షసులు విగతాసువులై ధరను॥ రా॥

గీ. రావణుని కొల్వుచవిక వేరమునఁగూలఁ
దన్న నది శిథిలంబయి ధరణిఁగూలె;
నలిగి దశకంఠుఁ డంపగా నసురవరులు
నరి మురిగ్ వాని ముట్టి మట్టాడఁ దొడఁగ.

వ. వారి నందఱిని గ్రమంబుగ జమునిమందిరమునకుఁ జేర్చి వేగంబున రామచంద్రునిం జేరి నమస్కరించి యిట్లనియె:

బేహాగ్ రాగము: ఆదితాళము.

రఘువంశ శేఖరా! రణరంగభీకరా! యఘదూర! శ్రీకరా! యమితకృపాకరా!॥ ర॥ మీయాజ్ఞనెఱవేర్పఁ బోయితి; నాతడు వేయేల సంధి కీయకొనననెను॥ర॥ చాపఁగఁ దెంపుగావించి సొంపు జేవయు జెడడు; చెప్పినవినడు॥ ర॥ శ్రీమోక్షగుండధామ కోదండరామాయతఁడు రాజికి రాడు॥ రాము॥

వ. అంత సువేలవిఘదలలండు యుద్ధసన్నాహంబు చుఱుకుగ సాగుచుండె. అక్కడ రాక్షసభటులు రావణుని జూచి,

ఉ. దేవ! పరాకు! వానరుఁడు తేఁకువ దానవసేనఁ దూఁటి తాఁ
బోవఁగ మిన్నకుండితివి; పొమ్మని మాకు ననుజ్ఞ యిచ్చినన్
లావు జవంబు మీఱఁ గపులన్ మనువంశ్యులఁ గూల్చి వత్తుమో
రావణ! పంపు మంచు వివరంబుగఁ బల్కిన నాతఁ డంతటన్—

వ. తన వైభవంబు రామునకు, గనఁబఱుపఁదలఁచి దివ్యవస్త్రా భరణంబులు ధరించి సమస్తపరిచారకు లుపచరింప రాక్షస గణపరి వృతుండై చని యుత్తరగోపురంబందుఁ గొలువుదీరినఁ గాంచి విభీషణుని వల్లన రావణుఁగా నెఱిఁగి రాముండు వాని గర్వం బడంచువాఁడై.

తో: అనుజునిచే విల్లంది దానియందు దర్ధచంద్రబాణమ్ము। ఘనముగ దొడిగియు గడఁగి విడువ నది చని కిరీటదశకమ్ము॥ రా॥ క్షితిఁగూల్చియు బోదిఁ జేర, రావణుఁడు, సిగ్గుబొంది కడుపోలి। యతివేగంబున నాత్మభవనమున కప్పుడె చనె ధృతిదూలి॥ రామ॥

వ. ఇట్లింటికిఁ బోయి రావణుండు మరలఁ గొలువుఁదీరి రాక్షసులంగని రాముని బలంబులు నాల్గుద్వారంబులఁ గవిసి పురంబుఁ బ్రవేశించుచున్నవి కాఁబట్టి, యీక్షణంబున—

పూరికళ్యాణి : ఏకతాళము - (అమితోగ్ర)వలె.

అసురేంద్రులారా! యీజికి మీర లతి శౌర్య మొప్ప నరుగుడింపారఁ జేర॥ నసు॥ అరులను ముట్టి, యురికినబట్టి, ధరఁ బడగొట్టి, నుఱుముడు మట్టి మట్టి॥ యసు॥ పగవారిమూఁక భయమేమిలేక దగ వచ్చెఁగాక తఱుమనో గాక వీక॥యసు॥ ధర మోక్షగుండ వరునికోదండ హరుని రాకుండ నాగుడు పెండ పొండ॥ యసు॥

వ. అని పురిగొలిపిన నవక్రపరాక్రమంబులు మీఱు వీరావేశంబునఁ గ్రూరరాక్షసులు లెక్కకు మిక్కుటంబుగా సమరసన్నాహకుతూహలులయి భేరీభాంకారరవంబులుఁ, గరులఘీంకారంబులు, ధనుష్టాంకారంబులు దిగంతంబులు ప్రతిధ్వను లీయఁ గదలి భుజాస్ఫాలనంబులు చేయుచు,

—♦ యుద్ధారంభము. ♦—

తో: నాలుగువాకిండ్లను మూఁగిన యానగచరసేనల దగిలి, ఛాలుగ యుద్ధము, సలుపగ బూనిరి సమరశూరులై మిగిలి॥ రా॥

వ. మేఘనాథుఁ డంగదుని, ప్రజంఘుఁడు సంపాతిని, అతికాయుండు వినతరంభులను, మహోదరుఁడు సుషేణుని, మకరాక్షుండు జాంబవంతుని, విద్యుజ్జిహ్వుండు శతబలిని, విక్రమధనుండు గజుని, కుంభుండు ధూమ్రుని, దేవాంతకుండు గవాక్షుని, సారణుండు ఋషభుని, త్రిశిరుండు శరభుని, నరాంతకుండు పనసుని, అకంపనుండు కుముదుని, ధూమ్రాక్షుండు కేసరిని, మహాపార్శ్వుండు గంధమాదనుని, కంపనుండు నలుని, జంబుమాలి హనుమంతుని, మిత్రఘ్నుఁడు విభీషణుని, ప్రహస్తుండు సుగ్రీవుని, వజ్రముష్టి మైందుని, అశనిప్రభుండు ద్వివిదుని, నికుంభుండు నీలుని, విరూపాక్షుండు లక్ష్మణుని, సుప్తఘ్న-రశ్మికేతువులు, నగ్ని-కోపాగ్నికేతువులు నలుగురు శ్రీరాముని, మఱియు ననేక వానరయోధులతోఁ ననేక దానవదళంబులు దలపడి ప్రథమ యుద్ధంబున శరవర్షంబులు గురిపించుచుఁ, దరుశైలపాషాణాదులు వైచికొనుచుఁ ముష్టియుద్ధంబులకుఁ జొచ్చుచు, ముసల ముద్గర ప్రాస పరశు భిండివాల తోమరంబులచే నఱికికొనుచు సంకులయుద్ధంబునకుఁ దగుల్పడిరి. పోరు ఘోరం బయ్యె! నప్పుడు——

తో: రాముని భటుల పరాక్రమమున కల రావణసైన్యము లాఁగి। యేమాత్రము సహింపఁగఁజాలక భూమిని గూలిరిలోఁగి॥ రా॥ కొందఱుదగ్గిరి; కొందఱు జచ్చిరి; కొందఱు భయపడి చనిరి; కొందఱు సందుల గొందుల దూఱిరి; కొంద ఱమరలే మనిరి॥ రా॥

వ. తన బలంబులు నశించి పరబలంబులకు జయము గలుగుటఁ గాంచి యింద్రజిత్తు యుద్ధంబు మాని నననశాల కరిగి హోమంబు జేసి యజ్ఞేశ్వరునివలన దివ్యరథ-రథ్యంబులును దివ్యాస్త్రకవచ-కిరీటాదులును గ్రహించి యుద్ధమునకు వెడలె. ఇక్కడ రాక్షసకాంతలు——

జంఝూటి : త్రిశ్రజాతి.

ఇఁక నేమిచేయుదమమ్మ! ఇది యేమికాలమమ్మ! యీ పోరు మానరైరి! ఇలమీఁద మనవారి బ్రతుకు లేమో నిజములేదు!

ఎవరు దెలిపిన నెంతమాత్ర మెఱుగ నొల్లడే! యెంతమూర్ఖుఁడే!॥ఇ॥ చలపాదిదశకంఠుడు గెలువగ దలచినాడు! అలమోతుకుండవిభుని బల విక్రమము గానఁడు! అకటా! కులనాశకుడు వీడు నిలుపరైరిగా! జల జమిత్రుఁ డస్తమించిన గాని మానరు॥ ఇ॥

వ. ఇట్లు చింతించునంతలో నస్తమించి చీఁకట్లు గ్రమ్మిన నింద్ర జిత్తు మేఘంబుల చాటున నిలిచి మాయాయుద్ధంబుఁ జేయుచునొరుల కగపడకుండనున్న నతనిఁ గనుఁగొని యుద్ధంబుజేయ వానరులు సమర్థులు గారైరి.

గీ. వానరుల నెల్లఁ బటుబాణవర్షమునను
ముంచి నాగపాశముల బంధించె నపుడు
రామలక్ష్మణులను బరాక్రమము మెఱయ
నింద్రజిత్తు మహాగ్రహం బినుమడింప.

వ. శరీరంబు ధరించినపుడు హరిహరాదులకయినఁ బురాకృతం బనుభవింపక పోవునా! ముందు బలిని బంధించిన కారణంబునరాముండు నాగపాశబద్ధుండయ్యె. అంత నింద్రజిత్తు తన విజయంబుఁ దండ్రికెఱిం గించిన సంతసించి రావణుండు త్రిజటను బిలిపించి,

కీర్తన: త్రిశజాతి-(వనమును) వలె.

సమరము జూపు రమణీ! కమలాక్షీ! సీతకు నేఁడు ॥సమర॥ క్రమముగఁ గపులు రాక్షసానీకము జేయు ॥సమరము॥ ఒడబడదామె దరుణి గడువేడ్క నాతోడఁ గూడ! నొడబడ! వడినాగపాశబద్ధుడై శ్రీరాముఁడున్న ॥సమ॥ ధర మోతుకుండవిభుడు దనుజుల గెల్వలేడు! ధరనో విరిబోణీ యాసవిడు మంచు బోధింపుము ॥సమరము॥

వ. అంతట,

గీ. త్రిజట లోనగు రాక్షసస్త్రీలు సీత
నొక్క పుష్పక మెక్కించి యుక్కు మెఱసి

సంగరస్థలిఁ జేర్చి ప్లవంగవిభుల
రామలక్ష్మణులను జూప రమణి గాంచె.

వ. కాంచి జానకీదేవి ఇట్లు వగచుచున్నది.

ముఖారి: ఆదితాళము.

నీకు బ్రహ్మ యిటుల వ్రాసెనేమో! శోకము నిలుపఁజాలను రాఘవ! ॥నీకు॥ ప్రాకటతల్పము - పాపమని యుంచురు! నీకుబంధక మాయెను! రాఘవ! ॥నీకు బ్ర॥ వెలయగ గాన్నికవిద్య యేమాయె! దైత్యులకు లోబడవలసెను! రాఘవ! ॥నీకు॥ దనుజులఁ బోరిగొని నను జెఱబాపెద ననియుంటివి నది తప్పెను! రాఘవ! ॥నీకు॥ అంత మెవరు మోక్షగుండనాయక! నే నకటా దురదృష్టురాలను! రాఘవ ॥నీకు బ్రహ్మ॥

వ. అని బహువిధంగుల విలపించు సీతను గాంచి త్రిజట యిట్లనియె:

చ. భయపడనేల నీపతికిఁ బ్రాణభయం బిసుమంత లేదు; ని
శ్చయముగ రాక్షసాధములఁ జంపగఁ బుట్టినమేటి యెవ్వ రేం
తయు, జెనకంగఁ జాల్వడరు! దానవమాయలుమాపి నిన్నునీ
ప్రియుఁ డనురక్తిఁ గౌఁగిట భరించెడి; నైపును తల్లి! మేలగున్.

వ. ప్రాణంబులు వాసిన వనచరు లింత చింతదక్కియుందురా! కర్మసంచిత మిట్లుండి కొంచెము చిక్కువడిరి! కాని వెఱవవలదు. అని సీత నశోకవనమునకుఁ జేర్చె. నిక్కడ రాముండు గొంతవడికి గన్నులు దెఱచి పాశబద్ధుఁ డయియున్న తమ్ముని విగతజీవునిఁగా నెంచి.

అసావేరి: అటతాళము.

కొమ్మను సాధించుకొన వచ్చె సుగ్రీవ! తమ్ముని గోల్పోవల సెఁగా! నే నిచట నమ్మతి నాసేవ సలుపుచు జనుదెంచె! సౌమిత్రి గుణ మెన్నఁజాలా యీవేళ॥కొమ్మను॥ తల్లి సుమిత్ర నాతనయు డేడని

యోగిపాలనమ్ భోగిశాయినమ్ నాగపోషణమ్ నతజనావనమ్॥ కో॥ ధారాధరశ్యామలగాత్రమ్ నారాయణకవివినుత చరిత్రమ్ సారస నేత్రమ్సజ్జనమిత్రమ్ ధరాస్తోత్రమ్ దితిసుతజైత్రమ్॥ కోదండ॥ పక్షీంద్ర గమనమ్ సురపాలమ్। మోక్షగుండసత్పురవర ఖేలమ్ అక్షరశీలమ్ ఆశ్రితజాలమ్ అనుపమఫాలమ్ అబ్జాలోలమ్॥ కోదండ॥

ద్విపద: అని యిట్లు చనుదెంచి యానారదుండు

మనుకులపతికి సమస్కృతిఁ జేసి,

దేవర వారికి దెలియని దేది!

రావణు జంపు కారణమున ధరణి

నరుఁడవై పుట్టిన నారాయణుఁడవు

కర మర్థి నజ్ఞానికరణి బల్కెదవు!

లోకులచిక్కులలోఁ జిక్కుబాపు

నీకు జిక్కులు గల్గునే యేటిమాట!

అదె చూడ నీయవయవములయందు

పదునాల్గు భువనముల్ ప్రబలియున్నయవి!

సర్వంబునీవె నిశ్చయ మగుసుమ్ము!

పూర్వపువాహనంబును స్మరింపు

వైనతేయుఁడు దాన వచ్చినంతటనె

యీనాగపాశంబు లెల్లను వదలు

నటుచేయు మని చతురాస్య నందనుఁడు

పటుమతి దీవించి పాఱెను దివికిఁ

బిమ్మట రాముండు వెనుకటిరూపు

నెమ్మదిఁదలపోసి నిక్కమూహించి, —

తో: గరుడుని దలచిన క్షణమాత్రములో నరుదెంచియు వాఁ లను। స్థిరముగ బంధించిన యురగంబులఁ దఱిమి దాఁటెమేరలను॥ రా

క. అంతట వానరు లెల్లను
సంతసమున మేను మఱచి చారులవలనన్
వింతగవిని దశకంఠుఁడు
పంతంబున ధూమ్రునయనుఁ బంపెఁ గలనికిన్.

వ. రాక్షసభటులు లక్షోపలక్షలు గొలువ ధూమ్రాక్షుండు తత్క్షణంబున రావణానుజ్ఞచే యుద్ధంబునకు వెడలి.

ధూమ్రాక్షయుద్ధము.

తో: పటపటార్భటులదిక్తటములు బెటిలి పడగ నరదంబుఁ। దటుకునఁ బఱపుచు బటహాభేరితమ్మట మృదంగరావంబు। రా॥

వ. చెవులు బీటలువాఱ మ్రోయుచుండ రణభూమికిఁ జేరి వానరులఁబొదివి,

కీర్తన: ఆదితాళము. (మాతాన) వలె.

మానవుల గూడి మీరు మమ్ము గెలువ వచ్చినారు! కానిలే చూతము రండిక॥ ఓకోతులారా!॥ మానుగ నాపైకి లెండికఁ, గొండలు నడవులు దిరిగి పండ్లుకాయలను దిని యుండినట్టి పనులు గావివి। ఓకోతులారా॥ గుండెపగులు యుద్ధభూమిది॥ మోక్షగుండదేవుడైన ముట్టడింపఁగలడె మమ్ము! రాక్షసు లనుచు దెలియరో! ఓకోతులారా! యీక్షితిగూలుట గానరో.

వ. అని పలికి శరపరంపరలు పఱపినఁ, దరుచరులు సరకుగొనక దరుగిరులచే వానిని విరిగింపుచు వీరు వారుఁ బోరుచుండిరి. అంత హనుమంతుండు ధూమ్రాక్షుని గదిసి శంకరధనుష్టంకార మొనర్చినఁ, బంకజాప్తకులుని కింకరులగు మావంకకు నిశ్శంకుఁడ వయి వచ్చి పెంకెతనపు బింకెలేల? బింకంబు మాని లంకకుఁ జేరుము. వంకరటింకరమాటలాడిన సీతల పెంకులు పెంకులు చేయుదునురా కుంక! యారౌర! నీ కింతమంకా! అనియొక్క మొత్తు మొత్తినఁ దత్తరంబు నొందక—

తో: గదచే మోదిన జెదరక మారుతి కరమున నొకగిరి బూని। గదిసి వైవ రాక్షసుని మస్తకము పిదిలి కూలె ధరపైని॥ రా॥

వ. అంతకుముందే వానిభటులు వానరులచేతఁ జచ్చిరి. హతశేషులవల్లన నీవార్త విని రావణుం డకంపనుని బంపిన,

అకంపనయుద్ధము.

తో: విలయకాలుఁడో! యిత డని వానరవీరులు గనుచుండ గను। బలముల గూడుక పరతెంచె నకంపనుడు రణము చేయగను॥ రా॥ వచ్చిననాతని భటవర్గంబులు చచ్చి పడగ వానరులు। చెచ్చెర మోచుక వచ్చియు వైచిరి హెచ్చుగ దరువులు గిరులు॥ రా॥

క. ఉప్పరవీధికి నెగియుచు
నప్పు డకంపనునిపయికి హనుమంతుఁడు దాఁ
గుప్పించి దుమికి పొడిగా
గుప్పున రథరథ్యములను గూలిచి పలికెన్.

వ. నిలింపులగుంపులు గుంపులుగాఁ దఱిమినట్టి తెంపుఁ జూపింప నంపులు చేయుచు వచ్చితివి. నీసొంపు వదలించి నిన్నుఁ జంపి దక్షిణంపు సామి కొంపఁ జేరఁ బంపనా! నీమంప దెంపనా! యోరి యకంపనా! యని యొక్క కొండతో మోదిన, గుండె పగిలి యాతండు గూలె. ఆ సంగతి యెఱింగి దశముఖుఁడు—

మహాకాయుని యుద్ధము.

క. తనతనయు మహాకాయుని
నని కేగు మటంచుఁ బంప, నాతఁడురోషా
ననుఁ డగుచు భటులు మంత్రులుఁ
దనవెంబడిఁ గొలిచి రా నుదగ్రత వెడలెన్.

వ. ఇట్లు వెడలి మహాకాయుని మంత్రులగు రుధిరాశన వజ్రనాభ కాలదంష్ట్రి కాలకల్ప పాపక శతమాయు ధూమ్రి దుర్ధరులను

వారు క్రమంబున బృథు పనస మేఘపుష్ప గవాక్ష ఋషభ గజ క్రోథన శతబలి తారులఁ బొదివి,—

తో: శరవర్షంబులు గురిపించుచు భీకరముగ సమరము జేయ। నరిమురి నవి లక్ష్యము జేయక తరుచరులు గిరులు గొని వేసిరి॥రా॥

వ. రాక్షస మంత్రులు బీరంబులు సెడి ఇలఁ గూలిరి. తక్కిన భటులు వానరసేనల నెదిరించి హతులయిరి. అది గని మహాకాయుని తమ్ముఁడు మహానాథుఁ డట్టహాసంబుఁ జేసిన, వానిదెబ్బలకు వానరులు భీతిల్లిరి, అప్పుడు నంగదుం డెదిరించి,

కమాచ్: రూపకము. (పేటాడడము.)వలె.

వడి జూపకుమా నీదు వడి॥ వడిజూపకు మల్లదె మీవారలగతి జూచుచుండి మిడుతలు బావకునిమీద నడచినగతి నరుదెంచితి॥ వడి॥ శిక్షింపగనూ మీచేగా దికను; మోక్షగుండదేవు కృపావీక్షణమున సంతత రణదక్షుల మగుదుము; బోరగ రాక్షస, నీ వెంతర! నీ॥ వడి॥

వ. అని పలికి భీకరముగు నొకమారికు చేకొని యొక్క దెబ్బ దీసినం గేకవేసి యతండు కూలె. అంత మహాకాయుండు దమ్ముని చావుఁ గని రోషానల జాజ్వల్యమాన మానసుండయి కపిసేనపయి రథమును బఱపె.

పంచచామరము.

అరణ్యభూములందుఁ గాయ లాకు లారగించుచుం
జరించువానరుల్ నరుల్ ప్రశస్తవీరు లట్ల దీ
వరంబుగా రణంబుఁ జేయ వచ్చినారు మేలునా
శరాళికోర్చి యుండు డంతె చాలు మెత్తు మిమ్ములన్.

వ. అనినఁ వానరులు—

ఉత్సాహ.

మిట్టిపడ్డ సోదరుండు మృత్యువాతఁ జిక్కఁడే!
వట్టిపొట్ట క్రొవ్వుమాట వాఁగ వీరధర్మమా!

గట్టివాఁడ వంటిన నిలువు కదన రంగమందు నిన్
మట్టిసేతు నొక్కసారి మర్మములఁ గలంచుచున్.

వ. అనిన వాఁడు మహాగ్రహా సమగ్ర విగ్రహుండయి పెక్కు మ్స్త్రులు ప్రయోగించె. కొంచెమునే పోర్చియు సైరింపలేని వానరుల నిలువరించి యంగదుం డొక్కగ్రుద్దు గుద్ది,—

కీర్తన: ఆదితాళము - (నీ వను) వలె.

నిను మడియించెద నిలువుము! ఘనముగ నావడిఁ గనుము కనుము॥ నిను॥ దనుజుడ మీతండ్రినిమాజనకుడు మును వార్ధులలో ముంచెను గదరా॥ నిను॥ అటువలె నావాలాగ్రంబున ని న్నిటు బంధించెద నిలపయి మోది॥ నిను॥ మోక్షగుండపతి ముఖ్యభటుల మాని। లక్షింపక యేలర చెడిపోవ॥ నిను॥

వ. అనిన దానవుం డాగ్రహించి గదతోఁ బొడిచిన గదాయుద్ధంబునఁ గొంతవడిఁదమలాఘవంబులు సూపి యాతటఁ బోక మల్ల యుద్ధంబునకుఁ జొచ్చి పెనంగుచు దానవుం డెన్నిమాయలు సేసినను లోఁబడక వాలినందనుండు—

తో: కడుబెట్టిదముగఁ బిడికిటఁ బెడతల నడిచినమాత్రమె యపుడు।దడయక దల బద్దలుగా బగిలినఁ బడియెను నారక్కసుఁడు॥ రా॥

వ. అనంతరము వానరులు జయజయశబ్దంబుల నంగదు నగ్గించి రామునిఁ జేరి నమస్కరించిరి. రాముండు గౌగిలించుకొని దీవించె.అంత హతశేషులవల్ల విని కొడుకుల మరణమునకు రావణుండు గొంత చింతించి ధైర్యంబుబూనియేగినపిదపఁ బ్రహస్తుని బిలిపించి యిట్లనియె;

కీర్తనఃఆటతాళము.

రామునిసేనల రణమున నెదిరించి రాశైరి మనవారలు! యేమి యోజించెద! నికమీద యుద్ధమున కేతెంచె దేశూరులు॥ కలన నీవును నేనుఘట కర్ణుడును దక్క నిలిచేవా రెవరూ సఖా! నెలకొని తమ్ముడు

నిద్ర లేవడాయె! నీవు నే నున్నామిక॥ దీక్షతో నీ వేగుదెంచెదవో! నే నేతెంతునో! తెలుపు మిక మోతుగుండేశుని మొనలతో బోనీక శిక్షించి వత్తామిదె.!

—♦ ప్రహస్తునియుద్ధము.

వ. అనిన నతం డిట్లనియె:

శా. నే నేతెంచి విరోధియూథముల భంజింతున్ విచారింపఁగా;
దైనన్ నే నొకనీతిఁ దెల్పెదను నీ వాలింపు మే లౌత! మీ
చ్చో నాజానకి నిచ్చితేని గరుణించున్ రాముఁ డ! ట్లొప్పదే
నా, నాతం డని కాహుఁ పొ మ్మనఁ, బ్రయాణంబై బ్రహస్తుండాగెన్.

వ. ప్రచండవేగంబున వేదండ తురంగ తండంబులతోఁ గదలి కోదండంబునఁ గాండంబు లఖండంబుగాఁ దాల్చి సముద్దండ దండధరుండునుంబోలె భండనమండలంబుఁ జొచ్చి కపిదండుల బెండువడఁజేయుచుండ నీదండిమగం డెవ్వాం డని కోదండరాముం డడుగ విభీషణుం డిట్లనియె:

తో: రావణుమాతులుఁ డీవచ్చెడివాడు! రామ! ప్రహస్తుం డితడే!। వావిరి దద్భటవర్గమునకు దళవాయి యగును నీఘనుఁడే॥ రా॥

వ. అని తెలుపుచుండ నతండు వానరసేనలను మార్కొని తన మంత్రులు భటులు మృతినొందుటఁ గాంచి యలిగి యందఱిపైని గ్రమంబున బాణంబులు పఱపి పేర్చియార్చుచు,

పంచచామరము.

ఆహా ! రణంబులందు శాత్రవాళి దాకి పోరుచో
సహింపలేని పిన్నవారిఁ జంపి పెంపుఁ జూపుచున్
అహంకరించియున్నవార లట్లుగాదు శూరుఁడౌ
ప్రహస్తుఁ డీతఁ డడ్డగించి పాఱిపోక నిల్వడీ.

వ. అనిన సత్యాగ్రహంబున నీలుం డెదిరించి యిట్లనియె:

పంచచామరము.

అరే ప్రహస్త! నిన్ను నీవె యాత్మ మెచ్చుకొంచు భీ
కరంబుగాఁ గరంబు నీ ప్రగల్భ జాల మాపు! నీ
తరంబుగాదు! రమ్ము నీప్రతాపమెల్ల నొంచి సు
స్థిరంబుగా యమాంతికంబుఁ జేర్తు నోర్తు నేఁ డిటన్.

వ. అనవుడు వాఁడు వాఁడిగల బాణంబులు ప్రయోగించె. వానిఁ ...చి కొని.

తో: నీలుడు రక్కసు నెత్తిన బడ నొక శైల మెత్తి వేయగను। ...డు ధరపయి గూలలు సేయుచు మేలని సురలెన్నగను॥ రాము॥ అది రావణుఁడద్భుతపడి తనమదిలో వగచియు దెలిసి। కదనమునకు నేఁ మానవుల మద మడగించెదఁ గదిసి॥ రామ॥

వ. అని సర్వాభరణభూషితుండయి ప్రయాణం బగుచుండ ...దరి కొలువుకూటంబునకు వచ్చి భర్తకు నమస్కరించి యిట్లనియె

జంఝూటి: త్రిశజాతి. (ఎవ్వాడు కాని) వలె.

నీ కింతపంత మేల నో కాంత! రఘువరుఁ జాల శ్రీకాంతు ...లు వేల; యేకాంతమున మేల జానకీకాంత జెరబట్టుట! ఇటుల నా ...కులు ద్రెళ్ళి రక్కసా! భూమిపై నికు నిల్వ జాలగా ॥నీకింత॥ ...రించి చసనవారు నొకరైన దిరిగి రారు! ఇక బోయి బ్రతుకువార లెవ్వరును, లేరు! చెప్పుటకు భయపడుచుందును! మనసు వికల నొందింపబోకుము; తిన్నగా యోజించి చూడుము॥ నీకింత॥ ధర ...గుండవిభుడు నరు డెన్నటికి గాఁడు; పరమాత్ముఁ డనుచు జూడు? ...జ నిడి వేడు నీవు శరణన్న రక్షించును. జెడినతరువాత బాగౌనె ...ను! ఇప్పుడే శోక మార్పుము॥ నీకింత॥

వ. అని బహుభంగులఁ బ్రార్థించిన వినక కోపించి రావణుండు-

గీ. కోఁతులను గూడి వచ్చిన రోతనరుని
గొలువఁగాఁబొమ్మ్ము పొమ్మని పలుకు టెంత
పలుచదన మగు! నానేర్పు దెలిసియు నిటు
పరుల నాముందు గణియించి పలికె దహహా!

చ. సురలనుగెల్చినట్టి రణశూరుని నన్ బెదరింప నేల! నా
నరుల విభీషణున్ దరణినందను మర్కటులన్ జయించెదన్
వెఱవకు! గెల్వ లేని యెడ వీరరణంబునఁ బోరి చచ్చి యా
పరమపదంబుఁ జూఱఁగొని భవ్యయశంబు గడింతు భామినీ!

వ. అనిన, నతని నిశ్చయం బెఱింగి విధికృతం బని యెంచి, అంతఃపురమున కేఁగుచుఁ దోడిసఖులతో నిట్లనుచున్నది.

హిం. తోడి: అటతాళము.

ఏ మని పలుకుదు! నెవ్వరి వేఁడుదు! కామిని! చెడిపోవు కాలము వచ్చెను॥ నే॥ సామజగామిని, నైపుఁజూల తొలి బాముల నోచిన నోము ఫలంబున॥ కేను॥ తగ మోతుగుండధాముసితోడఁ బగ బూనినాడు బ్రతుకగ నౌనటే!

వ. అంత రావణుండు యుద్ధసన్నద్ధుండయి,-

రావణప్రథమయుద్ధము.

క. పదితలలఁ గిరీటంబులు
పొదలగ శస్త్రాస్త్రసమితి పొందుగఁ దసయి
ర్వదికరములందుఁ దాలిచి
యుదయార్క ప్రభల వెలుఁగు నొకరథ మెక్కెన్.

వ. ఇటుల నెక్కి చతురంగబలసమన్వితుండయి చనుచున్నను,

తో: కరిబృంహితములు తురగ ఘోషములు సరదంబుల రావములు। మురజపటహభీకర కాహళరవములు సద్భట రావములు॥ రా॥ కలిసి దిగంతంబులు భేదించి యుఁ గగనలభ వాండము వగిలె। చెలగ రణస్థలిఁ జేరి రావణుఁడు నిలిచెను ధైర్యము మిగిలి॥ రా॥

వ. అతని విభవంబుఁ గని యాశ్చర్యంబున నితఁడెవ్వఁ డని యడిగిన విభీషణుండు రామున కిట్లనియె:

హిం-కాఫీ: రూపకతాళము. (ఇంతిరో విన) వలె.

రావణుఁ డతఁడే! రాఘవ! మాయన్నయయిన॥ రావ॥ దేవతలను బాధించుచు దిగ్విజయము గావించిన॥ రావ॥ పాతకుఁ డతఁడు; నీతి యింతయేనిఁగ లేఁడు; ఖ్యాతిగ మి మ్మేమరించి సీతను చెఱబెట్టినట్టి॥ రావ॥ ఈక్షితి వీని శిక్షించిన వెనుకను గాని మోక్షగుండవాస లోకములకు మేలుగలుగదయ్య॥ రావ॥

వ. అని తెలుపుచుండునంతలో రావణుండు వానరసైన్యంబుల పయిఁ దీక్ష్ణబాణంబులు నెడపక వేసి చిందరవందర చేయుచుండ, సుగ్రీవుండు రోషించి,

క. ఒకకొండయెత్తివైచినఁ
బ్రకటితముగ దాని నడుము బాణంబులచేఁ
శకలములుచేసి మఱి వే
ఱొకశరమున నినజు మూర్ఛ నొందఁగ జేసెన్.

వ. అది గని హనుమంతుండు రోషతామ్రాక్షుండయి రథంబు పయికి లంఘించి,

పంచచామరము.

ధరాకుమారిఁ జూచి క్రూరదానవాళిఁ ద్రుంచినీ
పురంబుగాల్చి నిన్నుఁ జంపఁ బూని నాఁడుమానితిన్
శిరంబులెల్లదుల్ల నేఁడు చేతు బ్రహ్మదత్తమౌ
వరంబులెల్ల నీదినంబె వాఁగుపాలు గావలెన్.

వ. అని బెదరించి పటుతరముష్టిచే వక్షంబున నొక్కపెట్టునఁ బొడిచిన రథంబుపయి మూర్ఛిల్లి వెంటనే తెప్పిరిల్లి చుఱచుఱఁ జూచుచు,

తో: కడువడి మెచ్చితి గదరా బలవంతుఁడ వని దశముఖుఁ డడవఁ। బెడిదంబగు తన పిడికిటిపోటునఁ బడియెను మూర్ఛిలి దిగువ॥ రా॥

వ. హనుమంతుండు మూర్ఛఁబోయిన రావణుఁడు నీలునిమీఁదికి రథంబుఁ బో నిచ్చి,

పంచచామరము.

తటాన నన్ను దాకిపోర దర్పకారి కైన మ
ర్కటాధమా! తరంబుగాదు రమ్ము పాటిసేకనీ
పటుత్వ మెల్ల గాంచి రామభద్రుఁ జేరఁ బోయి ది
క్కటంబు లార్వ నేఁడు మత్ప్రతాపఁ మెల్ల జూపెదన్.

వ. అనిన,

తో: నీలుడు కోపాన్వితుఁడై యొకనున శైలశృంగమును వేయఁ। బోలఁగ నాదశ ముఖుఁడు నడుమనే పొలియఁజేసె నంతుఁడాయ.

వ. పెల్లార్చి నీలుండు రావణురథంబుపయి కెగిరి మకుటంబులు జెదరున ట్లూచి ఛత్రచామరంబులు చూర్ణంబుఁ జేసి హారంబులు దెగదీసి రథంబు విఱుఁగునట్లు గదిలించి, యనేక విధంబుల భంగపఱచఁ గోపించి,

తో: అనలబాణమున నాతనిపై చిన నదిశిగిలెన మాత్రమున ! మునుకొని నీలుఁడు మూర్ఛిల్లుటఁ గని కనలి లక్ష్మణుఁడు కలన॥ రా॥

లక్ష్మణ-రావణ సంవాదము పాట: రూపకము.

ల॥ నన్ను గెలిచి పోవరా! దానవకులాధమా! పన్నుగ నాబాహు బలము బరగఁజూడుమా॥ నన్ను॥

రావ॥ పిన్నవాఁడ వెదురలేవు బీర మేలరా! అన్న మఱుఁగు జేరుము నీ కంతె చాలుర॥ పిన్నవాఁడ॥

ల॥ వాడిగలుగు బాణములు వచ్చి నిలుపుమా! నేఁడిపోక నిబ్బరముగ నుండ శక్యమా॥ నన్ను గెలిచి॥

రావ॥ నేఁడు మోక్షగుండవిభుఁడు చూడ జూపెదన్ నూడిచేసి బాణవహ్ని ముంచి వేసెదన్ ॥పిన్నవాఁడ॥

వ. అనిన, గోపోద్దీపితుండయి లక్ష్మణుండు నిలువరింప నశక్యంబులగు బాణంబులు రావణుపయి వైచిన, నతడు వెఱఁగంది బ్రహ్మదత్తం బయిన యొక్కబాణం బెక్కువెట్టి.

తో: ఉరము దాకునటు గురిగా వైచిన నరిగి తగుల లక్ష్మణుఁడు। సొరిగి లేచి బిరబిర రావణు విలు నఱికి భయదమై నెగడు॥ రా॥ మూఁడమ్ములు దశముఖుని వక్షమున గాడ నేయ మూర్ఛిల్లి। వాఁడు దెలిసి తీవ్రంబగు శక్తిని వైచెలక్ష్మణుని మళ్ళి ॥ రా॥

గీ. శక్తిదాకి మూర్ఛ సౌమిత్రి మునిఁగిన
నెత్తఁబూని దనుజఁ డెత్తలేక
యద్భుతంబు నొంది యట నున్నహనుమంతుఁ
డంతమూర్ఛ దెలసి యాగ్రహించి.

తో: వచ్చి రావణుని వక్షము పగులగ వడిగాఁ గుద్దుటవల్ల। జచ్చెఱ నటుమూర్ఛిల్లి పడియె సుర లచ్చెరు వందిరి మెల్ల॥ రా॥

వ. ఆంజనేయుండు రామభక్తుండు గాన జులుకనగా లక్ష్మణు నెత్తుకొని పోయి రామునిముందటఁ బెట్టె రాముని తేజః ప్రభావమునకుఁ బరాజితమై శక్తి దొలంగె. లక్ష్మణుఁడు మూర్ఛదేఱె మఱియు;

క. రావణుఁడు మూర్ఛదెలిసియు
వేవేగమె కపులపైకి వెడలఁగ, వారల్
చేవచెడి యురకఁ గని సీ
తావిభుఁ డవలించి పలికె దశముఖుతోడన్.

### రామ-రావణుల ప్రథమయుద్ధము.

రామ-కీర్తన: ఆదితాళము. (ఛీకరగతి.) వలె.

ఓరోరి రారా కోరికదీర దీరుగ నినుబోర నేరుపుమీఱగ నేటికి సనుకూరె, బోరున ముట్టి ధీరతబట్టి సారెకు గొట్టి చంపుదు జలపట్టి॥ యో॥ భండననిపుణ కోదండాదిదీక్ష పండితుం డను, మోక్షగుండ

విభుండను, దండిగ నీతలల్ ఖండింతు; నసురుల దండింతు, గండలు జెండింతు; రణభూమి నిండింతు రక్తము॥ ఓరోరి॥

వ. అనుచున్న సమయంబున హనుమంతుండు గరంబులు ముకుళించి,

తో: రాఘవ! దనుజుడు రథము నెక్కియు రణ మొనరింపను రాగ। లాఘవమున గాల్నడ నుండుట పోలదు నన్నెక్కుము వేగ॥ రా॥

వ. అనిన హనుమంతునిపై నెక్కి రామ-రావణులు గోపాటోపంబునఁ బరస్పరబాణప్రయోగంబులఁ దమ నేర్పులు గనఁబఱుచుచున్నంత,

తో: ఒక్కబాణమున రక్కసువిల్లు బుటుక్కున విఱువగ నతడు ॥ దక్కక మఱియొకధనువున శరసంధానము జేసియునపుడు॥ రా॥ తటుకున ననిలజు నిటలము దాకగ దద్దయు వైచిన గాంచి। చటులాగ్రహమున జానకీశు డొకశరమును నడి సంధించి॥ రా॥

వ. రావణు కోదండంబు ఖండించి రథంబు నుగ్గుసేసి రథ్యంబులఁ జంపి సారథిని గూర్చి,

తో. అనువుజూచి శరమను సంధింపగ నతనిమకుటములు విఱిగి। తునిఁగి కిరీట స్థగితమణులు ధరఁదొరగిన నాతఁడు గలఁగి॥ రా॥

వ. అప్పుడు రామచంద్రుం డనుచున్నాఁడు:

క. రావణ, నీ వెక నింటికిఁ
బోవుము! వానరులతోడఁ బోరి బడలియు
న్నావటు గావునఁ, జంపక
వే విడిచితి నన్న, నతఁడు విన్నఁదనమునన్.

వ. పాదచారియై వానరులు నవ్వుచుండఁ దలలు వంచుకొని గరుడునిచే విడువఁబడిన యురగేంద్రుని పగిది లంకలోనికిఁజని కొలువుకూటంబుఁజేరి ఖేదమందుచు రాక్షసుల కిట్లనుచున్నాఁడు:

హిం. తోడి. రూపకము.

ఏమిచేయుదు నకటా! యెటులనోర్తును రాముని వశముగాదు! తలఁపగ॥ యేమి॥ వన్నెగాంచితి బాహ్విభవమున మించితి! నన్ను నెదురలేరు త్రిభువనములు వెదకిన॥ నేమి॥ నాదుశౌర్యము నేఁడు నాదుధైర్యము మేదిని బడిపోయె దెలుపరాదు నిక్కము॥ ఏమి॥ ఒక్క నరునిచే నయ్యో! చిక్కగవలసె! నెక్కడినరుడు మోక్షగుండాధీశుడు! దెలిసె!॥ నేమి॥

వ. బలవంతులయిన ప్రహస్తాదులు మడిసిరి! ఇంక నామానవుల నెదిరించువా రెవ్వరు? కుంభకర్ణుండు తొమ్మిది దినంబులనాఁడు లేచి నాతోఁ గొంత ప్రసంగించి మరల నిదురించినాఁడు. మీ రతని లేపు కొని రండు! నాతమ్ముండుగాని వారల జయింపను బొండుఅనవుడు,

తో: కుంభపుగూళ్ళను గుసుమగంధములు గొనిరాక్షసు లరు దెంచి। కుంభశ్రవణుఁడు గూరికియుండిన గుహాలోన బ్రవేశించి॥ రా॥

వ. గంధపుష్పాక్షతలచే నతనిఁ బూజించి ధూపదీపంబు లిచ్చి, తాము గొనిపోయిన వరాహమహిషాది మాంసంబులును షడ్రసోపేతాన్నంబును రాసులుగాఁ బోసి, యింద్రాదుల నెల్లఁ బాలియించు మన్నట్టు గలకని కలవరించుచు మహత్తరమైన యుచ్ఛ్వాసనిశ్వాసంబులతో భయంకరాకారుఁడై పడియున్న నతనిగాంచి, యక్కటా! యింతబలవంతున కిట్టి నిద్రావస్థచే మునుంగవలసినట్టు విధాత లిఖించెగదా! ఎంతయన్యాయ మని దూఱుచు జయజయశబ్దంబుల నగ్గించుచు నంద ఱొక్కపెట్టున జగంబులు దల్లడిల్లునంత ధ్వనులు గలుగ నఱచుచు,—

కీర్తన: ఆదితాళము—(ఓరామరామ) వలె.

లే లెమ్ముకుంభకర్ణ లెమ్ముదేవరా! నిద్ర॥ లేలె॥ ఆలమ్ములో నమరాళి దిక్కులఁ దోలి కలఁచియు। సోలించునంతటి మేటిశూరవరుడవు॥ లే॥ అన్న రావణుఁడు బిలువు మన్నవచ్చినాము; లేచి పన్నగ

నాస్థానమునకు బరుము దేవరా! ॥లే॥ మోక్షగుండస్వామి పురము ముట్ట
డించియున్నవాడు! దక్షుఁడవై పోయి వానిఁ దఱుము దేవరా!॥ లేలెమ్ము॥

వ. అని వేఁడిన మిన్నకుండి,

తో: సారమైన నిస్సాణపటహములు భేరులు గడు వాయించి।
చారుతరం బగు శంఖంబులును దుతూర తెలమి బూరించి॥రా॥

వ. నిద్దుర లేవకుండినఁ బట్టిస భిండివాల గదా ముసల ముద్గ
రాదులు గొని యందఱు మూఁగి యొక్కపరి విసిరి వేయుచుఁ, బది వేల
కుంతములచేతఁ బఱులకు బట్టించి పొడుచుచు, గొప్పకొండ లనేక
ములఁ దెచ్చి వైచుచు, మీఁది కెక్కి సత్వంబు మెఱయఁ గాళ్ళతోఁ
ద్రొక్కుచు, వేధించియు మేలుకొలుపలేక, పిమ్మట—

తో: సింహనాదములు సేసి బిట్టుగాఁ జెవులు పగులగా నఱచి।
సింహగజాదులచేఁ ద్రొక్కించియు జందఱవందఱ బఱచి॥రా॥

వ. కోలాహలంబు గావించిన నాధ్వనికి లంకగగ్గోలు పడియె.
వానరు లందఱు దివిని భయభ్రాంతచిత్తులై యుండిరి. అప్పటికిని
లేవకుండిన—

తో: కొందఱు గర్ణములందు దూఱి చని గూబలఁ బండ్లను
గఱచి । కొందఱు గరములఁ గురులు పట్టి లాగుచు గాలి సేతులు
విఱచి॥రా॥ ।

వ. అమితముగాఁ బాధించిన నెట్టకేలకు గొంచెము కదలి
యావులించిన మహాగ్నికణంబు లపరిమితంబుగా వాగ్ద్వారంబున వెడలె.
నది గని రక్కసు లొక్కరితో నొక్క రక్కరణి ననుకొనిరి.

కమాచ్: ఆదితాళము.

చాలింపఁ బోకుడు సారించి లేపుడు॥

మించి మనము బొర్లించి లేపి కదలించుటచే నావులించినాడు॥
చాలింప॥ క్రమ్మఱ నిద్దుర గ్రమ్మిన లేపఁ దరముగాదు కార్యమ్ము

చెదును॥ జాలింప॥ ఈశని లేపక యేగితేని మనయాతుధానపతి చేత మాట॥ చాలింప॥ కదనంబున నీఘనుఁడు మోక్షపురసదను నెదురఁ గలఁడిది నిక్కము॥ చాలింప॥

వ. అని చెప్పుకొనుచు నలసటలేక యినుపమోకులు దెచ్చి కీళ్ళు కీళ్ళు విఱిచికట్టి,

క. వేయిఘటంబుల తైలముఁ
బోయక చెరలంగఁ గాచి పటుకారులచే
నాయతబలులై పట్టుక
పోయియుఁ జెవిగూబలందుఁ బోసిరి సరగన్.

వ. ఇనుపగడ్డపారలు దెగఁ గాలిచి ముక్కురంధ్రంబులఁ జొప్పించిరి. ధణంధణధ్వనులతో ననేక భేరులువాయించిరి. కల్లోలంబు గావించిరి. అతండు శేషాహిసమానోగ్రకరంబులు సాచి నీలిగి వికృతంబుగా నోరుదెఱచి యావులించి,

క. ఈనిద్రయేల రాముని
నే నెదిరించినను దీర్ఘనిద్రాసుఖమున్
దాననుభవింపఁ దలఁపే
మో నా, నవ్వాఁడు నిదుర ముదమున లేచెన్.

వ. ఇట్లులేచి కూర్చొని ప్రళయకాలాగ్నితో సమముగా నేత్రంబులయందుఁ గెంపుగదుర నిట్టూర్పులు విడుచుచు దానవులఁ గాంచి,

కీర్తన: ఆదితాళము-(ఏదిరారౌరి) వలె.

ఎవరు లేపిరి! న న్నెవరు లేపిరి! దివిజపవనగుల దిక్కులువాఁగల, జెవిగూబలగల రవములు మిగుల॥ నెవరు॥ మున్న నే లేచి మాయన్నను జూచి, మన్నన వడసి మఱినిద్రమురిసి పన్నుగ వచ్చి పండితి సొలసి॥ యెవరు॥ ఏమికార్యము మీకెంతధైర్యము! శ్రీమోక్షపురస్వామితో వైరమేమాయెఁ జేర నేటికి? స్వైర॥ ఎవరు॥

వ. ఇనిన రాక్షసు లకుంఠితరణోత్కంఠ రిపుగజ లుంఠనాదృత కంఠీరవుండగు దశకంఠుండు దోడుకొని రమ్మన లేపితిమి. కుంభకర్ణా! అనంత ధైర్యసంపూర్ణా! యనిన, మంచి దని యాతఁడు కాంక్షతోఁ బాఱఁ జూచిన నాక్షణంబున—

క. ఎనమున్నూరజముల మఱి
యెనుబది మహిషములఁ నింక నిరువది యొకరన్
మనుజులను వేవరాహము
లను నాలుగువేల శశములను వేర్వేఱన్.

వ. ఖండించి పాకముఁజేసి తెచ్చి రాసులుగాఁ బోసిరి. అమాంసంబుఁ గడుపాఱం దిని రెండువేలకుండల మద్యంబుఁ బానంబు జేసి,

తో: పటపట దిక్కులు బగులునట్లుగా పండ్లుగీటి తీవ్రమున। దిటవుగ జుట్టున దీర్ఘశ్మశ్రులు, దిద్దివికృతరూపమున॥ రా॥

వ. వెడలివచ్చి రావణుని కొలువుకూటంబుఁ జేరె. రావణుఁడును సంతోషించి హేమపీఠంబునఁ గూర్చుండ నియమించి యిట్లనియె:

హిం. కాఫి: రూపకము. (శివశివ వినుమా) వలె.

సోదర, వినుమా మేదిని శ్రీరాముఁ డను రాజు గలఁడు॥ సోదర॥ సోదర మర్కటయుతముగ మోదంబున మననగరము ముట్టడివేసె నతండును॥ సోదర॥ వారల నెదిరి, వారక మనవారలు బహుమంది చెడిరి! వారల॥ లేరు వీర నీవు దక్క! శూరు లెవరు మోతుకుండ శ్రీరాముని నెదిరింపగ॥ సోదర॥

వ. కాఁబట్టి నిన్ను లేవఁ గొట్టించితి. యుద్ధయాత్రకు వెడలుము. అనుడు నవ్వి యతం డిట్లనియె:

ఉ. నారదమౌని తెల్ప విని నాఁడ రమాపతి రాముఁడై ధరా
భారముఁ బాప సూర్యకులపావనుఁడై యుదయించు నంచు నా
తీరునఁ బట్టియుండ నగు! దేవమయుం డతనిన్ భరించు నా
శేరి! జగత్త్రయంబున జయింపఁగ నాతర మౌనె యగ్రజా!

తో: మనచేఁ గాఁగల పనిగా దిది; నీవు మనవలె నని తలఁచి నను। జనకజ నిచ్చియు శరణుజొచ్చురాముని కన గనలుచు ననెను॥ రా॥

కానడ: రూపకము.

పోరా యిారోతకూత లేర చాలురా! విన నొల్లర!॥ పో॥ ఆరాముఁ డబ్జనాభుఁడైన నేమి! మర్కటులు సురారులైన నేమి! వారు శూరులే! సెబాసు మనకన్నను॥ పోరా। యుద్ధం బొనరింపఁగ సన్నద్ధుడవై పోక నాకు బుద్ధులు గఱపెద వెంతటి బుద్ధిశాలి వంచు నన వచ్చును॥ పో॥ ఈలాగునఁ బగరబొఁగడి బేలరీతి లోఁబడెదవు। నీలావు గణింపలేవు; నిద్రపోతు కేటి రణరంగము!॥ పో॥ రాము డిల మోక్ష గుండ ధాము డనుచు నే నెఱుగనె నీమాత్రము! వానిచే హతుండ నైన ముక్తి యలవడదే!॥ పోరా యి॥

వ. అసిన వినియన్న మనోనిశ్చయంబు నెఱింగియిది గోచనుచుచు న్నా నని ప్రళయకాలాభీలవిజృంభిత మహాంభోధరంబు చందంబున గుంభకర్ణుండు గర్జించుచు యుద్ధసన్నద్ధుండై,

కుంభకర్ణుని యుద్ధము.

క. శూలి త్రిశూలముకన్నను
మే లగుశూలంబుఁ గేల మెఱయగ గీలా
భీలముగా నార్చుచు రణకేళికిఁ
జా వెడలె నపుడు క్షితి యదరంగన్.

తో: లెక్కకు మీరిన రక్కసు లెల్లను నుక్కున నెకొ్కని రాగా। జక్కగ బటునిస్సాణ పటహావిస్తారరవంబులు మోగ॥ రా॥ వెడలగ బిడుగులు బడె నుడుగణములు బుడమిని జలజల రాలెన్। కడువడి నిప్పులజడి గురిసెను దిక్కరులు భయంపడి సోలెన్॥రాము॥

వ ఇటువలెఁ ద్రిజగద్భయంకరాకారుండై యుద్ధభూమిఁ జొచ్చి వానర సైన్యంబుపైకి నడచు కుంభకర్ణుని వికృతాకృతికి నివ్వెఱఁగంది రాముఁడు విభీషణునితో—

క. దేవారి కేమిగావలె
నావచ్చెడి శూరుడెవ్వ? డాశ్చర్యకరం
బౌ వాని రూపుగాంచిన
వేవేగమె తెలుపు మన విభీషణుఁ డనియెన్.

జంఝూటి అటతాళము.

రణరంగశూరుఁడు కుంభకర్ణుఁడు, రామ, యీఘనుఁడు; రఘు రామ, యీఘనుఁడు; అల రావణానుజుఁడు॥ రణ॥ జనియించినప్పుడె దేవతలను జయించితోలెను జయించి మర్దింపఁబూనెను॥ రణరంగ॥ అది గాంచి నిద్రమునుంగునటు శపియించె పద్మజుఁడు; శపియించె పద్మజుఁడు; నిద్రించునీతండు॥ రణ॥ శ్రీమోతుగుంటపురీశ, యేమరకీక్షితిని వీని, నీ వీక్షితిని వీని, బాలింపుము దయమూలి॥ రణ॥

వ. రావణునికిగల బలంబులలో ముఖ్యుఁ డితఁ డొక్కండే! ఇతఁడు నశించిన వానిబలంబు నాశంబు వేగి సత్యము. నిద్రావ్యాజంబు లేనిచో వీనిదాడికి లోకంబులు భరింపునా! జాగ్రత్తస్వామీ! మాని హృదంతర్యామీ!

వ. అనుచుండ,

క. రాక్షసమూకలు వడిగా
వృక్షచరుల ముట్టడించి భీకరవృత్తిన్
లక్షింపుచు శిక్షింపుచుఁ
భక్షింపుచు పెక్కుగతుల బాధించి రొగిన్.

వ. అప్పుడు వనచరులు తమ ప్రతాపంబులు వెల్లివిరియ భుజాస్ఫాలనంబులు చేయుచు.

తో: కొండలు దరువులు గొని తెచ్చియు నాకు[illegible]ర రాక్షసుల నొడిచి। వెండియుఁ బురుకలు పెంకులుగాఁ దమ పిడికిటిపోటుల బొడిచి ॥రాము॥

వ. మహాద్భుతంబుగాఁ బెనంగుచుండ నప్పటిసమరంబు దేవతలకు గూడఁ దేరిచూడరాని దయ్యె. అప్పుడు—

తో: కూలెను నేతలు, సోలెదు రౌతులు, వ్రాలెదు గజ యూధములు। దూలెను వీరులు, దొరలెను శూరులు, దునిసెను రథ రథ్యములు॥ రా॥

వ. ఈ రీతి రభసంబయినఁ దదీయశోణిత మేదో మాంస మజ్జంబులు దృప్తిగా నారగించి భూత ప్రేత పిశాచ కాక ఘూక చయంబులు విఱ్ఱవీగుచుండె. అంతఁ గుంభకర్ణుండు వానరులపయికిఁ గదిసి,

కీర్తన: ఆదితాళము.

నన్నోర్చి నన్నోర్చి నిలుపుడి! మీరు నన్నోర్చి॥ నిన్నమొన్న రక్కసుల నిక్కి త్రొక్కినట్లుగాదు॥ నన్నోర్చి॥ అంభోజసంభవదత్త శుంభద్వరబలముచే విజృంభించి జంభారిముఖులదంభము సంరంభ ముడిపికుంభిని బేర్కొన్నయట్టి కుంభకర్ణుడను నేను॥ నన్నోర్చి॥ అక్షీణ బలదర్పితరణదక్షులౌ రాక్షసనద్య లక్ష్యముగఁ గొల్వ మిమ్ము శిక్షింప వచ్చినాడ! మోక్షగుండస్వామికి మీరీక్షితి సేవకులైన॥ నన్నోర్చి॥

వ. అనిన, నప్పుడు వానరులు రోషానలనయనులయి.

తో: పటుసత్వంబునఁ బాటివృక్షములు పర్వతములుగొని తెచ్చి కుటిలుండగు నలకుంభకర్ణుపయి దటుకున వైచిరి హెచ్చి' రా శూలముచేతను సొలయక యాతడు జూర్ణముగా నొనరించి, । కేలన గదగొని కీశవరుల్లను గీటడంప లంఘించి॥ రా॥

క. కోటానకోటి వానర
కోటుల గదచేత మోది కూలిచి పిదపన్
నోట గబళించి కొందఱ
వాటంబుగ మ్రింగె దనుజవల్లభుఁ డలుకన్.

వ. ఇట్లు విజృంభించి మ్రింగుచుఁ బెల్లార్చుచుండె. వాని నాసా కర్ణరంధ్రంబులనుండియు నోటినుండియు మ్రింగఁబడిన వానరులు వెడలి వచ్చిరి. కూలిన వానరులును మూర్ఛదేలికవిసిరి. అప్పుడు హనుమంతుడు,

తో. ఒక మహాద్రిగొని యురువడి వచ్చి మహోగ్రంబుగ వేయ
గను। బ్రకటితముగ నది పైదాకిన నిలబడి తెప్పిరిలి పొంపుగను॥ రా॥

వ. కోలాహలంబుగా గాలానలానేక గీలాభీలంబుచేసి, తాళిమిని దానవపాళిని నవలీల దూలించి, వాలంబు వ్రేలాడించుచుఁ బేరెదవు చాలుచాలు! నీలావును నీలాఘనంబును గాలదండాభమగు నాశూలంబుచే నేలపాలు చేసెద రారా వానరవీరా! యని శూలంబున మోదిన నాతాఁకునకు హనుమంతుడు మూర్ఛల్లె. పిమ్మట నీల ద్వివిద శరభ గజ గవాక్షాదిప్లవంగపుంగవుల శూలంబువ్రేసి కసిమసంగుచున్న, సుగ్రీవుండు పైకొని,

బ్యాండుస్వరము: ఏకతాళము.

నిను వధింతు దానవా! యిక నిలుపు నిలుపు దానవా! యిన సుతుండ దానవా! నన్నెదుర లేవు దానవా! మును వాలి మీయన్న నొంచెగదా! నిను బట్టి నేనిపుడు విడలించెదరా॥ నిను॥ శిక్షచేతు దానవా! నీ సిగ్గుదీతుదానవా! ఈక్షణమున దానవా! నీవింటి కేగు దానవా! మోతుగుండేశుని దయచేతను నీక్షితి భూతాళి కెర జేతును॥ నిను వధింతు దానవా!॥

వ. అనినఁ, గుంభకర్ణుండు,—

పంచచామరము.

పరాక్రమంబుఁ జూపునట్టి బల్లిదుల్ ప్రగల్భముల్
దురాత్మ, నీబలెన్ వచింత్రె! దుష్టచిత్త, వాగకే
పరారిగమ్ము! జీవనమ్ముపైఁ బ్రియమ్ము గల్గినన్!
పురారినో మురారినో మొగానసిల్వఁ గెల్చెదన్,

వ. అనిన నాగ్రహించి సుగ్రీవుండు——

గీ. పెద్దకొండ యొకటి పెకలించుకొని వచ్చి
యెత్తి వైచె దనుజు నెత్తిమీఁద
నదియు వానివక్షమటు దాఁకి చూర్ణమై
రాలెఁ; నంత నలిగి రాక్షసుండు——

తో: శూలము గొని చుఱ చుఱఁ జూచుచు సుగ్రీవుని వ్రేయగను। జాల మంట లుజ్జ్వలముగఁ గ్రక్కుచుజను దేఱగఁగనితగను॥ రా॥

తో: హనుమంతుఁడు నడుమనె దానిని వ్రయ్యలుగా ద్రుంచినగనలి। దనుజుఁడు మలయాద్రిని గొని సుగ్రీవునిపై వ్రేసిన దవిలి॥ రా॥

వ. ఆదెబ్బకు సొమ్మసిల్లి సుగ్రీవుండు మూర్ఛ మునింగినఁ గని, కుంభకర్ణుండు రావణునకుఁ గనఁబఱుచుటకు లంకలోనికిం గొని పోవుచుండ విడిపించుటకు నోపక వానరులు హాహారవంబులు చేయుచుండిరి. అంత సుగ్రీవుండు మూర్ఛ దెలిసి వాని యకృత్యమునకుఁ గోపించి,

గీ. పైకి నెగఁబ్రాకి జీకాకు పఱచి ముక్కుఁ
జెవులు దెగఁ బీఁకి రక్తంబుఁ జిల్క నోడ్చి
వికృతరూపుని గావింప, వీఁక నాతఁ
డర్కజునిబట్టి నేలపై నట్టివైచె.

వ. అప్పుడు సుగ్రీవుండు క్రిందఁ బడక లాఘవంబున రామచంద్రుని కడకు నుఱికె. పిమ్మట గుంభకర్ణుండు——

ఫీల్ రాగము—అటతాళము.

అకటా! నేటికి నింత యాపద లొదవె। వికృతాకారముతోడ వెలయగ వలసె॥ న॥ చెలియలిగతి నాకు సిద్ధించె నౌరా! తలఁపఁ బురాకృతము తప్పిపో దౌరా॥ య॥ ఈరూపమున నన్నుఁ జేరగఁ జాల! బోరికి గ్రమ్మఱఁ బోదు నీవేళ॥ సక॥ వెలయ మోక్షగుండవిభునితోఁ బోరి తలఁగక దాఁ జెడఁ దలఁచెనా కారి॥

వ. ఇట్లు పరిభవపడి కుంభకర్ణుండు లంకలోనికిఁ బోనొల్లక యకాలమహాగ్ని చందంబున మండిపడుచు రణరంగంబునకు వచ్చి దెబ్బకుఁ దబ్బిబ్బు నొందుచున్న వనచరులఁ జుట్టుకొని,

తో: కొందఱ బట్టుక గుంభిని మోదెను! గొందఱ నదుల దోసెన్! గొందఱ నూకెను గుధరంబులపైఁ!-గొందఱ బైకెగవైచె

గొందఱ దిక్కులకును బడ మీాటెను గొందఱ లంకను ... రెఁ!! తుందుడుకొప్పగఁ గొందఱ మ్రింగెను విందుపొందు గాఁ గొనరె

వ ఇట్లు భయంకరంబుగా శంక లేక పోరుచున్నంత.

క. కూతలు గూసెడుకపులును,
భీతిని బరతెంచు కపులు, భిన్నాంగులు నై
రోతపడు కపులు దనుజుని
వాతను బడుకపులు నై విపద్దశఁగలఁగెన్.

తో: తగ్గెను వినజుఁడు; దగ్గె నంగదుఁడు, దగ్గె గవాక్షుఁడు గజుడు, దగ్గెను నీలుడు దగ్గెను, శరభుడు దగ్గెను ధూమ్రుడు, నలుడు॥ రా

వ. తక్కిన జాంబవదాదులు భయపడి యురుకుచుండ లక్ష్మణుం డెదిరి,—

తో: కుంభకర్ణుపైఁ గొన్ని బాణములు గోపముతోడను బఱప సంభృతధీరుఁడు సరకుగొనక దాఁ జనుచుండగఁ బురికొలుప॥ రా॥

వ. వానరులు వాని పయికి నగణితంబుగా నెగఁబ్రాకి

తో: తోకల జుట్టియుఁ గేకల వెట్టియు, దోలువట్టి నఖములను బీకుచు సంధులు బిగియఁబట్టుచును బీడింపక జులుకగను॥ రా॥

వ. వారి నందఱను విదళించిన మేఘమండలమునుండి చుక్కలు రాలినట్లు గ్రిందరాలిరి. ఇట్లు నలుపు కుంభకర్ణుని పరాక్రమమునకు నమ్భుతం బంది,

క. రాముఁడు నిర్జితభార్గవ
రాముఁడు సద్గుణగుణాభిరాముఁడు నుత
సుత్రాముఁడుఁ దాటకగర్వ వి
రాముఁడు దా నెదిరె నపుడు రాక్షసుని పయిన్.

వ. ఇటువలెఁ గదిసి రాముండు ధనుష్టంకారంబు జేసిన, నాధ్వనికి జతుర్దశభువనంబులు గడగడ వడంకె. అప్పుడు విభీషణుండు రామునకు ముందుగా నడచి కుంభకర్ణుని ముందర గదాధరుండయి నిలిచినఁ గాంచి నవ్వుచు,—

కాఫి: అటతాళము. (సాయనయీ) వలె.

ఓరి విభీషణ, యుక్తమె యాగదా! పో రోనరింపగఁ జేరినవాడవు॥ ఓ॥ అన్నదమ్ములమని యెన్నగ బోలదు ని; న్నేలు వానికి న్నెప్పగ నుండుము ॥ ఓ॥ చాలగ నిన్నిటు జంపిన లంకను నేలువారెవరిక నీవుగాక ॥ యో॥ రాక్షసరాజ్యము రయమున నిచ్చును॥ ఓ॥

వ అనిన; విభీషణుండు గుంభకర్ణునకు మ్రొక్కి—;

తో: రామునితో వైరము వల దని నే రావణునకుఁ జెప్పినను
నామాటలను మనంబున నొప్పక నను దన్నియుఁ బొమ్మనెను॥ రా॥
కావున, రాముని కరుణకుబాత్రుడ నై వచ్చితి నే ననుచు,
సేవలముగ దుఃఖించుచుఁ దలగియునావల బోయెను గనుచు॥ రా॥

వ. అప్పుడు రాముండు లక్ష్మణ సహితంబుగాఁ గుంభకర్ణుని సమీపించి యిట్లనియె.

సురట: ఆదితాళము.

దురంబునను నను భరింపగను నీతరంబుగా దోరా! ఇక గుర్తెఱింగి యిటు బోరా ! సరోజసంభవు వరంబులెల్లను దోటిఁగు గనుగోనరా! ఇదె నా శరాగ్నిగాల్చునురా॥ దురం॥ త్రిమూర్తులును నీకు మేలుగా నడ్డమైన విడిచెదనా! నీవిక్రమంబు గనుగొననా॥ దురం॥

జగంబునను మోక్షగుండపతి నెదురగ నెవరికైన బాణములఁగూడి పోనగునా !

ఉ. అంతట వాఁడు రౌద్రరస మావహింపఁగ బ్రహ్మ మావసానకా
లాంతకుఁబోలె మండిపడి యార్చుచుఁ బేర్చుచు బంట్లగేటుచున్
గంతులు వైచి మర్కటులు గంపము నొందుచుఁ బాఱఁజేసితాఁ
బంతముమీఱి రామనరపాలునితో నని యెన్ జలంబునన్.

కీర్తన: అటతాళము (కేదారగౌళ) వరుస.

మాయలు వన్నిన మాఱుంచి చంపగ । మారీచు గాను సుమా! పాయక బాహులు భంజించి కూల్పఁగ బాహుడ గాను సుమా॥

పోలగ విల్లిచ్చి భువి భంగపడ భృగుపుత్రుడ గాను సుమా వాలాయముగ నొకకోలను గూల్పగ వాలిని గాను సుమా॥ రాక్షసేశ్వరుడ! రావణానుజుఁడ! రణవిక్రముఁడను సుమా! మోక్షగుండేశ్వర, ముల్లోకముల యందు మొనగాడ నౌదు సుమా!

సీ. ఘనమైన కటికు రక్కసుల పల్కులు గాని
సనకాదియోగి సంస్తవము గాదు,
పటహాతమ్మట భేరి భాంకారములు గాని,
నారదమహతి గానంబు గాదు;
అర్చుచుఁ జనుదెంచు నసురయోధులు గాని;
యర్చింప వచ్చు భక్తాళి గాదు;
కఠినతరం బగు కదనరంగము గాని,
కరమొప్ప క్షీరసాగరము గాదు;

గీ. అచట సుఖమును మేలు నీకిచటఁ గలదె!
యెందుకు జనించితివి భూమియందు నీవు?
వెఱ్ఱి బ్రహ్మయు నిద్రించు వేడగాని ?
యయిన ననుఁ దాకి బ్రతికి పొమ్మంతె చాలు.

వ. అని పలికినఁ గోదండరాముండు కోపాన్వితుండయి యనేక సహస్రకాండంబు లఖండంబులుగాఁ గోదండంబున నెక్కుపెట్టి వేసిన నవి తప్పించుకొని,

తో: గదఁ ద్రిప్పుచుఁ భీకరముగ రా గను గని వాయవ్యాస్త్రమున।
గదతోఁ గూడఁ గరమునుదునిమెను గాకుత్స్థుఁడు బీరమున॥ రా॥
కడమ చేత రాక్షసుఁడు వృక్షమును గైకొని మీఁదికి రాఁగా
దడయక నింద్రాస్త్రమ్మున రాముఁడు దానినిఁ ద్రుంచెను వేగ॥ రా॥

వ. రెండుహస్తంబులు దెగి క్రిందఁ బడిన, వానిక్రిందఁబడి కొందఱు వానరులు మడిసిరి. అనంతరంబ కుంభకర్ణుఁడు వికృతంబుగా నోరుఁ దెఱచుకొని,

కీర్తన: రూపకము. (మంగళమగు) వలె.

నిను మ్రింగెద నిను మ్రింగెద నిను మ్రింగెదఁ గనుమా! యినవంశజ యిఁక నిక్ష్వాక యోధైనను జనుమ!! నిను॥ నా బాహుల నఱుకంగనె నేఁ బోదునె కనుమా నీబంటుల దాకియు నిను నేనోర్తును నిలుమా॥ నిను॥ నరభోజనులకు వానర నరు లడ్డమె కనుమా! ధరణిని శ్రీమోక్షగుండ పురరాఘవ! నిలుమా॥ నిను॥

వ. ముక్కు చెవులును జేతులును దెగినను సిగ్గులేక వికారంబుగా నోరుఁ దెఱచుకొని పయికిఁ గదిసిన రాముం డలుక రెట్టింప,

తో: అగణితబలుఁడై యర్ధచంద్రశరయుగము వింట సంధించి। తగ బిగించి తత్పదయుగ్మంబును దెగ ఖండించెను మించి॥ రా॥

క. కరచరణంబులు దెగినను
ధరపై దొర్లాడుకొనుచు దైత్యుఁడు కవియన్
శరజాలంబులు నోటను
జొర వైచెను రాఘవుండు సురలు నుతింపన్.

వ. సింహనాదంబుఁ జేయుటకు వీలులేక వికారముగాఁ గేకలు వేయుచు వేడిచూపులఁ జూచుచున్న దానవునివక్షంబున గుఱిఁగాంచి,

తో: ఇంద్రాస్త్రము సంధించి వేయ నది యేగి యురము భేదించి। సాంద్రంబున భూస్థలిలో దూరెను నరగ రాముఁ డదలించి॥ రా॥

అంతకశర మత్యంత వేగమున నపుడు వ్రేయ బెల్లడరి। పంతము తోఁగుంభశ్రవణునిశిర మెంతయు ద్రుంచెను దొడరి॥ రా॥

వ. ఇట్లు శ్రీరామ కర నిర్ముక్తదివ్యాస్త్రంబుచేఁ గుంభకర్ణుని తలదెగి లంకలో సగంబును సముద్రములో సగంబును బడియె. గోపుర ప్రాకారాదులు చూర్ణంబులయ్యె. దానిక్రిందఁబడి పదికోట్ల వనచరులు మృతినొందిరి; జలచరంబులు నుగ్గె. కులగిరులు వ్రొగ్గె. దేవతలానందించి రాముని నభినందించుచు బుష్పవృష్టిఁ గురిపించిరి. అనంతరంబు హత శేషులు కుంభకర్ణుని మరణవృత్తాంతంబుఁ జెప్పిన రావణాసురుండు మూర్ఛవోయి కొంతవడికి లేచి విలపింపఁ దొడంగె.

ఫీలురాగము: అటతాళము.

అకటా! కుంభకర్ణ యని ద్రెళ్ళినావా! యిక గెలు పేది! నాకేదిర త్రోవ॥యక॥ కులిశధారకునైనఁ గూలనివేను యిల నరునేటున నిటుగూలెనొ నే!॥ య॥ మనవిభీషణునిమాట సైకొనక నినుగోలుపోయితి నీబుద్ధి వినక॥యక॥ నీబలమును నమ్మి నేఁడింతపనికి నేఁబూనితి నిక నేర్పేది యనికి॥ నక॥ మోతుగుండేశుని ముదమున నెదుర నీక్షితి నాపని యింతే యాఁగదర॥యక॥

వ. కుంభకర్ణునిగూర్చి రావణుం డీలీల విలపించుచుండ, నతని కుమారులగు నతికాయ దేవాంతక నరాంతక త్రిశిరులును దమ్ములగు మహోదర మహాపార్శ్వులును, రావణునితో ననుచున్నారు.

క. మీ రేల చింత నొందఁగ!
నోరావణ, యుమ్ముబంపు! మురువడిఁ గపులన్
శ్రీరామ-లక్ష్మణులఁ గసి
దీఱఁగ వధియించి జయముఁదెత్తుము పేర్కన్.

వ. కాలము దీజిననప్పు డెంతవారయినఁ జావకుందురా! యుద్ధకాలంబున దుఃఖించుచుండిన జయము కలుగునా! లెమ్ము లెమ్ము మమ్ముఁ బ్రయాణమ్ము జేసి పంపు మనవుడు, రావణుండు ధైర్యంబు నొంది,

అతికాయాదులయుద్ధము.

రావణుని వచనము:—

తోహా: మిం కద్దంబే లోకత్రయమున! భీకరశస్త్రాస్త్రములు। చేకొని యుద్ధముఁ జేయగఁ బొమ్మనఁ, జెలఁగి జోదు మొత్తములు॥ రామ॥

వ. అనంతంబులుగా నేల యీనినట్లు కదలిరాఁ గాంచనరథంబు లెక్కి ధనుర్బాణధరులయి భేరీభాంకారంబులు భూనభోంతరాళంబులు నిండ వెడలి యుద్ధభూమిఁ జేరి ముట్టడించిరి.

తో: కపులును డీకొని కరములఁ బొడుచుచుఁ గాళ్ళఁ గట్టిలన్ దన్నుచును। విపులశైలములు వృక్షచయమ్ములు విఱిచి తెచ్చి వ్రేయుచును॥ తురగంబులచేఁ దురగంబుల రథకరులచేత రథకరుల,। స్థిరముగనసురులచే నసురుల మోదిరి పొడిమై ధర నురుల॥ రా॥

వ. మర్కటులు మాఱులేక వైరులహతంబుసేయుచుండ రాక్షసదళంబులు బెండువడి యుఱుకుచుండ నిలువరించి నరాంతకుండు వనచరులపయి ననేక బాణంబులు వైచి తనలావుఁ జూపుచుఁ జః యంగదుని దాఁకి యిట్లనుచున్నాఁడు:

కమాచ్: రూపకము.

ఇంత గర్వ మేల నిల్వరా ప్లవగాధను! నీ॥ కింతగర్వ॥ అంతకని భుఁడను నేను; నరాంతకుఁడను. మంతనమున॥ నింత॥ దిక్కులు నేఁదిరి నానురా! మానవులఁ బట్టి చక్కడంచి మట్టినానురా! డొక్కఁదరఁగ దొక్కెద! నే, మొక్కెద నీకది కెక్కవ్వరు!॥ ఇంత॥ శిక్ష జేతు నొక్క

వేఁటునఁ బరుగెత్తు మిపుడు మోతుకుగుండవిభుని చాటుకు! అతియరణ దక్షుల మగు రాక్షసులకు రా కెదురుగ॥ నింత॥

వ. అనిన, నంగదుండు జానకీజానియానతిచే నేను వచ్చి మీనాయనతో భాషించి నానిపుణత్వంబు మెఱయ ఖరసూనుఁడు లోనగు దానవుల వేన వేలం జంపి మేనుపొదల మానవేసుకడకుఁ బూనికతో వచ్చితి. ఆనాఁడు నీయానన మయినఁ గానరాదయ్యె! డక్కకనె నుంటివిరా! యీవేళ వచ్చితివా! నిన్ను జంపక విడుతునా!

వ. అనిన వాఁ డలిగి,

తో. గదఁ జేకొని యంగదుని వ్రేయగాఁ గదిసి యురమ్మును దాచి,। యది విరిగిన గని యసురుఁడు బిడికిట నడిచిన మూర్ఛిలి లేచి॥ రా॥ఒక్క గుద్దుతా గ్రుద్దిన గ్రక్కున నొరిగెను నాతనివాజి। జక్కగ నింకొకసారి గ్రుద్దగను రక్కసుఁ డీల్గెనుఁ నాజి॥ రాము॥

వ. అంత నరాంతకుని చావుగని కినిసి, మహోదర-దేవాంతక-త్రిశిరు లొక్కసారి యంగదునిపయికి నడచి యనేకశిలీముఖంబుల నొప్పించుచుండిరి. అతండును వేనుఁదీయక పర్వతవృక్షాదులచే మోఁదుచుండె. ఇంతలో నీలుండును హనుమంతుఁడును నంగదునకు దోడు పడిరి. అప్పు డయ్యిరువెగలవారును గదిసి,

పంచచామరము.

అరే దురాత్మలార! మీర లాహవంబుఁ జేయఁగా
బిరాన వచ్చినారె! మీదుబింకముల్ గలంచిన
త్వరంబుగా శిరంబు లూడఁ దన్ని శ్రాద్ధదేవతా
పురంబుఁ జేర్తు మింకఁ బాఱిపోక యుండు నిల్వుఁడీ!

వ. అనినఁ గోపించి దేవాంతకుండు హనుమంతుని దూఱుచు,

తో. పరిఘ ద్రిప్పుచును బైకిదుముకఁ గని పవనజుఁ డలిగియు హెచ్చి। శిరమ్మును బిడికిట జిత్తుక బోనువఁగా క్షితిపైఁ గూలెను జచ్చి॥ రా॥

వ. అది గని మహోదరుఁ డొక్కమదగజము నెక్కి నీలుని జేరి యుద్ధములలో సమర్థుల మని యుద్ధరిత్రిని సిద్ధంబుగఁ బ్రసిద్ధిని గన్న మాపంటికి నాటోపంబుఁ జూప వచ్చెదను. సెబాసు కోపాగ్ని దీపింపగ నీపూట నీరూపుమాపి మాపెద్దఋణంబుఁ బాపెద పోపోరా నీలా! నీముఖంబుఁ జూడఁ జాల! దుర్గుణజాల! యని యనేక బాణంబులు వైచిన సరకుగొనక నీలుండు —

తో: గిరి జేకొని యంబరమున కెగిరియు గుఱిగా వైచినఁ దగిలి
కరియును రాక్షసవరుఁడు నొక్కపరి ధరఁ గూలిరి తల పగిలి॥ రా॥

వ. పిమ్మటఁ ద్రిశిరుండు హనుమంతుని పంటికి దుమికి,

త్రిశిర - హనుమత్సంవాదము.

కమాచ్: ఆదితాళము. (అతిడేవరే) వలె.

త్రి॥ తెలగకురా వానరా॥ త॥ ప్రకటితముగ నా బాణాగ్నికి॥ దల॥ హ॥ ప్రేలకురా దానవా! పే॥ ఒక త్రోపుకు నీ యుక్కడంతు॥ ప్రేల॥ త్రి॥ మించితిరా వానరా! నుం॥ ముదము సెదర మోదెద గదతో॥ దలఁగ॥ హ॥ గెల్చెదవా దానవా॥ గె॥ ఇదిగో మోక్ష పురికిఁబనా॥ ప్రేలకురా॥

క. అడిదముఁ గొని త్రిశిరుండు పై
కడరిన, హనుమంతుఁ డతని యడిదంబును తా
నొడిసి కొని దానిచేతనె
యుడిచిన నసురుండు చచ్చి యవని బడియెన్.

వ. అంతట మహాపార్శ్వుం డుగ్రుండై హనుమంతుని బైకొని

భుజంగ ప్రయాతము.

మహాపార్శ్వుఁడన్ నన్ను మార్కొన్న శూరుల్
మహిన్ లేరు; నీవెంత! మర్దింతు రారా!
ప్రహస్తాదులన్ బట్టి భంజించినట్లా!
దహింతున్ భవద్గర్వ దర్పంబు లెల్లన్.

వ. అని పలుకుచుండ, ఋషభుం డొక్క వృక్షంబు రాక్షసునిమీఁ
వైచె. వాఁడు దాని సరకు గొనక,

తో: తనగదచేతను దనుజుఁడు వ్రేసిన, దప్పించుక ఋషభుండ
గినిసి తనపిడికిట బొడిచిన గిజగిజ దన్నుక దనుజుండు॥ రావ
చచ్చిన నాతనిచావు జూచి రోషంబున నతికాయుండు! వచ్చెను వా
పర్యులఁ జంపెద వడిగా నని ధీరుండు॥ రామ॥

అతికాయయుద్ధము.

వ. సహస్రసూర్యప్రభాభాసమగు రథ మెక్కి మహాటో
బున వచ్చు నతికాయునిం గని కుంభకర్ణుండు పునర్జీవితుఁడయి వచ
చున్నాఁడేమో ! యని వనచరులు భయభ్రాంతులయి యుండఁ గ
రాముండు వీఁడెవ్వ డని యడుగ విభీషణుండు—

గీ. ధాన్యమాలియందు దశకంధరుఁడు గన్న
సుతుఁడు వీఁడు; యుద్ధశూరుఁ డరయ;
నతిబలాఢ్యుఁ డయ్య! యతికాయు డనువాఁడు!
వీనిఁ జంప దగును వేగమునను.

వ. అని తెలుపుచుండె నప్పుడు—

క. హనుమంతుండు లోనగువ
వ్వనచరు లవనీరుహములు వసుధాధరముల్
గొని యెదిరించిన నవ్వుచు
దనుజుండిటు బల్కె మిగుల దర్పోద్ధతుఁడై.

పీల్ రాగము: ఆదితాళము. (తల్లిభ)వలె.

ఏడీ యేడి! రఘువరు డేడీ! కపులార యేడీ! కనబడ డేడీ!
యేడీ! వాడిశరంబున వారిరాశి గర్వంబును బాపియు బంధించిన
డేడీ॥ సురరిపుతనయుఁడు జులుకఁగఁగట్టిన యురగపాశముల నూడ
కొన్నవాఁ డేడీ॥ ఘటకర్ణుని నొకగడియలోన దిక్తటములు చెదర

ఖండించినవాఁ॥ డేడీ॥ రావణు నిక జూర్ణంబు జేతు నని లావున లంకకుఁ దా వచ్చినవా॥ డేడీ॥ మానుగ నాతని పైనగాని నామానితశరములు మరి వేయగ రాముఁ॥ డేడీ॥ దక్షుఁ డనై యాతని తమ్మునితో శిక్ష జేతు నలమోక్షగుండవిభుఁ॥ డేడీ॥

వ. అని గర్వంబునఁ బలికిన యతికాయునిపైఁ గోపించి,

తో. కపులుగిరులు వృక్షంబులుగొని యతికాయునిపైఁ వేయగను। నపుడు వాఁడు దివ్యాంబకములచే నవియు(దుంచి నేర్పు గను॥ రా॥ గురుతరాస్త్రములఁ గుమ్మరుచు గోనగు కోతుల బిట్టుగ వైచి। స్థిరముగమూర్ఛిలఁ జేసి రాఘవునిఁ జేరి సర్వ్వమును జూచి॥ రా॥

వ. ఇట్లను చున్నాఁడు;

సీ. నీ వెంతవాఁడవో! నే నెన్నఁ డెఱుఁగను
నింతవాఁడవని నిన్నెఱుఁగ రెవరు!
దిక్పాలకులలోనఁ దెలియఁ గానఁగ రావు
మానాభిమానముల్ మహిని లేవు!
జాతివర్ణాశ్రమాచారనీతులు లేవు;
గుణహీనుఁడవు నిల్వఁ గొంప లేదు;
భువిలోన నొంటిగాఁ బొదలుచుండెదు నీకు
గపికోటిసైన్యంబు గలిగె నిపుడు;
గీ. దిక్కులేనట్టి నీకును దిక్కుగాఁ గ
నినజుఁ డేర్పడె నాతోడ నెదుర లేవు;
వనములందును గొండల మునులయాశ్ర
మముల వర్తింపు;కాదేని మఱియు వినుము.

మధ్యమావతి : ఆదితాళము.

విడిచేనా రఘురామ! నిన్ను॥ విడి॥ వేదదమీనమై జడనిధి జొచ్చిన, గడుఁ గమఠంబై గట్టుమోచినను, వడి సూకరమై పుడమి

దూఱినను, వడిగ వెదకెదఁ గాని॥ విడిచేనా!॥ పందిరికంబమునందు బుట్టినను, విందుగ వటువై భిక్షమెత్తినను బొందుగ రాజుల ద్రుంచజేసినను నందే కనుగొందు గాని॥ విడిచే॥ రాక్షసవరులతోఁ గక్షకట్టుకొని ఈ క్షితిఁ బోరఁగ నే తెంచితి విటు మోక్షగుండసత్పురవల్లభ నిదు దీక్ష సాధింతుఁ గాని ॥ విడిచేనా॥

తో॰: అని జేయఁగ రమ్మని యతికాయుం డగ్రజు జీరఁగఁ గాంచి। విని లక్ష్మణుఁ డతివేగ గనని యిట్లని పలికెను నదలించి॥ రా॥

క. ఓరీ రాక్షస! రాముని
తో రణ మొనరించు నంత దోర్బలుఁడవెనీ
శూరత్వంబును గాంచెద
రా రా నేనుండ రాము రమ్మనవలెనా!

వ. అని యుద్దండంబుగా నిలిచి గుణధ్వని చేసిన, వాఁడు దురాగ్రహవిగ్రహుండయి యొక్క కూరిబాణంబు వింట సంధించి లక్ష్మణుని దిక్కు నభిముఖుండయి,

కీర్తన: ఆదితాళము,-(తంగిం మెట్టు) వలె.

నీవు బాలుఁడవునిలువఁగ జాలవు పోవోయి పో రుషిగి లక్ష్మణా! నావాక్యములువిని మీయన్న రాముఁడు, మేదిని హిమగిరి, యాయమరాద్రి దక్క, యితరులు నాయంబులకు నోర్తురా! ॥నీవు॥ మోక్షగుండేశుని నీక్షణమున బట్టి, శిక్షింతు నీ కేలను లక్ష్మణా! వీక్షించుచును నిల్వుము॥ నీ॥

వ. అని తూలనాడిన సౌమిత్రి యిట్లనియె:

తో॰: దురహంకారముతో బలికిన లేదుర క్రియ! శూరుఁడ వయినన్ । సుర లరయఁగ నీశరలాఘవమును జూపింపర నాపైనన్॥ రా॥

వ. అని పలికిన నతికాయుం డంతకాకారుం డయి యత్యంత వేగంబునఁ బ్రయోగించియున్న పటుసాయకంబు వైచిన లక్ష్మణుం డర్ధచంద్రబాణంబునఁ ద్రుంచి,

తో: ఆగ్నేయాస్త్రము నసురుని వేసిన, నాతఁడు సౌరాస్త్ర మున। భగ్నం బయి యిలఁ బడఁగా నేసియు, బదపడి లక్ష్మణుతోన॥ రా॥ ఐషికబాణం బదిగో వచ్చెను! నాగెదవా, సౌమిత్రి! భాషింపక నీకఁ బాటిపోమ్ము నినుఁ బడఁగూల్చును సీధాత్రి॥రా॥

వ. దోషాచరులపయి ద్వేషించి మానుషవేషంబున దూషించుచు వచ్చితివి. నీరోషంబునకు నీపస్మాత్రంబు వెఱవ! ఐషిక బాణంబున నీభీషణంబు బాపెద! సౌమిత్రీ ఇది నిన్నుఁ గూల్చును! ధాత్రి నని వైచిన గోపించి,

తో: ఐంద్రబాణమున నది పోఁడిజేసెద! సార్ధ్యాటముఁ జాలించు! సాంద్రబలుఁడవై శౌర్యంబున నీశరవిద్యను జూపించు॥ రా॥

వ. ముమ్మరమ్మగు నైంద్రాస్త్రమ్మున నీయమ్ము వమ్ము జేసెద! మమ్ము బెదరించు సామర్థ్యమ్ము నీకుఁ గలదా? రమ్ము నీతల దిమ్ము నీదినమ్మునఁ బాపెద నతికాయా! అని వాని బాణంబుద్రుంచిన నతండు మరల,—

తో: యామ్యాస్త్రంబును సదరకవైచితి నాస్ప్రము నిదుగో వచ్చె! సౌమ్యం బనుచునుసరగునఁ జూడకు! చంపును నీమెదఁ జొచ్చె॥ రా॥

వ. పాత్రతాపాత్రత నెఱుఁగక శాత్రవుల పంచు స్తోత్రంబుఁ జూపెదు నీగాత్రంబు ధరిత్రి గూల్పఁజాలు యామ్యాస్త్రంబు వైచితి. సైరింపుము క్షత్రియాధమా! యసురయోధులతో వాదమా!

వ. అనిన, లక్ష్మణుండు,—

తో: వచ్చెను జూడర వాయవ్యాస్త్రము; వడిగల యామ్యాస్త్ర మును! జెచ్చెర నీక్షితి జీలిచి వేయును జేయుము మఱి యుద్ధమును॥రా॥

వ. వాయవ్యాస్త్రమున నీయామ్యసాయకముఁ బాయఁ జేసెద! నీకడనున్న యస్త్రంబుల నన్నిటిని వైపుమురా. మాయకాఁడా! నీ

యు త్తమాంగంబు వీడఁ జేసెదఁ జూడరా! అనియాబాణమ్ము
మఱికొన్ని దివ్యాస్త్రంబులు లక్ష్మణుండు బ్రయోగించిన, న
కవచంబును భేదింపఁజాలకఁ జూర్ణంబులయిన, సౌమిత్రి యు
నొంగుచున్న నామర్మంబు దెలుప గోరి వాయుదేవుండు వచ్చి

గీ. వజ్రకవచంబుఁ గొన్నాఁడు బ్రహ్మవలన
శరము లెవ్వియు భేదింపఁ జాలవయ్య!
కడఁగి, బ్రహ్మాస్త్ర మేసినఁ గాని తెగఁడు!
చేయు మట్లన మోదించి శీఘ్రముగను.

కీర్తన: రూపకము. (ప్రథమోగ్ర) వలె.

విపులాగ్రహోగ్రోదగ్రుఁడై బ్రహ్మాస్త్రము దొడిగి న
నిగ్రహమున వైచె నగ్రజునడిగి ॥విపు॥ దశదిక్కు లుక్కు
స్రుక్కె మిక్కిలి సోలెఁ! సుర లక్కజంబు నొందఁ జూక్క
రాలెఁ!॥విపు॥ కులపర్వతంబు లెల్లఁదుల్లె! వార్ధులు నింకెఁ! ర
నుర్వి వెల్లగిల్లె! నరుకఁడు గ్రుంకెఁ॥ విపు॥ బ్రహ్మాండ మొల్ల
వడిమె నద్భుతముగను! మోక్షగుండ శ్రీకోదండపాణి కూర్తి
గను॥ ॥విపు॥

వ. ఇట్లు బ్రయోగించిన బ్రహ్మాస్త్రంబును దప్పిం
టకయు,

తో: పరిఘయు శూలముఁ బటుశక్తియు గద నరగ
గించినను, । నరకుగొనక యది చని కిరీటయుతశిరమును ద్రె
జనెను॥ రా॥

వ. ఈలీల బ్రహ్మాస్త్రం బతికాయుని వధించి పొది జే
తలు లక్ష్మణుని గొనియాడిరి. లక్ష్మణుం డన్నను జేరి నమస్క
దీవించి కౌఁగిలించుకొనియె. అనంతరంబ.——

౹ు దశముఖునకు
ఁడు లోనుగాఁగ నార్వురచావుల్
ాచుఁ జని తెలిపిన,
ాయు మూర్ఛనొంది తెప్పిరి వగచె.

కీర్తన: ఏకతాళము. (నలరాజ) వలె.

యేమిరా! గతి యేది చూపరా! బ్రతుక జాల॥నతి॥
౹, చిరకాలముందువు; నీ వనుకొంటి॥ నతి॥ భయ
జయమెట్లుగల్గును! దిక్కులేదు॥ అతికా॥ కడు
ాపె మనలను! బలుకవేమి॥ అతికా॥ అలమోక్ష
౹నితో వైర మింత చేసె॥ నతి॥

నయుఁ ద్రుంచిన
ఘ్నుని వధించు రణశూరుఁడు లేఁ
విధికృతంబున
౹గ వారు గెల్చుటకిఁక సంశయమే!
ాముని పటుశూరత్వమునకు మేరలేదు తలపోయఁ।
ాతురు వోయెదు వారిగాన ననిఁ జేయ॥ శా॥
బహువిధచింతాక్రాంతుఁడయియున్న తండ్రిని జేరి
౹ద్రజిత్తు పలుకుచున్నాఁడు:

జంపఘూటి: తిశ్రజాతి.—(నామాట) వలె.

శంకింపగ నీ కేల శోకింపగ! మానుగ నని సల్పగ!
జనక, ప్రాణము ధృతి బాగ॥ నే నుండ॥ వానరు
౹వు లనగ నెంత! నే నరుదెంచినంత। నిలుతురే యిసు
నెదు బహువింత॥ నే నుండ॥ నను దేరిచూడలేదు!
లేదు! ఘనమోక్షగుండవిభుడు గావున జని నేడు
ు నీతోడు॥ నేను॥

వ. అని ధైర్యంబు దెలిపి యతని యనుమతి వడసి వేగంబున నింద్రజిత్తు ప్రయాణంబై,—

ఇంద్రజిత్తు రెండవ యుద్ధము.

క. చతురంగబలము లత్యా
ద్భుతవిక్రమ మొప్పఁ గొలిచి తోఁ నరుదేరన్
బ్రతిపక్ష భయావహముగు
నతులితరణభేరి మొఱయ నని మొనఁ జొచ్చెన్.

వ. ఇట్లు చొచ్చి,

గీ. అగ్నిహోత్రుని బ్రార్థించి యతనివలనఁ
గాంచి బ్రహ్మాస్త్ర-రథ-ధనుః కవచములను,
నభమునం డాఁగి యతఁడు వానరుల నెల్ల
నడపగొని వాఱుముంచెఁ బెల్లంపవాన.

గీ. అలబలము సేసి చెట్టుగట్టులు బెకల్చి
ఇంద్రజిత్తును మొత్తఁ బైకెగచి యెగచి,
వాఁ డదృశ్యుండుగాఁ జూచి వానరపతి
విసివి పుడమికిఁ దిగి వాని వెదక గడఁగె.

క. అన్నా! బ్రహ్మాస్త్రంబున
ని న్నీచుని ద్రుంచివైతు నిమ్మానతి నా
కన్నను, నొక్కనికొఱకయి
పన్నగ లోకములఁ జెఱుపఁ బాడియె యనుజా!

వ. బ్రహ్మాస్త్రంబు వాడు కనబడకుండిన లోకంబుల భస్మంబు జేయు నొక్కని కొఱకయి లోకము నేల బాధింతువు? మాను మని యతని యుద్యోగంబు నివారించె; నంత,

గీ. ఇంద్రజిత్తు కపుల నినకులజాతుల
బ్రహ్మశరము చేతఁ బరఁగ మూర్ఛ

నొందజేసి లంక కొయ్యనఁ జేరెను;
నరుఁ డ స్తమించె; నంతమీాద.

వ. వనచరులకు రామలక్ష్మణులకుఁ గలిగిన విపత్తును గుఱించి విభీషణుండుఁ గొంతయోజించి యిట్లనుచున్నాఁడు:

తో: బ్రహ్మవరముచేఁ బ్రబలి దనుజు డిటు వాడిజూప రాఘవుడు బ్రహ్మాస్త్రంబును బహుమానించుట భవ్యమంచు నాఘనుడు॥ రా॥

వ. ఊర కున్నాడు. కాని-చో నీనీచునికి లోఁబడునా! యనిన హనుమంతుండు బ్రహ్మాస్త్రమునఁ జెడకుండ వరము గొనియున్నాఁడు. గాన మూర్ఛనొందకుండుటచే లేచి విభీషణునితోఁ గలసి కొఱవులు చేకొని రణమందుఁ గూలిన వారినిఁ గని వగచుచు,

వసంత – అటతాళము.

ఇంతవారికిని నీవెత గలిగె॥ నింత॥ పంతముతో జని పటుసత్వవంతులై యెంతెంతపనులైన జింతింపకను జేయు॥ నింత॥ శూరులైన నవతారములైనను బ్రారబ్ధకర్మాను-భవము దప్పి చనునె॥ ఇంత మోక్షగుండమందు ముదమున వెలసిన సాక్షాన్నారాయణస్వామి యీరాముడు॥ ఇంతవారి॥

వ. వీరికి గలుగు నాపదదీర్చు నుపాయంబు మనకు దోపలేద జాంబవంతుం డున్న దెలుపఁగలఁడు; చూతము ర మ్మని యొక్క-చో నంపశయ్యమీాఁద జీవచ్ఛవముగాఁ బడియున్న యతనిఁగాంచి,

తో. బ్రతికియుండువా భల్లుకోత్తమ, పలుకగలవె మాతోడ ధృతిమీాఱఁగ గుర్తించినావె మముఁ దెలుపుమనగ వగతోడ॥ ఎలుగుబట్టి నిన్నిప్పు డెఱింగితి నింతెకాని నాకనుల। నలుగుఁ నాటుట నవశంబైయిటు నవనిఁ బడితినని మొనల!॥

వ. రామలక్ష్మణులు వానరులు నేటికిట్టులైరి. అయిన హనుమంతుఁడు జీవములతో నున్నాఁడే! యనవుఁడు, హనుమంతుఁడు నమస్కరించి.

తో: నే హనుమంతుడ నీదయచేతను నెమ్మది మనియున్నాడ। సాహసమున నే సలుపఁ దగినపని నూహదెల్పు ధృతితోడ॥ రా॥

వ. జాంబవంతుండు కౌఁగిలించుకొని యిట్లనుచున్నాఁడు:

శంకరాభరణము: ఆదితాళము-(ఔనానుమీ) వలె.

హనుమంత, నీవుదక్క వనచరులకు దిక్కు గనుగొన నెవ్వారు గల రింక బ్రతికింప॥హను॥ పాలసముద్రము కూలము దాటిన మేలుగ నటు ద్రోణశైల మున్నది యందు॥ హను॥ సంజీవవిశల్యసంధానసౌవర్ణ మంజులకరణులు మనకుఁ బ్రాప్తించెడి॥ హను॥ అవి దెచ్చి యీవానరావళి కిచ్చిన భువి మోక్షగుండరాఘవుప్రోల బ్రదుకుదురు॥ హను॥

వ. ఇట్లు చెప్పి ద్రోణాద్రికి మార్గంబు సెప్పిన నుప్పొంగి కుప్పించి సముద్రంబుఁ దాటి శీఘ్రయానంబున క్షీరాద్రి కవల నున్న ద్రోణాద్రిఁ జేరి అందు విమర్శించినఁ, గామరూపులయిన యా యోషధులు గానరావయ్యె. అంత నా పర్వతంబు బెఱికి నెత్తిన బెట్టుకొని వాయువేగంబున వచ్చుచుండిన, —

గీ. ఆమహౌషధీ సమాగత పరిమళ
కలన వానరాళి తెలివినొంది
చచ్చియున్న రాక్షసవారములఁ బట్టి
యబ్ధి బడఁగ వైచె నతిముదమున.

వ. అంతలో హనుమంతుండు మందులకొండఁ దెచ్చి వానరుల నడుమ నుంచె. అప్పుడు సంధానకరణివల్ల విఱిగిన యవయవము లతుకుకొనియె. విశల్యకరణివల్ల శరీరమున నాఁటిన యస్త్రంబు లూడిపోయెను. సౌవర్ణకరణిచే శరీరములు సువర్ణకాంతి వంతములయ్యె. సంజీవకరణిచే శోషించిన ప్రాణములకు స్ఫుటంబు గలిగె. ఇట్లు వానరుల బ్రతికించి యాంజనేయుఁడు,

తో: సరగ రామలక్ష్మణులకు మ్రొక్కిన సంతసించి దీవించి। యురువడి గిరి మున్నున్నచోటనె యుంచి రమ్మనఁగ మించి॥ రా॥

వ. ద్రోణాద్రి యెప్పటిచోట నుంచి వచ్చె. అంత సూర్యోదయంబాయె. అప్పుడు సుగ్రీవుండు రాఘవునను మతింబువఁ గపులకు గని,

కాఫిరాగము: ఏకతాళము. (ఈశరాసనంబ సా) వలె.

రావణుఁడు గడఁగిరాఁడు రణము సేయఁగా లావుమీద లగ్గలెక్కి లంక గాల్పుడు॥ రావ॥ అడ్డమైన దానవుల నపుడె ద్రుంపుఁడు; చెడ్డకార్యముంచు మఱి జాత మానుడు॥ రావ॥ అటులచేయు కూరకున్నాజ్ఞగొందును; నిటుల మోఙగుండవిభుడె యొప్పుడు దెల్పెను॥ రావ॥

వ. అని ఖండితంబుగా సుగ్రీవుండు పలికిన వానరులు మంచిదని సాయంకాలమువఱకు వేచియుండి, రాత్రి గాఁగానే కొఱవులు సేకొని లంక కరిగి ప్రతిగృహంబును గాల్చి మసిచేసె,

తో: బాలుర వృద్ధుల బట్టి మంటలోపల బడగా వైచుచును। జాలగ నడ్డము జనుదెంచిన రాక్షసుల బట్టి త్రుంచుచును॥ రామ॥

వ. బహుఘోరకృత్యంబుల జేసి వచ్చి రణభూమి ప్రవేశించిరి. అంత రావణుండు కోపించి,

## కుంభ-నికుంభాదుల యుద్ధము

తో: కుంభ-నికుంభుల ఘోరవిక్రములఁ గుంభకర్ణకొడుకులను గంభీరముగాఁ గదనమునకు దశకంఠుడు బొమ్మని యనెను॥ రామ॥

వ. మఱియు శోణితాక్ష యూపాక్ష కంపన ప్రజంఘులను గూడఁ బంపిన నీయార్గురుఁ గదలి రణస్థలిఁజేరి,

దానవ-వానరసంవాదము.

కీర్తన: ఆదితాళము. (మాతవ) వలె.

దా-ముదమున మాబలము మీదుమదికి దెలియకయమ్మ। నెదురు వచ్చినారె! మంచిది! వానరులార! గుదిమి పట్టెదము నిల్వుడి॥

వా-వదరుచు మీవలె ముందు వచ్చిన వా రొక్కరయిన। సదనములకు మరలఁ జేరిరే! దానవులారా! కదనమునఁ జావకుండిరే!

దా-వారివలె గాదు; మేము బేరుగొన్న శూరులము! లేరు మము గెలుచుధీరులు! వానరులార! దూరముగఁ బొండు మీరలు!

వా-ధారుణిని మోహనగుండశ్రీరాముఁడు శూరుడు మీయూ పులు నీరుజేతుము! దానవులారా! మృత్యువాతఁ బడఁగఁ జేతుము!

వ. అని సింహనాదంబుఁజేసి యార్చి పేర్చి రాక్షసుల లక్ష్యపెట్టక విజృంభించి క్షణమాత్రంబున సంగదుండు కంపనుని, మైందుండు ప్రజంఘ-యూపాక్షులను,- ద్వివిదుఁడు శోణితాక్షుని, సుగ్రీవుండు కుంభుని, హనుమంతుఁడు నికుంభుని సంహరించిరి. అవ్వార్తవిని రావణుండు మకరాక్షుని బొమ్మన వాఁడు సుగ్రీవుండు,

మకరాక్షయుద్ధము.

తో: ఒక్కరథమ్మును నెక్కి యుక్కు గలగక్కను యుద్ధతిఁజూప, నక్కజముగ మకరాక్షుడు వెడలెను నాజికి సిరి ప్రేరేప॥ రా॥

వ. ఖరాసురుని కొడుకగు మకరాక్షుఁడు యుద్ధభూమిఁ జేరి మిన్ను మన్నుదగుల సింహనాద భుజాస్ఫాలనంబులు జేసి యదిరించిన, వానరుల నొప్పించుచు రామమూర్తి సమీపంబునకు నరిగి,

కీర్తన : త్రిశ్రజాతి - (వనమూను) వరలి.

రణమును జేయు మిపుడు రఘురామ! నాతోడ గడిసి॥ రణ॥ క్షణములో నిన్ను సమయించి లంకకు బోదు॥ రణ॥ ఖరసూనుడను గనుము! వరమకరాక్షుడ వినుము॥ ఖర॥ పరగ మాతండ్రి పగదీర్ప నేటికి గలిగె ॥ రణ॥ కరవాలమున నయిన, గద నైన, విలుబూనిట్టయిన॥ గర॥ వరమోహనగుండవాసుడ, యేలీల నయిన॥ రణమును॥

వ. అనిన, రాముండు గోపంబుదీపింప,—

తో: దబ్బరగాదుర దైత్యాధమ నాదెబ్బ తగిలినంతటను। నిబ్బర మెడలియు దబ్బిబ్బున నీయబ్బకడకు జనవలెను॥ రా॥

వ. అనిన,

క. మకరాక్షుఁ డరిగిపలు నా
యకములు మై గాఁడ నేయ, నవి నఘుఁడు నె త
ప్పక దునిమి వాని రథ-ర
థ్య కేతు చాపములఁ ద్రుంచె దాశరథి తగన్.

వ. అప్పుడు,

క. విరథుండయి శూలము గొని
వెఱనక దనుజుండు వ్రేయ, వేగమె దానిన్
విఱుగంగఁ జేయ, నాతఁడు
కఱకగు పిడికిటను బొడువఁగా నేతేఱన్.

తో. అనలాస్త్రంబున నతనియురమ్మున నారాముఁడు వ్రేయగను,। ననిమొన నమ్మకరాక్షుఁడు ద్రెళ్ళెను నమరులెల్లఁ జెలగగను॥ రా॥

వ. అంత, సూర్యోదయం బాయెె. మకరాక్షుని మరణవార్త రావణుండు విని దుఃఖరోషంబులు పెనఁగొని తన్నలయింప, నింద్రజిత్తుని బిలిచి యిట్లనియె.

కేదారగౌళ : ఆదితాళము.

కుమారకా! వినరా! అయ్యో! విమర్శగను నే వివరించెదనో॥ కు॥ అతికాయుడు మొదలై నవీరు లుద్ధతి గూలిరి యుద్ధములోన! గతి నీవేయిఁక! గదనము జేయఁగ॥ కుమా॥ సురలను దఱిమిన జోదువు నీ కీనరుల గెలుచు టెంతటిపనియరా. దురమునందు నీతో సరిగలరా॥ కుమా॥ మోక్షగుండ రాముని లక్ష్మణుని లక్షింపుచు గె, ల్వగనీవు ఈక్షణమునరథ, మెక్కి-కదలుము॥ కుమారకా॥

ఇంద్రజిత్తు మూడవసారి యుద్ధము.

వ. అని వీడ్కొలిపిన నత్యుగ్రమూర్తియై లేచి కాంచనరథా రూఢుండయి,

క. అరదము లరువదికోట్లును,
గరులును బదుమూఁడుకోట్లు, కడువడిగల మేల్
దురగములు నూఱుకోట్లును
వరభటు లగణితముగాఁగ వచ్చుచు నుండన్.

వ. ఒక్కకోటి చతుర్దంతదంతావళములు, నాలుగుకోట్ల నిలుక వన్నెగల గుఱ్ఱములును గూడ బలిసి యేతేఱ, నిస్సాణాది బహువిధ వాద్యంబులు - మ్రోయ నుత్తరద్వారంబున వెడలి యుద్ధభూమిఁ బ్రవేశించి,

గీ. రథము డిగ్గి చుట్టు రాక్షసదళములఁ
గాపువెట్టి కాటికాఱునిచ్చు
దెచ్చి వేదియొకటి దీర్పించి యందుంచి
జ్వలను నింధనముల వెలుఁగఁజేసె.

వ. సమంత్రణ పూర్వకంబుగా హోమంబుఁ జేసి ఆ యగ్ని నుండి.

అఠాణా : ఆదితాళము.

కృత్తియవతరించెను; బెద్దసత్తి యవతరించెను। కృత్తియనెడు పెద్దసత్తి లోకములకు మిత్తి యనగ మోర యెత్తి యార్భటించుచు॥ కృ॥ చాలభయదమౌ కపాలపాత్రయు, నస్థిమాలలు భీకరకరాల కేశము లలర॥ కృ॥ మోతుకుండేశునిపైఁ గతు గట్టినయట్టి రాక్షసవరునకు ప్రత్యక్షమై పనులు సేయ॥ కృ॥

వ. ఇట్లు ప్రసన్నయయి కృత్తి యింద్రజిత్తుఁగాంచి,

తో: పంపుమునన్నేపనికైనను నా తెంపు బెంపుజూపెదను।సొంపు గనచుచును రంపులు చేయగఁ జూచిసంతసింపుమను.

వ. ఆకృత్తినడిగి దివ్యశస్త్రాస్త్రరథరథ్యంబులు గయికొని కృత్తి సహితంబుగా నంబరంబున కెగిరి, కృత్తిమహత్త్వచే నెవరికిఁ గానరాకుండ నదృశ్యుండయి,

తో: ఉగ్రబాణముల నురువడి వానరయోధుల పయిఁ బఱపుచును। నాగ్రహమునఁ బెల్లార్చుచు మెలఁగెనునంబరమండలముననను ॥ రా॥

వ. పిమ్మటవానిసైన్యంబులుదిరిగిలంకలోనికి జనియె. అక్కడ,

తో: గజుఁడు గవాక్షుఁడు గంధమాదనుడువిజయుఁడు లోనగు కపులు గజిబిజి నొందుచు గదియుచు వైచిరి కడగి గిరులు వృక్షములు ॥ రా॥

**సురటః ఆదితాళము.**

శిలీముఖంబులు వలీముఖులపయి చలంబు మెయినేసెన్ ! వారలఁ బలాయనుల జేసెన్॥ శిలీ॥ పటుత్వ మొప్పఁగఁ బదికోటుల మర్కటోత్తముల గూల్చెన్! బలముత్కటంబుగాఁ బొల్చెన్॥ శిలీ॥ అనంతరము నెమ్మనంబులను భయమునన్ వడంకుచునణంగి చూచుచు నుండన్॥ మొఱో యటంచును మోక్షగుండపతి మఱుంగునకు జనిరి; మ మ్మెద్ధరింపు మని యనఁగా॥ శిలీ॥

వ. అప్పుడు లక్ష్మణుం డన్నకు నమస్కరించి,

ఉ. రామ, యిదేమి చూచెదవు ! రావణి మర్కటసేన ద్రుంపఁగా!
నే మన కూరకున్న మన నిచ్చునె ! కార్యము తప్పివచ్చెడున్ !
భీమబలంబుతో నతని బిట్టుగఁ దాఁకి శరాగ్నిఁ గాల్చెదన్
వేమరు నాజ్ఞ యిమ్మనుచు వేడినఁ దమ్ముని గాంచి యిట్లనెన్:

తో: వినుమిదె లక్ష్మణ! వీ డసాధ్యుడగు వనజభవుని వరమునను । ఘనముగఁ బ్రబలియుఁ గనబడకయ మగతనముఁ జూపు దురముననను॥

వ. కాఁబట్టి వీనిమీఁద బాణంబులు వైచిన నాయమ్ములు చెడి పోవును గాని నిలువవు. సైరింపుము. అనుచుండ నగ్నిహోత్రుండు వచ్చి,

తో: కనదాగ్నేయం బనుమంత్రంబును మనుకుల, జపియించు చును| ఘనబాణం బొక్కటి వ్రేసిన దనుజుని బాయును కృత్తియును॥ రా॥

వ. అప్పుడు వాఁడగుపడు నని చెప్పి యగ్నిభట్టారకుం డదృశ్యుం డయిన, రాముండు శీఘ్రంబున,—

గీ. అగ్నిమంత్రంబు జపియించి యమ్ము వైవఁ
గృత్తి యెడవాసిపోవె పెంద త్తఱి మునఁ
దిన్నఁగా మేఘనాథుండు దిగి పుడమికి
దశదిశలు వ్రయ్య సింహనాదమ్ము సేసె.

తో: వానరు లప్పుడు| వడిగా దరువులువసుధాధరములుగొనుచు| వానిపైన బడవైచి రొక్కపరి బంధుర వైరము కొఱలి॥ రా॥ రాముఁడు నూఱుశరంబులు మఱి యారాముని తమ్ముఁడు మూఁడు| భీమశరంబులు వ్రేయఁగ; నన్నిటిఁ బిండిజేసి యనె వాఁడు॥ రా॥

పూరికళ్యాణి: ఏకతాళము.

ఎదిరింపలేరు! ఇఁకజాలు పోరు! అదలింపరారు! అంతటివారు గారు॥ఎది॥ అనిమిషులను అనిఁ గెల్చినాను! నను గెల్వఁబూను నరు డెంతమాత్రుఁ డౌను॥ ఎ॥ బలవద్విరోధ మిల జేటుగాదా! తెలియఁగ లేదా! తలఁగఁగరాద వాద॥ ఎ॥ మురిసేరు కాండనుల మోహ్షగుండ వరు దూఱుచుండ బఱపెద నుండ కుండ॥ ఎ॥

వ. అని పలికి చండకాండంబు లెక్కుపెట్టి స్వాతీగతశుక్రుండు వర్షించిన చందంబునఁ గపిప్రవరులపై నెడములేక ప్రయోగించి నొప్పించి లక్ష్మణుని విల్లు విఱిచి రాముని కభిముఖుండయి యను చున్నాఁడు:

క. నీకుఁ సాయము వచ్చిన
యీకపులను గెల్చినాఁడ! నిఁక నన్నెటులన్
దాఁకి జయింతువు! తొలఁగుము
నా కడ్డము గలదె త్రిభువనంబులలోనన్.

వ. అని పలికి మఱియు ననేక సాయకంబు లందఱపై వైచుచుఁ దాను గెలిచిన ట్లూహించి వేగంబున లంక కరిగి యావార్త దండ్రికిఁ దెల్పిన, సంతోషించి, రావణుండు,—

కీర్తన: త్రిశ్ర జాతి-(ఇంతైన) వలె.

నీవంటికొడుకుండఁగ నీవారెవగ దీర్పగ నీవేళ కొనగూడె గా! ఇక వెండియు జను వడిగ॥ ననిలో నీవిక్రమము సరగ తీవిగుల్కఁగ; దేవపాళి బెదరి చూడఁగఁ జూపి రవిక్రమ॥ నీవంటి॥ శ్రీమోక్షగుండ విభుని రాముని లక్ష్మణుని వానరకోటులను దాఁకి యందున్న సోదరుని మొనసి మోమోటమిని మాని తామసంబునఁ దలలు త్రుంచివేసి రమ్మిక సీత యబ్బును ॥ నీ॥

వ. అనిన, దండ్రిని వీడ్కొని మహోత్సాహంబునఁ బురోహిత యుతంబుగా రణభూమిఁ జేరి యొక్క హోమంబుఁ జేసి నగ్నిదేవుని సహా యంబువలన నాలుగుగుఱ్ఱములతో రథమును సమోఘాస్త్రంబులుఁ గైకొని.

ఇంద్రజిత్తునాల్గవయుద్ధము.

క. రథ మెక్కి యాతఁ డంబర
పథమునకును నెగిరి కానఁబడక యె కపులన్
వధియించుచు సాయకముల
వ్యథ నొందఁగఁ జేయుచున్ భయంకరుఁ డగుచున్.

వ. దక్షిణదిక్కునకువచ్చి యిట్లనుచున్నాఁడు:

కీర్తన: ఆదితాళము (నీ వనువా) వలె.

రణ మొనరింపుము రామా! రామా! రయమున గూల్చెద రమ్మా! ॥రామా॥ అణుమాత్రంబుగ నసురుల దున్మించి సరణాశూరుఁడవుగా రామా రామా! ॥రణ మొ॥ కోఁతుల బలగముఁ గూడి వచ్చితివి యాతుధాన కుల మల రెను రామా! ॥రణ॥ పోతుగుండవరా! ముఖ్యంబుగ నీవీక్షితి నన్ను జయింపుము రామా! ॥రణ॥

వ. అని మఱియు,

తో: పడమటిదిక్కునఁ పలికెను; మీ రెక్కడ బోదురు దిక్కెవ్వరు! కడివలెఁ జిక్కితి రెడపక మిము జక్కడఁతు! లేనునా కాదురు ॥రాను॥

వ. అని కొన్ని బాణంబులు వైచి యింతలో —

తో: ఉత్తరదిక్కున నుండి పలికె: మిమ్ముఁ జక్కడంచి మీ దటను, ఉత్తరది యనకుఁ డయోధ్యకుఁ జని మీ కున్న వారిఁ జంపెదను॥ రా॥

వ. అని కొన్ని శరంబులు పఱపి వారి నేమఱించి తూర్పు దిక్కున కరిగి,

తో: మదిని విభీషణుమాటలు నమ్మియు మఱియేటికిఁ జెడిపోదరు? పోదలుచు మీ రిప్పుడె యొటకయినను బోయిన మని యుండెదరు॥ రా॥

వ. ఈప్రకారంబుగఁ జతుర్దిక్కులయందుఁ దిరిగి ప్రగల్భంబు లాడుచు నదృశ్యంబుగా బహుబాణంబులు ప్రయోగించి వానరుల నశింపఁ జేయుచుండినఁ గాంచి, కోపించి లక్ష్మణుండు రాముని కిట్లనియె.

కేదార: రూపకము.(సాటి)వలె.

వీని పైనిఁ గోపము రాని హేతు వేమొ! రఘుకులవర॥ వీని వాన రాళి నెల్లఁ బొలియింపఁగ దీనతతో నీనామము నే దలతురు॥ వీని॥ మేనులు దాఁపక వీరు నీనిమిత్తమింత పని చేయఁగ, దానవుని వాత

దగఁ ద్రోయఁగ నౌనె యిది మానవపతులకు ధర్మమె॥ వీఁ॥ దండిగ మధ్యాదినచండకిరణురీతి వడిఁ జూపుచు నున్న॥వీని॥ మోక్షగుణాధిప, కండలుగాఁ జెండఁగ నాకు సెలవొసఁగుము॥ వీని॥

వ. అనిన శ్రీరాముం డిట్లనియె.

చ. కనఁ బడకుండయుద్ధమును గ్రక్కున నీఁ వొనరింప, వీనికై
కినిసిన లోకముల్ చెడవె! గీప్పతిరుద్రబిడౌజులైన నీ
తనిఁ జెనకంగఁ జాల! రటుఁ దాఁ గొనినాఁడు వరంబు బ్రహ్మచేఁ!
గనుక సహించినాఁడ; నిఁక గాతు నె కాలము మూఁడి వచ్చెడిన్.

తో: నేనల్గినయెడ వీనిప్రతాపము నీరుగఁ జేయుద వినుమూ!
మానుగ పారబ్రహ్మము లు గాచిన నైన విడుతు నే కనుమూ॥ రా॥

వ. అని పలికిన రామునకుఁ గలిగిన యనుగ్రహంబు వాఁ డెఱిఁగి యుద్ధంబుఁ జేయఁ జాలక లంకలోనికిఁ జని తండ్రి కిట్లనియె:

క. కట్టల్కతోడ నేఁ జని
మట్టితిఁ గపికోటినెల్ల మనుకులవరులన్
ధట్టించి మానములు గొని
నెట్టనఁ జనుదెంచినాఁడ నీ కెఱిఁగింపన్.

వ. అని యధికప్రసంగంబుఁ జేసిన నింద్రజిత్తుపై రావణుండు గోపించి, —

జంఝూటి: అటతాళము.

ఇది యేమిటిపోక! యిది యేమిరాక! యదరి యేతొంచి యిట్లాడెదుగాక॥ యి॥ పగవారి నెదిరి చంపఁగఁ జేతగాక, మగఁటిమిని జెప్పెదవు! మఱిసిగ్గులేక॥ యి॥ దిక్కుల జయించి తిరిగియాడినము దక్క నరులకు డాఁగుటే ఘనము॥ యిది॥ మోక్షగుండేసు దమ్ముని తోడ బట్టి శిక్షింప కిక నన్నుఁ జేరకు పట్టి॥ యి॥

వ. అనిన మంచి దని వాఁడు సీతవంటి యాకృతిగల నాతి నొక్క
తెను దన మాయచేత నిర్మించి రథంబుపయిన నుంచుకొని పడమటి
దెసను వచ్చుచుండెఁ; అప్పుడు—

ఇంద్రజిత్తు పంచమయుద్ధము.

క. ఏతట్టు వచ్చునో యని
నాతని దశదిక్కులందు నరయుచుఁ గపుంగుల్
భీతాత్ములగుచు నుండఁగ
నాతఁడె వాతూలతనయుఁ డద్రిశిఖరముల్—

వ. నెక్కిన చూచుకొని పడమటిదిక్కుగాఁ జూచుచు.

తో: అరదముపై మాయాసీతను గని 'యకటా! పాపాత్ముండు!
ధరణిజ దెచ్చెను దా నేమి చేయునో! తగవిధికృత మగుచున్నదు॥ రా॥

వ. 'దైవమా! యిట్టిదీనదశఁ జూడఁ గలిగె! అయ్యో! వీని
నేమిచేయుదు! నెటుల నోర్తు'నని కపికోటులఁ గూర్చుకొని యట్ట
హాసంబునఁ బయికడరె హనుమంతునితో నింద్రజిత్తు పలుకుచున్నాఁడు:

తో: ఏటికి వచ్చెద వీసేనలతో? నిదిగో! సీతను గనరా! ధాటిగ
నీసతి తల దరిగెద మిమ్మాటికి నిజ మిక జనరా! ॥ రా॥

వ. ఈసీతకొఱకే కదా మీ రింత శ్రమించుట. మీశ్రమ నివా
రించితిఁ జూరా! వాయుకుమారా! అనిన, నాంజనేయుం డిట్లనియె:

తో: దనుజుఁడ వయినను ధరణిని విశ్రవసు మునుమఁడ వగు నీకు
దగునా! ముచుకొని సీతను ముందలబట్టుక కొనకొని ఈడువ నగునా!॥
రామ॥

వ. అని పలుకుచుండ వాఁడత్యుగ్రకర్మమునకు లోఁబడి,

క. మాయాసీతను బట్టుక
కో యని యార్చెను వివశ, కోపము గనరన్
ఆయెడఁ గరవాలంబునఁ
బాయకఁ దలదఱిగి యాతడు పలికెన్ గడిమిన్:

కీర్తన: రూపకము. (జేటాడు) వరళి.

ఇంకేటికిరా రణము॥ ఇ॥ పంకజగంధిని సీతను బట్టుక గరవా లంబున శోకింపక దలఁదుర్చించితి! బింకంబులు బొంకంబులు॥ నింకే॥ ఈ జానకికొఱకే కద యాజికి మీా రేతెంచుట! మీాజాడలు నామనుండలఁ గాఁ జాలవు రాఁజాలవు॥ ఇంకే॥ ఈసంగతి మోక్షుగుండవాసునితో నెఱిగించియు, నాసలుడిగి పొంగుడుండిన రోషంబున మోసం బగు ॥ నింకేటికి॥

ద్విపద: వాఁడిట్లు పలికిన వాయుసుతుఁడు
పోఁడిమిచెడి దుఃఖపూరితుం డగుచు
'వనచరులార, దైవముఁదప్పదీసె!
మనయుద్యమం బేది మఱిసాగదయ్యె!
నేమఱియుండకుఁ డితని మీారు!
రామున కీవార్త రయమునఁ జెప్పి
యమ్మహానీయుని యాజ్ఞానుసరణి
నెమ్మదితో వత్తునే' ఁడంచుఁ గదలి
పోగు; నాపిదప నుప్పొంగుచు దనుజ
నాయకసుతుఁడు మనంబునఁ దలఁచె.

క 'ఇక్కడ హనుమంతుఁడు లేఁ;
డొక్కండును జెఱుపలేరు హోమము మొనర్పన్
గ్రక్కున' ననుచు నికుంభిళ
దిక్కున కరుదెంచి యతఁడు దృఢనిశ్చయుఁడై.

తో: కల్లు పాలు రక్తంబు దేనె టెంకాయలు గంధసుమములు। బల్లులు పిల్లులు పాములు మొదలగు బహువ్యృగాళిమాంసములు॥ రా॥

వ. అమితంబుగా దెప్పించి కాత్యాయనీదేవిని నిలిపి పైవస్తువులచే మంత్రపూర్వకంబుగా నగ్నియందు హోమంబుఁ జేసి తనువుచుండె. ఇక్కడ హనుమంతుండు శోకాతురుం డగుచు వచ్చి రాఘవునకు నమస్కరించి యిట్లనుచున్నాఁడు.

ఫీల్ రాగము: ఆదితాళము. (గురుమహా)వలె.

మనుకులవర్యా మనుకులవర్యా! మన కార్యము జెడె॥మనుకు॥ రామ! మీరామను రావణి దెచ్చియుఁ గోమలిశిరమును గోసినాడ కట! ॥మనుకు॥ ఒప్పుగ నందఱ ముండియు సీతను దప్పింపఁగ శక్తత లే దాయెను॥మ॥ తక్కక నీనినదాఁకఁగాపాడియు నక్క కిచ్చిన చందం బుగ నాయెను॥ మ॥ మోతుగుండాధిప, ముందుగ మీకును నీక్షణ మున దెల్ప నేతెంచితిని॥ మనుకుల॥

వ. అనిన హనుమంతుని పలుకులు ములుకులై చెవిసోఁకిన నిశ్చేష్టితుండై రాముఁడు,—

క. జనకజను మదిని దలఁచుచుఁ
బెనుగాలిని నేలఁ గూలు వృక్షము రీతిన్
ఇనకులుఁడు మూర్ఛనొందినఁ
గని వగచిరి చుట్టునున్న కపిపుంగవులున్.

వ. అప్పుడు—

తో: కన్నీ రేఱుగఁ గారఁగ లక్ష్మణుఁ డన్నకడనుఁ దా నరిగి। పన్నగ నూరులపయికిఁ జేర్చుకొని మన్నుగుడిచి మది గరగి॥ రా॥

ముఖారి: ఆదితాళము.

అకటా! రఘువీరా! జానకి కింత యిడుమలవలసె నౌరా॥ప్రకట ముగ దశకంఠుఁ గూల్పఁగ రాజ్యమును విడనాడి వచ్చితి! మొకటి మన మెంచినను దైవం బొకటి నెంచెను! విధికృతంబకట॥ నకటా॥ రణశూరుఁ డగు నీవు గలిగియు ధరాకుమారికి జాన్ని తృణముగాఁ బల్కు వచ్చె నీశోక మున కెయ్యదిమేర! సుర రక్షణమునకు జనియించితివి మోతుపుర నాథ య దెట్లు జేసెద॥ మకటా॥

తో: జానకిమరణము నైపజాల! నేశరవహ్నుల ముంచెదను। దానవులను! లంకానగరంబును దగ్ధము గావించెదను॥ రా॥

వ. అని లక్ష్మణుండు శోకించుచుఁ బలుకు పలుకులు విని విభీషణుం డిట్లనియె:

తో: ఎక్కడిమాటలు ఇంద్రజిత్తు దానికడ గపటముచేత గ్రక్కన సీతను గల్పించియు మఱి చక్కాడెను గసిచేత॥ రా॥

వ. ఇందులకు వగవవలదు. నేను రామునకు సీత నిమ్మని చెప్పిన వినని రావణుండు కొడుకు సీతను జంపఁ బోయినఁ జంప నిచ్చునా! అమ్మహాపతివ్రత చచ్చిన లోకంబులు నిలిచి యుండునా! నేను నిజముం గాంచి వచ్చెద నని యింతలో రాముండు మూర్ఛఁ దేఱియున్న,—

గీ. రామునాజ్ఞను గైకొని భ్రమర మగుచు
రావణోద్యానవనము, జేరంగఁబోయి
శింశుపముక్రింద నున్నట్టి సీతఁగాంచి
మరలి యేతెంచి తెలిపె దాశరథులకును.

వ. ఇట్లు సీతాదేవి క్షేమవార్త రామలక్ష్మణులకుఁ దెలిపి విభీషణుం డిట్లను చున్నాఁడు:

తో: రామ నికుంభిళ హోమము జేసి శరంబులు రథమును బడయ। దా మది యెంచియు దరుచరు లది యెంతయు జెఱతురో యని తెలియ॥ రా॥

వ. ఇంద్రజిత్తు కపటంబున నిదియొక సందడిచేసి యందఱు నిర్విణ్ణులయి యుండఁ, దిమ్మదిగా నికుంభిళకుఁ బోయి హోమంబుఁ జేయు చున్నాఁడు.

క. హోమము సాంగంబయినను
నా మేటిని గెలువలేరు హరిహయు లయినన్;
ధీమతితోఁ గపియుతముగ
సౌమిత్రిని బంపు మతనిఁ జాపుటకొఱకై.

వ. పదునాలుగు సంవత్సరములు నిద్రాహారములు వర్జించిన వానిచేఁ జచ్చునట్లతనికి వర మున్నది. అట్టివ్రతము మన లక్ష్మణుం డాచరించియున్నవాఁడు గావున, వానిం జంపును. వాఁడు మడిసిన రావణుఁడును జచ్చినట్లుగాఁ దలఁపుఁ డనిన, రాముం డాశ్చర్యచిత్తుఁడై లక్ష్మణునిఁజూచి॥

జంఝూటి: త్రిశజాతి (ఏకతాళము) జతి.

సౌమిత్రి, యికను లెమ్మా! సమరము జేయ బొమ్మా! ఆ మేఘ నాథుగమ్మా! అమ్మాల బడ గ్రుమ్మా! గెలిచి క్షేమముగను జేరుము! వాని హోమము విఘ్నము జేయుము! ఆజిలో మోమోట ముడుగుము॥ సౌ॥ మదిమోటుగుండవిభుని మఱవక తలంచుకొని పదజయ మయ్యెడిని! భల్లూకవల్లభుని వేగఁ బవమానవరపుత్రుని వెంటఁ బలిమిగా గొల్చి రమ్మని ప్రీతితో ధనురస్త్రములఁ బూని॥ సౌమిత్రి॥

వ. అని యిట్లు తెలిపి, సముద్రుం డిచ్చిన వజ్రకవచంబును ఖడ్గంబును ధనుర్బాణంబులును ఇచ్చి దీవించి పంపిన, సౌమిత్రి రామునకు నమస్కరించి జాంబవంతుంను కోట్లకొలఁది భల్లూకంబులతోడ వెడలి విభీషణయుతంబుగా హనుమంతుని నారోహించి యిరువంకల గపిసేనలు బలిసి యేతేరఁ గదిలి,

తో: ముప్పదియోజనములదూరంబున నొప్పు నికుంభిళ కేగి,। గొప్పబలంబులు గోట్లర్బుదములు గూడి చుట్టినను మూఁగి॥ రామ॥

వ. సందడి లేక నిస్తరంగసముద్రంబుఁబోలె నలరుచున్న మేఘ నాథుని సేనలం గాంచి లక్ష్మణుఁ డాశ్చర్యంబు నొందె. అప్పుడు విభీషణుండు,—

గౌళబంగాళ: అటతాళము.

చూడుమా సేనల రామానుజ! చూడు॥ ఏడఁజూచిన గాని యెడము సందులేదు॥ చూడు॥ సేనల ద్రుంచినఁ గాని లేవఁడు వాఁడు ॥చూ॥ హోమవిఘ్నము జేయ నురుబలముల బంపు॥ చూడు॥ బాణ

పరంపరఁ బఱపి చంపుము వాని॥ జూడు॥ మోక్షగుండేశుని ముద్దుల తమ్ముడ॥ చూడు॥

వ. అనిన, లక్ష్మణుండు రాక్షసదళంబుల యాక్షేపణంబుల వీక్షించి బ్రహ్మాండ మదరునట్లు జ్యానినదంబుఁ జేసి శరవర్షంబులు గురి పించుచుండె,

తో: రాక్షససేనలు నాక్షణమున నారామసోదరుని గదిసి॥ యతీక్ష్ణంబుగ నలజడి బెట్టిరి యంబులు బెక్కులువేసి॥ రామ॥

వ. అది గని మహోగ్రమానసులగుచు,

క. భల్లూకవరులు మర్కట
వల్లభులును గిరులు దరులు వడి వైచుచు రం
జిల్లఁగ రాక్షససేనల
నెల్లనుభంజింపుచుండి రెంతయు దెగువన్.

వ. లక్ష్మణుండును బాణప్రయోగంబుల ననేకుల మడియింపు చుండ దదీయాటోపంబునకు సైరింపనోపక రక్కసు లుక్కుచెడి హోమంబుచేయు నింద్రజిత్తు మఱుఁగునకు జని బహువిధంబుల మొఱ పెట్టుకొనిరి. అప్పుడు—

ఇన్నూటపదియాహుతులు వేల్వవలసియుండె. అందు నూట తొమ్మిది మాత్రమే వేల్వఁబడియె. ఇంతలో—

క. దనుజులు హాహారవములఁ
దనమఱుఁగునఁ జేరుటయును, దరుచరులెల్లన్
వెనుకొని తఱుముటయుంగని
పనివడి సవనంబుమాని పటురోషమునన్.

గీ. కేలనుండిన యాహుతుల్ నేలవైచి
రథముపై నెక్కి చాపశరంబు లూని
దండధరుఁడునుబోలె నుద్దండు డగుచు
శరసహస్రమునించె వానరులమేన

వ. ఇట్లతండు వానరుల నొప్పించుచుండి, విభీషణుండు లక్ష్మ ణునిం జూచి యిట్లనియె:

కాంభోజి. అటతాళము (నిన్ను నమ్మి) వలె.

దానవునిచేత గాన వచ్చెగదా! వానరుల గెల్చి వచ్చును గ్రమ్మఱ॥దాన॥ మానుగ నామన్త్రినూను క్రింద హోమ మానందముగ జేయ బూనును సత్యము.॥దా॥ హోమముసాంగమైన, నామేటి గెల్వ సుత్రామాదు లయినను దా మోహం జాలరు॥దా॥ దండిగ శ్రీ మోక్ష గుండేశు సోదర, చెండుము వా డింకం జేరకమును వే!॥ దాన॥

వ అనియిట్లు ప్రేరేప లక్ష్మణుం డతివేగంబున వానరులం గనిను సంగు నింద్రజిత్తునకు నభిముఖుండై చని యంభోధరసమానగంభీర వాక్యంబుల నిట్లనియె:

తో: మాయలు చేసిన మఱి క్రియ లేమర మగవాండవు నీ వయినం! నా యెదుటికి దిన్నంగ జేరియుం గదనము చేయుము రా రా॥ రా॥ ఆలములో వీరాదలుం జూడంగ, ననురాధను, నినుగూల్చి కాలుని పోలికిం దోలి గొందు జయశీలత నేం బొల్చి ॥రా॥

వ. అనిన వాం డదరిపడి యిట్లనుచున్నాండు;

కళ్యాణి: రూపకము.

అంతవాండవా! నాయంతవాని తోడ నని సలిపెదు! ॥నంత॥ అంతకాభుండంచు నన్నుం గాంతు రాశాకాంతులీ వింతగా! నిసుంత లేవు పంతగించి వచ్చి బెదరించెదు॥నంత॥ మున్ను నాగపాశముల నిన్ను గట్టి వచ్చితిగా! నన్ను నింతలోనే మఱచినావె మానవుండ ననుమా రోటిను ॥నంత॥ మోక్షగుండవాసుని తమ్ముండ నయిన నేమి నిన్ని క్షణమ్ము శిక్షజేతు రాక్షసాళిపైని నడిపించెదు॥ నంత॥

వ. అని రోషకషాయితాక్షుండై విభీషణుని గని యిట్లనియె:

తో: పిన్నతండ్రి వని నినుం జూడం దగ; దన్నిట రోసితి వీవు;। పన్నగ శత్రులపంచ గామకొని తిన్నగం బడియున్నావు॥ రా॥

ధర్మహీన,మాసుర్మంబులు శాత్రవులకు బ్రమరించితివి! దుర్మతి స్వకుల ద్రోహము జేయగ గూర్మితోడఁ దలచితివి॥ రా॥

వ. ఎంత నీచుండయినను ఎంతమాట వచ్చినను బంధువులు విడనాడి పగవారి శరణు జొచ్చువారు గలరా! నీసహాయంబుచేతనే రావణుండు దేవతల గెలిచెనా! ఇప్పుడు నీవు తలఁగిన మాకు లోపమా! యని తూలనాడినఁ గలుషించి విభీషణుం డనుచున్నాఁడు.

దర్బారు: (వీరినం) వతె.

మీమేలు చాల్ చాలు! నాఃకుందర బలుకకు నిలు॥ మీమేలు॥ నామాటలు వినరైతిరి! యీమాడ్కిని మీమూర్ఖమె మిముఁజెఱచెనునో రున్న దనుచు జాల దూఱకు దుశ్చారిత్రులఁ గూరిమిబంధువులైనను సారజ్ఞులు దూరముగా దొలగం దగు॥మీ॥ నీతండ్రియును నీవునీతిలేని నీవారలు, ఘాతుక, విను మోతుగుండనేత చేత భూతలమునఁ బొలియఁ గలరు॥ మీమేలు॥

వ. అని విభీషణుండు పలికిన, నతండు ప్రళయకాల రుద్రుని భంగి రౌద్రాకారుండయి హనుమంతునిపయి నెక్కివచ్చుచున్న లక్ష్మణుని దిక్కుఁ దనరథంబు బో నిచ్చి పలుకుచున్నాఁడు:

పంచచామరము.

వనాంతరంబులందు నుండి వంటకంబుఁ గాన కే
యనాదృతిం గృశించినా వహో నరాధమా!
ఘనాంగులన్ మమున్ జయింపఁగాఁ దరంబెఁ యీసదీ
అ నాజిమాని లేచి పొమ్ము రాముఁ జేర నుర్వడిన్.

వ. అటుల పోక నెదిరించితివేని వినుము.

తో: పటువిశిఖంబుల పాలుజేసి నినుఁ బడఁగొట్టుదు భూస్థలిని।
గటకటబడి రాఘవుఁడు బడిన నినుఁ గనునటు జేతును లలిని॥రా॥

వ. అనిన లక్ష్మణుం డిట్లనియె:

పంచచామరము.

అలంప నిర్జరాళిఁ దోలినట్లుఁ గాదు నిల్చిదో
ర్బలంబు జూపు నిన్ను నీవె ప్రస్తుతించు కొంటచే
ఫలంబులేదు! నాదుబాణపఙ్క్తిఁ గోర్చి నిల్చినన్
బలాబలంబు లెల్లఁగానవచ్చుఁ జూచు వారికిన్.

వ. అనిన వాఁడు రోషించి,—

ఇంద్రజిత్తు-లక్ష్మణ సంవాదము.

ఇంద్రజిత్తు-జంఝూటి : రూపకము.

వచ్చెను నాబాణములవాడి జూడుమా! ॥వచ్చె॥ చచ్చెర నీజో
మ్మవియగఁ గ్రుచ్చును లోఁజొచ్చును మెఱమెచ్చులుగా విచ్చలుగను॥
వచ్చె॥

వ. అని పెక్కుసాయకమ్ములెక్కువెట్టి పుంఖానుపుంఖంబుగా లక్ష్మణుని ముంచి యార్చిన, నతండు లక్ష్యపెట్టక,—

లక్ష్మణ-జంఝూటి : రూపకము.

ముచ్చిలి యీవఱకు బోతి మూఁడుసారులు ! వచ్చితి యీసారి! మిడుత జిచ్చునఁబడి చచ్చెడుగతిఁ జచ్చెద విపు డిచ్చటనే॥ ముచ్చి॥

వ. అని పలికి యాశరంబులు తననిశితసాయకమ్ములచే రూపుమాపిన, వాఁడు ఘోరనారాచంబులు దొడిగి,

ఇంద్రజిత్తు-జంఝూటి : రూపకము.

వక్షము లక్షించినాను వ్రయ్యు లయ్యెడుఁగా! ఈక్షితి బ్రతుకంగ దరమె యక్షయరణదక్షునిగా! నీక్షణమున వీక్షింపుము॥వచ్చెను॥

వ. లక్ష్మణుని యురంబు గుఱిజూచి వైచిన నవి తునియవైచి సౌమిత్రి కోపోద్రేకంబున భయంకరమగు నొక్క బాణంబుఁ గార్ముకంబున నెక్కువెట్టి,—

జంఝూటి-రూపకము.

మోతుగుండదేవునికటాక్ష మున్నను దీక్షతో నీబాణమునఁ బరీక్షగ నోరాక్షస! ప్రత్యక్షంబుగ శిక్షించెద॥ ముచ్చిలి యీ॥

వ. అని యాకర్ణాంతముఁ దిగిచివైచిన, నాయేటునకు రాక్షసుండు మూర్ఛిల్లి మరలలేచి యెదిరించె. గా లూన నియ్యకుండ లక్ష్మణుండు బాణంబులు వేయుచుండె. అపుడు దానవుఁడు దనమనంబున—

తో: అబ్బా! దేవతలందఱిఁ గెల్చితి నాయాసము లే దాయె! । గొబ్బున నరుచే గూలుకాల మొన ( గూడెనేమొ వడిబోయె॥ రాము॥

వ. పరాక్రమవంతులగు దానవు లందఱు వీరిచేత మడిసిరి. నేను బ్రదికి ప్రయోజనమేమి ? శరీరము దాఁపక యుద్ధంబుఁ జేయుద మని యెంచి భూకంపంబు గలుగఁగ సింహనాదంబుఁజేసి,

తో: పిన్నతండ్రిపైఁ గొన్ని బాణములు, భీకరముగ లక్ష్మణుని । గొన్ని బాణములు, గురుతుగ వాయుజుఁ గొన్ని బాణములు విడిచి॥ రా॥

వ. నొప్పించిన, రోషించి విభీషణుండు——

తో: విల్లు గుణధ్వని వేగచేసి పటువిశిఖంబులు సంధించి । కొల్లగ నగ్రజుకొడుకుమేనిపైఁ గోపంబున దా ముంచి॥ రాము॥

వ. మఱియు ననేక మార్గణంబులు రాక్షసానీకంబుపై వైచి బాధింపుచు వానరసేనలం గాంచి విభీషణుం డిట్లనియె:

శేహగ్-ఆదితాళము : (పోనియ్య) వలె.

మీరు తగ్గక తగ్గక గ్రమ్ముఁడు! ॥మీరు దగ్గ॥ నిగ్గుగ బగవారి మూఁక మొగ్గ వచ్చె లగ్గలెక్క—॥ త॥ దీక్ష లక్ష్మణునిచేత నీక్షణమె చంపించెద; । రాక్షసమూఁకల మీరు శిక్షింపుడు; పిమ్మటను మోక్షగుండవాసునిచే రక్షోవిభు డీల్గినట్టి॥ తగ్గక॥

వ. అని కవియించిన, మహారోషాయత్తచిత్తులై జాంబవంతాది వీరులు పర్వత వృక్షాదులచే మోదుచు,

అర్ధకందము: వేటుకు వేటుకు రాక్షస

కోటులఁ బెక్కండ్ర నవనిఁ గూల్చిరి కడిమిన్.

వ. ఇంతలో హనుమంతుండు లక్ష్మణుని దించి రాక్షసులపైఁబడి

అర్ధకందము: వాటుకు వాటుకు నొక్కొక

మా టసురుల బెక్కు-మంది మహిపయిఁ గూల్చెక్.

వ. ఇట్లుపోరు ఘోరం బయిన సహింపలేక ఇంద్రజిత్తు ప్రతాపం బిగురొత్త విభీషణుండు లోనగువీరులపయి దారుణాస్త్రంబులు వేయుచుండఁ గని లక్ష్మణుండు గోపించి యాంజనేయు నెక్కి- యొక్క- యర్ధచంద్ర బాణంబున—

తో: సారథిఁగూల్చిన సారథికము రాక్షసుఁడు దానసల్పునన బోరొనరింపఁ గవులు గొందఱు వాని తేరు హయులఁ గూల్పగను ॥రా

వ. విరథుం డయ్యు వాఁడు నడిచెడక సింహనాదంబుసేసి,

తో: అడరుచు నాగ్నేయాస్త్రము వింటను దొడిగి విభీషణునేయ।నడుమవరుణబాణమున లక్ష్మణుఁడునటికి తునుపులుగఁ జేయుఁ॥రా।

వ. రాక్షసుండు లక్ష్మణునకు నభిముఖుం డయ్యె. నప్పుడు—

భైరవి. అటతాళము (నమిలాంశి) వలె.

వారు ప్రయోగసంహారములతో బోర, బోరు ఘోరం బాయెను శూరుఁడు రావణసుతుఁడు మోక్షగుండేశుని ప్రియసోదరుఁడు చూడఁ జూడ॥ వా॥ ఘననాగశరము రావణి వేయు, సౌమిత్రి గరుడాస్త్రమున ద్రుంచెను. ధనదాస్త్రము వాఁ డుద్ధతి వేయ. లక్ష్మణుఁ డును యామ్యమున ద్రుంచెను. చూడ జూడ॥ వారు॥ అరసి వాయవ్యాస్త్ర మతఁడేయ, సౌమిత్రి యైంద్రాస్త్రమునఁ ద్రుంచెను. సురవైరి గంధర్వశరమేయ రామానుజుఁడురౌద్రమున ద్రుంచెను. చూడఁ జూడ॥ వారు॥

వ. ఇట్లుఁ గొంతవడకుఁ బోరిన పిమ్మట లక్ష్మణు డింక వీనిఁ బరిమార్చుట కర్తవ్యం బని యెంచి దిశాభాగంబులు పగులఁ గార్ముకజ్యానినాదం బొనర్చి యుగ్రదృష్టిచేత నింద్రజిత్తును వీక్షించి,

ఇంద్రజిత్తు మరణము.

తో: ఇంద్రాస్త్రంబును వింట దొడిగి రామచంద్రుఁడు ధార్మికుఁడైన। నింద్రాదుల కిది హితమైనను నాయిలసుత పతిహితమైన ॥ రా॥

ఈయస్త్రము జని యింద్రజిత్తుతల యిలఁ గూల్చును గా కనుచు। నా
యెడ నాకర్ణాంతము దిగిచి రయంబున వేయ గనలుచు॥ రా॥ ప్రళయ
కాలపై శ్వాసరుగతి దాఁ బ్రబలుచు నదియే తెంచెన్। వలగొని మణి
కుండలయుతముగ రావణిమస్తకమును ద్రుంచెన్॥ రా॥

వ. అప్పుడు——

క. తుంబురులు పాడి; రచ్చర
లంబరమున నిలిచి వేడ్కనాడిరి; సుమవ
ర్షంబులు గురిపించిరి మో
దంబున లక్ష్మణునిపైనిఁ దగనిర్జరుల్.

వ. ఇంద్రజిత్తు మరణంబు గాంచి లక్ష్మణుండు శంఖంబుపూరించి సింహనాదంబుఁ జేసె. అప్పుడు విభీషణుండు లక్ష్మణుని గౌగిలించుకొని యగ్గించె. వానరులు జయజయశబ్దంబులఁ బొగడిరి. తరువాత రాముఁ డున్నయెడ కందఱుఁ జేరి మ్రొక్కిరి. ఇంద్రజిత్తుమరణవార్తకు రాముండు సంతోషించుచు,——

కీర్తన: ఆదితాళము.

భయముడంగెను మనకు జయమెసంగెను! రయమున నాయింద్ర జిత్తు రణమున దెగెను॥ భయ॥ కొడుకు లీల్గిరి; హితులు గూలిపోయిరి కడకు రావణుండు వచ్చుఁ గదనమునకును॥ భయ॥ దీక్ష; బూనెద వానిఁ శిక్షఁ జేసెద! మోక్షగుండమందు వెలసి మోద మందెద॥ భయ॥

వ. అని బహుభంగులఁ దమ్ముని శ్లాఘించె. అనంతరంబ——

ద్వి. ఇంద్రజిత్తిటువలె నిలఁగూలుటయును
దంద్ర నొందుచు లేచి దానవభటులు
దరుచరుల్ దమ్మునుదగ్రులై దఱుమ
బరువడి నఱుకుచు బలహీను లగుచుఁ
గొందఱుపాఱిరి కొండలపయికి;
గొందఱు దూఱిరి గుహలలోపలికి;

గొందలు వసతిలోఁ గొబ్బునఁ బడిరి;
గొందలు లంక గ్రక్కునఁ బ్రవేశించి
వదనంబులను దీనభావంబు దోపఁ
బదనుల గడుఁదొట్రుపాటు జనింప
రావణుకొలువు జేరఁగ వచ్చి మ్రొక్కి-
దేవఁ వరాసు! తా దిగ్విజయంబు
చేసిన మనయింద్రజిత్తు యుద్ధంబు
చేసి రామానుజు చేతను గూలె
నని తెల్ప; నాలించి యధికశోకమున
మునిఁగి కొండొకసేపు మూర్ఛిల్లి తెలిసి,—

-హిం-తోడి : అటతాళము-(దేహికే) వరు.

హా కుమార ! గుణాకరా ! యోర! హా కదనపటుభీకరా! నాక
ది క్కెక నెవరురా! యీశోక మాపఁగఁ జాలరా॥ హా॥ గరుడఖేచ
కిన్నరాసుల సురగణంబుల గెలిచిన వరబలం బేమాయెనో! యొకనర
నిచేఁ బడు టాయెనా॥ హా॥ మోటుగుండపురీశుని వెనుముట్టి చంపుద
వనుకొని యాతృణంబున బంపితి నది యంత పోయెను జెడితిని॥హా॥

తేవారము. కొడుకులనందఱఁ బాసి కడకు నే నిన్నుఁజూచి
యొడలఁ బ్రాణములు నిలిపియుంటి! నిపు డీవు బాలిసి!
తిడుములకు నేను లోఁగి! తికను బ్రతికేమి సాగి!
చెడెను నాకీర్తి యెల్ల! జిక్కితిని నరులవల్ల!

తో: నాకు నీవు పరలోకకృత్యములు నాయన, చేయఁగవలయు
నీకాలంబున విపరీతంబుగ నీకుఁ జేయఁగావలయు ॥ రా॥

వ. ఇట్టి కాలవిపర్యాసమున కేమి చేయుదురా ! కుమారా
సుకుమారా ! యని బహుభంగుల వగచి యెట్టకేలకు ధైర్యంబునొంది
కోపాగ్ని మానసంబున అవులుకొని వృద్ధిపొంద,

తో: అటు నిటుఁ జూచుచు నగ్నికణంబులు బొటబొటఁ గన్నుల రాలఁ। బటపటఁబటపటపండ్లు గీటుచుఁ బలికె మంత్రులకుఁ జాల॥రా॥ మున్ను బ్రహ్మవరమున నేఁ గొన్న మహోన్నతధనురస్త్రములఁ బన్నుగఁ దెండికి బవరమునకుఁ జని పరిమార్తును శత్రువుల॥రా॥

వ. అని పలికి బ్రహ్మాండంబుఁ బగుల భుజాస్ఫాలనంబుచేసి,

తో: నాతమ్ముల బాంధవుల భటుల మాతీ నాతనయుల రాముండు। సీతకొఱకుగద చీల్చెను, నేఁ జని సీతను జంపెద నుండు॥రా॥

వ. అని కరవాలంబుఁ గొని కోలాహలంబుగా నార్చుచుఁ ద్రిపురంబులు గాల్పం బోవు ప్రళయకాలరుద్రునివలెఁ దీవ్రతమై నశోకవనంబుఁ జేరె; తన్నుఁ జంపఁ బైకొనివచ్చు రావణుని తెంపుఁ గని కంపంబు నొందుచు సీత విలపించుచున్నది.

హిందూస్థానిరాగము : ఆటతాళము–(ప్రాణనాథునెటు) వలె.

వీని చేతఁ జావు నాకు విధి లిఖించె నేమొకో! పాణియందుఁ గత్తిఁ బూని పయికి వచ్చె నేలొకో॥వీని॥ ఇంద్రజిత్తు చావువలసి యీసు చేతనూ, ఇంద్రవైరి నన్నుఁ జంప నిపుడు వచ్చె నేమొకో॥వీని॥ మోక్షగుండేశుని జయించి మోద మందుచు నీక్షణంబు నన్నుఁ జంప నిటకు వచ్చె నేమొకో॥వీని॥

వ. అని విలపించి రామమూర్తిని తనహృదయారవిందంబున నిలిపికొని మూర్ఛిల్లి ధరణిజ ధరణిపయి నొరిగె. అప్పు డతని రౌద్రరసంబును గని సుపార్శ్వుం డనువాఁడు హితంబుఁ దెలుపఁగోరి,

క. నీపైకి నెత్తి వచ్చిన
యాపగతురఁ జంపు టర్హ మగు; నదిగాకీ
పాపమునకు నొడిగట్టకు!
యీపడఁతినిఁ జంపుటుచితమే దనుజేశా!

వ. బ్రహ్మవంశభవుండవయి నీతి విడిచి స్త్రీహత్యచేయ న
తంబేనా! చేత నయిన రామలక్ష్మణులఁ జంపు పొమ్మన, నియ్యక
తిరిగివచ్చి యాస్థానంబుఁ జేగి కొలువు దీరి,

తో: తనయునిశౌర్యము తన్మృతివిధమును దనవారికిఁ జె
చును। మనమున శోకసమగ్రుండై యాదనుజు డుండె నంతటను॥

వ. ఇంద్రజిత్తు మరణసమాచార మంతఃపురకాంతలు చె
తోడఁ జెప్పుకొనుచుండ విని యతనిభార్య సులోచన లోచనంబ
నీరుగార మూర్ఛనొంది చెలులు బోధింపఁ గొంతవడికిఁ దెలిసి నాథు
గూర్చి—

ముఖారి : ఆదితాళము.

నాకు నీకు ఋణము తీఱెఁగదా ప్రాకటముగ నేఁటితోఁ బ్రాణే
నాకనివాసుల నాకుల మేపిన లోకభీకరుఁడ వయ్యయ్యో ప్రాణే
ఎప్పటికి నాతోఁ జెప్పి పోవుదు! నేఁడు చెప్పక పోతి వయ్యయ్యో
॥ప్రాణేశ॥ కొడుకులఁ గాకుల కొల్ల జేసియు నీవువిడిచి పోతివయ్యయ్యో
॥ప్రాణేశ॥నాకు॥ ఈక్షితి మోతుగుండేశుఁడు మానపై నిటు దయతో
నయ్యయ్యో! ప్రాణేశ॥నాకు॥

క. ఉరగేశుఁడు మజ్జనకుఁడు
సరగున న న్నిచ్చి పెండ్లి సలిపెడివేళన్
వరరత్న మొకఁటి ప్రాణే
శ్వర నా కిడి యిట్లు పలికె వాత్సల్యమునన్.

తో: జయకాంక్షను నీప్రియుఁ డని కేఁగెడుసమయంబునఁ ద
యుంచు। నయముగ నీరత్నమును నివాళించియుఁ బంపుము జ
మొందు॥ మఱువకు మనుచును మఱి నీతో నని దూరమున కేఁగె
వేళ। స్థిరముగ భార్యకుఁ జెప్పి పొమ్మనుచు జెప్పియుండె నావేళ॥

వ. మీమామమాటలు మఱచితివే! నాతోఁ జెప్పిపోఁ
నిట్టి మరణంబు సంభవించునా! మనోనాయకా! అనిదుఃఖించి పిమ్మట
దనతనయులఁ జూచి యిట్లనియె:

సులోచనాసహగమనము.

ముఖారి: అటతాళము.

ఏల యీలీల వగవఁ దనయులారా!॥ యేల॥ ఏల వగచి ఫల మేమిరా! కాలము గడవ। నెంతవారికి జాలును దనయులారా!॥ ఏల॥ భీతి నొందకుఁడు! విభీషణు డున్నాఁడు! ప్రీతితో మన్నించును దనయులారా॥ యేల॥ ఘనమోక్షగుండేశుకరుణచే నే సహగమనము జేయుదును తనయులారా॥ యేల॥

వ. అని యూరార్చి విన్నదనంబుతో దశకంఠుని యాస్థానంబు జేరి పతివియోగదుఃఖమునఁ గన్నీరు మున్నీరుగాఁ గార వగచి మామతో నిట్లనియె:

తేవారము: పతివియోగంబు గలిగె! బ్రతికియుం కేమిఫలము!
బతిని వెన్నంటి చనుట పరమధర్మంబు గానఁ
బతిశరీరంబు మామా! పరగ దెప్పించి యిమ్మా!
సతులు మెచ్చంగ వేగ సహగమన మేనొనర్తు.

వ. అనిన, నతండు దుఃఖాక్రాంతుండై—

తో: ఆహవమునఁ బడినట్టి నీమగని యడిగినవా రిచ్చెదరా! ఆహా నాచే నది గా దనఁగా నామె వలికె మదిచెదర॥ రా॥

హిందూస్థాని తోడి: అటతాళము.

ఎక్కడికాలము గ్రక్కున వచ్చెను అక్కట! నామది కద్భుత మాయెనః॥ ఎ॥ గాలిసి బట్టిన కీలినిముట్టిన కైలాస మెత్తిన నీలావు దూలెనె॥ యె॥ సురపతి గెల్చిన శూరున కిప్పుడు నరులకు వానరవరులకు లోఁగుట॥ కె॥ మోక్షగుండేశుని మ్రోలకు నే నేగి దీక్షతో నావిభు దెచ్చుకొనెద నిక॥ నెక్క॥

వ. అని నిశ్చయించి మామకు నమస్కరించి యతనిసమ్మతంబున—

చ. అరదము నెక్కి తోడిచెలు లందఱు సన్నుతి సేయు చుండఁగా
బరువడి దీనభావమున భండనభూమినిఁ జేరి తేరు తీ
వరమున డిగ్గి కాల్నడను వచ్చి విసంస్రమతోఁ దోఁప నార్తి వా
నరు లరుదంది చూడ, రఘునందను జేరి నమస్కరించు చున్.

వ. సులోచన కరకమలంబులు ముకుళించి వినుతించు చున్నది.

శంకరాభరణము: రూపకము.

రామ! కదనభీమా! జయ॥ రామ॥ ప్రేమతో నామనంబు నందుఁ గొలుతు॥ రా॥ సామనుత, స్మరారిహిత, సురారిహిత॥ రామ॥ కామనిభామలకాయా, సామజసన్నుత, భార్గవరామగర్వభంగ, పూర్ణ సోమదివ్యవదనా, తామసాదిగుణవర్జిత, భూమిజవర, మోక్షగుండ ధామ, శుభద, నారాయణనామకవిస్తుత, సుందర॥ రామ॥

వ. అని నుతించిన, రాము నాసతి సుగ్రీవుఁ డత్తరుణిం గాంచి,

తో: ఎవ్వరిదానవో! యెవరు తండ్రి నీ కేఁగను వచ్చితి విపుడు? ఎవ్వఁడు నీపతి? యెఱిఁగింపుము మాఁ; కవ్విధమున, ననె నపుడు ॥ రా॥ వెలయ సులోచన; నింద్రజిత్తు నావిభుఁ డగు; శేషుని సుతను; నలరఁగ రావణు నకుఁ గోడలను నని రామునితో ననెను॥ రా॥

క. రామ, దయాకర పటురణ
భీముం డగు నాపెనిమిటిఁ బృథివిని గూల్పం
గా మంచి దగునె! యకటా!
ఈమెయి వైధవ్యమెటు సహింతును దేవా!

పున్నాగవరాళి: ఏకతాళము.

రఘురామచంద్రమా! యఘహార! బ్రోవుమా!॥ మ్రొక్కెదను॥ పతిభిక్ష బెట్టుమా! వెతలెల్ల బాపుమా! పరమపురుష! ॥ ర॥ నీప్రాపు జొచ్చితి గాపాడ వేడితి దీనురాల॥ ర॥ విడనాడఁ బోకుము చేడఁ జూడ బోకుము మోక్షగుండ॥ రఘురామ॥

వ. అని ప్రార్థించిన రాముండు పరమదయాపరమూర్తిగాన, గరుణించి మేఘనాథుని బ్రతికింప నెంచె; అది యూహించి హనుమంతుం డిట్లనియె:

తో: ఏమి రామ నీవెఱుంగని దున్నదె! హేమగర్భవరములను। నీమదిలో మానింప దగదె యన, నెలంతకు రాముం డనెను॥ రా॥

క. భామిని, యిం కొక భవమున
నీమగఁడును, నీవుఁ గలిసి నిత్యసుఖంబుల్
ప్రేమాను భోగపరతం
గామించి మదీయపదముఁ గాంతురు పిదపన్.

వ. అని పలికిన నానందించి యామె యిట్లనియె:

తో: దీనదయాపర, దేవదేవ, యట్లైనను నాపతిమేను। బూనిక నిప్పింపుము నేఁ జేతును మానుగ సహగమనమును॥ రా॥

వ. అనునంతలో సుగ్రీవుండు నీవు పతివ్రతవేని నీపతితోఁ గొంత ముచ్చటింపు మనియె. ఆమె మంచి దని రణమధ్యమందుఁ బడియున్న పతి శరీరంబుఁజూచి దుఃఖించి,

తో: పతియె దైవ మని, ప్రతిదినమును నే వ్రతముగ సలుపుదునేని। క్షితిపంబు నాపతిజీవసహితుఁడై చెలిమిఁబలికెడునుబూని ॥రా॥

వ. అనిన, ఇంద్రజిత్తు గనులు విచ్చి చూచి యందఱు విన సులోచన కిట్లనియె:

హిం. తోడి: ఆదితాళము. (కరిరాజ)వలె.

ననబోణిఁ వగపగను బనిలేదు పోగదే! నను దాకి పోరువాఁడు నహి జగమునఁ జూడు॥ మన॥ ఆనందు శేషుఁ డగు నీశంద్రి యగును గాన నాతోడ గెల్చినాఁడు; నాతిరో, యిచట నేఁడు॥ ననబో॥ వడిగను మోక్షగుండవరపుత్రినానతి గడువగ శక్యమె! కాలము దీఱెను ॥ ననబోణి॥

వ. ఇట్లు పలికి యింద్రజిత్తు కనులుమూసి పలుకకున్న దుఃఖించి లేచి వచ్చి రాముని కెఱిగిన సంతసించి రాముం డానతియ్య నంగదుం

డింద్రజిత్తు కళేబరంబు సులోచనకుఁ దెచ్చి యిచ్చె. దాని నామె మీఁద నుంచుకొని రాముని వీడ్కొని కదిలి,

తో: కాంచనాంగి లంకాపురికిని వేగంబున నపు డరుదెంచి యుంచెఁ దగినతావున బతిదేహము నుంచి భటులఁ గాపుంచి॥ రా॥

ఉ. మామను జేరి మొ్రొక్కి రణమధ్యముఁ జేరఁగ వేగఁ బోయి శ్రీ
రాముని నాశ్రయించి సుకరంబుగ భర్తృకళేబరంబు దా
ధీమతిఁ దెచ్చుకొన్న కథ లెల్లముగా వివరించి నేఁడు నే
నామగ జేగుతో నివను జనక్ దయనాకు ననుజ్ఞ నిమ్మనక్.

వ. రావణుండు మిగులఁ జింతాక్రాంతుండై కోడలి ధైర్య స
ణంబులకు నద్భుతంబంది కొండొకకాలంబునకు నిట్లనియె:

క. భామిని నీ వెఱుగనిపని
యేమున్నది! దుఃఖవార్ధిసీగను నాకున్
ఏమియును దోఁప దాయెను
నీమదిలో దోచునట్లు నెఱపుము సాధ్వి!

వ. అనిన, నతనివీడ్కొని స్వగృహంబున కరిగి చింతగూరియు
తన తనయులం గురిచ్చి లేవ నెత్తి శిరంబు మూర్కొని యిట్లు
చున్నది:

పీలు రాగము: అటతాళము.

నాముద్దుసుతులారా! నాయన్నలారా! భామిని నా
బుట్టితి రౌర॥ నా॥ మీముద్దు జూడ నేనోమంగ నైతి! నేనువిధిక
మెఱుఁగకపోతి॥ నా॥ మహిమీఁద నుండ ధర్మముగాదు; నేను న
గమనముచేతు క్షణమాత్రముననను॥ నా॥ ఇందుండఁ దగఁదీర లిప్పు
లెండు! ముందుగఁ బాతాళమునకుఁ జనుండు॥ నా॥ వాసి మిూత గుం
వాసునిదయను శేషునియింటను జేరిన సుఖము॥ నా॥

వ. ఇట్లు కుమారులను శేషునియింటికిఁ బంపి సులోచన యి
విషయములయందు విరక్తిఁ జెంది,

ఉ. తానును భర్తదేహ సహితంబుగ స్నాన మొనర్చి దివ్య భూ
షానికరంబుఁ దాల్చి నిజసంసృతి బంధమెడల్చి పుష్పవై
మానికరత్నమంపుఁ దన మన్మథునుంచి వధూవరాళికిం
దానములిచ్చు చుంజని యుదగ్గిశయందున నిల్పియంతటన్.

తో: చితిపైఁ బ్రాణేశ్వరుఁ జేర్పించియుఁ జిఱునగవొలయఁగఁ
జేరి। పతితో సహగమనం బొనర్చి నచ్యుతపదంబు నెదఁగోరి॥ రామ॥

వ. అంత దానవు లనలంబు రవులు కొలిపి యిండ్లకుఁ జనిరి.
తదనంతరంబ—

తో: సతియుం బతియున్ సంతోషముతో సౌర విమానము
నెక్కి। యతులితముగ సద్గతికిఁ జేరి సౌఖ్యంబుగ నుండిరి చొక్కి॥ రామ॥

మూలబలయుద్ధము.

ద్విపద: అప్పుడు రావణుం డధికరోషమునఁ
గుప్పలై నిప్పుకల్ గురియ నేత్రముల
మూలబలంబుల మొనఁగట్టి యుఱికి
యాలంబునకు నేగి యగచరాధముల
రామలక్ష్మణులను రయమునఁ జంపి
మీమీ పరితాపముల్ మేవడిఁజూపి
వేగంబ రండిక వెడలిపొం డనిన
త్యాగశీలతదెచ్చి దానవభటులు
పరిఘన కేళికిఁ బ్రాభవం బొప్పనుఱికి
రథములు దురగవారణములు భటులు
లెక్కకుమీఱి బల్మిని కేక లిడుచు
దిక్కులు నగుల విద్విషకోటినొగుల
సింహనాదంబులు సేయుచు వెడలి
రంహసంరంభులై రణమునఁ జొచ్చి,—

క. కేకల గొట్టుచుఁ గోతుల
మూఁకలవాకట్టి మట్టి మొనసిపగతురన్
లోకంబులుఁ గంపింపఁగఁ
జీకాకుగ నంపవానచే ముంచి రొగిన్.

తో: అప్పుడు వానరు లధికాగ్రహమున నగ్రములు మ్రాకులు గొనుచు। గుప్పలుగా ధరఁగూలునట్లుగా గ్రుమ్మఁజె యసురులగనుచు

వ. ఇట్టిరువాఁగువారును పౌరుషంబుచే పెల్లురేఁగి విసువకపోర చుండిరి. అప్పుడు వానరబలంబులు రాక్షసబలంబుల లక్ష్యపెట్టక,

తో: కరులను దోలిన గరులచేతనే గరుల మోది చంపుచును
దురగంబులపైఁదోల వానిచేఁ దురగంబుల మోదుచును॥ రామ
పటుతర రథములు బఱప వానిచేఁ బటురథములు గూల్చుచును
భటులుగదిసినను భటులచేతనే భటుల మోది చంపుచును॥ రామ
కాలఁ గొందఱిని, గేలఁ గొందఱిని, వాలంబుల గొందఱిని కూలిచి
పోదవిరి కో యని దనుజులుగూలి లిడఁగ న త్తలిసి॥ రా॥

వ. ఇట్టి భయంకరరణంబునఁ బెక్కండ్రు రక్కసుల నోర్చి వానరులు పేర్చి యార్చుచుండిన నారభసంబు గని సహింపక,

రగడ. మూలబలము లడరి కోఁతులమూక పయిఁబడిరి
వికృతగాత్రులును, వికృతనేత్రులును,
వికృతహాసులును, వికృతనాసులును,
వికృతవక్షులును, వికృతకర్ణులును,
వికృతపాదులును వికృతనాగులును,
వికృతపుఁగరులును వికృతాధరులును,
॥మూ॥ కరపత్రింబులు, క్రకచముసలములు,
గరవాలంబులు, గదలు చక్రములు,
పరిఘులు శూలలు, ప్రాస పట్టిసలు,

పరశు-ముద్గరలు, బలుతోమరములు,
మొదలగు నాయుధములు గడు బూనుచు,
వదరక బెదరక వని వెనుదీయక,
ము॥ కడువడి జగములు గడగడ వడకగ,
నుడివడి జలజల జుక్కలు రాలఁగ,
జలనిధు లింకగఁ గులగిరు లదరఁగ,
గలవరమున దిగ్గజములు బెదరఁగ,
బలువడి శేషుఁడు ఫణములు ముడువఁగ,
బలుమఱు గ్రహములుఁ బథములు దప్పగఁ,
మూలబలము లడరి కోతుఁల మూకపయినబడిరి.

వ. ఇట్లు క్రమ్ముకొని నిలుపోవనీక వానరులఁ జెల్లాచెదరు చేసిన వారిదాడికి భయభ్రాంతులై వానరులుఁ దరులు గిరులుఁ గ్రిందవైచి తమలోఁ దా మిట్లనుకొనిరి:

కీర్తన, చాపుతాళము: (సీతారామ) వలె.

రాముఁడేలా! యినజుఁ డేలా! యుద్ధమేల! జాలును! ఆలమును మాని పోవు టదియె మేలును॥ రాము॥ కడుపు, నిండఁగాయపండ్లాకులు గొండవనముల దండిగ దినుచుండక దఱలి రా నేల॥ రాము॥ పెంకెరాక్షసుల నీక్షణమె శిక్షసేయగ మోక్షగుండాధ్యక్షు డిది యేమో కనడాయెగా॥ రాము॥

వ. ఇప్పుడు వీరిచేత జావ నేల నూపిరి యుండిన నుప్పమ్ము కొనిబ్రదుకుదుము రం డని, సేతువుమీదుగాఁ బోవు కపుల నడ్డగించి నీల - హనుమంతాంగదులు మరలించిన వచ్చి; భయభ్రాంతచిత్తులై రాముని మఱుంగునకుఁ జనిరి. దయారసంబునఁ గని రాముండు,

తో: దానవు లడరఁగ వానరు లలరఁగ ధనువు గుణధ్వనిఁ జేసి। భానుదీప్తశరవర్షం బసురులపయి గురిపించెను డాసి॥ రా॥ దనుజులు

వోఁగదారి గాన కనురణములోన దిరుగుచును। వెనుకొని రాముఁడు విశిఖంబులు పడి వ్రేయ దాఁకి కూలుచును॥ రామ॥

వ. ఉండుట గని రాముండు మఱియు,

క. చరణంబులు వదనంబులు
కరములు శిరములును వ్రేళ్ళు గాత్రంబులు న
త్తురు లురులఁగఁ దెగనేసిన
ధరఁ ద్రెళ్లిరి పెక్కుమంది దానవవీరుల్.

వ. అంత మిగిలిన రక్కసులు భయభ్రాంతులయి.

తో. అదిగో రాముం డదిగో వ్రేసెను! యిదిగో రాముఁడు వ్రేసె। నదిగో వ్రేసెను నిదిగో వ్రేసెను! యదెపాసెను నిదె డాసె॥ రా॥

వ. అని తిరిగి తిరిగి చూచుచుఁ బాఱుచుండగా రాముండలుక రెట్టింప,

తో. నెమ్మిఁ దొడిగి సమ్మోహనాస్త్రమును నేర్పుమెఱయ వడి విడువఁగను। దమ్ముఁ దా మెఱుఁగక దనుజులు భ్రమపడి తబ్బిబ్బుగఁ దిరుగఁగను॥ రా॥ ఒక్కరాముఁడే పెక్కురాములయి యెక్కడఁ జూచినఁ దోఁచె; । అక్కజముగఁ గన, సంతా రామమయంబై వైరుల నేచె॥ రామ॥

వ. ఇట్లాజిమధ్యంబున ననంతరూపులుగాఁ దోఁచి రాముండు గనిమసంగిన నెక్కడివా రక్కడనే సొలసిరి. చావఁగాఁ జిక్కనవారు తప్పించుకొని లంకలోని కరిగిరి.

క. పదివేలుగరులు, హయు లిరు
పదివేలును, భటులు నొక్కపద్మము, రథముల్
బదిపగులు గూలెనేనియుఁ
బదపడి యొకయట్ట లేచి పరువడి నాడుఁ.

ఉ. అట్టులు నూఱుకోట్లొగసియాడిన మస్తక మొండు నార్చుచున్
దట్టనలేచుఁ గోటి యవి తప్పక లేచిన రావుఱవింటికిన్
గట్టినగంట మ్రోగుఁ బదునాలుగుగంటలు నర్ధయామముల్
గట్టిగ మ్రోఁగె నార దశకంఠుని మూలబలంబు గూలఁగన్.

వ. ఇట్లు కోదండ దీక్షాగురుండగు రాముండు దేవతల కభేద్యం బయిన రావణుమూలబలంబులభేదించి సుగ్రీవ విభీషణుల దిక్కుఁజూచి యిట్లనియె:

కీర్తన: ఆదితాళము-(కనలి) వలె.

ఇలలోఁ గలబాణముల కిది మేటిగా అలగాధినందనుఁడు చెలిమి నా కిచ్చినాడు; బలమైన కలహమునఁ బఱప మే లౌనుగా॥ యిల॥ రిపులను ద్రేయ, నుపశాంతి జేయఁ; ద్రిపురారి నేరు దక్కఁ దెలియ రన్యులు నిక్క; మిపుఁ డెంత నిపుణత్వ మిది జూపెఁ గంటిరే॥ యిల॥ సమ్మోహన మను శర మిది యౌను; అమ్మోక్షగుండపతి నైన నా యనుమతి సమ్మోహితులఁ జేసె నిమ్మూలబలమును॥ యిల॥

వ. అనిన, వారు సంతోషించి శ్రీరాముని గీర్తించిరి. అపుడు విభీషణుండు—

తో: దేవతలను ద్రోలిదేవతలను భేదింపలేని సైన్యమును। దేవదేవ సాధించితి! విక దెగు రావణుండు రణముననుII రా॥

వ. అని పొగడుచుండె. అనంతరము మూలబలంబు ద్రుల్లిన వార్త విని రావణుండు,—

క. కోపాగ్ని జ్వాలలుగడు
దీపింపఁగ, గొలువు సెదర, దీక్ష బలంబుం
జూపుచు యుద్ధోన్మత్త వి
రూపాక్షాదులకు ననియె రోషములోడన్:

బేహాగ్ : ఆదితాళము-(పోనియ్య) వలె.

పోదము పోదమురం డిక మనము బోదము॥ మోదమునఁ గపి నృపుల ముట్టడించి చంపఁగను। బోదము॥ అక్షయరణదక్షుల యూపాక్ష

శోణితాక్ష మకరాక్ష దన ధూమ్రాక్షముఖ రాక్షస యోధుల బట్టి శిక్ష జేసి వెలయుచున్న మోతుగుండ నిలయుపంయికి॥ బోధను॥

రావణుని రెండవసారి యుద్ధము.

వ. అని వారిని గూడుకొని రథారూఢుండయి యుత్తర ద్వారంబునఁ జని, యుద్ధభూమికిఁ జేరినపిమ్మట ముందుగ విరూపాక్ష యుద్ధోన్మత్త సుపార్శ్వులు బహురాక్షసానీకంబులతో నార్భటించుచు వానరానీకంబులపయికిఁ దోఁచరి, —

తో: పరిఘ ఖడ్గ గద పరశు కుంత తోమర ముసలాదులచేత। నతిసుతిమోదుచు నార్భటించు వానరు లతికోపముచేత॥ రా॥ క్షితిజాతంబులు క్షితిధరంబులును శిరముల పైఁగొని తెచ్చి। ధృతితో వైచుచు దేవారుల బాధింపఁ దొడఁగి రటు హెచ్చి॥ రామ॥

వ. ఇట్లు క్షణమాత్రంబున నుగ్రవాది వానర యోధులు విరూపాక్షాద్యసుర యోధులఁ బిలుకుమార్చిన, నది గని రావణుండు గోపోద్దీపితుండయి సారథికి నిట్లనియె:

కీర్తన : ఆదితాళము—(మాతాహ) వలె.

రామలక్ష్మణులపయికి రథమును బోనిమ్ము నేఁడు! భీమశరము వెడద గుర్చెద! సారథీ; వినర బిలుకుమార్చి మరలి వచ్చెద॥ రా॥ వారుగాలినంత మీద వానరులు చెట్లపాలై పారిపోదు రింక దప్పదు। సారథీ; వినర! వీరిటిప్పు లిపుడె చెప్పెదు॥ రా॥ రాక్షసాధ్యక్షుల నెల్ల శిక్ష జేసి యుప్పొంగెను! మోతుగుండేసుల నుట్టును! సారథి, వినరా! యా క్షితిని బడగొట్టుదు॥ రా॥

వ. అని పలికి తేరుఁ బరపించి గుణధ్వని జేసి తనపయి నెదిరించిన కపిపుంగవులం బరికించి,

తో: అవలీలగ సాయకవృష్టిని అప్లవగనల్లభుల ముంచి। దివిభువి యదరగ దినకరకులు పైఁ దేరు వేగఁ బరపించి॥ రా॥

వ. రావణుండుఁ దనయుద్దండంబు జూపుచుఁ గోదండపాణితో భండనం బొనర్ప నెదిరిన యడ్డంబుదూఱి లక్ష్మణుండు—

క. కొన్నిశరంబులఁ వైచిన
నన్నియుఁ దనబాణనిహతి నడఁచియుఁ దాఁ
గొన్నిశరంబుల నాతనిఁ
బన్నుగఁ జిక్కంగఁజేసి పక్షిగళుండున్.

వ. రామునిపైకి నెదిరిన రాముండును నెదిరించి,

తో: రామలక్ష్మణులు రయమున నుభయులు రణరంగం బునదగిలి। భీమబలంబులఁ బెనఁగ జొచ్చి రుద్దామప్రజ్ఞలను మిగిలి॥ కరలాఘవమున శరలాఘవమున సరిసమానముగఁ బెనగ। సురలెల్లను నంబరమున నిలిచియుఁ జూచుచుండి రది సరగ॥ రా॥

కీర్తన: అటతాళము.(మేలైన) వలె.

రౌద్రబాణంబును రావణుఁడేయగ రయమున బైకిరాఁగ, రౌద్ర బాణముచేత రాముఁడు దానిఁ బరాస్తంబొనర్చె వేగ॥ రా॥ ఘనతమిస్ర బాణమున దశకంఠుఁడు గడుఁజీకటులు సేయుగ గనుఁగొని రాముఁడు, గర ముగ్రమగు బాణగణములచేఁ బాపెగా॥ రా॥ అతిశయబలుఁడగు నసురవల్లభుఁడు నహిశరములుప్రేయగా, మోక్షగుండేను డొప్పుగఁ బెక్కుశరముల దీక్షతోఁ ద్రుంచెఁదగ॥ రా॥

తో: అసురసాయక మసురుడు ప్రేయుగ నదియు నుష్ట్ర శార్దూల। కేసరి కిటి కరి గృధ్రోరగసమ భాసురముఖముల జాల॥ రా॥

వ. బహుసాయకంబులంబు కవిసిన రాముం డలుకరెట్టింపఁ దన విలువిద్యాప్రౌఢిమచేఁ బటాపంచలు చేసి,

తో: దహనాస్త్రము భూధవుఁ డేయ, రవి గ్రహతతిమిల్కల భాతి బహుబాణములంబు పయికిరాగ, వే భంజించె సురారాతి॥ రా॥

తో: మయదత్తంబగు మాయాశరమును మఱియుచు రావ ణుఁడు బఱప,। రయమున గాంధర్వం బను శరమున రాముఁడు దానిని జెఱుప॥ రా॥

వ. ఇట్లలతివోక యిమవ్రుఁ జోరు నవసరంబున లక్ష్మణుం డెదుఁ జొచ్చి.

తో: ఏడమ్ముల దను జేసుని పడగయు విల్లును సారథి నడచి పొడిగల్గుశర పంచక మాతని వక్షము నొవ్వఁగ విడిచి॥ రా॥

వ. సింహనాదంబు జేసిన నంతలో విభీషణుండు—

తో: తురగంబుల దుత్తునియలు సేసిన, విరథుండై రావణుఁడు॥ ధరణికి దుమికియుఁ దగశక్తిని గొని తమ్మునిపై చెదురాగ్రహుఁడు॥ రా॥

గీ. నడుమ దాని లక్ష్మణస్వామి మూఁడమ్ము
లేసి తుంచెదాన వేశుఁ డంత
మయునిచేతఁ గొన్న మహితశక్తి విభీష
ణాఖ్యుమీఁద వైవ నడగుటయును.

తో: రాము నితమ్ముఁడు రావణు తమ్ముని రయమున వెనుకకుఁ ద్రోసి। తా ముందటి బంతేమున నిలువ, నగి దశకంఠుఁడు నదిఁ డాసి॥ రా॥

కీర్తన: అటతాళము. (బాశాబం) వరి.

ఓర్చియుండు మిక వచ్చెను శక్తి॥ యో॥ కార్చిచ్చువలె మంట గ్రక్కుచు వచ్చెను॥ యో॥ విభీషణుని నీవు వెనుక నుంచుకొంటివి॥ వో॥ మయునిచే గొన్నట్టి మహానీయశక్తిది॥ యో॥ ఉరగేంద్రనిభమైన యుగ్రంపుశక్తిది॥ యో॥ మోటుగుండేశుఁడు ముదమున మెచ్చెను॥ వో॥

లక్ష్మణుని మూర్ఛ .

తో: ఘనమగ నది చిటిగంటలచప్పుడు గణగణ యని మ్రోయగను। వనధులు గలగఁగ వడిగఁ గులాద్రులు నడకగ దిశలార్వగను॥ రా॥ పిడుగులు రాలఁగఁ బుడమి జలింపగ నుడు పంక్తులు జెదరగనుఁ గడువడిఁ జని లక్ష్మణునివక్షమున గాడిన ధరపయిఁబడెను॥ రాము॥

వ. కాలావసానసమయంబునఁ బెంపుదక్కి కూలు మహామేరువు చందంబున రావణప్రయుక్తశక్తిచే లక్ష్మణుం డిలఁ బడియుండఁ గాంచి, శోకవ్యాకులితచిత్తుండయ్యెను,

క. సౌమిత్రియురము గాడియు
భూమికి దిగియున్నశక్తిఁ బుచ్చఁగఁగపులుం
దా మోపఁ రైరి యొకరును;
రాముఁడును బెటికేఁ గను బరాక్రమ మొదవన్.

వ. ఇట్లు పెటికివైచి సుగ్రీవ హనుమంతాది కపులను గాంచి రాముం డిట్లనియె:

కాపి: అటతాళము.

ఈదశకంఠుని నే దునుముటకై గాదె జనించుట, కష్టము లొందుట, మేదినిపుత్రి వియోగము సైచుట, గాదిగితమ్ముని గడకుగో ల్పోవుట॥ ఈ॥ చాలపరాక్రమశాలిని వాలిని గూలిచి యీకపికోట్లను గూడుట, యాలవణాంబుధి నటువలె గట్టుట, పోలగ మోక్షగుండ పురపతి నగు నాకు॥ నీద॥

తో: శౌర్యముఁ జూపెద సమయముగా దిది కార్యము జెడ వగచుచును| ధైర్యము దూలెడు తఱిగా దిక నా తమ్ముని గాపాడుచును॥రా॥

వ. మీరేనుఱక యుండు డింకఁ దెలిపెద.

కీర్తన: త్రిశజాతి. (వనమును) వలె.

ప్రతిన దప్పను వినుడు ప్రతిలేదు కపులార నేఁడు॥ ప్రతిన॥ క్షితి బతికి- కంసుబ్రేసుకుతోఁ జో నీను నేను॥ ప్రతి॥ సురవైరి పోక నిల్చి బరిదెగి పోటిసజాలడు॥సుర॥ యిరువురి తెంపు నెఱుఁగుదురు చూడఁగల వారు॥ ప్రతి॥ ధరణి దూటిన విడువఁ దగ వార్ధిఁజొచ్చిన విడువ ॥ధర॥ సురలచాటునఁ జొఱఁబాఱి దాగిన విడువ ॥ప్రతిన॥ తరణివంశజుఁడ నేని, దశరథతనయుఁడ నేని, నరమోక్షగుండవాసుఁడ నైతి నేని ॥ప్రతిన॥

వ. అని ప్రతిజ్ఞగాఁ బలికి తనులఁ గెంపు లొలుక ధనుష్టంకారంబుఁజేసి రావణాదిరక్కసు లభిముఖుండై తండోపతండంబులుగాఁ గాండంబులు పఱపె.

క. ప్రతిసాయకంబు లేయుచు
నతులితగతిఁ గొంతవడికి నసురేశ్వరుఁ డు
ద్ధతి బోఁజి రామబాణ
క్షతుఁడయి సమరంబుమాని చయ్యన బాసెన్.

వ. సింగంబును గని మాతంగంబు పరుఁగు పోలుభంగి రాముని చే భంగపడి యసురపుంగవుండు సంగరరంగంబుమాని ప్లవంగవిభులుఁ దఱుమ లంకఁ జొచ్చి యంతఃపురికిఁ జేరి మందోదరితో నిట్లనియె:

హిం. తోడి: అటతాళము.

రాముని విక్రమము, రమణిరో నిర్వక్రము! ఏమిజెప్పుదు భామి నీ! యెటుల గెలుతును గామినీ! ॥రాముని॥ నామదిని భావించిన రామ రూపమే తోచును! లేమరో యెందున్నది రామమయముగ నున్నది॥ రా॥ మోత్కుగుండేశ్వరుని ముట్టడింపఁగఁ జాలను! త్ర్యక్షుని సేవింతును! దప్పక జయ మొందును ॥రాముని॥

వ. అని పలికిన తత్క్షణంబున,

క. మానుగ సాత్వికవృత్తిని
బూనిశివాలయముఁ జేరి పూజించి మదిన్
ధ్యానముఁ జేయుచునుండిన
దానవపతిఁ జేరి పలికెఁ దత్సతి తెగువన్.

తో: ఇదివఱ కందఱ నెదిరి జయించితి వెన లేరెవ్వరు నీకు; దుద కిటు మగటిమి దూలి పలుకు టిది తోఁచిన యూనన యన బోకు ॥రామ॥

కళ్యాణి ఆదితాళము.

నీకింత భయమునే డేటికి నీవు పంతము చెడి భయపడువాఁడవు? పరకాంత నపుడుదేనేటికి? తేనేటికి? తేనేటికి? ॥నీ కింత॥ తాతయు దమ్ములు దల్లియు నేనును నీతిదెలుప వినగూడదాయెన ॥నీ కిం॥ పుత్రులు మిత్రులు బొలిసినపిమ్మట శత్రులకు నను లొంగవచ్చునా ॥లొం॥ ఈతీతి

శూరుఁడ వేని మోహఘుగుండేశుని నెదురుము చాలును ॥అంతేచాలు॥సీ॥

వ. అని తూలనాడిన సిగ్గునఁ దలలు వంచుకొని కొంతవడికి భార్యదిక్కుఁ జూచి నిట్టూర్పుఁ బుచ్చుచు నిటు లనుచున్నాఁడు:

శ్లో: అలివేణిరో! నీ వన్నది నిజమే! యయిన రామునకు తెలివ! జెలగి హోమమును జేసి పోయి నేఁ గెలిచెదఁ బొ మ్మింక తెలివ॥ రామ॥——

వ. అని యిట్లు ధైర్యంబుగఁ బలికి మండోదరిని బంపి తానును హోమంబుఁ జాలించి గృహంబున కరిగి శయనించె- నిక్కడ రాముండును,

క. నెత్తుటఁ దోఁగినతనువున
నొత్తిగిలంబడిన తమ్ము నురువడి గని తా
జిత్తంబు గరఁగి కన్నుల
నత్తఱి బాష్పములు దొరగ హా యని యేడ్చెన్.

ఫీల్ రాగము: అట తాళము.

అయ్యో నాతమ్ముఁడ! యయ్యో! లక్ష్మణ! చయ్యన నను బాసి చనినావదివికి ॥న॥ అడవుల మాతోడ నిడుమలు గుడిచి కడకు దైత్యునిచేతఁ బడితివి యిచట ॥న॥ కావలె నన్నరాఁ గల దట్టిభార్య నీవంటితమ్ముని నేనెందుఁ దెత్తు నయ్యో ॥అ॥ పలుమాఱు నే నింత పలవించి పిలువ నెలుగెత్తి యో యన వేమిరా యనుజా! ॥అ॥ ఎల మిని మోహఘుగుండేసుఁడ ననుచుఁ బలుకుచు సేవలు సలుపుదు నాకు ॥నయ్యో॥

తేవారము. నాకు యుద్ధంబి కేల! నాకు రాజ్యంబి కేల!
నాకు జయ మింక నేల! నాకు నీసీత యేల!
నాకు నీసౌఖ్య మేల! నాకు బ్రాణంబు లేల!
నాకు నీతోడిదైవలోక మే యగును జాల.

తో: నాతోఁ గూడి వనంబులకును దిన్నగ వచ్చితి వీ వపుడు। నీతోఁ గూడా నేను దినంబున కేతెంచెద మఱి యిపుడు॥రా॥ ఇంతె కాని ని న్నెడ బాసియు నే నెంతయు నుండఁగఁ జాల। బంతంబున నీకుఁ బ్రత్యర్థులపైఁ బడి చంపుట నా కేల॥ రా॥

వ. అని యనేకవిధంబుల సౌమిత్రిసుగుణంబులు దలఁచుకొని శోకించుచున్న రామచంద్రునిఁ జేరఁబోయి సుషేణుండు ధైర్యవచనంబు లాడుచు నిట్లనియె:

కల్యాణి : రూపకము.

శోక మేలనయ్యా ! విను, నీకు మేలుగాదు మాను; ప్రాకటముగ నీతనికిఁ బ్రాణభయము లే దికను॥శోక॥ మేనునఁ బ్రాణముఁ బాసిన వాననమున గళ లున్నె! మానుగ నిందీవరములమాడ్కి గనులు తెన్నొంగునె॥ శోక॥ అందములై యరచేతులు గెందామరలటు లున్నె! తొందరేల! మోక్షగుండసుందర నీడెందంబున॥ శోక॥

వ. అని పలికి రాముని శోకం బార్చి హనుమంతునిఁ జూచి సుషేణుం డిట్లనియె:

క. మును జాంబవంతు మఖమున
విసియుంటివి మూలికలను వివరింపంగా,
హనుమంత, ద్రోణగిరి ద
క్కినపుశిఖరంబునందుఁ గలివెదురు మలక.

వ. అందు విశల్యకరణి, సౌవర్ణ్యకరణి, సంధానకరణి, సంజీవకరణి, యను నాలుగౌషధలతలు గలవు. వానిని వెదకి తీసికొని వత్తువేని ఈలక్ష్మణుని ప్రాణంబులు మరలింపవచ్చును, లేకున్న నొండు సదుపాయంబులేదు,

కేదార: చాపుతాళము. (కోరియం) వలె.

పోయి రమ్మిక హనుమంత॥పోయి॥ వాయునందన లేవపోయి వేగమునంబకు పోయి ముందుములుగొనిరా పోయి తేవోయీ యీ

హోయీ కావోయీ॥ పో॥ మించి ద్రోణాద్రిని శోధించి గంధర్వుల జయించి, రాక్షసులను దుర్మించి సాధించి, లక్షించి, కుప్పించి॥ పో॥ చండకిరణుఁడు పొడుపకుండ రావతె మోక్షగుండెరఘుపతి గనుచుండ ప్రొద్దుండ నేదండ నిలకుండ॥పోయి॥

వ. ఇక్కడికి నాలుగులక్షల యిరువదివేల యిన్నూట పదియోజనంబులదూర మున్నది. ప్రొద్దువొడిచిన నౌషధములుఁ బనిజేయఁజాలవు. క్షీరాబ్ధిని దాఁటి జవంబునఁ జేరు మనిన, హనుమంతుం డొడఁబడియె. అప్పుడు రాముండు—

క. ఈతమ్ముని బ్రతికించియు
భూతలమున నీవు కీర్తిఁ బొందుము వత్సా!
నీతోఁ గూడఁగ నలువురు
నాతమ్ము లటంచు వాయునందన తలఁతున్.

వ. అనిన, విజృంభించి మహానందంబున నాంజనేయుం డిట్లను చున్నాఁడు:

శంకరాభరణము: ఏకతాళము. (అమ్మయ్య) వలె.

నావంటిబంటుండ, నీ వేల వెరగంద! వేవేగ మందులు వెతకి నే; దెచ్చెద॥ నా॥ ఆయేడుదీవుల కావల నుండిన, నాయద్రి నేగెడు నంతలోనె దెత్తు॥ నా॥ ఆమిత్తి నదలించి యననిపై బొలియించిసౌమిత్రి ప్రాణపంచకమును మరలింతు॥ నా॥ ఈలోకమునగాదు యేలోకమున నున్న నాలక్ష్మణుని దెచ్చి యర్పింపనా నీకు!॥ నా॥ మోక్షగుండేశ్వర, మ్రొక్కెద దీవించి యాజ్ఞ మే పంపు మేతెంతుఁ దడయక॥ నా॥

వ. అని మ్రొక్కి దీవనలంది సుగ్రీవాంగద జాంబవంత విభీషణుల వీడ్కొని పర్వతాగ్రంబు నెక్కి లంకాపురగోపురంబుఁ గూలునట్లుఁ గుప్పించి యెగసి వియన్మార్గంబున నదీనద పర్వతారణ్య పురంబులఁ బరికించుచుఁ బోవుచుండె. ఇక్కడ—

క. వేఁగులవారలు తెలుపఁగ
వేగంబున రావణుండు విని విహ్వలుఁడై
భోగీంద్రుపగిదిఁ గసలుచు
నేగెను నా కాలనేమి యింటికి వేగన్.

వ. ఇట్లు వచ్చినరావణుని సత్కరించి కాలనేమి యిట్లను చున్నాఁడు.

తో: యేమిపనికి నాయింటికి వచ్చి రేనిశివేళను సనఁగా। నే మఱు తెలిపెద విను మొకపని, కాలనేమి, సేయవలయునుగా॥ రామ॥

క. అదియేమి యన్న, నుడివెద
మదమున నచ్చక్తి మూర్ఛ మునిగినయనుజున్
బ్రతికించుకొనుట కనువౌ
సకుపాయం బెంచి రామచంద్రుం డాత్రన్—

క. సంజీవకరణి కొఱకై
యంజని పుత్రకునిఁ బంప నతఁడేఁగె వడిన్
భంజింపుము నీవడ్డము
గం జని యటు చేయఁ జేరగాకుండినచోన్.

వ. మాయోపాయంబుచేత వాని ప్రయాణంబు సాగకుండ నయినఁ జేయుము. ద్రోణగిరి సమీపంబున నొక్క సరోవరమున్నది. దానియం దొక్క మకరియున్నది.

తో: అది దేవాదులనైనను మ్రింగును నగపడుఁడనగాఁ నెంత! । వదలక యచటికి, వాయుజుఁ డేగకుపగిది జేయు మిది వింత॥ రా॥

వ. వేగంబునఁబో మ్మనఁ, విని కాలనేమి యిట్లనుచున్నాఁడు:

శంకరాభరణము : ఆదితాళము – (మేలైన)వరసె.

మాయామృగాకృతి మారీచుఁ డేగియు మాయమైపోఁడె మును గోయని యార్చునుఁ! గుంభకర్ణాదులు గూలరె చూడు మును! లంక

సీతమ్మనుఁ జేలగ గట్టి సీతమ్మ నింక రామునకు నిడి । శంకరుగూర్చి నిశ్చయముగ దపమును సలుపు మేలు గలిగెడి! అదికానిచోఁ బోయి యలమోక్షగుండేశు నెదిరించి వడిఁ బోరుము కదనరంగమునందు ! గడతేరి వైకుంఠ పదమునకును జేరుము॥ మా॥

వ. అంతేకాని యీ మాయలవల్లఁ బ్రయోజనం బేమనఁ, గోపించి దైత్యేశ్వరుఁడు చంద్రహాసంబునఁ గాలనేమి తల తెగ నేయఁ బోయిన, నది యెఱింగి.

తో: ఇదిగో పోయెద నేటికిఁ గనలెద, వింటికి జను మని పలికి। తుది యిది యనుకొని తూర్ణంబున వాతూలసుతునిపై నలిగి॥ రా॥

వ. కపటముని వేషంబున ననేకశిష్యగణసహితుండయి మనోవేగంబున ద్రోణాద్రిసమీపమందున్న దివ్యవృక్షసహితంబయిన యొక్క వనంబుఁ జేరి యాశ్రమం బేర్పఱుచుకొని,

తో: మునివలెఁ గన్నులు మూయుచు గొణుగుచు బూసలు ద్రిప్పుచునుండ, । ననిలజుఁ డంబరమున బోవుచు నది గని యాశ్చర్యము నిండ॥ రా॥

స్రగ్విణి.

ముందు ద్రోణాద్రికిన్ బోవునా డీవనం
బిందులే దింతలో నెట్టులన్ వచ్చెనో!
దారి నే దప్పితిన్! తందరన్ వచ్చుచోనిన్!
విందుగా నీమునిన్ వేఁడి యోజించెదన్!

వ. అని యెంచి తత్క్షణంబునఁ గ్రిందికిఁ జనుదెంచి మునికి నమస్కరించి యిట్లనుచున్నాఁడు:

తో: రాముని కార్యార్థంబుగ జనియెద; నే మారుతతనయుఁడను;। ఓ మునివర నాకొదవెను దాహము ! ఉదకము జూపుము తగను॥ రా॥

వ. అనిన, నక్కపట మునీంద్రుం డిట్లనియె:

కం. మా వనమునఁగల ఫలములు
నీవలసినవి యారగింపు; నీర్వట్టపఁగన్
ద్రావు కమండలు జలములు;
పావని, నీయుద్యమం బవశ్యము సాగున్.

వ. మా కాగతానాగతములు దెలియును; చెప్పెద వినుము.

కీర్తన : అటతాళము - (శంకరభం)వలె.

వేమఱు దెలిపెద వినవోయీ! నామాటలు గుఱుతిడుమోయీ! రామునిభామిని రావణాసురుఁడు నేచుటించుకొని యేగెను లంకకు॥ వే॥ అది గని రాముం- డలిగి కపులతోఁ గదలి వచ్చి లంకకుఁ జేరఁ పోద లుచు రావణు పుత్రమిత్రులను జిదిపిన, నాదశవదనుఁడు గినలుము॥ వే మోతుపురవరాధ్యక్షుని యనుజుని దీక్షమీఱ శక్తినినైచి, యీక్షితి గూల్చిన, నిపుడు ద్రోణగిరి కతుయోషధులకై వచ్చితి విటు॥ వేమ॥

క. రాముఁడు లోకహితార్థము
గా మహి జన్మించినాఁడు గాన, సహాయం
బేమును జేయుట ధర్మ్మా;
బోమారుతి! మంత్రతతుల నుపదేశింతున్.

వ. అమ్మహామంత్రపునశ్చరణంబున సమస్తకార్యసిద్ధులొదవు. ఇదియునుంగాక——

తో: సంజీవనిముఖసకలౌషధములు సమృద్ధి మానసమునను; నాంజనేయ, నే నరుఁడు వాడిచిన నవి తెచ్చిచ్చెద నింను॥ రామ॥

వ. నామంత్రసామర్థ్యంబునఁ గనుఱెప్పవేయునంతలోఁ లంకకుఁ జేరఁగలవు. లక్ష్మణునకు బాధ లేకుండు ననిన, హనుమంతుం డిట్లనియె.

తో. అక్కడ లక్ష్మణు డట్టులుండ నా కిక్కడఁ దడయుట తగదు;॥ అక్కఱలేదు ఫలాదులు; జలమును, జిక్కిన దాగవియు జనుదు॥ రా॥

వ. మీ కమండలోదకమ్ములు నాదాహంబు దీఱునన్ని లేవు. కొలనుగాని, నదిగాని యుండినఁ దెలుపుఁడు. త్రావి పోయెద. అనినఁ గాలనేమి—

తో: ఉన్నది చేరువ నొకకొల; నచటికి జన్న నుదకములు గలవు; పన్నగ శిష్యులఁ బంపెద వెంబడి బనుము చూపెదరు నెలవు॥ రా॥

వ. ఇట్లు పలికి తన శిష్యులఁగూడ నిచ్చి పంపిన, హనుమంతుండు జని, కలహంస కారండవ చక్రవాక బక పక్షితతులచే నొప్పి కమలకహ్లారసహితంబయి మీన మకర కర్కట జలూక గ్రాహసమన్వితంబయి యలరారు సరోవరంబు మనోహరంబుగాఁ గనుపట్టె. అందు దిగి యుదకంబులు గ్రోలుచుండ, నప్పుడు—

తో: ఒక్కమకరి తనయుగ్రపుకోరల నొడిసి కాలు నమలగను। జక్కగ రౌద్రరసం బొలుకగ దిగఁద్రొక్కె పండ్లు తెమలగను॥ రా॥

వ. ఇట్లు పండ్లూడఁ దన్నిన, బోక యది మహారోషంబున నాంజనేయుని మ్రింగఁ దలపడిన, తన మనంబున—

కీర్తన : ఏకతాళము—(కాలికి) వలె.

అక్కటా ! శ్రీరామకార్య మట్టె నిల్చెను ! జిక్కినాడ నిచట మొసలి చిక్కబట్టెను॥ న॥ త్రాణలేదు ! చత్తునేమొ దైవమా యిక ! ద్రోణశైలమెట్లుఁ దెత్తు ! ద్రోవతోఁపదు !॥ అ॥ నన్నునమ్మి మోక్షుకుండనాథు డంపెను ! బన్నుగా నక్రంబుమధ్యపట్టి జంపెను॥నక్కడా॥

వ. ఈవిధంబున డోలాయమాన మానసుండయియున్న హనుమంతుని మకరి మ్రింగినఁ, దిన్నఁగా గడుపులోఁ బ్రవేశించి,

తో. దానికడుపు బ్రద్దలు జేసియు బవమానసుతుడు వెలిరాగ మానుగ నది సురమానినియగుచు విమాన మెక్కి పయికేగ॥ రా॥

వ. ఆంజనేయు డాశ్చర్యకలితచిత్తుండయి వియత్తలంబున నున్న యమ్మత్తకాశిని గనుంగొని, ఇంతకుముం దనంతబలాక్రాంతనక్రంబవై।

పంతంబున నన్ను వంత నొందించితివి! ఇంతలో దేవకాంతనంబు యంత రితిమున కెగిరితివి. వింతగానున్నది! నీకథ సవిస్తరం బెఱింగింపుము, అనిన, నాపె యిట్లనియె:

కేదార: రూపకము—(సాటి) దరు.

నేను ధాన్యమాలి యనుదానను; గంధర్వశశివదనను॥ నే॥
గానమభవుచెంత జేయఁగ సమ్మానించి-తా నిచ్చె విమానంబును॥ నే॥
ఈవిమాన మెక్కి నిత్య మీకొలంకుఁ జేరి క్రీడించుచు బోవ నొక్క-
నాఁడు, శాండిల్యుడు భావమునఁ గేవలముగ దా నలచెను॥ నేను॥
కోరి మోతుగుండవిభుని కొఱకు కేళిఁ గూడు మని వేడిన, 'నే రజస్వల
నైతి; మూడహములు దీఱినను గూరిమితో గూడు' మంటి॥ నేను॥
ఉ. అంతట గంధమాదనమునందు మునీంద్రుని యింటనుండఁగా
నెంతయు రావణుండు విజయేచ్ఛను గ్రుమ్మఱుచుండి నాటిసా
యంతననుండఁ దా విడిచి యచ్చట బాడెను నన్నుఁ జేరి యా
కంతుని కేళి గూడు మనఁగా నను ముట్టఁగరాను పొమ్మనన్.

తో. వినక నన్నుఁ బైకొని రమియించిన దనుజుం డతికాయుండు।
ఘనముగ గలిగినఁ, గైకొని లంకకుఁ జనియెను దశకంఠుండు॥ రాము॥
గీ. స్నాన మాడినంత జని మౌనితో నను
గూడు మన్న, నతఁడు గోపగించి
నాకు మాట యిచ్చి నాయింటిలోనుండి
యన్యుఁ గూడినావె హరిణనయన

తో: కావున నిను నేఁ గలయ; మకరివై నీవీకొలకున నిలుము।
పోవును జెడి నినుఁ బొందినయాతఁడు పుత్రమిత్రులతో నిజము॥ రా॥

వ. అని శాపం బిచ్చిన, నేను భయపడి శాండిల్యమహాముని పాదంబులకు నమస్కరించి శాపంబు బాపు మని బహుభంగులఁ బ్రార్థించితి. ఆతఁడు గరుణించి,

తో. 'కొంతకాలమున కా రఘురామునిఁ గొలిచి వచ్చుఁ బవనజుఁడు। చింతిల కాతనిచే శాపము చనుజెలి' యనె మునితల్లజుఁడు॥ రా॥

వ. అంత నాముని గంగాయాత్రకుఁ జనియె. నే నీకొలనిలో మకరినయి పడియుండి బహుకాలంబయ్యె,

జంఝూటి : అటతాళము—(పాలించరా) వలె.

నేఁటికి శాపము దీఱె! బోఁటినై యిచ్చగఁ బోవఁజేకూరె! మాటికిఁజిక్కులు బారె! బాటిగ దాపసి బలికినవిధమున నీటికివచ్చిన నిను బట్టగానే నే నిను॥ నేటికి॥ మోక్షగుండేశునిపనికి దీక్షతో నీ వరుదెంచితి విప్పటికి! రక్షించితివి న న్నింతటికి! వృక్షచరాధీశ, వెడలుము ద్రోణాద్రి! కక్షయనుగ దారి యదియయగు వినుము దారియది ॥ నేటికి॥

తో: నిను గొలనుకు బొ మ్మని పంచిన యాతని మునియని నమ్మకుము । నినుఁ జాప దశాననుఁ డంపగ వచ్చిన దానవుఁ డని కనుము॥ రా॥

వ. ఆకపటాత్ముని శీఘ్రంబున రూపుమాపి ద్రోణాద్రికి బ్రా ని తెరువుఁ జూపి దీవించి హనుమంతుని వీడ్కొని ధాన్యమాలి దివి కరిగె. అంత, హనుమంతుండు గాలనేమి యున్నకడకు శీఘ్రంబున వచ్చి నిలిచిన,

క. కపటాత్ముఁ డతఁడు గదలక
జపతత్పరుఁ డయినవాని చందము దోఁపన్
దప మొనరించుచుఁ బిమ్మట
నిపుణతతోఁ గనులుదెఱచి నేర్పున బలికెన్.

గీ. ఎంతసేపాయె నీ వేగి! యింత తడవ
యేమి చేయుచు నుంటివి యెఱుఁగ బలుకు!
మఱియు నుపదేశ మొనరింతు మంత్రములను
దెలియ గురుపూజ కేమైనఁ గలదె తెమ్ము.

వ. అనిన, నాంజనేయుండు గుపితుండయి,

తో: ఇదిగో! దక్షిణ యిచ్చెద గురువర ముదమున గైకొమ్మనుచు। వదలక బిడికిట వక్షము బొడిచిన, వాఁడు పక్షియై తఱచు॥ రా॥ కవిసిన నెఱికలు గనునడి విఱచిన గంభీరవమ్మై తగుల। దివిరి బిట్టు తలఁ దెగఁ బొడిచిన నాదేహము మాఱెయు మరల॥ రా॥

వ. సుగ్రీవుని రూపుధరించి ఎదుట నిలిచి యిట్లనుచున్నాఁడు:

పూరికళ్యాణి: చాపుతాళము.

ఇది యేమి నీవు యిచటనే యున్నావు! మది దెలియలేవు! మరలియు నచటికి రావు॥ ఇది॥ మనలక్ష్మణుడు మూర్ఛ తేరినాడు! మన కేల జూడు మందులు గిందులు నేడు॥ ఇ॥ మందులకొండ మహిమోతుగుండ మందిరమందుండ, నెందుకు నో వాతాత్మజ॥ ఇది॥

వ. అని పలికిన సుగ్రీవుఁ డని భ్రమ చెందియు మరల గాఁ డని నిశ్చయించి కోపంబు నిగుడ విజృంభించి,

తో: బెట్టిద మగుతన పిడికిటిపోటుల భీమం బగుపదహతుల। మట్టి వాని క్షణమాత్రంబున యమునికిఁ జేర్చె బహుగతుల॥ రామ॥

వ. ఇట్లు గాలనేమిని జంపి హనుమంతుఁడు వేగంబున ద్రోణగిరి కరిగి యెంతపరిశీలించినను మందులు దొరకకున్న నిట్లనియె:

తేవారము: రాముఁ డౌషధములకును రయమునను బంపినాఁడు:
నో మహీధరము! నేను నేమమున వచ్చినాను;
ఆమహామహునిపనికి సరకొఱలు జేయవలదు;
క్షేమముగ మందులిచ్చి శీఘ్రంబున బంపు మెచ్చి.

వ. అనిన, నతండు వినకున్నఁ గోపించి,

తో: రాలకు గనుదయ రమ్మన వచ్చున! చాలును నీతోఁ జెలిమి! కేలఁ బట్టి యవలీలగ నే బెఱికెదను సుమ్మి నాబలిమి॥ రా॥

వ. అని కోపాగ్నులడర విజృంభించి, వాల మంకించి, దశయోజన విస్తీర్ణంబును బంచదశయోజనోన్నతంబును నగు పర్వతం బెల్లగించి, నెత్తినఁ బెట్టికొని పోవ నుద్యుక్తుం డయిన, నాయోషధుల గాపాడుచుండు చిత్రసేనాది గంధర్వులు బహుయూఁథు కోట్లనుండి పైబడిపోనీయక యెదిరిరి.

తో: వాలపాశమున వారిని జుట్టియు వడిగా గిరగిర ద్రిప్పి వాలాయంబుగ వార్ధినిబడగా వైచె గొందఱిని గుప్పి॥ రా॥ కొందఱ నేలనుగూలిచె నలుకను గొందఱ నొవ్వగఁజేసె; గొందఱు బిమ్మటఁ గోపముడిగి గిరిఁ గొనిపో మ్మనగా సైచె॥

వ. గంధర్వుల నిటుల జయించి ధరాధరంబు నెత్తినఁ బెట్టుకొని మారుతి వచ్చుచుండె. ఇక్కడ నందిగ్రామంబున నానిశీథమున భరతునకుఁ గొన్ని దుస్స్వప్నంబులుఁ దోఁచిన, లేచి మోము వెలవెల బాఱ దిక్కులు సూచుచు,

హిం. తోడి: రూపకము.

ఆహా దైవమా! మమ్మాదరింపుమా! దేహము గంపించె నేమో! దిగులు దోచెను॥ ఆహా॥ రామలక్ష్మణు లడవిలో మెలంగుచు నేమియైరో! భూమిజాత యెటుల నున్నదో॥ ఆహా॥ దుర్నిమిత్తము లిపుడు దోచె! సత్యము కర్ణగోచరంబుఁ జేయుఘనులు గలుగరు॥ ఆహా॥ దీక్షతో వారిగడువు దీఱవచ్చెను! మోక్షగుండవిభుని జూచుపుణ్య మెప్పుడో॥ ఆహా॥

వ. అని విలపించుచు వేదపారగులగు బ్రాహ్మణులఁ బిలిపించి హోమాదిశాంతులు చేయించి దానంబు లిచ్చె. ఇంతలో—

తో: హనుమంతుఁడు బాలార్కుని విధమున నంబరవీధినివచ్చి। ఘనముగ నందిగ్రామమ్మున భరతుని గని తలఁచెను మెచ్చి॥ రా॥

క. రామునివలె నున్నాఁ డితఁ
డేమీ నిశిని నిటకు నేటికి వచ్చెన్!

సౌమిత్రి మృతుండైనను
భూమిజ నటు విడిచి రాగఁ బోలును సుమ్మా!

వ. అయినఁ జూతము బోయి యడుగుగునా నలచా యని కొంతఁ జింతించి యంతలోఁ దనమునంబున నిట్లని తలంచు:

హిం—కాఫీ : అటతాళము.

రణనిపుణుం డగు రాముఁడు వచ్చెనె! యేణబుద్ధిచేత నిట్లను కొంటి నక్కట! ॥రణ॥ ప్రాణములతో రావణు విడిచి క్షోణిజ సుమిత్రాసూనుల విడిచి॥ రణ॥ మోతుగుండాధిపు మ్రొక్కఁగు లుండఁగ వీక్షించి బ్రమసితి వెఱ్ఱితనంబున॥ రణ॥

వ. తనబుద్ధిభ్రమణమునకుఁ దానే నిందించుకొనుచు వియన్మార్గంబున వచ్చుచుండఁ గని భరతుఁడు—

తో: నే నుస్వప్నము నేఁడుగాంచి మదిఖేద మొందు చుండగను। ఈదుర్గ్రహ మిటు లేటికి వచ్చెనో! యిపుడే చంపఁగఁ దగును॥ రా॥

వ. అని కోపాటోపంబున శరచాపంబులఁ గేలధరించి లేచిన భరతునకు నాకాశవాణి యిట్లనియె:

తో: మీకార్యంబులు మకొనిచేసెడి మీబంధుం డితఁడగును; బ్రాకటముగ గోపము జేయకు డస, భరతుఁ డూరకుండగను॥ రా॥

వ. హనుమంతుఁ డంత శీఘ్రయానంబున దక్షిణాంభోనిధి సమీపంబునను వచ్చిన, రావణుపనుపున మాల్యవంతుండుఁ బదివేల కోట్లరాక్షసులతోఁగూడ దారి సడ్డగించి,

కీర్తన : అటతాళము – (రామకృ)వలె.

పోకుర పోకుర పోకుర వానర సీకును నాయున్న నేటితో దీరెను॥ బో॥ ఒక్కరిద్దఱిని నొంచుట గాదిది! పెక్కురచేతను జిక్కితి వెక్కడ॥ బో॥ నమ్మనురంగను మాటలే! యాకుధరమ్మటు వైచి యురమ్ము దురమ్మున॥ పో॥ మోతుగుండేశుని మోహాపుతమ్మున కీక్షితి బ్రాణము లియ్యఁగఁ బోదువా॥ పోకుర॥

వ. అని భుజబలదర్పితులయి తాఁకి పరశు తోమర ప్రాసపరిఘాదులచే నడంచిన సరకుఁగొనక శైలంబు నెత్తిన దృఢముగా నిలుపుకొని,

తో: కొందఱ వ్రేసెను; గొందఱ ద్రోసెను; గొందఱఁ జుఱచుఱఁ జూచెన్! గొందఱఁ దోఁకను గ్రుమ్మి చంపె; మఱి గొందఱఁ గాళ్ళను దాఁచెన్॥

వ. ఇట్లు తనవారందఱు మడిసిన మాల్యవంతుండు గనిసి యాంజనేయుని కిట్లనియె:

క. వననిధిమధ్యంబున నను
వినతాత్మజు నెక్కి వచ్చి విష్ణుఁడు పూర్వం
బున దాఁకి నోడిపోయెను
నిను నోర్చుట యెంత నాకు! నిలువర యనిలోన్.

వ. అని ఖడ్గంబుచేత మోదిన హనుమంతుని వక్షంబుదాఁకి విఱిఁగె; అప్పుడు హనుమంతుండు నొచ్చి,

తో: 'ముదిమివాఁడ వని వదలిన మానక గదిసితి! మంచిది! యనుచు! జిదుమక వాలముచేఁ జట్టియు వానిఁ జరజర ద్రిప్పుచు నగుచు॥ రా॥

వ. వనధిలోఁ బడవంచిన వాఁడు తిన్నగా నా మార్గంబునఁ బాతాళవివరంబుఁ జొచ్చె. హతశేషులు దిక్కులకుం బాఱిరి. అంత హనుమంతుండు సముద్రంబుఁ దాఁటి వచ్చుచున్న నాదీప్తిగని ప్రభాతంబు గావచ్చె నని శంకించి యిక్ష్వాకుడరాముండు విలపింపఁ దొడంగె

ముఖారి : ఆదితాళము.

తోడునీడ వనుచు నుంటి నయో! నేఁడదియెల్ల దీఱెను సోదర! ॥తోడు॥ చూడఁగ మారుతి రాఁడు మందుఁబుఁ గొని! వేఁడివెలుఁగు పొడిచెను! సోదర॥ తోడు॥ భామసుమిత్రకు భరతశత్రుఘ్నుల కేమని

తెలుపువాఁడను॥ సో॥ అడవులలోపల నాలి గోల్పోయితినని నిను గోల్పోయితి! సోదర॥ తోడు॥ ఈక్షితి మోక్షగుండేశ్వర, నీసేవ యెపుడు జేసెద సంహవు ॥సోదర॥

తో: దేనికి నే జింతింపను! మఱియొక దానికి జింతించెదను!। మానుగ నను మఁగవానిగ నెంచెను దానవానుజుం డేదను॥ రా॥ తనవారల నందఱిని విడిచి నాదాపు జేరినా డితఁడు!। నిను లంకకు రాజును జేసెద నని నే నంటిని గద యపుడు ॥రా॥

వ. సూర్యోదయంబు గావచ్చె! ఇంక నాతమ్ముఁడు జీవింపఁడు! పిమ్మట నాప్రాణంబులు నిలువవు. నే సితనితోఁ గూడ దినంబున కరగి నచో విభీషణున కిచ్చిన యభయహస్తంబు దీర్చువా రెవ్వరు దైవమా!

తో: శరణార్థుల రక్షణ జేసెద నను బిరుదు పోయె నే డకట! తరణివంశజులు ధర్మచరితులను దారి దొలఁగ నేఁ డిచట॥ రా॥

వ. కాఁబట్టి యీవిభీషణుని యయోధ్యకుఁ గొనిపోయి భర తునకు నొప్పగించి యొక్కయుపకారంబుఁ గట్టుకొమ్ము సుగ్రీవా!

తో: నేఁ జెప్పితి నని నేఁడు భరతునికి నీవు చెప్పి యీతనికి। నోజను గట్టు మయోధ్యను దొలఁగకు నే జడియకు మీపనికి॥ రామ॥

వ. పిమ్మట నీవును గపిసైన్యంబులతో గలిసి కిష్కింధఁ జేరుము. నాతమ్మునితోడ నేను బోయెద సనుజా! సుగ్రీవా! అని సైన్యంబున వగచుచుండిన రాముని గని వగపుఁ జెందుచు సుగ్రీవుం డిట్లనియె.

శుద్ధకాంభోజి : ఆదితాళము.

వగవ వలదు దేవరా! యజ్ఞానిరీతి॥ వగవ॥ తెగువకార్యములందు దిగులు జెందఁగ నగునా॥వగవ॥ ధైర్యమే సర్వసాధన మని తెలుపు చుందురార్యులు; వైరిసూదన, సూర్యుఁడు వచ్చువేళ చూడఁగ లేదీర్రీల॥ వగవ వలదుదేవరా॥ మూఁడవజాము మీఱఁగ శ్రీమోక్షగుండతేశ ! మారుతి సేరఁగ వేడుకతోడనచ్చు విమలౌషధములుఁ దెచ్చు॥ వగవ॥

వ. అని ధైర్యవచనంబు లాడుచున్నను దేఱక రాముండు గ్రమ్మఱ ని ట్లనుచున్నాడు:

తేవారము. తమ్ముఁడా! తండ్రి నన్ను దండకాటవుల కంపెఁ
బొమ్మనెనె నిన్నుఁగూడఁ! బూర్ణమగుభక్తితోడఁ
గ్రమ్మఱించినను వినకఁ గదలి వచ్చితివిగాక!
నెమ్మదిని మోసపోతి! నిన్ను నే గోలుపోతి!

తో. నన్నన్నా యని యెన్నడుబిలుతువొ! యెన్నడు విందునొ జెవులఁ! జెన్నుగ నాకును సేవలు జేయఁగ నెన్నడు గందునొ గనుల॥

యదుకులకాంభోజి. అటతాళము :

సీతను జెఱఁగొన్న యాతుధానుల దుంచి వేతు నందువు తమ్ముఁడా!॥ నిద్రగన్నెఱుఁగని నీకు నేటికి దీర్ఘనిద్రవచ్చెనె! తమ్ముఁడా! ॥సీత॥ కాఱడవుల నన్నుఁ గాపాడి విడిచితి: ఘోరాజిలోఁ దమ్ముఁడా! మోక్షగుండేశ్వర, ముందుగ రిపుల దున్మెద నందువుర తమ్ముఁడా!॥ సీ॥

వ. అని యిట్లు మితిమీఱినదుఃఖంబుచే వగచి రాముండు మూర్ఛిల్లిన వనచరులు దేర్చిరి. ఇంతలో హనుమంతుండు సమీపించె. అదిసూర్యోదయం బని కపులు తహతహపడిరి. రాముఁడు గన్నులుఁ దెఱచి చూచి,

తో: పగవారికి దోడ్పడుగద సూర్యుఁడు! తెగువతోడ బొడిచెడిని!। తగవా యిటనికి దనకులజులపంబు దయజూపక వచ్చెడిని॥రామ॥

వ. అయిన నేమి! యీచండకిరణుని మతోద్దండచండకాండంబుల పాలుసేసెదఁ జూడుండని కనుకొలుకులఁ గోపాగ్ని కణంబులు పొటపొటరాల—

తో: బ్రహ్మాండంబులు బ్రద్దలు జేసెడు ప్రళయకాలశివుభంగి బ్రహ్మాది దిశాపతులు వెఱచి గంపంబునొంద నుప్పొంగి॥ రామ॥ కోదండము చేకొని రౌద్రాస్త్రము గురుతుగ సంధింపగను! నా దాశరథికి నని మెఋక్షపతి యతివినయము దోఁపఁగను॥ రా॥

నవరోజు: ఆదితాళము.

పగఁ గొన నేటికి రాఘవా! నీకు ॥బగ॥ జగములు నీశరసంధానమునకుఁ దగ వడవడవడకెను గాదె। ॥పగ॥ హనుమంతుఁడు ద్రోణాద్రిని దెచ్చెను! గనుగొను మర్కటుఁడు గాడు! ॥పగ॥ ఓషధీదీధితు లొప్పఁగ నెమ్మదిఁ బూషుం డనుకోనేల ॥బగ॥ మోతుకుండవర, యీక్షణమున గపిముఖ్యుల నెదురుగఁ బంపు॥ పగ॥

వ. అని యిట్లు చెప్పుచున్నంతలో—

క. హనుమంతుఁడు ద్రోణాద్రిని
గొని వచ్చియు మ్రోలనుంచి కూరిమితోడన్
జననాథుఁ జేరి మ్రొక్కియు
వినయంబున నిట్లు పలికె విశదము గాఁగన్.

తో: పోవునప్పుడును పోయివచ్చుతఱిఁ ద్రోవను బహువిఘ్నములు।దా వచ్చుటచేఁ దడసితి దప్పును గాచికొనుఁడు దండములు॥ రా॥

వ. అని పలికిన రాముఁడానందంబున నిట్లనియె.

క. నీకేటి తప్పు లున్నవి!
కాకుత్స్థకులాభివృద్ధి గలిగెను నీచే;
నీకార్య మవ రొనఘ్గుర !
నాకూరిమిహితుఁడ వీవు నగచరవర్యా!

వ. అని కొనియాడె. అంత సుగ్రీవుండు సుషేణునిఁ జూచి,

గీ. ఇంక జాగేల కపులు నీ విన్నగంబు
నెక్కి, దివ్యౌషధంబుల నెత్తి తెచ్చి
లక్ష్మణుని కిచ్చి ప్రాణము ల్వడయఁ జేయు
మనఁగ, నాతఁడు గపులతో నద్రి నెక్కె.

వ. కలయం దిరుగుచు నా యాస్థల విశేషంబు లగచరులకుఁ దెలుపుచు శీఘ్రంబున సుషేణుండు—

తో. స్వచ్ఛౌషధములు దెచ్చి లక్ష్మణున కిచ్చి ప్రయోగింప
గను। తచ్ఛక్తిని సత్వరముగ బాణములు దనరన చ్చెం గ్రమ్మఱను॥ రామ॥
అప్పుడు పావనుని లాదులు గొలువంగ నాలక్ష్మణుఁడలు లేచి। తప్పక
రాముని దగ్గరి మొ్రొక్కి-నఁ దమ్ముని గరములు సాచి॥ రా॥

వ. లేవనెత్తి యాలింగనము జేసికొని కన్నుల నానంద బాష్పం
బులు దొరంగ చెంతనున్న హనుమంతునకు శ్రీరాముం డిట్లనియె:

కీర్తన: ఆదితాళము—(గౌళము) వలె.

పావనమూర్తివి పరమబంధుఁడవు, పావని తమ్ముని బ్రతికించి
కేవలసుకృతము గీర్తియు గంటివి; నే వెలసితి ధర నీచెలిమిఁ॥ పావన॥
పాయక నీవలెఁ బరహితకార్యము జేయుగ నొరులకు జేతగాదు; నీయు
పకృతికిని నే బ్రత్యుపకృతి జేయుట కేదియు క్షితిలేదు॥ పావ॥
మోక్షపురవరాధ్యక్షునికరుణా। పేక్షగాఁ గలుగఁగఁ వెలసెదవు; ఈక్షితి
నాపద లేవియు లేక సురక్షితముగ నికఁ బ్రబలెదవు॥ పావ॥

వ అని శ్లాఘించి యిప్పర్వతం బెప్పటిచోటఁ బెట్టి రమ్మని
చెప్ప మంచిదని పవమానననందనుండు తత్క్షణాబునఁ గొనిపోవుచుండ
జలధిమధ్యంబున రాక్షసులుచూచి పోయి చెప్పిన, రావణుండు గోపించి
శంకుకర్ణ హస్తికర్ణ స్థూలజంఘ మహానాద మహావక్త్ర చతుర్వక్త్ర
ముఖ రాక్షసులఁ బంపిన వారు గదా ముసలాది సాధనంబులతో నడ్డ
గించి యిట్లనుచున్నారు:

తో: ఎక్కడి కేగెద వీకొండను గొని! యీవార్ధిని బడవేయు!
చిక్కితి సటువలెఁ జేయకున్న నినుఁ జీల్తుము యుద్ధము చేయు॥ రా॥

వ. అని బహువిధంబుల మునరి నొప్పించినఁ గోపించి యుగ్రా
కారుండై,—

తో: కాల దన్నుచును, కేల గ్రుద్దుచును, వాలముతో విసరు
చును। వేలసంఖ్యలగు వీరరాక్షసుల నేల గూల్చి నవ్వుచును॥ రా॥

వ. కొండ గోనిపోయి యెప్పటితావున నుంచి వచ్చి రాముని కు నమస్కరించి పోయివచ్చిన తన సంగతియు రెండుసారులును దనకుఁ గలిగిన యాటంకములు విన్నవించె. పిమ్మట వానరు లందఱు లంకలోనికి జని సింహనాదంబులు చేసిరి. అంత సూర్యోదయంబాయె. అప్పుడు, రాముండు లక్ష్మణున కిట్లనియె :

తో: అనుజ, నాదుభాగ్యంబున జేసియు నిను గ్రమ్మఱఁ బడ సితిని । యనిలజుఁ డను ఘనమైన నావచే నాపదబ్ధి గడచితిని॥ రామ॥

వ. అనిన, లక్ష్మణుండిట్లనియె :

హిం. భైరవి : అటతాళము, (విమిలాం) వతి.

ఇక నేటికి జాల మినకులతిలక ! మీ రేల యోజింపగను॥ రామ॥ ఇ॥ స క ల ము దె లి సి న స్వామి, మీకుఁ దెల్పుటకును శక్తుడ నౌదునే॥ రాను॥ ఇ॥ మనుజావతార మెత్తిన కారణంబును మది యోజింపఁదగును॥ మును దండకవనమునుల కిడిన యభయమును దీర్పగాఁ దగును॥ రాను॥ రామ॥ ఇ॥ ఆక్షీరాబ్ధికడ సమరులతోడ మీ రన్న మాట దీర్పుము ; మోతుగుండేశ్వర, దీక్షతో నీవేళ రాక్షసేశ్వరు దునింపుము॥ రామ॥ ఇ॥

మై రా వ ణు ని క థ .

వ. ఇట్లు పలికిన లక్ష్మణుని వాక్యంబులకు రాముఁడు సమ్మతించియుండె. ఇక్కడ రావణుఁడుఁ జారులవల్ల నావార్తవిని నివ్వెఱగంది సభాసదుల కిట్లనియె :

క. మూలబలంబు నశించెను
మూలంబుగ నింద్రజిత్తు మొదలగు శూరుల్
గూలిరి ! చిక్కితి నొక్కడ !
నేలీల జయింప నగును నిసరులు నింకన్.

వ. మయదత్తంబగు మదీయామోఘశక్తిచేత లక్ష్మణుని బడవైచిన సంజీవని సహాయముచే బునర్జీవితుని జేసికొనిరి. నాచేయు యత్నంబులు విఫలం బగుచున్నవి. మంత్రులారా!

తో: ఐరావణు డన, మైరావణు డన, నారసాతలమునందు! ధీరులు గలరు మదీయబంధువులు వారి బాసిటర్ల గొందు॥ రా॥

వ. వారు సహాయపడిన రామలక్ష్మణుల నిరాటంకముగా జయింపవచ్చు నని యోజించి తగినదూత నేర్పఱిచి,

కమాచ్: ఏకతాళము. (గంగా)వలె.

మైరావణా! మావార్త మఱి వినదగు ॥మైరావణా॥ ధాగుణిని రాముం డనంగను దగునొక మనుజుడు ॥మైరావణా॥ పూనివాని చెలి దెచ్చితిని॥ మైరా॥ కపుల గలసి సాగరము దాటి లంకకు జేరిరి ॥మైరా॥ నాకన్న సుతుల, నాకున్నహితుల, జేకొన్నభృతుల, బోకార్చి యతుల భీకరగతులను బీరము లాడుచు బెదరక నిలిచిరి ॥మైరా॥ బెదరించి ఎదిరినిం, జించి, విదలించి, యెగురించుధీరు లిం డెవరు లేరు ॥మైరా॥ వైరుల గెలువగ వశముగాదు! ముదమార మోకుపుర శ్రీరామునితోం బోరాడగదే శూరాగ్రేసర! చేరి తోడుపడి పోరం గెల్చికడ తేఱం జేయు ॥మైరా॥

వ. అని సమాచారంబు వ్రాసి యాపత్రికనిచ్చి దూత నొకనిం బాతాళలంక కనిపిన వాడు జని మైరావణ యైరావణులం గని నమస్కరించి యుత్తరం బిచ్చె. వారు దానిం జదువుకొని యాశ్చర్యంబు నొంది ప్రత్యుత్తరం బిట్లని యిచ్చిరి:

క. శ్రీరామలక్ష్మణుల నే
నీ రాతిరిబట్టి తెచ్చి యిచ్చెద బలిదు
ర్వారంబుగం గామాక్షికి;
నో రావణ వెఱపుమాని యుండుము కడిమిన్.

వ. అని వార్త వ్రాసి పంపినఁ జూచుకొని యానందించి రావణుం డుండె. ఇక్కడ విభీషణాదులు.

క. సౌమిత్రి మూర్ఛ వోయిన
రామునిచేఁ గొట్టబడియు రావణుఁ డెరిగెన్!
ఏమో క్రొమ్ముల రాత్రే
దేమాయకుఁ జొచ్చినాఁడొ యెఱుఁగఁబడదహా!

వ. అయిన, నేటిరాత్రి జాగరూకులమై యుండఁ దగు నని యెంచి,

తో: హనుమంతుఁడు దోఁకను నాకాశముదనుక కోటగా గట్టె!
రఘుకులవర్యుల వనచరులను సంగ్రహించి తాను గనుపెట్టె ॥ రా॥

వ. జాగరూకులై యుండ విభీషణాదులు జుట్టు తిరుగుచుండె. అక్కడ నపరరాత్రియందు మైరావణుండు దనపానుపు పయిఁ గూర్చుండి యోజించుచుండె. వాని భార్యయగు మాతంగి యిట్లను చున్నది.

కీర్తన: ఏకతాళము. (సతితం) పతి.

యేమి యోజనా! యేమైన దోచెనా! ॥యేమి॥ స్వామి! సురతముల సరససుఖములను చవిసితిరిది ॥యేమి॥ అర్ధరాత్రి నిద్దుర మాని మీరెద్దియొ యోజించు చకితి నున్నారి ॥దేమి॥ ప్రాణపదంబైన భార్యకు నెఱిఁగింపరాని రహస్యము దాఁచి యున్నదేమి ॥యేమి॥ పోతుగుంటేశుని సాక్షిగ సంకల్ప మూటయును దెల్పఁ డేల సందేహమి ॥దేమి॥

వ. అని వేఁడిన భార్యను మైరావణుం డిట్లనియె:

సీ. రామచంద్రుం డను రాజుభార్యయు దాను
దండకావనములం దుండె నొకఁడు;
దశకంఠుఁ డేగి యాతని మోసపుచ్చి యా
దీయభార్యను వేగఁ దెచ్చి లంకఁ

జేర్చి; నంతటఁ గపిసేనతోఁ దమ్ముని
తోఁ గూడి రాముఁడు సాగరమును
గట్టి లంకకు ముట్టి ముట్టి తదామాత్య
పుత్రమిత్రుల నెల్లఁ బొలియఁ జేయు

గీ. నొక్కరుఁడు చిక్క రావణుం డుక్కు దక్కి
నన్ను బ్రోవఁగాఁ గోరెఁ దెన్ను లరసి
మాయ సంధించి రామ లక్ష్మణులఁ దెచ్చి
కాళికాంబకు బలియిత్తుఁ గంజనయన.

వ. అనిన, విని యహల్యానిసీరత్నం బిట్లనియె:

కమాచ్: ఆదితాళము. (త్రైశ్రే)వళి.

ఇది యేమిపయనము! హృదయేశా మానుము ॥ఇది॥ రాముం డన నారాయణుండు దద్భార్య సీత సిరి ధర బుట్టెను॥ఇదియే॥ దనుజ కులాంతకుఁ డని తెలియక యాతని పైకొని చెడె దశకంధరుఁ డిది ॥యే॥ తనను గట్టుటకు దాఁడు దానె చేకొని వచ్చినరీతిని నున్నది: యిది ॥యే॥ముందుగ జని నీవు మోక్షసుందరరఘునందను మనపురి కిందే నేలని ॥దేమి॥

వ. అని ప్రార్థించిన సతిం డు వినక భార్యకిట్లనియె.

క. బోఁటీ! శ్రీరాములకే
నాటికి నేవెఱవ: నతఁడు నన్నెదిరించే
పాటి బలిష్ఠుఁడు గాఁ డిం
కేటికి వగచెదవు! పోయి యిపుడే తెత్తున్.

వ. అని వీర సాహసంబున లేచి తత్క్షణమే లంకాపురమున యుద్ధభూమిఁ జేరి విభీషణవేషంబున హనుమంతునితోఁ గొంత ముచ్చటించి పిమ్మట హనుమద్వాలనిర్మితమగు కోటలోఁ జొచ్చి.

తో: అచ్చట నొకశిలయందుఁ బండి యున్నట్టి రామలక్ష్మణుల। ముచ్చిలి శిలతో మోసుక నిద్రల మునిఁగియున్న యారఘునుల॥ రా॥

వ. కైకొని బయటవచ్చి యాంజనేయునితో మాటలాడి యతి వేగంబున రసాతలంబున నున్న తనమందిరంబున నాశిల యుంచె. తద నంతరంబ,

తో: మరల విభీషణుఁ డరుగుదెంచి, 'హనుమంత, హెచ్చరిక!' యనఁగ । ద్వరలోఁ గ్రిమ్మరి వచ్చితి వే మన దనుజుఁడు లోఁ జని కనఁగ॥ రా॥

వ. రామలక్ష్మణులు లేకున్న సుగ్రీవాదికపులను లేపి యాద అగలసి వెలుపలికి వచ్చి హనుమంతునిఁ జూచి హాహాకారంబులు చేయుచు—

వసంత : అటతాళము – (మేలేదు)వలె.

లేరు లే రకటా! మనసాములు॥ లేరు॥ లే రెవ్వరును బవ్వళిం చినచోటికి రా రనుకొంటిమి! రామలక్ష్మణులు॥ లేరు॥ మనము మెలఁ కువగా నె కనుపెట్టియుండియు, మనల మాయముంచి కొనిపోయె నెవ్వఁడో॥ లేరు॥ అడుగులజాడ వెంబడి నీవు జనిన నిప్పుడే దాపులో గనుపడగలరు! దారిఁ॥ లేరు॥ రాక్షసేశ్వరుఁడు రావణాసురుఁడు మోతుగుండేశుని మోసముపుచ్చెనో॥ లేరు॥

వ. కాబట్టి త్వరగా నీవు చని జయముఁ బొంది మనప్రభువుల గొనిరావలసినది యని హెచ్చరికచేసి సుగ్రీవ జాంబవంతాదులు ప్రేరేపఁ. దత్క్షణంబున—

క. హనుమంతుం డుత్సాహము
దనరఁగ నాజాడవెంట దక్షిణదిశకున్
జనియె; నికుంభిళకును జ
య్యన జేరియు నచట నిలిచి యారయుచుండెన్.

వ. అంత నక్కడ గర్భిణిగానుండిన కపోతపక్షి పురుషపక్షి కిట్లనియె:

తో: నరమాంసము దిన నాకుఁ గోర్కెయున్నది; దెచ్చిమ్మని యడుగ । బురుషపక్షి యప్పుడు ముదమున దనపాలఁతి కిట్లనియె వడిగ॥ రా॥

గీ. సగము రేశిబిరమ్ము మోసమునఁ జొచ్చి
గాఢసుప్తుల రామ-లక్ష్మణులఁ గాంచి
తత్క్షణము చేర్చె నిజ రసాతలగృహమ్ము;
దేవికిం బలివెట్టు మైరావణుండు
అతివ, నీ కబ్బు రేపు మాంసాశనమ్ము.

వ. అనిన కపోత వాక్యంబులు విని యలరి హనుమంతుండు రసాతలమునకుఁ బోవ యత్నించి యుదకమున దిగఁ బోవఁ దత్పాల కుండగు మకరధ్వజుం డిట్లనియె:

సంవాదము - కీర్తన : అటతాళము - (మేలయిన)వలె.

మ-ఏమిర పోయెద! వెక్కడ మీాయునికి! యెవ్వరివాఁడవుర?
హ-రామునిదూతను; లంకాపురమునుంచి రా నాయె నిటు బోదురా!
మ-ఇక్కడ నీకిపు డెవ్వరితోఁబని యెఱిగింపుము నాతోడను.
హ-రక్కసితేనిని మైరావణుఁ గనుగొనఁ జక్కఁగఁ బోయెదను.
మ-వానితో నేపసి వచ్చెను వెనుకొన వానర తెలుపుముర.
హ-మానుగ మారాము మాయచేఁ గొనిపోయె గాన వెనుకబోదును,
మ-శ్రీమోక్షగుండేశు, సేవించుమాతండ్రి. క్షేమమె వాయుజుండు?
హ-ఆమారుతికి భార్య యవనిలో లేదు; నీ వాత్మజుఁ డెట్లయితివి?

వ. అనిన మకరధ్వజుం డిట్లనుచున్నాఁడు:

ద్విపద: ధరణిజకై రఘూద్వహునాజ్ఞఁ బూని
కఱువలి కొడుకు లంకకుఁ బోయినపుడు
మొనసి యాలంక నిప్పుల పాలొర్చి
వననిధిలోఁ దనవాలమ్ముం దడిపి,

మున్నీటి జలములఁ బుక్కిలించుమియ,
నన్నీట నతని కఫాంశమ్ముఁ బడియెఁ;
బడినంత దాని పాపజా నొక్క మకరి;
కడుపడి నద్రివేఁకటిదాల్చి తుదకుఁ
బ్రసవించెనను; మకరధ్వజాహ్వయుఁడ;
మైరావణుని బంట; మకరాలయంబు
ద్వారంబుఁగాతు నెవ్వరిఁ జొరనీక.

వ. అనిన సంతోషించి ఆంజనేయుం డిట్లనియె.

కళ్యాణి : ఆదితాళము – (మనవిని)వలె.

నేనే ననుకోరా హనుమంతుఁడ॥ నేనే॥ మానసమున ననుమానము వల దిఁక; మకరధ్వజ, కనరా హనుమంతుఁడ॥ నే॥ ఘనముగ నీ చెప్పిన చొప్పున నే మును పొసఁగించితిరా హనుమంతుఁడ॥ నే॥ నా కొమరుఁడవైనను మంచిది! యిఁక నాకు దెఱవుఁజూపు॥ హనుమం॥ నే॥ మోతుగుండరాముని గొనిపోయిన రాక్షసుఁగనఁజోను॥ హనుమం॥ నే॥

వ. అని తెలిపిన సంతసించి మకరధ్వజుండు దండ్రికి నమస్కరించి యిట్లనుచున్నాఁడు.

తో: జనకా! మైరావణుఁడు రామలక్ష్మణుల నిటులఁ గొనిపోయెఁ। దననగరంబుకును జేర్చెను వారిని దేవికి బలివేయఁగ॥రామ॥

వ. సంకల్పించియున్నాఁడు. కాఁబట్టి యీమార్గంబున, సూక్ష్మరూపంబున నీ వేగి కామాక్షీదేవ్యాలయంబునఁ జేరుము సర్వంబును దెలియఁ గల దని తెరువుఁజూపిన,

క. త్రిసరేణుమాత్రుఁడై సం
తసమున నాదారి దాఁటి త్వరగాఁ జని వా
యుసుతుండు చేరెఁ గామా
క్షీసదన మసదృశవివేకశేముషి దనరఁగ.

వ. ఇట్లు కామాక్ష్యంబ దేవాలయంబునఁ గవాటంబు బిగించి ధైర్యంబుననుండె. ఇక్కడ మైరావణుండు దనసతితో నిట్లనుచున్నాఁడు.

తో: భామా! వద్దని పలికితివిగదా! రామలక్ష్మణుల జూడు! కామాక్షికి బలిగావించెద నాసామర్థ్యము గను నేఁడు॥ రామ॥

వ. అనిపలికి చూపించిన నామె కటకటంబడుచు నడ్డముగావచ్చి యిట్లనుచున్నది.

కీర్తన – ఆదితాళము. (ఆహాబాల) వలె.

ఈయన్యాయ మిటులఁ జేయ నేల దోచెను! పాయక నాచేయు మనవి ద్రోయ నేలను ॥ఈ॥ నీ కేమైన నపకారము నెగడఁజేసిరే! చేకొని దండింప నీచేఁ జిక్కువారలే!॥ ఈ॥ రావణునిరీతిగను నీవు జెడగ నీవగ వీరిని దెచ్చినావు వెకలి॥ ఈ॥ జీవితేశ, మోక్షగుండదేవుఁ డనుచు భావమున నెంచి విడుము! బ్రతుకు నిలుచు॥ ఈ॥

వ. అని మిక్కిలిగాఁ బ్రార్థించిన నామాట నిరాకరించి యనేకరాక్షసవధంబులు సాయుధంబులగు గొలువ, మైరావణునితోఁ గూడి శ్రీరామలక్ష్మణు లున్న శిల నెత్తుకొని కామాక్షిగుడిసన్నిధికి వచ్చి నిలిచి,—

తో: రామలక్ష్మణుల రయమున బలియిడఁ గామాక్షీ! జగదంబ! మేము దెచ్చితిమి; చేకొని వీరిని మ్రింగి కావు మమ్మంబ! ॥ రా॥

వ. ఆనువాక్యంబులు విని హనుమంతుండు దేవి పలికినట్లుగా మెల్లన నిట్లనియె.

క. దేవాలయంబులోపల
రావల దావలనె యుండి రాక్షసులారా
యీవత్పూజా కల్పము
సేవయుఁ గిటికిలగుండఁ జేయుఁడు భక్తిన్.

కీర్తన : ఏకతాళము. రామచంద్రదమ)వలె.

రాక్షసేంద్రులారా మనోరంజనంబుజేయు డికను! అక్షయజలములు సన్నమాంసములు దీక్ష వేయుడు గవాక్షంబులనే॥ రా॥ రామ

లక్ష్మణులకు సుమముల నేమంబునను బూజించి ధనుర్ధరులై మొలయంగ నయంబున దెం డిటు॥ రాక్ష సే॥ ద్వారముకు సగముకు దెలిపియు, వారు మోక్షపురవరు లయినను సనుఁ జేరఁద్రోసి తుష్టినిఁ జేయగ దగు॥ రా॥

వ. అనంతరము కవాటంబు మూసికొని మీరు దూరంబున నుండుఁడు. సమస్తకార్యంబులుఁ జక్కపడు నని చెప్పిన వారు హర్షించి తత్క్షణంబున—

క. పూజాద్రవ్యంబులు గొని
పూజించి చతుర్విధాన్నమ్ములు రాసులుగా
నోజ గవాక్షంబులనే
యాజగదీశ్వరికి నిడిరి యసురవరేణ్యుల్.

తో॥ అతులితపంచామృతకలశంబులు నర్పించిరి యొకకోటి। యతిశయమధురఫలాంచితపేటిక లర్పించిరి యొకకోటి॥ రా॥

వ. ఇట్లువైచిన నవియన్నియు నాంజనేయుండు క్షణమాత్రంబున భక్షించి తిరిగి యిట్లనుచున్నాఁడు:

తో॥ ఏమి యొసంగుట ఈగ్రాసంబులు! యేమి తృప్తి యగు మాకు! । మాముది యలరఁగ నులిసలుపుట ధర్మముగాదే యిక మీకు!॥ రా॥

వ. అనిన నాశ్చర్యకలితచిత్తులై దానవపుంగవులు భటులం గాంచి,—

పూరికల్యాణి: ఆదితాళము. (అమితో॥ గ9) వల.

భటులార రెండి! బరువడి పొండి! దృటిలోన వండి దేవికి దండి రెండి॥ భటు॥ ఆలస్యమైన నలుగు బిరాన నేలీలనైన నీవలె గానదానఁ ॥భ॥ మనయిండ్ల యందు గని యున్న దంతు కొని రండి యిందు! దిన తృప్తిజెందు ముందు॥ భటు॥ పొలుపుగ మోక్షపుర ధామలక్ష్మణుల దిని రాక్షసుల బోలుమ నేకదీక్ష॥ భటు॥

వ. అని వేగంబునఁ దఱిమిన, రాక్షసదూతలు మహాట్టహాసంబునఁ జని రాజగృహము మొదలు ప్రతిగేహంబును బరిశోధించి,

తో: మిగిలిన వస్తువు లెగబెట్టిన యవి మెతుకుమిగులకుండ।
దగిలి వెదకి తొందరగాఁ గొని చని దనుజేశుఁడు గనుమఁడ॥ రా॥

వ. కొండలపొడవు రాసులుగాఁ బోసిన భోజనపదార్థంబులు సోరణగండ్లగుండ దేవికి రాక్షసు లర్పించుచుండిరి. హనుమంతుండు మెక్కుచుండె. ఇక్కడ నగరంబునఁ బ్రతిగృహంబునఁ గలకల ధ్వనులు పొడమెను. అందుఁ గొందఱు నారీరత్నంబులు గుమిగూడి ఇట్లనుకొనిరి:

హిం. కాఫీ అటతాళము. (ఏలాగుతా.) వలె.

ఈయాగడంబున కేం తని వగతునె నేఁడీ॥ యాగ॥ నేయిపాల్ పెరుగులుఁ బోయుమని బాధించిరి॥ నేఁడీయాగ॥ తట్ట డతిరసములు జట్టాలపిండును జేసి యుట్టిమీద దాచి పిరిపొట్టన బెట్టితిగదె॥ నేఁడీయాగ॥ అమ్మినమర్తకు జేసి చిమ్మిలియుండలనెల్ల దొమ్మిజేసి ఎత్తుకొని అమ్మపరువెత్తినారు॥ నేఁడీ॥ తెల్లవారినేప్పు చిన్నిపిల్ల కొక్క మెతుకైన గల్లగాదు లేకుండగఁ గొల్లవెట్టి రిల్లు సొచ్చి॥ నేఁడీ॥ పెండ్లికని జేసినట్టి పిండ్లు మాపిల్లవాండ్రు కండ్ల బడకుండ దాచి పీండ్ల కర్పించిరిసి॥ నేఁడీ॥ ఈ పగిది మనగిములు దోఁపించిన పాపాత్ముల రూపుమాప మోక్షగుండ శ్రీపతిని వేడరమ్మ॥ నేఁడీయాగ॥

వ. అని వివిధంబులుగా నాక్రందింపుచుండిరి. అంతట హనుమంతుఁడు రాక్షసదత్తపదార్థంబులఁ గడుపార భుజించి సంతుష్టుఁడై దనుజుల కిట్లనియె:

తో: భక్ష్యభోజ్యములు గుక్షినిండ నే భక్షించితి నిఁకఁ జాలు।
భక్షించెద రామలక్ష్మణులను లోపలికి పంపు డిదిమేలు॥ రామ॥

వ. అనిన, వా రానందించి,

తో: శరచాపంబులు ధరియించిన రామచంద్ర-లక్ష్మణుల లేపి।
సరగున సుమభూషణభూషితులుగఁ జలిపి లోపలికిఁ బంపి॥ రా॥

వ. తలుపు బిగించిరి. అంత హనుమంతుండు నమస్కరించిన, రామ-లక్ష్మణు లాలింగనంబు జేసికొనిరి. ఆమీఁద దలుపు దీసికొని వెలుపలికి వచ్చి గుణధ్వనిచేసిన,

తో: దిక్కులనునిండఁ బ్రతిధ్వను లొప్పెను దిగ్గంతులు భయపడెను। జుక్కలు రాలెను; శేషునిగుండెలుఁ బక్కన బగిలెను దగను॥ రా॥

వ. ఆధ్వని కదలి సేనలు భయభ్రాంతములయి యురుకుచుండ, మైరావణుండు వారల కిట్లనియె:

కన్నడరాగము: రూపకము. (సరిగమ) వలె.

పో॰ నేల సేనలార భయపడి॥ పో॥ అవలీలవారి మట్టి రణకేళియందుఁ బోకార్పక॥ పో॥ మనుజాశనులకు మనకు మనుజేసులనఁగ నెంత! రణకౌశలంబు జూపి యాగనాశమొంది పో॰ రాడక॥ పో॥ పరిపంథులను వధించి మనబాంధవ్యైనయట్టి దశకంధరునకుఁ బ్రీతి శుభ మొంద నేఁడు గావింపక॥ పో॥ ధరమోక్షగామినినని నడ శిక్ష జేయ లేని మనరాక్షసత్వ మేల ద్రుషదీక్షబట్టి పో॰ రాడక॥ పో॥

వ. అని వారిని బురికొల్పిన నసుర్నస్పరిపంయి నిసితసాయకమ్ములు గ్రుమ్మిన, నమ్మోటబయులు నడుదీయక.

క. ఒక్కొక్క శరము దనువున
నెక్కిడి తెగ నిండ దిగిచి యుద దగులగఁ దా
గ్రక్కున నందఱ నైమచు
నొక్కమ్మడి ద్రుంచె నసుర యోధుల నల్లన్.

వ. ఇట్లు క్షణంబులో వారిని మడియించినఁ గని, మైరావణుండు మేఘవల్లభ ఘటక సంచర్మిక భైరవముఖ సింహముఖ సర్పముఖ కర్కోటకముఖ మసముఖాదిప్రధానుల యుద్ధంబునకుఁ బురికొలుప, వారు సింహనాద భుజాస్ఫాలనంబులుఁ జేయుచు ననేక కోట్ల రాక్షసదళంబులతో వచ్చి తాఁకె,

గ్నః రూపకము (జనకనామ) వలె.

భళిరె మాతోడ కలిసి పోరాడ గలరె మాప్రోడ! గడువడి జూడ బలువైన బాణములు బఱపమీ ప్రాణములు నిలువన్ గలవే కాయంబులలో! నిలలో శూరులె॥ భళిరె॥ ఆరావణాసురు డవనిజనే తెచ్చె; మైరావణుం డన్న మాటి మిమ్మె తెచ్చె; నీ రసాతలము జేరితి రిటనుండి మీ రేరీతిన్ మహికిన్ జేరన్ నేరుతురింకన్॥ భళిరె॥ మాయలు నేర్చిన మాతోడ డీకొన మీ యబ్బతరమౌనె మిమ్ము విడుతుమా! కో యని శ్రీమోక్షగుండేశ, రణములోఁ గూలన్ జేయన్ దాయన్ ద్రోయన్ బాయన్ దరమే॥ భళిరే॥

వ. అని ప్రసంగంబులు జేయుచున్న దానవమంత్రులను గద్దించి మరున్నందనుఁ డుద్దండంబుగా నడ్డంబువచ్చి,

తో: శ్రీరామునితోఁ బోరు శక్తిగలవారా! దానవులారా మారాడక మీనోరులు మూసుక మరలిరండు ననుఁజేర॥ రా॥ ఒక్క త్రొక్కుకే యుక్కుదక్కి మీ దుర్వ్రోని గూలఁగఁజేసి । యిక్కడనే దేవికిఁ బలి యిచ్చెద మక్కువ మారుగాఁ గోసి॥ రా॥

వ. అనిన, వారిలో వారు నవ్వుకొనుచు నిట్లనుచున్నారు:

పీలురాగము: ఆదితాళము—(తల్లి) వలె.

అబ్బా యబ్బా కోతిగదబ్బా! పైబడు నబ్బా! తిను నిపుడబ్బా॥ బెబ్బులివలెఁ బెడ బొబ్బలిడుచు నాదెబ్బఁజూడుమని గొబ్బున వచ్చెగ॥ దబ్బా॥ కోఁతితోడ మార్కొని పోరాడఁగ యాతుధానులకు జేతనౌనె పగ॥ దబ్బా॥ తీయనిఫలములు గాయలు బెట్టుదు! పాయక నిది మనపైకి రాను పగ॥ ద॥ ఘనమోక్షపురీశుని దన వెనుకను నునుచుక మనపై దుదువడి వచ్చెగ॥ దబ్బా॥

వ. అని యుపహాస్యంబులాడుచు లెక్కపెట్టక ముసల ముద్గర ప్రాస త్రిశూల భిండివాలాది సాధనంబులు పైఁ బఱపి సింహనాదంబు జేసిన యాంజనేయుండుప్పొంగి,

ఉ. కొందఱిఁ బాదఘట్టనలఁ, గొందఱి వాలముఁ జుట్టి మోదుటన్,
గొందఱి ముష్టిఘాతములఁ, గొందఱి జానులతోడఁ గుమ్మటన్,
గొందఱి దంతపాటనలఁ గో యని కూయుచు నుండువారలన్,
ద్రుందగఁ జేసె నొక్కక్షణ మాత్రమునన్ హనుమంతుఁడయ్యెడన్.

వ. ఇట్లు హనుమంతుని చేతం దన మంత్రులు సేనాధిపతులు సైన్యంబులు నశించిన నలిగి మైరావణుం డైరావణ సహితంబుగా సహస్రతురంగ విరాజిత దివ్యకనకస్యందనం బెక్కి వచ్చి నారి సారించి మారుతి కిట్లనియె :

కమాచ్ : ఏకతాళము—(రామాభూ) వలె.

రారా ! మాపయిన్ బోరఁగ నేరా కోతిముండ వయిన॥ రారా॥ వారు వీరనక మేరు పెంపులేక మారుతి మారితి వారీతి గాటింపఁగగు॥ రారా॥ తోఁక ద్రిప్పుచును, గేక వెట్టుచును, డీకొని చేకొని పైకొని పోకార్చితివి ॥ రా॥ మోతుగుండధవుముఖ్యభక్తుఁడవు ! వీక్షింతు శిక్షింతు భక్షింతు వృక్షాటవర॥ రా॥

వ. అని దట్టించి పలికి కొన్ని బాణంబులు వైచిన నవి రాముండు నడుమనే త్రుంచి యిట్లనియె :

క. నన్నుఁ గదా కొనితెచ్చితి !
విన్నగచరుపయిని శరము వేయఁగ నేలా !
నన్నే వేయుము మార్కొని !
వన్నెయు వాసియును దెలియ వచ్చును బిదపన్.

వ. అనిన వాఁడు రోషించి నిశితాస్త్రంబులు గణనాతీతంబుగా బ్రయోగించిన రాముం డవి తన శరంబులచే వారించి యొక్కయమోఘాస్త్రంబు వింట సంధించి విడిచిన,

తో: అది చని యాతని రథరథ్యంబులు నవసిఁబడగఁ వడిఁద్రోసె! కలక మటియొక కదుపును వేయగ వారి ప్రాణములు దీసె॥ రా॥

వ. ఇట్లు ప్రాణంబులువాసి యవనింబడి యంతలోఁ బునర్జీవితులై కదిసి,

కీర్తన: ఆదితాళము—(ఏదిరా) వరె.

మమ్మ్ము గెలుతురా! సమరమ్ముఁజేతురా॥ అమ్ముల ముంచి, రొమ్ముగలించి, మిమ్ముల ద్రుంచి, మ్రింగుదు మెంచి॥ మమ్ము॥ తుక్కుదైత్యులఁ బడఁ గ్రుక్కినట్టుల మక్కువయుంచి, మ మ్మెదిరించి, త్రొక్కదలంచి, సిక్కరు మించి॥ మమ్ము॥ మోక్షపురవర, యిక శిక్షయగు ధర రాక్షసులందు లక్ష్యము లేదు; యీక్షణమందు నిలగూల్తు మిందు॥ మమ్ము॥

వ. అని చెప్పుచుఁ గొన్ని మార్గణంబులు వైచిన రాముండు లక్ష్మణునితో.

క. మృతులై వీరు పునర్జీ
వితులయి మనమీఁది కిపుడు వెడలెద రిదియ
ద్భుతముగ నున్నది సోదర
బ్రతుకున కేదయిన మందుఁ బడయఁగ బోలున్.

వ. ఐనఁ జూత మని యెంచి,

తో॰: పటుసాయక మొక్కటి యెక్కిడి తప్పక లక్షించియు వ్రేయు। గుటిలరాక్షసులు గూలి లేచి యప్పటివలె దనుపంయిడాయు॥ రా॥

వ. రాముం డాశ్చర్యపడి మగుడ యుద్ధంబునఁ దగులువడియె. ఇట్లు నూఱుపర్యాయములు విసువులేక రాముండు హతంబు చేసినను పునర్జీవితులై వచ్చుచుండిరి. ఇదిగని యా రహస్యం బెఱుఁగఁగోరి,

తో॰: హనుమంతుండు పత్తనమునకై జని యందొక నాతినిగాంచి। వినయంబున నామెను లాలింపుచు దనమువ్చట వివరించి॥ రా॥

వ. ఇట్లని యడుగుచున్నాఁడు:

కమాచ్: ఆదితాళము-(ఇటురమ్మా) వలె.

ఏ మమ్మా కుటిలకుంతలా! అమ్మైరావణ మైరావణుల నమ్ముల గూల్చిన నపుడు లేతురే॥మమ్మా॥ మృతులగువారు బ్రతుకుట గలదే! క్షితిలో మా కద్భుత మగు నిదియే॥ మమ్మా॥ వారు మగుడ లేవక యుండుటకుఁ గారణ మెఱిగినఁ జేరి తెలుపుమా॥ యమ్మా॥ పోతుగుండరాముండు నీకోరిక యీక్షణమున నెఱవేర్పఁగల డదే॥మ॥

వ. అని యడిగిన నామె సంతసించి యిట్లనుచున్నది:

సీ. నాగకన్యను నేను; నన్ను భోగించుట
కై రావణుఁడు దెచ్చె నయ్య యిటకు!
మైరావణుండును మారుకేళినిగూడ
వచ్చునిత్యంబును వలపుగదుర;
వానితోఁ గూడిన వీనికి గోపంబు;
వీనితోఁ గూడిన వానికలుక;
ఇద్దఱితోఁ గూడి యేనుఁ గృశించితి
జవసత్వములు బోయెఁ జాలు! వీండ్రు
జచ్చిపోవుట నాకును సమ్మతంబె!
యైన శ్రీరామచంద్రుఁ డహర్నిశంబు
నన్నుఁ గూడుట కొప్పిన, నగచరేంద్ర,
వాండ్ర గుట్టు దెల్పుదును నవశ్యముగను.

వ. అనిన, నాంజనేయుండు,—

తో: రాముని కడు, భారంబుచేతఁదగ-నీమంచమువిఱుఁగకయ। భామిని యుండిన భ్రాంతిదీఱనిరుఁ బరగఁ గూడు దప్పకయ॥రా॥

వ. ఇందుకు సందియంబు లేకఁ దెలుపు మని యడిగిన నామె యిట్లనియె:

శహానరాగము : ఏకతాళము-(ఎంతని నే) వలె.

హనుమంతా, గుణవంతా, వినుపించెద నంత! మైరావణుమర్మంబును॥హ॥ మునుపు దమ్మోదల ముంటఁ గ్రుచ్చుచుండినఁ గని బాలకు

లను వీ రుడిపిరి॥ హను॥ భ్రమరంబుల్ తమచావుల్ బాపినవారిఁ గని సమరంబున మీకుఁ జా వొదవినతఱి॥ భ్రమ॥ అమృతంబును గాయములఁ దెచ్చి యిడి మిముఁ బ్రతికింతుము మే మని యనె నవి॥ హనుమంతా॥ అదిమొదలున్ మెదబాదలన్ యాపట్పదములు వదలకయున్నవి వారిపడకలను; అది వెదకియు వానిని జదుప మోక్షపురసదనుని చేతను జచ్చెద రసురులు॥ హనుమంతా॥

వ. అని తెలిపిన నానందించి హనుమంతుండుఁ దత్క్షణంబున వారినిద్రాస్థానంబునకుఁ జని పానుపు నాశ్రయించియున్న తుమ్మెదలను గాంచి,

గీ. కోటికోటాను సంఖ్యలఁ గూడియున్న
తుమ్మెదల నెల్లఁ బట్టి వాతూలసుతుఁడు
పరగమర్దించుచుండిన భయమునొంది
యొక్కతుమ్మెద యతనికి మ్రొక్కి పలికె.

కీర్తన: ఆదితాళము-(కనలి) వలె.

శరణు తరుచరవర, నన్నుఁ బ్రోవవే! బరువడి మమ్ముఁ జంపు పనిమాని కరుణింపు వెఱచి నీమఱుఁగునఁ జొరితిని గావవే॥శరణు॥ అమృతమువల్ల నసురుల నెల్ల నమృతుల జేయుచుంటి; మది యిఁకఁ జేయమంటి; నమరారు లడగెరు; సుకుమార శుభము॥ శరణు॥ వర మోక్షగుండవాసుఁడు నిశితశరములు వేయ వారుఁ జత్తురు; లేవఁబోరు; మఱిమీరు ధర జేరుదురు ధీరు లగుచు॥శరణు॥

వ. అని బహువిధంబులఁ బ్రార్థించిన నాభ్రమరంబును గటాక్షించి చంపు టుడిగి హనుమంతుఁ డిట్లనియె:

తో: భ్రమరమ! నీయిష్టము నొసగ్గాన నిను సమయింపక నే విడుతుఁ। గ్రమమునఁ బ్రత్యుపకార మొకటి చేయుము లేకున్నను నడతు॥ రా॥

వ. అది యేది యనిన వినుము.

క. ఐరావణభోగాంగన
యారూఢిని బవ్వళించు నామంచంబున్
జేరి యది తొలిచివేయును
వారణభక్షితకపిత్థఫలభంగి ననన్.

వ. ఆతుమ్మెద తమజాతి జంతువుల ననంతంబుగాఁ దోడితెచ్చి నాగకన్యయొక్క మంచమును క్షణమాత్రములోఁ దొలిచి తొఱ్ఱఁజేసి యథేచ్ఛం జనియె. పిమ్మట హనుమంతుఁడు రాముని జేరె. అంతలో_

తో: రాముఁడు దివ్యశరం బొక్కటి బీరంబున నెక్కిడి వైవ, నామైరావణ-మైరావణు లటు హతులయి-పడి రా దిగువ॥ రా॥

వ. అంత జయజయ శబ్దంబుల దేవతలు రాముని నగ్గించిరి. పిదప హనుమంతునితో స్వామి యిట్లనియె:

తో: ఈరాజ్యంబును నెవరికిఁగట్టుద మెవ రయినను న్నారా!! మారుతి! యెఱిఁగిన మఱి రప్పింపుము వారి కిత్తు నింపారా॥ రా॥

వ. అనిన, హనుమంతుండు___

హంసధ్వని : ఆదితాళము - (సదావే)వలె.

భజే రామచంద్రప్రభో, యవధారు జగద్విభో॥ భజే॥ శూరుఁడు భక్తుఁ డొకఁడు సుగుణుఁడు గల డిచ్చట॥భజే॥ వాఁ డెవఁడన్నను నాఁడు లంక కే నోడక జనినపుడు నొక చిత్రము జరిగెను॥ భజే॥ లంకఁ గాల్చి వాలమ్ముఁ జల్లార్పఁగఁ లవణాబ్ధికిఁ జేరి యం చుమిసితిఁ గళ్ళెను ॥భ॥ మకరము మ్రింగిన నది గర్భంబై మకరధ్వజుఁ డనఁగ నొకఁ డుద్భవ మయ్యెను॥ భ॥ మైరావణుకడఁ జేరె నాతఁ; డిడు; మీరాజ్య మతనికిఁ వరమోక్షపురీశ్వర॥ భ॥

వ. అని వేడిన సమ్మతించి మకరధ్వజునిఁ బిలిపించి యతనికి రసాతల లంకారాజ్యం బిచ్చి యభిషేకంబు జేయించె: తర్వాత హనుమంతుం డనుచున్నాఁడు:

తో: ఐరావణుభోగాంగనగల దాయనుతో నే నపు డడుగ।
రికిఁగల యావన్మర్మంబులు వాకుృచ్చెను దావడిగా॥ రా॥ చెప్పె
ప్పుడె మెప్పుగ దనతోఁ జెలఁగి నీవు గూడఁ గను। దప్పక గోరినఁ దగ
ందురు నే నొప్పితి నోకమరతుగను॥ రా॥

వ. అదిమొది యనిన, దేవరవారిభారంబుచే నామె మంచంబు
ఉగక భరించినమొదలఁ గూడున ట్లొప్పించినాఁడ గాన, నాయొడం
డిక ప్రకార మాను ఇంటికి బోయి రావలె మహాప్రభో అని
ర్థించిన సమ్మతించి,

గీ. నాగకన్య గృహంబున కేఁగి యామె
చేత సత్కృతుఁడై తనచేతఁ దక్క
రంబు స్పృశియించి మెక్క మంచంబుపైకి
నదిపటుక్కన విఱిగె మోయంగలేక.

వ. అప్పుడు రాముఁడు మద్భారంబునకు నీమంచం బోర్వలే
దయ్యె; నింక నిన్నుఁ గలయుటలేదు. అని లేచిన, నాగకన్య రాము
నకు నమస్కరించి చేతులు జోడించి యిట్లనియె:

జోగి: ఏకతాళము—(పరమేశ్వరా) వలె.

రఘునాయకా! శుభదాయకా! నిను బాయలే నిఁక! నన్నుఁ
ద్రోయ ధర్మమా! నేఁ జేయుకర్మమా! వృథామొగా మదీప్సితం బహో
తలంపుమా॥ రఘు॥ రతికేళిగోరితి; బ్రతిమాలి జేరితి; మొరాలకింపవై
తివి! విరాళి ద్రోచితి॥ రఘు॥ నీచాత్ము లంటిన పాపాత్మ గావున,
మహాత్మ యంటఁ గూడ దంచు నాత్మ దోచెనా॥ రఘు॥ పరిశుద్ధ
జేయుమా! నన్నుద్ధరింపుమా! జగద్ధితా! శ్రీమోక్షగుండకాంత
ప్రోవుమా!॥

వ. అని యనేకవిధంబులఁ బ్రార్థించినఁ గరుణాకలితహృదయు
డయి రాముండు—

గీ. తొయ్యలీ, యేకపత్నీవ్రతుండ నగుట,
నంటనిను; నీవు భవాంతరమున
నవనిసురునింటఁబుట్టి, కన్యాకుమారి
పేరఁ బెరుగుచుఁదపముఁ గావింతువేని,
జాంబవంతుని బిడ్డవై జననమగుదు
ద్వాపరమ్మునఁ గృష్ణావతారమందు
ప్రేయసిగ నిన్ను నే స్వీకరింతు!
నరుగుము! తపమ్ము సేసి కృతార్థవగుము.

వ. అని రాఘవుఁడు లేచి అమెను వీడ్కొని లంకాప్రయాణో న్ముఖుండయి హనుమంతున కిట్లనియె:

తో: రావణాసురుని లంకాపురమార్గము దుర్గము నటుగాన। నేవిధమున మన మేగవలయునో యెఱుఁగుదువే నీ వనిన॥ రా॥

వ. ఆంజనేయుం డిట్లనియె:

కేదార: రూపకము. (అడుదమా) వలె.

శ్రీరఘుకులతిలకా మీ రపుడున్ దీఱని నిద్దుర నుండుటగారణముగ దారెఱుఁగరు॥శ్రీరఘు॥ నేనెఱుఁగుదు గానన్, యానమునైఁయీనిమిషములో నచటికి మానుగ మిము మఱి సేర్తును॥ శ్రీ॥ మన మకరధ్వజునిన్ ఘనముగ మీయనుజుఁ డెక్క, ననునీ వెక్కనిపుడే కొనిపోదుము॥ శ్రీ॥ ఈక్షణమున నరిగి రాక్షసులన్ వీక్షింతువు శిక్షింతువు మోక్షపురాధ్యక్ష లెమ్ము॥ శ్రీరఘు॥

వ. అని పలికిన నానందించిరి. హనుమంతుఁడు రాముని, మకరధ్వజుండు లక్ష్మణుని, మూపుల నెక్కించుకొని వచ్చిన మార్గంబుననే క్షణకాలంబులో లంకానగరంబుఁ జేర్చిరి. మకరధ్వజుండు స్వరాజ్యభార నిర్వహణంబు కొఱకుఁ జనియె; నంత—

క. శ్రీరామలక్ష్మణులఁ గని
యారవినందన-విభీషణాదు లమందా

పారమహానందంబునఁ
దేటవిశేషముగ సన్నుతించిరి భక్తిన్.

వ. రాముండును వారిని మిగుల సమ్మానించి యిట్లనియె:

కమాచ్: ఆదితాళము. (కరుణాల)వలె.

వినినారే మీరు! వినినారెమీరే! ఘనులైనవారు నను జేరినారు! కొనిపోయినారు॥ విని॥ మైరావణుండు మటుమాయకాండు! ఐరావణుండు నతివిక్రముండు ॥విని॥ మాతోడఁబోరి మనుఁజంపఁ గోరి యేతెంచి తనపురి కెత్తుకొని చనిరి ॥విని॥ ఘన మోక్షగుండమున నిల్చియుండ నొనగూడె నండ హనుమంతుఁడు ॥విని॥

వ. లేకున్న దుర్గమమైన పాతాళలంకనుండి యీదుర్మార్గుల నిగ్రహించి క్రమ్మఱ రాఁగలుగుదుమా! అని నాగకన్యావృత్తాంతము మొదలు యావద్వృత్తాంతములు వివరించె. వారందఱు రామునిఁగొని యాడి హనుమంతుని శ్లాఘించిరి: అప్పుడు హనుమంతుండు—

తో. అసురులఁ బ్రోవఁగ నసురుల ద్రుంపఁగ నవతరించితిరి స్వామి!తమ కేవ రక్షము దాకిన విడుతురె! దాసుఁడు సేసినదేమి॥ రా॥

వ. ఆరావణద్వయమును సంహరించిన రీతిగానే యిఁక నీరావణాసురుని రూపుమాపి లోకంబు లుద్ధరింపుము! మహాప్రభో!

క. మైరావణు నైరావణు
శ్రీరాముఁడు చంపి మరలఁ రేగెనని సమా
చారము చారులు దెలిపిన
నారావణుఁ డరిగె శుక్రునారాధింపన్.

వ. దీనాననుం డగుచు రావణుండు కులాచార్యుండగు శుక్రుని చెంతఁ జేరి నమస్కరించి యనుచున్నాఁడు:

తో: ఒకమాఃఖము నా కొదవెను మునివర ప్రకటంబుగ రఘువరుచే! సకలబాంధవులు సచివులుఁ బుత్రులసమసిరి బలహీనతచే॥ రా॥

క. కావున నాకు జయం బిం
కేవిధమునఁ గలుగుఁ జెప్పవే గురువర్యా!
నావుఁడు శుక్రాచార్యుఁడు
రావణు వీక్షించి కనికరంబునఁ బలికెన్.

జంఝూటి: ఆదితాళము.

హోమముఁ జేయఁగ నీ విపు డో మనుజాశన యురువడిఁ బూనుము నీమముతో క్షేమముతో నే మంత్రము లుపదేశింతు సామ్రగులన్నియుఁ గూర్చి ॥హో॥ దివ్యమౌ రథరథ్యంబులుదివ్యచాపమును దృఢసాయకములు సవ్యముగా సాఁగినను; హవ్యవాహనుఁడు మెచ్చి భవ్యముగ నిచ్చు నీకు ॥హో॥ అంతట నిన్నెదిరించెడు నంతవారు జగమం దెవ రుండరు; పంతమున బవరమునఁ గ్రుంతువు శ్రీమోక్షగుండకాంతుని లక్ష్మణుఁ గపుల ॥హో॥

వ. అని తెలిపి హోమమంత్రంబు లుపదేశించి చేయవలయు విధులు తెలిపి శుక్రుండు పో మ్మన రావణుఁడు త్వరగా వచ్చి లంకా ద్వారంబులు దిట్టంబుగా మూయించి,

తో: పాతాళంబును బరువడి బోలిన లోఁతుగల్గు మందిరము యాతుధానపతి యటు నిర్మించియు నందు జేరెఁ దాఁ గరము ॥రా॥

వ. ఇట్లు జేరి గుహాద్వారంబున కొక్క రాయి యడ్డంబు వేయించి లోపల నిష్ఠాగరిష్ఠుండైన వేదోక్త విధిగా ననలుఁ బ్రతిష్ఠించి మధు మాంసాజ్యాది ద్రవ్యములు చేకొని వ్రేల్చుచుండె. నాధూమంబు దివినిండిన గని విభీషణుండు రాముని జూచి,

తో: స్వామి రావణుఁడు హోమముజేసెడు వ్యోమవీథి నాలీల। ధూమము లేచెను! దురమునవాని నెదుర్కొన లేరఁటపోల॥రా॥

వ. కాఁబట్టి యది సాంగంబుగాకముందే వానరులచేత హోమంబుఁ జెఱిపింపు మన రాముండు మంచి దని యాజ్ఞవెట్టిన,

క. పదికోట్ల వానరులు స
మ్మోదమున నటులంకఁజేరి మూసిన తలుపుల్
బదవూలను బగులఁదన్నియు
వదలక లోపలికి నేగి వారనియలుకన్.

తో. తురగశాలలను దూఱి కూల్చి రౌతులను గుత్తములఁ బొడిచి। కరిశాలలకును నరిగి మావటులఁ గరుల నుక్షణమునఁ నడఁచి ॥ రా॥

వ. ఇట్లు కపులు లంకాపురంబునఁ దిరిగి బహుభంగుల భంగపఱుచుచు వెదకుచున్న రావణుని పోఁబడి దొరకకున్న విభీషణుని భార్య సరమ హస్తసంజ్ఞచేఁ జూపినఁ దత్ప్రదేశంబెఱిఁగి యంగదుండు,

తో: గుహాకడ్డముగాఁ గూడియున్న శిలఁ గూల దన్నెఁ జూర్ణముగ। బహువేగంబున వానరాళి లోపలఁ జొచ్చిరి మొత్తముగ ॥రా॥

వ. ఇట్లు గుహాలోఁ బ్రవేశించి కన్నులు మూసికొని హోమంబు వ్రేల్చుచున్న రావణుంగని యంగదుని యనుమతిని వానరులుఁ జెలఁరేఁగిరి.

శేగడ: ఏకతాళము.

చెఱిచివేసిరి చెలఁగి హోమమును॥ జెఱిచి॥ తరుచరు లందఱు దానవేంద్రు మ్రొట్టి॥ చెఱిచి॥ రావణాసురుఁడు రయమున వ్రేల్వఁగ నావేళఁ జేకొన్న యాహుతులను లాఁగి॥ చెఱిచి॥ హోమగుండమున నున్న యజ్ఞేశుని దానుసమున వేతే తలగించి చల్లార్చి॥ చెఱిచి॥ ధర మోక్షగుండేశు దాసులు రావణుఁ గరముల గ్రుద్దుచుఁ గాళ్ళతోఁ దన్నుచు॥ జెఱిచి॥

వ. బహుప్రియత్నంబులు సేసినను వాఁడు జలింపక నిష్ఠాగరిష్ఠుఁడైయున్న నంగదుం డప్పుడు,

తో: మందోదరి వరమందిరమునకుఁ బురందరునుమండేగి। తొందర నొందుచు సుందరి వగవగ ముందలఁ బట్టుక లాఁగి॥ రా॥

వ. రాక్షసస్త్రీ లందఱుఁ బెల్లుగా నేడ్చుచు మొఱపెట్టుకొనినను బోనీక మహాట్టహాసంబున గుహాలోపలి కీడిచికొనిపోయి రావణుని ముందరఁ జేర్చి యిట్లనుచున్నాఁడు:

గీ. రాముసతిఁ జెఱబట్టిన్క్రౌతువుగద!
రావణా, తెచ్చితిని నీదు రాణివాస
మిదిగో! విడిపించుకొనుము నీయేపుఁజూపి!
మఱుఁగు దఱుగులఁ దాఁగుట మగతనంబె!

వ. అని తూలనాడి పలుకుచు మందోదరిని విడువక వేధించుచున్న నామె భర్తను నాలింగనంబుఁ జేసికొని,

**తోడిరాగము: ఆదితాళము.**

దనుజేంద్ర, దిక్కు లేనిదాన నే నైతిని! వనచరుఁ డీడువఁగ వ్రాసె నానుదుట బ్రహ్మ॥ దను॥ నాకూర్మిసుతుఁ డుండిన నాకింత వెత గల్గునా! నాకేశవైరి, మనల లోకులు నవ్వ నాయె॥ దనుజేంద్ర॥ చిచ్చొడి గట్టుకొన్న చెన్నున సీత నిటు దెచ్చిన పాప మురకదీఱునె వేధింపక॥ దను॥ శ్రీమోక్షగుండదేవు చేతను నోడి నీవు హోమము జేసి గెల్వఁగా మించి వచ్చినావా॥ దనుజేంద్ర॥

తో: మాయలు మంత్రము లాయగ్రజుతోఁ బోవెను సాగవుచాలు!! నీయుపాయములు నిలిపి రణంబును జేయఁ బొమ్ము కడుమేలు॥ రా॥

క. ఈహోమ మేల యిఁకఁ జనిఁ
యాహవమున రాముసాయకాగ్నులకును బూ
ర్ణాహుతి వగు; మధవా వై
దేహి నొసఁగి శరణుఁజొరుము దినకరకులునిన్.

వ. అని కఠోరంబుగాఁ బలికిన విని దశాననుండు రోషదందహ్యమాన మానసుండయి దీర్ఘనిశ్వాసంబులు వెడలఁ గన్నులు దెఱచి

భార్య పడిన బరిభవంబు జూచి చేతియాహుతులుఁ గ్రిందివైచి ఖడ్గంబు బూని,

తో: అట్టహాసమున నంగదుహస్తము నదరంటఁగ వ్రేయఁగను। దట్టున మందోదరిని విడిచి యాతఁడు మూర్ఛిలి యిలఁబడెను॥ రా॥

వ. అంత హనుమంతుండు కోపాగ్నులొలుక లేచి,

తో: కులిశనిభం బగు బలుముష్టిని పదితలలు నొవ్వఁ బొడువఁగను,। అలిగి వాఁడు బయి కడరు నంతలోఁ, నంగదుండు దెలిసియును॥ రావణు తలలదరఁగ బొడువఁగ బీరమున వాఁడు ఖడ్గమున। నావాయుజ మతి యంగదు గదతో నపుడు మోఁదె రోషమున॥ రా॥

వ. నల నీల గజ శతబలి మైంద ద్వివిద గవాక్ష గంధమాదనాదుల బరిఘ ముస లాంకుశ శక్తి ముద్గర తోమర గదా కుంతాది సాధనంబులఁ బొడువ, వారును రోషతామ్రాక్షులయి కాళ్లఁదన్ని, బిడికిళ్లఁ బొడిచి, పండ్లతోఁ గఱచి, గోళ్లతో బఱికి వాలంబుతో విసరి వ్రేసి వానిని నొప్పించి వేగంబున రాముని జేరి యీవార్త దెలిపిరి. అంత—

క. భార్యకు ననె దశకంఠుఁడు
శౌర్యంబున నేను బోయి సమరములోనన్
సూర్యకులుఁ బ్లవగేంద్రులఁ
గార్యము బుటమార్చివత్తుఁ గమలదళాక్షీ!

వ. అట్లుకాని నాఁడు—

తో: రామునిచే రణరంగహతుఁడనైన రమణి మోక్షముం గందు। బాములఁబడుట స్వభావము పాపికి వలదుమానుమీకుందు!॥ రామ॥

వ. సీతను బారిగొని నీ వగ్నిప్రవేశంబుచేయు మనిన, మందోదరి యిట్లనియె:

జంఝూటి: త్రిశజాతి.

బల వద్విరోధ మేల? పయిఁ బడి పోవ మేల? బాలిసిరి పుత్రు లెల్లఁ! బాలిసిరి హితులెల్లఁ! గల్ల గెలు పొందు టేఁక జెల్ల॥ బలవద్వి॥ శ్రీమోతుగుండవిభుఁడు శ్రీపతి యగును జూడు! మా మేటిడోడ నూడు వేసుఖ గడుగీడు మూడు! నామాట వినునేఁడు॥ బల॥

వ. నిన్ను వధించునిమిత్తమై యిప్పుడు దశరథసుతుఁడయి యయోధ్యయందు శ్రీరాముం డన నవతరించె. ఇది నిశ్చయంబు; కాదేని త్రిలోకవాసుల నొక్కపెట్టున మార్కొనఁ జాలినయింద్రజిత్తు లోనగు శూరుల జయింపఁగలుగునా! నీకును జయింపరాదు. వినుము—

తోడిరాగము: ఆదితాళము-(ఫరజు)వలె.

శ్రీరామునితో సరివా రెవ్వరు ధర॥ శ్రీ॥ దోరెను దాటకి; దోర్లెవిరాధుఁడు; మారీచుండును మ్రగ్గిస్రగ్గెధర॥ శ్రీ॥ ఖరదూషణు లే గతిఁ బట్టిరో! సోదరిపరిభవమును బరికింపు ధర॥ శ్రీ॥ అతికాయుఁడు మొదలైనకుమారుల గతి యేమైనది! కనుపడదా! ధర॥ శ్రీ॥ ఎవరిని బెట్టుక యేగెద వని కిఁక నవని మోతుగుండాధిపుపై ధర॥ శ్రీ॥

వ. ఈ సారిపోయిన నీకు మరణంబు దప్పదు జరామరణంబులు లేకుండ మాతండ్రి నాకు వరం బిచ్చెను గాన, నేను సహగమనంబుఁ చేయ ననువుగాదు. వ్యర్థముగాఁ బగఁ బూని చచ్చుటకంటె—

తో: మనవిభీషణుని మర్యాదగ రమ్మని నీరాజ్యము గట్టు!। చనువున సీత నొసంగి రాఘవుని శరణు జొరుము; చేపట్టు॥ రా॥

వ. ఆమహనీయుని కొలువు చేయుటకంటె పరం బేదిగలదు. నిరుపాధికశాశ్వతివై కుంతసామ్రాజ్యం బేల వచ్చునని బోధించిన, భామినికి రావణుఁ డిట్లనియె:

క. నాకొడుకు లెల్లఁ గూలిరి!
నా కిరాజ్యం బి కేల? నగరంబేలా?
రాకొమరు శరణుఁ జొచ్చిన
నాకస్థులు నన్నుఁ జూచి నవ్వరె చెలియా!

వ. కాఁబట్టి నేను సీత నిచ్చిశరణుఁ జొచ్చుటలేదు. యుద్ధంబుఁ జేసి గెలిచెద. గెలుపు లేకున్న రామునిచేఁ జచ్చిముక్తిని బడసెద. నీవు జింతింపకుము! తలగు మని రావణుండు యుద్ధసన్నద్ధుఁడై,—

రావణుని మూఁడవయుద్ధము.

తో: ఇరువది కన్నుల నురుకోపాగ్ను లనేకకణములై రాల। చరణ ఘట్టనను ధరణి యదుర దిక్కరులు బెదరి కడు సోల॥ రా॥

వ. ప్రస్థాన భేరి వేయించి సకలాభరణభూషితుండై కోటిధ్వయఘంటికాసంభరిత దివ్యస్యందనారూఢుండై బరశు ముద్గర ప్రాస భిండివాల గదా పరిఘాది సాధనంబులు ధరించుచు యసంఖ్యాత రాక్షస దళంబులు నేల యీనిన ట్లుభయపార్శ్వంబుల నడవఁగదిలి రణ భూమిఁ బ్రవేశించె. అయ్యవసరంబున—

తో: భూమిధ్రంబులు భూమిరుహములు బూని వానరులు దెచ్చి! తామసమున నాదానవసేనల తలలు వగులఁగా వైచి॥ రా॥

వ. గర్జించి మిన్ను బ్రద్ద లగునట్లు కేకలు వేయుచున్న వానరుల పయికిఁ గదిసి, ఖడ్గరోమ సర్పరోమ వృశ్చికరోమాగ్నివర్ణులను రాక్షసులు నలుగురు భీకరంబుగా మార్కొని,

కమాచ్ రాగము : రూపకము.

ఎందుఁ బోక నిందు నిల్వుడీ! ముందర రిపుసందోహములం దోలిన చందముగా॥ ఎందు॥ పొందుగ మాముందర మీపందెంబులు పనికిరావు! చిందర వందరఁ జేసి పురందరముఖులందఱుఁ గన, బ్రమందింతుము నిందింతుము॥ఎందు॥ మోక్షగుండపతితోడను రాక్షసులు గెల్చుటకై యీక్షణమున వచ్చినార! రూక్షాక్షుల వీక్షింతుము శిక్షింతుము భక్షింతుము॥ ఎందు॥

వ. అని పలికి కసిమసఁగి బాధించుచుండిన, నాంజనేయుండు ఖడ్గరోముని, నంగదుండు సర్పరోముని, నీలుండు వృశ్చికరోమునిం దాఁకి,

తో: కడుభయంకరముగా యుద్ధంబును గావించి యనంతరము| వడిఁ జెడఁ జేసి ధ్రువంబుగ దనుజుల మడియించిరి తీవరము॥ రా॥

వ. తదనంతరము పంద్రెండుమూర్తు లేకీభవించిన మార్తాండు భంగి మండిపడుచు నగ్నివర్ణుండు నిజశరీరజనితాగ్నికణంబులచే వానరాటవుల దహించి చుట్టాకుచుండినఁ గోపించి రాముఁడు——

తో: వరుణబాణమును వడిసంధించిన వాడియుడిగి దానవుఁడు, ధరణినిఁ గూలెను; దానిఁ గనుంగొని తామసమున రావణుఁడు॥ రా॥ దశవదనస్థితదంతఘట్టనముఁ దగ సలిపినమాత్రమున। దశదిశలు ప్రతిధ్వను లిచ్చె వసుంధర గంపించె భయమున॥ రాము॥

వ. ఇట్లు తన ప్రతాపంబు జూపి సింహనాదంబుఁ జేయుచు, రాముని కభిముఖంబుగాఁ దనరథంబును బఱపించి రావణుం డిట్లను చున్నాఁడు.

సావ—కీర్తన : రూపకము—(వేటాడు) వలె.

నాసరి యెవరు పోర॥ నాసరి॥ నాసరివా రెవ్వరు. విను: నాకమర్త్య పాతాళము లీసున నే విహరించితి; వేసరకయ వీక్షించితి॥ నాసరి॥ గరుడోరగ విద్యాధర గంధర్వాప్సర చారణ సుర గుహ్యకయక్ష నిశాచర కిన్నరవరులందునను॥ నాసరి॥ కైలాసాచలమెత్తితి! శూలిని నే మెప్పించితి! పాలించితి లంకను బహుకాలం బజువరబలమున! నాసరి॥ మానవమాత్రుఁడ వీ వసమానబలుని న న్నెదురఁగ బూనుదు వే! మోక్షగుండపురవల్లభ! వివరించిన॥ నాసరి॥

వ. అనిన, వానియవలక్షణ ప్రసంగంబునకు రాముం డేవగించి నవ్వుచు నిట్లనియె:

క. నేవినియే ! యుంటిని మును
నావాలినిఁ గార్తవీర్యు నాహవమందులు
నీ వెదిరినట్టివిధమును
రావణ, చెప్పంగ వలెనె! రమ్మిఁక ననికిన్.

వ. అనినమాటలకు రావణుండత్యంతరోషసంభరితస్వాంతుండయి,

తో: భానుపంక్తికి జను స్వర్భానునిగతి భానుకులుని పంక్తి కంఠుండు రి। దానవనాథుఁ డుదగ్రబాణములు దలగఁక వైచెను దోడరి॥ రా॥ అందుకుఁ బ్రతిసాయకములు శ్రీరఘునందనుఁ డటు వేయఁగను। జిందరవందరఁ జేయుచు దనుజుఁడుఁ జెలఁగుచు బైకొనఁ దగును॥ రా॥

వ. అప్పుడు దేవసారథిని మాతలినిఁ జూచి ఇంద్రుఁ డిట్లనియె:

హిం-కాఫి-రూపకము-(శివశివవి) వలె.

మాతలి! గనుమా! సీతాపతి యాతుధానపతివోరుట॥ మాతలి॥ భూతలమున రాము డుండ, నాతఁడు రథమం దుండుట, నీతిగాదు నిశ్చయముగ॥ మాతలి॥ వినుమా యదనుస మన మలరఁగ మనరథము నంపించుమా! మనకులుఁడగు మోక్షగుండ ఘనుఁ డల్లదె మనకొఱకై దనుజేంద్రుని దాఁకి పోరె॥ మాతలి॥

వ. అని తెలిపిన, మంచి దని యతండు దివ్యరథం బాయత్తంబు చేసికొని వాయువేగంబున్మించు తురంగంబులఁ బూన్చి, శీఘ్రంబున భూస్థలికి వచ్చి రాముఁ జేరి రథంబు దిగి నమస్కరించి యిట్లనియె:

తో: దేవరథం బిది దేవర, మీకై దేవేంద్రుఁడు బంపఁగను। దీవరమున నేఁ దెచ్చితి నిప్పుడె దీని నెక్కు డింపుగను॥ రా॥

వ. దానవాధముండు రథస్థుఁడైయుండ దేవరవారు దిగువ నుండ ధర్మంబుగాదు. నేసారథినయ్యెద. దయచేసి యీరథం బెక్కి యా దుర్మార్గునిఁ దెగటార్చి లోకంబు లుద్ధరింపుము. దేవా! మహానుభావా! అని వేడిన, శ్రీరాముండు —

తో: అలవిభీషణుని మనుమతిఁగైకొని వలఁగొని యీరథ మెక్కెఁ। జెలగుచు నుదయాచలమెక్కిన రవివలె నేకడుఁ బెంపెక్కెన్.

వ. ఇట్లు దేవేంద్ర ప్రేరిత రథంబుపై శ్రీరాముం డెక్కి యుద్ధారంభ కుతూహలచేతస్కుండయి వింటనారిసారించిన నారవంబు

నకు జగంబులు గంపంబునొందె. అంత రామ-రావణ సంగ్రామరంగంబు దిలకించు తలంపున దేవ గంధర్వ కిన్నరాప్సరఃపన్నగ చారణ విద్యాధర కింపురుషయక్షగణంబులు విమానా రూఢులై విలోకించుచుండిరి. అయ్యవసరంబున-

క. కరియును గరియును, వరకే
సరియును గేసరియు, జలధి జలధియు, మఱియున్
గిరియును గిరియును, దాఁకిన
కరణి నసదుగాక పోరఁ గడఁగిరి బలిమిన్.

కీర్తన: రూపకము. (వినుడిభూప) వలె.

రామ- రావణుల రణము భీమమై వేమఱుజూపట్టె! విభ్రాంతి నట్టె తామసములను నిద్దఱు సమబలముల నేమఱి జయకాంక్షలతో నెసఁగన్ నిలువకఁ బెనఁగన్॥రా॥

రాక్షసాస్త్రము రావణుఁడు వేయ, రాముని నది రయమునఁ గదియ, నక్షయ మగువైష్ణవాస్త్రముచే దానిఁ దక్షణమందున్ ద్రుంచెన్; దశరథ తనయుఁడు మించెన్ ॥రామ॥ అంతవాఁ డురగాస్త్రము దొడిగి పంతమున నేయ, బరువడి గదియ, వింతగ శ్రీరఘువీరుఁడు గరుడాస్త్ర మెంతయు నెక్కిడి వేసి వధించెన్, బీరమడంచెన్ ॥రామరా॥ కరిముఖాస్త్ర మాసురుఁడు సంధించి కర మొప్ప వేయఁగా నది గదియ, వరమోక్షగుండనివాసుఁడు రాముఁడు నరసింహశరంబునుదాఁ బఱపెన్, దానిని జదిపెన్ ॥రామరావణుల॥

వ. కల్పాంత సమయమహాగ్ని చందంబున మంటలు మండుచు భయంకరాకారంబుగాఁ దనరు శూలంబుఁ గేల ధరించి గిరగిరఁద్రిప్పి రాముని జుఱ జుఱఁ జూచుచు,

తో: శూలము వైచిత్రి జూడుము వచ్చెను గాలాగ్నులు గ్రక్కుచును। యీలములో నీయనుజుని నిన్నును నేలను గూలుతు నికను ॥రా॥

వ. అని పలికి శూలంబు వేసి సింహనాదంబుసేసె. అంత నా శూలం బగ్నికీలలఁ జిమ్ముచుఁ బైకి వచ్చుటం గాంచి రాఘవుం డఖండ రణపాండిత్యంబు మెఱయ,

శ్లో: పాకశాసనుఁడు బఱపిన శక్తిని భీకరముగ వేయగను ప్రాకటముగఁ జని పటుశూలంబును బ్రద్దలు సేసెను దగను ॥రా॥

వ. అప్పుడు రావణుండు గనులయందు విస్ఫులింగంబులు రాల వింశతిభుజంబులుఁ జఱచుచు మహోగ్రసాయకంబులు బెక్కులు వైచి సారథిని హయంబుల నొప్పించి కేతనంబు ఖండించి మఱికొన్ని బాణంబులు రామునిపయి వైచిన వాని ధనుర్విద్యాసామర్థ్యంబునకు రాముండచ్చెరు వొందుచుండ, నింతలో నగస్త్యమహాముని వచ్చె. ఎటులనిన,-

సురటరాగము: ఆదితాళము.

భజామి శ్రీరామమ్ మనసా భజామిరామ్ భణ్డన భీమమ్ ॥ భజామి ॥ నిజదాసమనోమ్బుజవరధామమ్ సుజనజపిత భాసురనామమ్ అజ రుద్రార్చిత మసురవిరామమ్ ॥భజా॥ అక్షయ మమలమనాద్యమ్ నారాయణకవిరక్షమ్ యతిపక్షమ్ మోక్ష కుణ్డసత్పుర వరదక్షమ్॥భజామి॥

వ. ఇట్లరుదెంచి యగస్త్యుండు శ్రీరామునిఁ గాంచి యిట్లను చున్నాఁడు.

క. విజయార్థియైన మనుజుఁడు
నిజముగ నాదిత్యహృదయ నిర్మల మంత్రం
బు జపించి యుని మొనర్చిన
సుజనావన జయముగల్గుసూ ! నిక్కముగన్.

శ్లో: కావున నీ వటు గావించినయెడ, రావణుఁ డని మొనఁ దెగును; ఆవల కార్యము లన్నిదీఱు భువనావళికిని మే లగును ॥రామ

వ. అని పలికి శ్రీరామమూర్తికి సౌరమంత్రం బుపదేశించి తదనుష్ఠానవిధానంబులెల్ల బోధించికుంభజుండుయథేచ్ఛంజనియె. అంత

తో: ఆయగస్త్యముని యుపదేశంబున నర్క-మంత్రరాజమును।
బాయక మదిని జపంబుఁజేసి రామభద్రుఁ డొందె దేజమును॥రా॥

వ. అంత రాముం డత్యంతపరితాపంబునఁ బ్రళయకాలాభీల జాజ్వల్యమానమహానలంబు చందంబున వేఁడి చూపుచుఁ బ్రచండ మార్తాండమండలమయూఖకాండోపమ కాండమ్ము లఖండమ్ముగా బఱపినఁ, బ్రతివేయ నోపక నిర్విణ్ణుండగుచు యున్న రావణుఁ గాంచి రాముం డిట్లనియెః

బేహాగ్ : ఆదితాళము - (పోనియ్యి)వలె.

చూపుము చూపుము నీవడి। యింకఁ జూపుము! ఓపికతో ఘోరరణనైపుణిగలవాఁడ వయినఁ॥ జూపు॥ బాపురే నీపురాకృత పాపము నాదృష్టిపథము దాపున జేరిచె నిన్నుఁ బాపము! వేవేగ మత్పరితాపము గోపము నీదురూపము మాపెదఁగాక॥ చూపు॥బెండువడి చేష్టలుడిగి యుండనేల? గుండెగల మగండ వయిన, రమ్ము తీవ్రకాండములు పఱపి తలపండు డుల్చుకున్న మోతుగుండవాసుఁడను గాను॥ జూపుము॥

తో: వారిని వీరిని వడిగెల్చితి నని వదరుచునుంటివి గదరా!।
యూరక నిటు నిట్టూర్పులు బుచ్చుచు నుండ నేల బైకొనరా॥ రా॥

క. మము డాగురించి సీతను
బ్రమదంబునఁ దెచ్చినట్టి పందెంబులుని
త్యము బచరించిన ఫలమే!
సమయం బిది! చూపు నీకు శౌర్యము నాపై.

శంకరాభరణము : చాపుతాళము - (మేలైన)వలె.

ఉండు నీకండలుఁ జెండి భూతములకుఁ బండుగఁ జేసెదను! నం డగఁ! దిరిమూర్తు లనడ్డమగుచునిలిచిన నైన విడువను నిను॥ ఉం॥ ఆయజు మెప్పించి యధికమా బలమును నాయువుఁ బడసినావు! మాయావిధం

బులు మఱి నేర్చి దిక్కులు మూర్కొని గెలిచినావు॥ ఊ॥ రమ్మి మోక్ష గుండరముండ నగు నేను రణమున నిను మరింతును! సమ్మతి గాకున్న జనకజ దెచ్చి శరణుజొరుము కాతును॥ ఊ॥

వ. యుద్ధంబుఁ జేసి జయించుట యొండె, చచ్చుట యొండె కాక, యి ట్లలతింబోలె నిర్విణ్ణుండ వయియుండుట రణధర్మంబా! ప్రాణంబుల పయి యాసయున్న త్వరగా సీతను దెచ్చి నా కిచ్చి శరణుజొచ్చుము. రక్షింతు. అని పలికిన వాక్యము లగ్నిసమంబులై తనను గాల్చిన మహా గ్రహంబునొంది పదఘట్టనంబుఁ జేసి యొూడుఁ గఱచుచు రావణుఁ డిట్లనియె;

కీర్తన : ఆదితాళము – (మాతామహు) వరె.

బలహీనుల రాక్షసులఁ బట్టి కొందఱను ద్రుంచి గెలిచితి నను కో బోకుము! ఓరామచంద్ర, తెలిసి వచ్చి నన్నుఁ దాకుము॥ బల॥ లాన్నన గంధర్వ యక్ష దేవతాదిక్పాలకుల చేవ జెడఁగొట్టినాఁడను! ఓరామచంద్ర నీ వనఁగ నెంత నాకును॥ బల॥ మోక్షగుండవాస, సీత మ్మని నిన్నుఁ జంపిగాని దీక్షతో లంకకుఁ జేరను; ఓరామచంద్ర, యీ, క్షితిఁ గూల్పక మాననను॥ బల॥

వ. అని పలికి దిగంతంబు లల్లాడునట్లు పెల్లున నార్చి పెక్కుసా యకమ్ముల రఘురాముని బొదివిన రాముండుఁ గోపించి,

పంచచామరము.

సురాసురల్ జయించినట్టి చొప్పుగాదు నిన్ను నీ
ధరిత్రిఁ గూల్పఁ బుట్టినాఁడ; ధాత యిచ్చినట్టి యా
వరంబులెల్ల నీ రొనర్తు వచ్చె నాదు బాణముల్!
భరించి నిల్వు పాఱి పోక, పఙ్క్తికంఠ, మెచ్చెదన్.

వ. అని పలికి, తాటకమథనకాలమందు విశ్వామిత్రుం డిచ్చిన సాయకంబులు దలంచి పుంఖానుపుంఖంబులుగా బ్రయోగించిన నిలువ రింపలేక రావణుండు మూర్ఛిల్లినఁ గని,

తో: వారక సుర లంబరమున నవ్వుచు సారెకు హేళన సేయన్।
సారథి రథమును సమరభూమికిని దూరముగాఁ గొనిపోయెన్॥ రామ॥

వ అంత గొంతవడికి రావణుండు మూర్ఛదేఱి సారథిం గని యిట్లనియె:

తో: 'ఓరీ! రాముం డురువడి నవ్వఁగ నారయశము కొఱవడఁగా।
తేరుదూరముగఁ దెత్తురె!' యనవుఁడు, తెలిపె సారథి వినయముగా॥ రా॥

క. రథి సంకటంబుఁ గని సా
రథి రథము మరల్చి చెల్ల రణధర్మం; బా
విధ మనుసరించితిని; న
న్నధిపా, రిపు పక్షపాతి ననితలపకుమా!

వ. అనిన, వాని వివేకంబునకు మెచ్చి, మరల రథంబును రాము
నిపైఁ బఱపించి, త్రిలోకకంటకుండు విశేష భయంకరంబుగ—

అరభిరాగము : ఆదితాళము - (కొలువైయు)వలెం

విడిచెఁ బాణములు! శ్రీరామునిపయి॥విడిచెఁ॥కడుకోపాగ్నులు
వెడలిజగంబుల కుడుకు బుట్టింపఁగఁ జిడుముడిపాటులో॥ విడిచెన్॥
ప్రధనరంగమున బలముకు గణియించి వివిధంబు లయినపృథుశరములు
ధనువున సంధించి, యాకర్ణాంతం బధికబలంబున నల్లబిగియించి పే
రుగ్గడించి, రథ హయ సారథులను గుఱిగాంచి, రౌద్రము మించి॥విడి॥
శ్రీవిని దిశలఁ బ్రతిధ్వను లీన, నంతకుఁడో యనఁ, దావెలసియుఁ
గోదండము ద్రెవ్వ, శ్రీమోతుగుండదేవుని దేహము గడువడి నొవ్వఁ,
దనసారథియు 'రావణ సై' యని రయమున నవ్వఁ, బగవారు గ్రువ్వ
విడిచెఁ!

వ. ఇట్లు విజృంభించి రావణుండు బాణవృష్టిని ముంచిన,
రాముం డతిరోష కషాయితాత్ముండయి,

తో: ఇంద్రుని పంపినవింట సాయకము లెక్కు—వెట్టి ద్రేయుచును।
నింద్రవైరియే పెల్ల నడఁచె నాయినకులుండు డాయుచును॥ రా॥

వ. వీరరసావేశంబు వెల్లివిరియ రావణుం డిట్లనియె:

పంచచామరము.

పరాక్రమంబుఁ జూపునంత బంటువా! నిలింపులక్
దారంబులందుఁ దోలినట్టి దోర్బలుండ రావణా
సురుండ సన్నుతుంగ వేయుమూపి చెప్పినాఁడ నీ
తరంబుగాదు యుద్ధమందుఁ దాఁక లేవు మానవా!

వ. అని పలికి,

తో: కరవాలంబులు గదలు జక్రములుఁ బరిఘలు ప్రాసాదులును। పరశక్తులు రావణుఁడు వైవఁగా వచ్చెజనపుమెూత్రిలుదు॥ రా॥

రామ-రావణసంవాదము.

జంఝూటిః రూపకము.

రామ-అర్ధచంద్రబాణ మిదో వ్యర్థముగాదు! సార్థకముగుఁగాక నిన్నుఁ జంపకపోదు॥ అర్ధ।

వ. అని ప్రయోగించిన యర్ధచంద్రబాణంబు జని రావణుని రథ కేతు విలఁ గూలిచె. (అంత రావణుఁడు గసలి.)

రావ-పార్థివేశ, నాదు బాణపఙ్క్తి- కోర్చ్యమా! స్పర్ధమాని యెచటి కంటిన సరగ బాఱుమా। ॥పార్థి॥

వ. అని పలికి కొన్ని ఘోరనారాచంబుల రథరథ్యసారథులపై వైచిన, నవి ప్రయోజనంబులు గాకపోయె నప్పుడు.

రామ-రాక్షసేంద్ర! వట్టితూలురజ్జులేలరా! కక్షమాని శరణు జొరుము కాతుఁ గరుణతో! రాక్ష॥

రావ-మోక్షగుండ సగరవాస కక్షతోడను ఈక్షితిపై నిన్నుఁ గూల్పకేను పిడను॥ మోక్షగుండ।

వ. అని పలికి రావణుం డుద్దండకాండంబు లఖండంబుగాఁ బఱపినఁ జూచువారికి నద్భుతంబుగాఁ దోచె. అంత రాముం డలుకరెట్టింపఁ బ్రళయకాలార్క-నిభంగి పొంగి యానీచుని దెగటార్చువాఁడై.—

తో: నిశితసాయకము నేర్పున నటుసంధించి వేడ్క—గురిగాంచి। దశకంఠంబులుఁ దద్వింశతిహ-స్తములు ద్రుంచె మోదించి॥ రా॥

క. శరచాపముసల ముద్గర
కరవాలచయంబు లమరఁ గా నటు వింశ
త్కరములు గిరీటయుతముగ
శిరములు పది మొలిచె మగుడఁ జిత్రముగాఁగన్.

వ. అప్పుడు రాముం డద్భుత వీరరసంబులు బెల్లుబ్బ పాఱ శర సంధానంబుఁజేసి మరలఁ గర-శిరంబులు ద్రుంచె. అవిక్రమ్మఱ మొలిచె. అంతట రాముండు గోపించి నిలుపోపనీక,

తో: కరములు శిరములు గడుఁదీవ్రభయంకరముగ నగణితము గను। అటిముటి ద్రుంచిన నవి యెప్పటివలె మరల మొలుచుచుండ గను॥ రా॥

వ. రావణుని తెగిన కరశిరంబులు మెండుగా భూనభోమధ్య భాగంబు నిండె. అప్పుడు—

తో: రామబాణహతి రాలుతలలు బీరము విడనలయవు చెడవు। వేమరు వాఁడవు విన్నవోవు కడువిలపింపవు వెతపడవు॥ రా॥

వ. ఇట్లు శరపరంపరలు పఱపి రాముండు గరశిరంబులు దెగ వ్రేయుటయు, నవి క్రమ్మఱ మొలచుటయు, నేర్పరింపరాక చూపరుల చూపులు మిఱుమిట్లు గొలుపుచుండ, రామ-రావణయుద్ధంబునకు రామరావణయుద్ధంబే సమంబుకాని యన్యంబు సరిపోల దని దేవతలు ఆనందించిరి. రాముండు రణంబు నిలిపి తనమనంబున—

గీ. ఏ డహోరాత్రములు వీనితోడఁ గదిసి
యుద్ధ మొనరించినాఁడఁ బ్రసిద్ధముగను
జావడేయుక్తి చేతను! జేవఁ జెడఁడు!
తలలు ద్రుంచినఁ గ్రమ్మఱ మొలచునకట!

కీర్తన: రూపకము—(కాలికి) వలె.

ఈతనిఖండించుమార్గ మేది తోఁపదు! యీతఁడెంతశూరుఁడో యిఁకేమి చేయుదు॥ నీతని॥ చేతులు ఖండంబులుగఁ, జేసి రోసితిఁ! గోతగా శిరంబు లెల్లఁ గోసి రోసితి॥ నీతని॥ ఈసుతో మర్మంబులెల్ల నేసి రోసితి! గాసినొంద బాణపఙ్తు లేసి రోసితి॥ నీతని॥ మోక్షగుండ నేత నయ్యు రాఘవేంద్రుని కక్షగట్టి తుత్రింప జేతఁగాకయుంటిని॥ ఈతని॥

వ. అనితలపోయుచుండినరాఘవేంద్రునిఁగనివిభీషణుఁడిట్లనియె:

తో: నలినగర్భువరబలమున నీతని నాభియందు నమృతంబు। గలదు కుండలా కారంబుగ నది పొలియకున్న నికట్టంబు॥ రా॥

క. రావణుఁడు బొలియకుండును
గావున, దన్నాభియందుఁ గలయమృతంబుఁ
బావకశరమున నేయుము
తీవరమున నతఁడు జిక్కి తెగుఁ దత్క్షణముఁ.

శహాన: ఆదితాళము—(తలపైని) వలె.

మనుకులాంబుధిసోమ, రణరంగభీమ, పావనసురవినుతనామ, రామరామ, దనుజగర్వవిరామ, అనలాస్త్రమున నాభి। యమృతంబు నింకించి వెనుక నాతని కరములు। రామ రామ! దునుము వాని శిరములు॥ మను॥ పదపడి నూటతొమ్మిదిమాఱు లారీతిఁ జిదిమి వేసిన మీఁదను రామరామ। యుదయింపకయమానును॥ పిదప మోక్షగుండసదన, నీచే దశ। వదనుఁడు ధరగూలును రామరామ! ఇది వాని మర్మమగును॥ మనుకులాంబుధి॥

వ. అని తెలిపిన రాముండు దేటి విభీషణుని వినయవిజ్ఞాన విశ్వాసభక్తిభావంబులకు నాత్మ మెచ్చి విల్లు సారించి,

తో: అదరుచు నాగ్నేయాస్త్రము వింటను దొడగి లాగి విడువగను। గడువడి నాభినిఁగలయమృతంబునుగ్రొంచెను వేగడవఁగను॥

రా॥ పిదప నూటతొమ్మిది సారులుగా జిదిమెను గర శిరమ
తదనంతర మొకతలయు రెండు హస్తములుఁ దక్క నన్నియున

వ. మరల మొలవకుండ నిలిచి పోయె. తెగిన తల
కొలఁకు రక్తంబుచేఁ దడిసి రక్తసిక్త శరీరుండయి రావణుం డు
అరుణుని యరుణచ్ఛాయచే నావరింపఁబడిన యస్త్రాద్రిపయిఁ
భానుబింబంబురీతి రావణదేహంబుమీఁద నొంటితలయొప్పె.
రావణుండు రోషభీషణుండయి విభీషణుని జూచి యిట్లనియె :

నాటకురంజి : రూపకము—(సీతజాడ) వలె.

ఓరి ద్రోహి ! యోరి పాపి ! యోరి నీచాత్మక! యేరా
క్రూరకర్మములఁ జేయ ధారుణి బుట్టితివిర॥ యో॥ కోరి పగ
మఱుఁగుఁ జేరి కొల్చుచుంటి వధమ ! యేరికెఱుక లేనిదుర్మ
జేయ నిది ఘనమ॥ యో॥ మంచిది శ్రీమోతుగుండ ! మా
వెంట నిను దుంచివేతు రణములోన దోర్బలమునఁ గనుము
నోరీ॥

వ. అని నిష్ఠురంబులాడి భయంకరాకారంబగు శక్తిని విశ్
పయి వైచిన, నదియుఁ గాలాగ్ని చందంబున మంటలు గ్రి
వచ్చుచున్నఁ గని రాఘవుండు,—

తో : నడుమనె బహుబాణముల నేసి తానఱకెను
రాముండు।గడువడి నదిగని కనలుననార్చుచు గదిసెను దశకంఠుం

వ. అన్ని శరశిరంబులుగల లావెల్ల రెండుకరంబులు
శిరంబునందు నిండి తనరారఁ బ్రళయకాల విజృంభిత విలయకా
నుంబోలె మండిపడుచు రామునిపైఁ గవిసి,

క. శరములఁ బ్రాసంబుల ము
ద్గరముల ముసలములఁ గదల ఖడ్గంబులఁ దో
మరముల శక్తులఁ బరిఘల
నుఱుముచు వ్రేయుచును బొడుచు చొప్పుగ నడరెఁ

వ. ఇట్లడరి రామ- లక్ష్మణ- విభీషణులను దోఃకమూఃకలను బహువిధంబులఁ గాఱించుచు ససాధ్యుండయియున్న రావణుని యాటోపంబునకు భయపడి మాతలి రామున కిట్లనియె :

కాఫి : ఏకతాళము—(ఈశరాసనం బసా) వలె.

ఇంతసేపు వీని నిల్వ నేల రాఘవా! పంతమునఁ జంపివేయ వలదె రాఘవా!॥ ఇంత॥ మొలచునేమొ మగుడ వీనితలలు రాఘవా! చలమున నీవఁ తలోనె చంపు రాఘవా॥ ఇంత॥ ఈకిరాతకుండు దెగిన నింక రాఘవా, లోకములకు మేలు గలుగు గాక రాఘవా॥ ఇంత॥ చెండుము బ్రహ్మాస్త్ర మేసి చెలగు రాఘవా! యుండఁదగడు వీడు మోక్షగుండరాఘవా!॥

వ. అని మాతలి పలికిన జగదభిరాముండగురాముండుశస్త్రాస్త్ర విద్యావిశారదుండు కావునఁ బ్రహ్మాస్త్రంబు సంధించుట కిదియ సమయంబని తలఁచి గాధేయ సవనసంరక్షణకాలంబున నతం డిచ్చిన యక్షయ బ్రహ్మాస్త్రంబును దలంచి తదావాహనంబుఁ జేసికొని మంత్రపూర్వకంబుగా వింటను సంధించి ప్రత్యాలీఢ పాదుండయి నిలిచి నిండార దిగిచి విడచె. అది చని,

సురటరాగము: ఆదితాళము.

స్ఫుటంబుగను బెటపెటార్భటుల దిక్తటంబు లార్వగను దన యుత్కటంబు జూపుచను ॥స్ఫు॥ కులాచలంబులు జలింప జలధులు గలంగి కడు సోలఁ దహనస్ఫులింగములు రాలఁ ॥స్ఫు॥ మహోల్కాలోదవఁగ గ్రహంబు లురులఁగ విహాయసము వగులన్ బెల్లుగ మహీతలం బగలన్ ॥స్ఫు॥ జగత్కంటకునిఁ దెగించు మని సురలగణ్యాముగ వేడన్ (శ్రీ) మోక్షగుండపతి సూడన్ ॥స్ఫు॥

తో: రావణ దనుజుని ప్రాణంబులు గొని రయమున భూమికిఁ జొచ్చి। శ్రీవెలయఁగ రంజిల్లి రాము పొదిఁ జేరెను గ్రమ్మఱ వచ్చి ॥ రా॥

వ. ఈ ప్రకారంబున శ్రీరామకర నిర్ముక్తామోఘ బ్రహ్మాస్త్రంబు ఇంద్రి యమ వరుణ కుబేరాదులకైన భేదింపరాని రావణుని మర్మంబులు భేదించి ప్రాణంబు లాహుతివేసికొని నీకూతుం జెఱగొన్న వానిం జంపినా నని భూదేవికి చెప్పబోవుచున్నదో యనునట్లు భూమిం దూఱి మరలి రాముని తూణీరంబు జొచ్చె. ఇట్లు కులిశధారాహతిం గూలుకులశైలంబుం బోలె రావణుని దేహంబు భూమిపయిం బడిన మాత్రంబున,

తో: క్రుంగె దిక్కరులు గ్రుంగె కూర్మపతి గ్రుంగె భుజంగ విభుండు। గ్రుంగెం జరాచరకోట్లతోడ నీకుంభిని మెల్లను మెండు॥ రా॥

కీర్తన: ఏకతాళము (ముఖుగు) వరా.

రావణుండు రణములో ధరాతలింబడ దేవతూర్యరవము లలరె దెసలం బనువడ బోరున ॥రా॥ అసదుగాక రాముమీఁద నాటరంబున గుసుమవర్షములు సురలు గురిసి రింపున ॥రావ॥ తెలివినొంది దిక్కులెల్లం జెలంగుచుండెను। మలయవాయువీచెను బరిమళను నిండను ॥రా॥ దీక్షతోఁ దైత్రిలోక్యవాసు లక్షయముగను మోతుకుగుండవాసునకును మ్రొక్కలిడఁగ॥రా॥

వ. అంత శ్రీరాముండు విల్లెక్కుడించి సౌమిత్రిచేతి కిచ్చి దేహపరిశ్రాంతికొఱకు నొక్కచో విశ్రమించె. అప్పుడు రణభూమిని పడియున్న రావణుని కళేబరంబుఁ గని విభీషణుండు డగ్గరి చింతాక్రాంతుడగుచు,

తో: ఆహవముల దేవారులకును భయ మావహింపఁగాఁజేసి। బాహుశాలివగు నీవు ఘూకముల పాలైతివిగా రోసి ॥రా॥ కుసుమతల్పమునఁ గూర్మి బండునీ కోమల మగు దేహంబు। అసువులెడలి యీ మసనపు ఱాలను నడలి బడితె నిక్కంబు ॥ రా॥

క. నవరత్న స్థగితంబై
రవికోటిసమప్రభా విరాజిత మగుచున్

రవణించు దశకిరీటము
లవనీతలమందు బడఁగ నాయె నయారే!

ముఖారిః ఆటతాళము (అయ్యా మీ) వలె.

అన్నా విన వైతి వన్నా! నాహితములు ॥అన్నా విన వైతివి॥ మెన్నో విధముల నే విన్న వించుచునుండిన నాహితములు ॥ అన్నా॥ సీతను దెచ్చుట చేటుతప్పదని సీతోను వివరించిన నాహితములు ॥అన్నా॥ వలదు రామునితోడ వైరమనుచు మును పలుమాఱు బోధించిన నా హితములు ॥అన్నా॥ నీమనోగర్వంబు నీకిట్టిగతిఁ దెచ్చె! నే మని శోకింతును! నాహితములు ॥అ॥ మోక్షగుండేశుఁడు సాక్షా ద్విష్ణుం డగు వీక్షింపు మని తెల్పిన నా హితములు ॥అన్నా॥

వ. ఇట్లు విభీషణుండు శోకించుచుండ హతశేషరాక్షసులవలన నీవార్త దెలిసి మందోదరి మొదలగు దనుజకాంతలు శోకావేశంబు వెల్లివిరియ వేగంబునఁ బానుపుపంయినుండి దుమికి,

తో: అడుగులుఁ దడబడ హారములూడఁగ నడుములు వడి నసియాడ। జడ లూడి శిరోజములు మూపుపంయిఁ బడి యట్లు నిటు వ్రేలాడ ॥రా॥

వ. కరమ్ముల బోమ్ముమోదుకొనుచు నేడ్పుల రవంబులు నింగి ముట్ట లంకాపురంబు వెడలి శకలంబులయిన రథంబులును, భిన్నంబు లయిపడిన మదదంతావళంబులును, దెగిపడిన తురంగంబులును, జూర్ణంబులయిన గదా ముసల ముద్గర ప్రాసాద్యాయుధచయంబులును, తెగినచేతులును, నొగిలిన మూతులును, ఖండంబులయిన శిరంబులును, దునకలయిన పదంబులును, దుండెంబులయిన మాంసపిండంబులును, గలిగి తొలఁగఁ ద్రోయ రాకుండ భూత బేతాళ ప్రేత పిశాచ శాకినీ ఢాకినీ కాక ఘూక శ్వాన జంబుకాదులు, రక్త మాంస మేదో మజ్జా దుల నిండార యారగించి తృప్తిబొంది, రాము నగ్గించుచు నృత్యంబా

ర్ప్రచుండ భయావహంబై యున్న రణరంగంబుఁ జొచ్చి, క్రమంబున రావణుం డున్న దెసకుఁ జేరి, నిశ్చేష్టితుండై యిలఁగూలిన జీవితేశ్వరుని పయిబడి, మందోదరి—

ఫీల్: అటతాళము.

హా రాక్షసేశ్వర! హా జీవితేశా! హా రణాలంకార! హా వీరవర్యా!॥హా॥ గడగడ నినుఁ జూచి వడకు దిశాపతు లుడువీథి నుబ్బుచు నున్నారు నేఁడు॥ హా॥ కట్టా! యుద్ధములకుఁ గాలుద్రవ్వెడు నీకిట్టిదుర్దశ వచ్చె నేమందు విధిని॥ హా॥ అతులితభోగము లందించి యిపుడు వెతల పాలుజేసి విడిచి పోయితివా॥ హా॥ మోతుగుండేశుని ముట్టడింపకుము; కక్ష వద్దని తెల్పఁగా లేదా నేను॥ హా॥

తో: నరుడు గాఁడు శ్రీధరుఁడు రాము డని, నయముగఁ దెలిపిన వినక। దురమున నాతనితోఁ బోరియు నీ ధరణి దుల్లితివిగాక॥ రా॥

వ. సురల కయిన దేఱిచూడరాని లంకకు హనుమంతుం డొక్కఁడు ప్రవేశించి, జనకజను గాంచి, వనంబు వెఱికి, లంకఁ గాలిచి చనుచున్న నేమిచేయ నేరక పోయితివే! యంతట నైనఁ దెలియవైతివి గదా! ప్రాణేశ్వరా!

క. ఖరదూషణాదిరాక్షస
వరులను ఖండించినట్టి వార్త దెలిసి నే
వెఱతు నది మొదలుగా మది
వెఱవక ధరఁ గూలి తీవు విక్రమధుర్యా!

వ. పతివ్రతాశిరోమణియగు సీతను చెఱఁ దెచ్చిన పాపంబు నిన్నింతచేసె. చేసినకర్మ మనుభవింపక నెంతవారి కయినఁ దప్పునా! మనోహరా!

ముఖారి: ఆదితాళము-(నేమమున్) వలె.

దిక్కు లేనిదాన నైతిని హా! యెక్కడఁ బోదు నింకను! రావణ!॥ అక్కడ పుత్రకు లందఱు దెళ్ళిరి! గ్రక్కున నీవు బడితివి! రావణ!॥

మయుండను నాజనకుండు, మగడవు నీ వని మది గర్వమొందుచుంటిని ! రావణా! ॥ మృత్యువునకు నీవు మృత్యువై యుండి, యిపుడు మృత్యువు వాతఁ బడితివి ! రావణా!॥ భాగుణి మోక్షగుండధాముని పైనఁ గొన్న వైరమునఁ జేటు దెచ్చెను! రావణా! ॥

తో: అనునిటిపరుఁ డగువిభీషణుని కతులసౌఖ్యములు గలిగె !! నినుపోషించెడి వైభవము నిట్లవని వెళ్ళఁగాఁ గలిగె॥ రా॥

వ. "నీ కామాంధకారంబు నీకన్నులం గప్పె ! నిన్ను గట్టుటకుఁ దాళ్ళ నేనే తెచ్చుకొన్నట్లు సీతను దెచ్చితివే ! కాని కుల దాక్షిణ్య రూప గుణగణాతిశయంబుల సీత నాతో సరిబోలునా! ప్రాణ నాథుండా," అని బహువిధంబుల విలపించుచున్న నదితి కదంబులవారిలి కన్నీరు మున్నీరుగాఁ గారునేడ్చుచు విభీషణుండు —

హిం. తోడి : రూపకము.

కామినీమణి, కాలకర్మమే యని వేమరు దుఃఖింతు నింక వెలసె తైతొంటి॥ కా॥ ఎన్నిగతులను జెప్ప, నెఱుంగ డాయెను! నన్ను గాలు లాడి సభలోఁ దన్నిపంపెను॥ కామినీ॥ దండిపేరుఁడై రణోద్దండశూరుఁడై యుండునన్నను గూలె మోక్షగుండదేవుచే॥ కామినీ॥

వ. అని బహువిధంబుల దుఃఖించుచున్న విభీషణునకు రాముం డిట్లనియె:

తో: వలదు విభీషణా, విలుపుము దుఃఖము! వనితలశోకము మాం న్పు! విలపించుటచేఁ ఫల మేమున్నది తలఁపున ధైర్యము జొనుపు॥ రా॥

వ. రావణుండను సామాన్యుండు గాఁడు. సురాసురుల కజేయుండై సమస్తసుఖంబులు బాహుకాలం బనుభవించె. కొదవ యేమి ! కర్మశరీరంబు స్థిరంబుగానుండునా! యతండు గృతార్థుండు! గాన ధైర్యం బవలంబించి యుచిత కుమారులందఱు నశించిరి గాన నీవే యగ్నిసంస్కారాది విధులాచరింపుమను విభీషణుండదరిపడి యిట్లనుచున్నాఁడు.

తో: ఈ కష్టాత్ముం డెక్కడిమ యగ్రజుఁ డెక్కడిశమ్ముడనేను!। ఈకలుషాత్ముని కేటి విధులు! వీనిఁ దాఁకిన దోషం బగును॥ రా॥

వ. మీభార్యను జెఱదెచ్చిన దుర్మార్గునకు సంస్కారంబు గావలెనా! కంకగృధ్రాదులు వీఁకి భక్షించుటయే సంస్కార మనిన, రాముడునవ్వి యిట్లనియె,

తో: పూర్వవైరములు బొలిసిన పిమ్మటఁ బూన దగను; రణమందు। నుర్విని గూలుట నొప్పి ననఘుఁడై యొనరజేయు విధు లిందు॥

వ. అని యాజ్ఞాపించినఁ జిత్త మని లేచి విభీషణుండు వగితల నూరడించి, యగ్రజాదుల కగ్ని సంస్కారంబులుసేసి, స్నానం బాడి, తిలోదకంబులు విడిచి శుద్ధుండై వచ్చె. అంత రాముండు లక్ష్మణున కిట్లనియె:

కీర్తన: ఏకతాళము. (రామమంత్ర) వలె.

వినుము సోదరా! నీవుఁ జనుము సోదరా! వనవిభీషణునకు లంకఁగట్టు సోదరా! ॥ విను॥ అన్న తఱిమిన, నితఁడు నన్నుఁ జేరినఁ, బన్నగ శరణంబొసంగియున్న విధమున॥ విను॥ సరసుఁ డగుటను మన శరణు జొరుటను, ధర మోక్షగుండదేవు కరుణ గలిగెను॥ వినుము॥

వ. అని రాముం డనుజ్ఞ యిచ్చిన మంచి దని లక్ష్మణుండు విభీషణునిఁ దోడ్కొని లంకకుఁజని వనచరులచేత సముద్రోదకంబు దెప్పించి శుభకాలంబున,

విభీషణు బట్టాభిషేకము.

తో: వారిమంత్రులును వారిబంధులును వారిపురోహితవరులు। జేరి చూడ నభిషేకము జేయించెను విభీషణున కపుడు॥ రా॥

వ. ఇట్లభిషేకము జేయించి, సింహాసనాసీనుం జేసిలక్ష్మణుండు,

క. శ్రీరఘురాముని చరితము
సారసహిత కైరవా ప్తసమ్యగ్గతులీ

ధారుణి వఱలెడు నంతకు
వారక నేలుదువుగాతఁ బౌరహితముగా.

వ. అని దీవింప విభీషణుం డమందానందకందళితహృదయార విందుండై లక్ష్మణునకు సభవారికి నమస్కరించి, దివ్యాంబరాభర ణాదులు మంగళ ద్రవ్యపురస్సరంబుగాఁ గొని లక్ష్మణుని వెంటవచ్చి రామునిం జేరి సమర్పించి నమస్కరించె—

తో: అవి మాతలి కిడి యటువీడ్కొలిపిన, నారాముని యను మతిచే। దివమున కేఁగెను- తేరిఁదోలుకొనియే తెంచెనతఁడుసమ్మతిచే॥ రా॥

వ. పిమ్మట రాముండు హనుమంతునిఁ గాంచి యిట్లనియె.

బేహాగ్ : అటతాళము (రాజ రంగేలి) వలె.

లంకకు నేతెంచుమా కేసరీపుత్ర! ॥లం॥ శంకలు దీఱె జానకి నెమ్మది; సంకటములు దీర్పఁగఁ గేసరిపుత్ర! ॥లం॥ మనవిజయంబు జనకతనూజకు వినిపించి ముదము జేయఁ గేసరీ! ॥లంక॥ ఇప్పటిరాజగు విభీషణునకుఁ జెప్పి వానినను నుతిఁ గేసరిపుత్ర! ॥లంక॥ శ్రీమోక్ష గుండ స్వామికార్యంబుఁ జేయుభక్తుఁడ వీ వగు గేసరిపుత్ర! ॥లంక॥

వ. అని పలికిన రాముని వీడ్కొని హనుమంతుండు వేగంబున నశోకవనంబున కరిగి జానకీదేవిని గని నమస్కరించి,

తో: తల్లి! నీమనోధవుఁడు రాఘవుండు దశకంఠుని దునుమాడె। నెల్లకష్టములు డుల్లె నేటితో నీప్సితములు జేకూరె॥ రా॥

వ. రాముని విజయప్రభావంబు నీకుఁ జెప్ప వచ్చితి. ఏమియాజ్ఞ? యనవుఁడు నామె యానందబాష్పంబులు రాల నిట్లనియె:

క. జగదీశ్వరు డగు రాముఁడు
మగఁడై యుండంగ, సుగుణమాన్యులు మీరల్
దగినట్టిభక్తులై యుం
డఁగ లోపము గలదె పవననందన నాకున్!

వ. ఆపన్నివారక మగు నిట్టిమేలువార్త నా కెఱిఁగించినందు నకు నేనే వచ్చి నీ ఋణంబుఁ దీర్చుకొందు నాంజనేయా! రామకార్య సహాయా!

వ. అనిన, నతండిట్లనియె.

గీ. అమ్మ! మీకృపకలిమియ యుంతె! చాలుఁ
గడమవస్తువు లిచ్చినఁ గార్యమేమి?
యనిన దీవించి పలికె నా యన్న! రాముఁ
జూతు నట్లుగఁ జేయుము శుభము లొదవ.

వ. అనిన, మంచి దని మహానందభరితుఁడయి పునఃపునరభివంద నంబు లాచరించి కదలి వచ్చి రామునకు సర్వంబు నెఱిఁగించిన రాముండు విభీషణు నవలోకించి,

బేహాగ్ : ఆదితాళము.

దనుజాధినాయక, తడవిఁకఁ జేయక జనకజఁ బాయక కొనిర మ్మెడపక॥ దను॥ వడి జలకమార్చి వలువలు దాల్చి తొడవులుదీర్చి తోడ్తెమ్ము దేర్చి॥ దను॥ తగ మోతుగుండనగర్వరుండ నగునాదు దండ కతిభక్తినిండ॥ దను॥

వ. అని యనుజ్ఞ యిచ్చిన సంతసించి హనుమంతయుతంబుగా విభీషణుండు సని జనకజాతకు—

తో: సరమ మొదలు రాక్షసకాంతలచే జలకములార్పించి,। సురుచిరదివ్యాంబరభూషణములు సరగునఁ గైసేయించి॥ రా॥

క. బంగరు పల్లకిలో సీ
తాంగన నెక్కించుకొని మహాగోప్యముగాఁ
గంగంచుకంబు గప్పి త
రంగించు ముదంబుగొలుప రామునికడకున్.

వ. ఇట్లు రామునకుఁ గొంతదూరమునఁ బల్లకియుండఁగానే వాన రు లత్యంతకుతూహలంబున సీతాన్వేషణంబు చేయంగోరి చుట్టుకొని

బెత్తముచే మోఁది యందఱిని తఱుముచుండిరి. అది గని రాముండు
విభీషణున కిట్లనియె,

శంకరాభరణం : ఆదితాళం - (తాపసేం)వలె.

వలదు నిలువు విభీషణా, వానరులం దఱుమంగ ఫలమేమి?
మనవారిమీఁద బంటుతనముఁజూపఁగ॥ వలదు॥ ధారుణిసుతనుజూడఁ
గోరి చేరినారుగ! వారిలోప మేమున్నది నేరములు గొనఁగ॥ వలదు॥
అల్లమోక్షగుండవిభుఁడ నైన నాయిల్లాలిని దల్లిగా భావించి చూడ
దాపుఁ జేరి రోలిస॥ వలదు॥

వ. వివాహమున, రణరంగమున, మహోత్సవమున, దుఃఖసమ
యమున రాణివాసం బక్కఱలేదు. ఇది రణరంగమై యుండి పతినైన
నేను సమీపమం దున్నప్పుడు లోపంబు లేదు. కాన సీతను శిబికనుండి
దించి యందఱుఁ జూచుచుండఁ గాలినడకతో నాసన్నిధికి వచ్చునట్లు
చేయు మన, నతండట్లని యామెకుఁ దెలిపిన సిబికలోనుండి దిగి,

తో: నలిననయన కాల్నడకఁతోడఁ దిన్నగఁ రాముని జేరఁగను।
చెలి యగ్నిని దాఁచిన నిజరూపము చేకొను మని తెలుపఁగను॥ రా॥

వ. లక్ష్మణునిఁ గని రాముని కపవాదము లేకుండునట్లు వహ్ని
యందు జొచ్చి వచ్చెద. జితిఁబేర్చి యగ్ని రవులుకొలుపు మనిన, లక్ష్మ
ణుం డట్లఁ జేసె. అంత—

ఉ. రాముని నెమ్మదిన్ నిలిపి రాక్షసకాంతలు వానరుల్ సుర
స్తోమములెల్లఁ జోద్యముగఁ జూడ ధరామరదేవపాళికిన్
వేమరు మ్రొక్కి పావకుని వేఁడి హుతాశన, రామునిన్ సదా
నామదిఁ గొల్చుదాన నయినన్ త్రిజగంబులవారు జూడ న
న్నీ మెయిఁ బ్రోతుగాక యని యేర్పడ జొచ్చెను నగ్నిగర్భమున్.

వ. ఇట్లగ్నిం బ్రవేశించిన, నందఱు నద్భుతం బందిరి. అంతఁ
గమలాసన గౌరీశ్వర దిక్పాలకాదులు విమానారూఢులయి వచ్చిజయ

జయశబ్దంబుల రాముని గొనియాడిరి. రక్తమాల్యాంబరాభరణ భూషితయగు సీత స్వాంకతలంబునవెలయ నగ్నిహోత్రుండుఁ బ్రసన్నుండయి రామున కిట్లనియె,

కీర్తన : ఆదితాళము – (నీవను)వలె.

జయజయ రఘురామ! జయజయ రామ! జయజయ శాంకరీ జపవరనామ! ॥ జయ॥ నియతురాల మన్నింపఁగఁ దగునీ ప్రియురాలిని గొను రయమున రామ॥ జయ॥ మును నాలో దాచిననిజరూపముఁగొనివచ్చితి గైకొను మిదె రామ॥ జయ॥ దంభం బగు ప్రతిబింబ మడఁగె నిజబింబం బిదిగో నిజంబుగ రామ॥ జయ॥ తవిలి చతుర్దశ భువనము లేలితివి వరమోతుగుండాధిప రామ॥ జయ॥

వ. అని యప్పగించి సీతను రాముని యంకతలంబున వసింపఁ జేసె. అప్పుడు శంకరుండు రామున కిట్లనియె:

తో: శ్రీరామా! శ్రీమీఱ నయోధ్యకుఁ జేరిరాజ్యమును జేయు కోరినకార్యము కొనసాగెను నిఁక గొదవలేదు దయచేయు ॥రా॥

వ. అనునంతలో విమానారూఢుండయి స్వర్గంబునుండి దశరథుండు వచ్చినఁ, గాంచి సీతారామలక్ష్మణులు మ్రొక్కిరి. వారిని దీవించి యాలింగనంబు జేసికొని దశరథుం డిట్లనియె:

తో: నినునమ్మినవారిని సంసారాబ్ధిని దరింపఁ జేయుదువు। తనయ, యయోధ్యకుఁ జని రాజ్యముగొని తగఁ బాలింపుమునీవు॥రా॥

వ. వంశాభివృద్ధియగు నని దీవించి వీడ్కొనియె. అంత రాముం డిందునిఁ జూచి,—

తో! నాకృతముగఁ బడి-నా రగణితముగ నగచరులో సురవీరా !। చేకొని వారి సజీవులఁ జేయుము చిలికి యమృతధారా॥ రా॥

వ. అనిన, నతం డమృతంబుఁ దెప్పించి పోసి మృతులయిన వానరుల జీవింపఁ జేసె. అప్పుడు విభీషణుండు రామునకు నమస్కరించి యిట్లనియె :

గీ. అంగనయు లక్ష్మణుఁడు మీరు సతిముదమున
మంగళస్నాన మొనరించి మాల్యగంధ
భూషణాంబరములుఁ దాల్చి పోవు టొప్పు
భర్తృఁడను దోఁయవలదు నా ప్రార్థనంబు.

వ. అనిన, రాముండు.—

కీర్తన: అటతాళము—(వినుఁ డిది) వలె.

వరసుకుమారులు సరసులు దమ్ములుఁ బోరి జటావల్కలములు
పరిహరించి, సరగున నం దుండ మఱియు నే నిచ్చట సరియగునా
మలంకరణముఁ జేయఁగ॥ వర॥ గన మోక్షసందేశు కరుణ విభీషణా!
వనచరులకు నిదె సలుపు సత్కృతులు; మనమున సంతోషమగ్నుఁడ
గాదును; అనుమాన ముంపకు! మటుఁ జేయఁగాఁ దగు॥ వరసు॥

వ. అని రాముండు నియమించిన మంచిదని విభీషణ్ణుఁడు,—

తో: నవరత్నాభరణములు వస్త్రములు నవిరళముగఁ దెప్పించి।
విజాదుల కలరాక్షసవర్యుఁడు ప్రమదమెసఁగ నర్పించి॥ రాను॥

వ. అనన్తరంబు విమానంబుఁ దెప్పించి నిలిపిన, రాముడు
సీతాలక్ష్మణయుతంబుగా నారోహించి యందరిని గాంచి యిట్లనియె,

జంఝూటి: అటతాళము—(ఒకదివ్య) వలె.

పోయి వచ్చెద మేము పుణ్యాత్ములారా! మాయయోధ్యకుఁ
జేర మర్యాదమీఱ!॥ కపులను దోడ్కొని కదలి సుగ్రీవా! యిపుడే
కిష్కింధకు నేగు మీతోఁ రావా॥ బో॥ దేవతలను గూడి, దేవతావర్య!
యీవేళ దివమున కేగు గుణధుర్య!॥ పో॥ రాక్షసేశ్వర! లంకా
రాజ్యంబు నేలు మోక్షగుండేశునకు మొ్రక్కుచుఁ జాలు॥ పోయి॥

వ. అని పలికిన, రాముని గనుంగొని, విభీషణాద్యసురులును
సుగ్రీవాది వనచరులు నిట్లనుచున్నారు:

తో: మే మయోధ్యకును మీతోఁ గూడా మిత్రకులజ!
వచ్చెదము!। క్షేమంబుగ మీకుఁ జేసెడిపట్టాభిషేకోత్సవ మరసెదము॥ రా॥

వ. భరత శత్రుఘ్నులను, కౌసల్యాదిమాతలను, చూచి వత్తుము; దయానిధీ! నిరాకరింపవలదు. వచ్చుట కంగీకరింపవలయు నని వేఁడిన, సమ్మతించె. అందుమీఁద,—

తో: వానరు లందఱు దానవు లందఱు మానితపుష్పక మెక్కి। మానవనాథుని యానతిచేఁదమ మనికి కరిగి రాచక్కి॥ రా॥

వ. ఇట్లు కదలి వియన్మార్గంబున పుష్పకంబుఁ బఱపి, దృష్టిగోచరంబులగు విషయంబులు రాముండు సీత కెఱిఁగించుచుఁ బోయి సేతువుఁ జేరవచ్చి,

మధ్యమావతి: రూపకము.

సేతుబంధనంబు జూడు ప్రీతితోడ, సీత నేఁడు! ఖ్యాతిగఁ గపినిర్మిత మిది! పాతకంబులెల్ల వీఁడు॥ సేతుబం॥ రామేశ్వరుఁడనులింగము నే మును స్థాపించి తిందు! భామ, సేతుదర్శనంబుఁ గామించిన యా మనుజుం డీమహి జనియింపఁబోఁడు॥ సేతు॥ ఇందుఁ బితృతర్పణంబు విడుచువారుఁ బితృయుతము గం దగ శ్రీమోక్షగుండ సుందిరు కరుణను ముక్తినిఁ బొందుదు రానందంబుగ॥ సేతు॥

వ. ఇట్లు సేతుమహాత్మ్యంబు సీతకుఁ జెప్పి, యనంతరము, విమానంబు నడపించుచు శీఘ్రంబునఁ గిష్కింధా సమీపంబునకు వచ్చిరి. అంత, రాముని యాజ్ఞానుసారంబుగా,—

తో: తారాముఖకాంతలు వేగంబునఁ దరలివచ్చి జానకిని। సారెకుఁ గనుగొని సలిపిరి సకలోప చారమ్ములు నెమ్మదిని॥ రా॥

వ. పిమ్మట వారితోఁగూడ విమానం బెక్కించుకొని క్రమంబున బంచవటి దండకావనంబులు గడచి శరభం గాగస్త్య సుతీక్ష్ణాత్రి వాల్మీక్యాద్యాశ్రమంబులు గనుచు బదునాలుగు సంవత్సరములు పూర్తి యయిన పంచమీదివసంబున భరద్వాజాశ్రమంబుఁజేరి యాతనిచే సత్కరింపఁబడి రాముం డిట్లనుచున్నాఁడు:

తో. భరతునకును గడపటిశత్రుఘ్నునకును భద్రంబే మునివర్యా!
ముగ రాజ్యముఁ జేయుచుఁ దల్లుల సేవింతురె యోయార్యా॥ రా॥

వ. అనిన మునివర్యుం డిట్లనియె:

తో: మీరాకను మదిఁ గోరుచు జడలును నారచీరెలు ధరించి।
రుణి భారము దనపాదుకలం దారోపించి సహించి॥ రా॥

వ. నందిగ్రామంబున సుఖంబుగ నున్నారు. రావణాది రాక్షస
ననంబులు గాల్చి సుఖంబుగ మీవచ్చినవార్త యుష్మత్కటాక్షంబున
గిన దివ్యజ్ఞానంబున నెఱుంగుదు. రామా! త్రిలోకాభిరామా!

కీర్తన: ఆదితాళము - (ఓ రామ)వలె.

ఓదేవదేవ! నిన్ను యోగు లందఱు నాదిమధ్యాంతరహితుఁ
చుచుఁ గందురు! ఆదివిష్ణుఁడవు నీవె! శ్రీదేవి జానకిదేవి! యాదిశేషు
లక్ష్మణుఁ డగుచు సత్య ము॥ఓదేవ॥ నీమాయచేఁ ద్రిగుణములు నెగడి
సృష్టిస్థితిలయోద్దామక్రియలుఁ జేయుచుందు దగులవు నిన్ను॥ ఓదేవ॥
జ్ఞులకు వేఱై యుందు! వరయ మోక్షకుండవుదు విజ్ఞులకు దోఁచి
ల వెలుఁగుచుందువు ॥ ఓదేవ॥ నారాయణశర్మవినుత నాయింట
నాఁడు నిలిచి నన్ను ధన్యు జేయ గదవే! నతజనావన! ॥ఓదేవ॥

వ. అని వేఁడిన సమ్మతించి యందు వసించి హనుమంతుం
చి రాముం డిట్లనియె:

తో: గంగాతటమునఁ గల దొకనగరము శృంగిబేరమన; నందు।
గుగఁ జెంచులరాజు గుహుండను ప్రాజ్ఞభక్తుఁ డింపొందు॥ రామ॥

వ. అతనితో మదాగమనవార్త యెఱింగింపుము. పిమ్మట,
యోధ్యకుఁ గ్రోశమాత్రదూరంబున నందిగ్రామము గలదు. అందు-

క. భరతుం డున్నాఁ; డాతని
సరసకుఁ జని జనకజాత సౌమిత్రులతో
నరుదెంచె రాముఁ డని స
త్వరముగ మత్కుశలవార్త పలుకుము వేఁగన్.

వ. ఆతండు మునిఁబోలె జటావల్కలధారుండయి నావలెనే యున్నాఁడు. రయంబునఁ బోయి ర మ్మనఁ, నుహ్మాంగి మనుష్యాకారంబున బయలుదేరి వాయునందనుండు వాయువేగంబునఁ జని.

తో: గుహుని గనుంగొని కుశలంబుగ నినకులుఁడు వచ్చుచున్నాఁడు। సహసీతాలక్ష్మణుఁడై; యెదురుగఁ జనికాంచుము నీవు నేఁడు॥

వ. అని పలికిన, నతం డానందభరితుండై కాచుకొని యుండె. అంత హనుమంతుండు నందిగ్రామంబుఁ జేరి,

గీ. పాదుకలయందుఁ దనరాజ్యభార ముని చి
జడలు ధరియించి శత్రుఘ్నసహితముగను
రాముఁ డేమాయెనో యింక రాఁడటంచు
నెంచుచున్నట్టి భరతునిఁ గాంచి పలికె:

కీర్తన : ఆదితాళము – (శంకరసం)వలె.

రామునిదూతను రాజవరా, స్వామి కార్యరత, సత్యధరా! క్షేమంబున శ్రీరాముఁడు లక్ష్మణ-భూమిజయుతముగఁబొలుపుగ వచ్చెను ॥రా॥ రావణుండు దనదేవినిఁజెరగొనఁగా వానినిఁ దగ ఖండించి వేవై దేహిని విడిపించుక సుగ్రీవాదులతోఁ దా వచ్చెను విను॥ రా॥ రాముండిపుడు భరద్వాజాశ్రమభూమి నిల్చి నను బుత్తెంచె; భూమీవర, సొంపుగను మోక్షపురధాముని కెదురుగఁ ద్వరగా నేగుము॥ రా॥

వ. అను పలుకులు విని భరతుండు హర్షసముద్రంబున నోలలాడి మైమఱచి కొంతసేపుండి పిమ్మటలేచి, హనుమంతుని గౌఁగిలించుకొని యానందాశ్రుకణంబులచే నభిషిక్తుఁ జేసి యిట్లనియె:

తో: ననుఁదేర్చితి విటు నాప్రియాగ్రజుని ఘనశుభవార్తను దెలిపి!। మనుజుడవో సురమాన్యుఁడవో నామది నెఱుఁగనుగుఱినిల్పి॥

క. వరలక్షధేనువులు, శత
పురములు సకలాభరణసుభూషిత లగు సుం
దరకన్యలఁ బదియార్వుర
గురుభక్తిని నిచ్చినాఁడఁ గొను నీకొఱకున్.

వ. అని ప్రశంసించి శత్రుఘ్ను నితో నిట్లనియె:

హిం-కాఫీ : ఆదితాళము.

పోదాము ర మ్మనుజా మనము॥పో॥ మోదమున మోక్షగుండ
కండపాణికి నెదురుగ॥ పో॥ పురిని గై సేయింపుము! రాజతరుణుల
బంపుము! కరిరథహాయములు రాగ వరతూర్యరవములు మ్రోగ॥
॥ వారకామినులాడఁగ, జటులవందిబృందము గూడఁగ, నారా
ణశర్మ హృద్విహారున కెదురుగ పనము॥ పో॥

వ. అని చెప్పిన శత్రుఘ్నుం డాక్షణంబున నన్నియేర్పాటులుఁ
. అంత, సామంత పౌరజన వందిమాగధ వారకాంతాదులుఁ బరివే
చికొలువ, బ్రాహ్మణు లాశీర్వదింప, భేరీమృదంగకాహళాదిమంగ
నాదంబు లలర, రాజకామినులు బల్లకులయందురా రాముపాదు
ద్వయంబు శిరసావహించి తమ్మునితోఁ గూడఁ బాదచారియైకొంత
రంబు జని యప్పుడు —

తో: కాంచెను భరతుఁడక్క-జముగ రవిసంకాశము విధికల్పితము।
చితశశినిభ మతిసుందరమును నంబున దివ్యపుష్పకము॥ రా॥

వ. ఇట్లు గాంచి యానందభరితుండై యుండ, నాంజనేయుం
ని యె:

హిం-కాఫీ: అటతాళము. (మెంత్రిక్క-న) వలె.

కనుఁగొను భూవర! కను లలరార! యొనర విమానము జను
చుచున్నది ॥కను॥ అందు శ్రీరాముఁడు నవనిజ-సుమిత్రానందన-
కీవనగచరు లున్నారు॥ కను॥ వరమోక్షగుండనివాసునిఁ గొలు
చు సరగ విభీషణుఁ డరుదెంచుచున్నాఁడు॥ కను॥

వ. అని పలుకునంతలో విమానంబు సమీపించె. రాజకాంతలు
ుదలయినవారు శిబికాదులనుండి క్రింద దిగి నిలువంబడి చేతు లెత్తి
ాపుచు,

తో: అదుగో! రాముం డదుగో! లక్ష్మణుం డదిగో! సీతాదేవి। కడువడి గన్నులకలువ దీఱంగ గాంచుడు వారలరీవి॥ రా॥

వ. బహువిధంబుల యెలుగెత్తి పెద్దగాఁ జెప్పుకొనుచుండిరి.

వ. భరతుండును రాముని జూచి క్రిందనుండి చేతులు ముకుళించి మ్రొక్కినఁ, గాంచి రాముండు మహానందంబున విమానంబుఁ గ్రిందికిఁ బఱపించి,

తో: తమ్ములఁ బౌరులఁ దల్లుల దాదులఁ దక్కిన పరిజనములను। సమ్మదమునఁ బుష్పక మెక్కుడునటుసలిపి పఱపె గ్రమ్మరను॥

వ. అని బహుకాలంబునకుఁ జూచిన మక్కువచే రాముండు భరతుని దనయంకతలంబునఁ గూర్చుండఁబెట్టుకొని కుశలం బడిగె. భరతుండును సీతాలక్ష్మణుల నాదరించి సుగ్రీవాంగద నల నీల జాంబవంత సుషేణ ప్రముఖవానరులఁ జిత్రంబుగా నవలోకించి క్షేమంబడిగి సుగ్రీవునిఁ గౌగిలించుకొని యిట్లనియె:

గీ. నీసహాయంబుచే రావణాసురాది
శత్రులను గెల్చెమాయన్న మిత్రతనయ!
నలువురము సుమ్మి యన్నదమ్ములము మేము!
ప్రీతి నీతోడ నేవుర మైతి మిపుడు.

వ. అని శ్లాఘించె. అప్పుడు శత్రుఘ్నుండు రామ లక్ష్మణ సీతా దేవులకు నమస్కరించిన, దీవించిరి. అంత రాముండు—

తో: తల్లులకును బ్రణమిల్లిన వారలు దనయుని లేవగ నెత్తి। యుల్లంబున వగనొందిన పిమ్మటను నుబ్బిరి యక్కున నొత్తి॥ రా॥

వ. అప్పుడు భరతుండు—

తో: తారమోధ్య కిత్తఱిఁ జేరఁగ, సందర్శన భాగ్యముగూడె। శ్రీరఘురామా॥ రా॥

జంఝూటి—అటతాళము. (ఆదిమూరుని) వరె.

ఇఁక రాజ్యము నీవే యేలుము రామా! యెుకనాఁటికి నాచేతఁ పరంధామా! ॥ఇఁక॥ పదియునుఁగులు మునుపటికంటె ధనము యె ఖజానాకొట్టుఁగో! వినుము॥ ఇఁక॥ పాదుకలను రాజ్యభార కి; నీపాదుకలను నీ కర్పణ జేసితిని॥ ఇఁక॥ నీపంపుఁ జేయుచునిను కను నేపట్ల మోక్షగుండేశ్వర నేను॥ ఇఁక॥

వ. అని యిట్లు పలికిన వనచరులు మోదించిరి. అంతలో విమా నందిగ్రామంబు సమీపించె. అప్పుడు రామానుమతంబున నందఱు కతునియాశ్రమంబుఁ జేరిరి. అప్పుడు—

తో: ధనదునిఁ జేరఁగ బనివిని యెద నేనని పీఠ్గా ని పై కెగిరి। విమానము వినువీధిని వైశ్రవణునినగరము దారీ॥ రా॥

వ. రాముండు కులగురువగు వసిష్ఠమహామునికి నమస్కరించి ంది యామునయనుమతిచే సర్వాసనంబునఁ గూర్చుండె. అనంత భరతుండు—

తో: తల్లి నాకు దత్తంబుసేసె; నే దత్తము చేసితి నీకు వల్లభు కూవదాజ్యమునకుఁ బాలింపుము దయ విడకు॥ రా॥

వ. అని పాదంబులకు సాగిలిపడి, వేఁడుకొనియె. ఇంతలోఁ గైక

తో: నాతప్పిదము మనంబున నుంపక నాయన్నా దయయుంచి। డ నవనీతలమెల్లను నీ వేలుము సైరించి॥ రా॥

వ. అని యనేకవిధంబులఁ బ్రార్థించె. అప్పుడు వసిష్ఠుండు లేచి ఖిమతప్రకారము సమ్మతింపు మని చెప్పిన రాముఁడు నియ్యౌ ం. అంత రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులకు క్షురకర్మంబులు చి సుగ్రీవ విభీషణాదులు గూడి తైలంబుఁ బూసి,

జడ లూడఁదీసి స్నానము
గడువడిఁ జేయించి వస్త్ర-గంధంబులు ఖేల్

దోడవులు నలంకరించిరి
పుడమిసుత కపుడు దారముఖచెలు లెల్లన్.

వ. అభ్యంగనస్నానంబుఁ జేయించి సర్వమాల్యాభరణాదులచే నలంకరించిరి. అప్పుడు గౌసల్య కొడుకును జూచి యానందించె. శత్రుఘ్నునియనుమతిచే సుమంత్రుండు రథం బాయితంబుజేసిఁ తెచ్చిన, రాముం డారోహించి,

రగడ: సాకేతము జేరెన్ రాముఁడు సకుటుంబముగాఁగన్
సౌమిత్రియు మఱి శత్రుఘ్నుండును జామరలు వీవఁగ
భరతుండును శ్వేతచ్ఛత్రము జెలగబట్టగఁ గోతులమూఁకలు
గూడను ముట్టగ, భానుజయువరాట్ప్రముఖవానరులు
దానవపతియు రథద్విపార్శ్వముల రామునియానతి రయమున నెక్కియు,
వేములు రాగను, వెంబడిజొక్కియు, సాకేతము జేరెన్.
ఇంద్రుడు తనరథ మెక్కియు రాగను, జంద్రములు ధరజాతను
వేగను, కైకసుమిత్రా కౌసల్యాదులఁ బ్రికటతారాప్రముఖ భామినుల
శిబికారూఢులఁ జేసుక నడవఁగఁ బ్రబలివాద్యములు బరువడి మ్రోయఁగ
సాకేతముచేరెన్ రాముఁడు సకుటుంబముగాఁగన్.
నందిబృందకై వారము లలరగఁ ముందాభటులుసమ్మోదమునఁ గొలువఁగ
వారకామినులు వరుసగనాడగ వారకగాయకవర్యులు బాడఁగఁ
బౌరులు గుములై బరువడిఁ జూడఁగఁ గూరిమి నర్థులు గొబ్బున వేడఁగఁ
బురిశృంగారముఁ బొసఁగఁగఁ గాంచుచు నరుదగు నాశ్చర్యంబునఁ దేలుచు
సాకేతముఁజేరెన్ రాముఁడు సకుటుంబముగాఁగన్.

వ. ఇట్లయోధ్యం జేరిరి. అవ్వా ర్తవిని రామసందర్శనకుతూహల మానసలై పౌరకాంతలు భర్మహర్మ్యాగ్రంబుల పయికెక్కి సేసలు చల్లుచు శరీరంబులు పులకాంకురములు నొంద నిట్లనుచున్నారు.

కీర్తన : ఏకతాళము-(సైరంధ్రి) వలె.

పట్టాభిరాముం జూడరే! పట్టాభిరామునకు నిపుడు పట్టాభిషేక మగును! బట్టపుదేవి జనకపట్టియే యగు నౌర॥ పట్టా॥ నీలాబ్దగాత్రుం డగు నితండు, నీరజనేత్రుం డగు లీలావతారుండగు బాలించి మాడ నగు॥ పట్టాభి॥ శ్రీమోత్తుంగుండేశుని నేడు సీతాసమన్వితుని శ్రీమీరాలం గాంచితిమి యేమి సుదిన మగు॥ పట్టాభి॥

వ. ఇాతసురూపవంతుండగు ననంత తేజోభిరాముని రాముని గాంతాయుతంబుగం గాంతారమునకుం బంపి దురంతచింతాకాంతులం జేసెంగదా! కైక యత్యంత కఠినాత్మురాలుగాక,

తో: కైక ననంగ నక్కరలే దెంతటి ఘనులైనను లోకమునం। బ్రాతకర్మము పగిదిని నడతురు గాక యన్య మొకటగునా! ॥రా॥

వ. కైకప్రేరణలేకున్న లోకకంటకులగు కైకసి సుతప్రముఖా నేక రాకాసిమూక లేకరణిని జెడుదురు! పాకారి ముఖ్యదివౌకసుల కే కరణిని మేలుచేకూఱు. ఇది యవశ్యంబు గాందగినకార్యమే! సరి యనుకొనుచుండు నంతలో—

తో: నిజభవనము సన్నిధికిం జేరి మానితరథ మవరోహించి। నిజమాతలకు ననేక దండములు నేర్పుతోడ నర్పించి॥రా॥ కొలువు కూటమునకును జని రత్నోజ్జ్వలసింహాసనమునను। గొలువుదీరి తనుం గొలుచు చుముందఱ నిలిచిన భరతున కనెను॥ రా॥

హంసధ్వని : ఆదితాళము-(సరోజాప) వలె.

మదాజ్ఞానుసారుండవై ప్రాజ్ఞతతో నడవుము॥ మదా॥ సంజ్ఞను నెల్లపనులుసరగున నెఱవేర్పుము॥ మదా॥ దానవభర్తకు వానరభర్తకు వేరువేరుగను విడుదులు జత పరుపుము॥ మదా॥ రాజకాంతలను

రయమున నంతిపురంబులకును బంపు! ఘనముగ సురవరుగను॥ మదా॥ అభిషేకార్థము యత్నము సలుపుము! శుభముగ మోక్షపురవిభుమదిం దలంచుచు వడి॥ మదా॥

వ. తదాజ్ఞను శిరసావహించి భరతుండు సర్వము నెఱవేర్చి యన్నకు నిట్లనియె:

క. రవితనయ విభీషణ సుర
ధవయువరాజాములకును దగ వేర్వేఱ
నివసింపంగం దావులు మ
ద్భవనంబున నేర్పఱిచితిం బరమదయాళూ.

వ. అని విన్నవించి పిమ్మట సుగ్రీవుని చేరంబోయి యిట్లనియె:

తో: శ్రీరామున కభిషేకము చేయగ సింధుజలముకావలెను ;। మారుతమునకు సమానంబుగ జను వారిని బంపంగవలెను॥ రా॥

వ. అని తెలిపిన సుగ్రీవుండు మంచిదని గవాక్ష నీల నలాంజ నేయుల చేరం బిలిచి క్రమంబున నిట్లనియె :

కీర్తన : త్రిశ్రిజాతి—(సంతతంబున) వలె.

పోయి రాం దగు వాయుజవముతోం॥ బోయిరా॥ తోయధుల జలముం దూర్ణంబునంగొని తెచ్చుటకు॥ బోయి॥ ఓగవాక్షనీవుం బ్రాగబ్ధిజలమును వేగమెక్కికొని యేగెదులోపల॥ బోయి॥ నీల, దక్షిణాబ్ధి నీరము ముహూర్తకాలమునకుం జేర్పంగా వలెం గావునం॥ బో॥ ఓనలుండా! పశ్చిమోదధిజలము లానందముగం దెచ్చి యర్పింపంగా నీవు॥ బోయి॥ పావని, యుత్తర పాథోధిసలిలంబున్న। పావనతీర్థము వేవేగం దేవడి॥ బో॥ శ్రీమోతుగుండ శ్రీరామాభిషేకార్థమై మీరు మోదాబ్ధియం దోలలాడుచు॥ బోయిరాందగు।

వ. మఱియు సమస్త పుణ్యనదీతీర్థంబులు తెచ్చుటకు సుషేణ-జాంబవంతుల నియమించిన వారందఱును గనకకలశంబులు ధరించి వారివారి నియామక స్థలములనుగూర్చి యరిగిరి. అనంతరంబ,

తో: భరతుని పంపున దేశమంతటను భటతండమ్ములు జాట।
పురజనులెల్ల రలంకరణమ్ములు మురువుగఁ దీర్చిరి వీట॥

శహనరాగము: ఏకతాళము—(ఎంతని వే) వలె.

పురము నలం కరణము జే సిరి పురుషులు జెలులుల్। శోభా కరముగ సొగసుగఁ॥ బురము॥ పరిమళఘనసార మృగమద। భరితచందనంబుఁ బరగఁ గూర్చి యలికిరి॥పురము॥ గోడలపై మేడలపైఁ జూడఁగఁ జిత్తరువుల్ వేడుకలర వ్రాసిరి నాడెముగను॥ గో॥ యీడులేని మాడువుల ధ్వజములను బైడికలశములు బాగుగ నెత్తిరి॥ పురము॥ ముంగిళులల్ ముత్యముల రంగవల్లు లలరన్, మంగళముగ భర్మ స్తంభమ్ముల ముంగి॥ రంగుమీఱఁ బచ్చులు గూర్చినతోరణములు శుభమా రంగ నటు గట్టిరి॥ పురము॥ చల్లనిపందిళ్ళు దగన్ గొల్లఁగ నెల్లెడలన్ సల్లలితాగరు సౌరభధూమము జల్లని వెల్లివిరియ మోకుగుండ శ్రీరఘు! వల్లభుండు రంజిల్లి మెచ్చగను॥ బురము॥

వ. ఇటువలె నారాత్రి నాలుగుయామంబులు నిద్రాహారంబులు వర్జించి సమస్తజనంబులు పురము శృంగారించుట లోనగు కార్యములఁ బ్రవర్తించిరి. అంతఁ దెల్లవాఱిన వసిష్ఠుండు సనుదెంచి,

క. పట్టాభి రామమూర్తికిఁ
బట్టము గట్టంగ నేఁడు భవ్యదినం; బీ
పట్టున రామునకున్ ధర
పట్టికిఁ గైసేయవలయుఁ బదిలముగాఁగన్.

తో: అంత వసిష్ఠుని యానతిఁ దలకొని కాంతలు బురుషులు గలిసి। వంతులు వేసి వసంతము లాడిరి వావివరుసలను దెలిసి॥ రా॥

వ. ఇట్లు శ్రీసీతారామసహితంబుగా సకల పురుషులు స్త్రీలును జేరి మంగళవాద్యంబులు మ్రోయుచుండఁ జెలరేఁగి,

కీర్తన: ఏకతాళము—(దారిజూ) వలె.

ఎంతో వైభవ మొదవఁ జెలఁగుచు, వసంతోత్సవము వేడ్క సలుప దొడగిరి॥ యెంతో॥ తరుణులున్ బురుషులున్ మురువుగన్

వరుసలన్ సరగ దెలిసి చల్లుకొనుచును॥ జన మెంతో॥ ఇతరేతరంబు దఱుముచున్ జేతః ప్రీతిన్ ఖ్యాతి నెన్నుచున్ ॥ జన మెంతో॥ బీరమ్ము జేయుచున్, బేరమ్ము దీయుచున్ వదనమ్ము లలర సరసమ్ముల నిమ్ముల నమ్మించి చిమ్మించి చల్లుమ॥ నెంతో॥ రారాదా చల్లగా రాదా! యని చీరుచు మూరను బారుచును॥ జనమెం॥ మంచిపసుపు నీరు సున్నము నిం పెసంగగన్, గుసుగుస దరిసముతో బిసికి చల్లులాడుచు॥ జనమెం॥ వరమోక్షగుండ రాఘవుని కటాక్ష ముంచుటన్, బరీక్ష బట్టుచును దీక్షతో వంతులాడుచును॥ జన మెంతో॥

వ. ఇట్లు కొంతదడవు వంతంబులు మెఱయ వసంతంబు లాడి శ్రీరామచంద్రమహాప్రభువును జాయాయుతంబుగఁ బీఠంబులపయిఁ గూర్చుండఁ జేసి సువాసినులు నివాళు లిచ్చిరి. ఎట్లనిన,

ఉశేనిరాగము: ఆదితాళము. (ఈరాజా) వలె.

సీతారామునకుఁ బ్రీతిగను హారతు లొసగరె ॥సీతా॥ యాతుధానులఁ గోత గోయఁగ, భూతలంబునం దుదయించిన ॥సీతా॥ మేలుగ ధరాపాలు రరయఁగ నోలి శూలిచాపము విఱచిన ॥సీతా॥ దండిగను మోక్షగుండపురమున నిండు వేడ్కతో నివసించిన ॥సీతా॥ శ్రేయముగ నారాయణార్చితుఁడై యనంతముగ విలసిల్లెడు ॥సీతా॥

వ. ఇట్లు హారతు లిచ్చి యామీఁదఁ శోభనంబులు వాడిరి. ఎటులనిన:

కళ్యాణి: ఆదితాళము. (మనవి)వలె.

శోభన మనియునదే సుదతులార ॥శోభన॥ ప్రాభవమున సీతా భగవతితో శోభిలురామునకు సుదతులారా ॥శో॥ భూతావళులను బ్రోచుచునుండెడు సీతారామునకు సుదతు ॥శో॥ భానువంశసంభవుడయి వెలసిన జానకిరామునకు సుదతు ॥శో॥ దశకంఠుని శపథముగొని కూల్చిన దశరథరామునకు సుదతు॥శో॥ మోక్షగుండమున ముదమున

వెలసిన మోహనరామునకు సుదతు ॥శో॥ సరగ నారాయణశర్మను బ్రోచిన ధరణిజరామునకు సుదతు ॥శోభన॥

వ. ఇట్లు శోభనంబులు పాడుచు సంపెంగ తైలంబునఁ దల లంటి యనంతరంబున నలుగుబెట్టు విధం బెట్లన్నను,

నలుగుపాట: రూపకము (దాసిక్) వలె.

రామల్ నలుగు లొసగిరి విరాజితకరులైయా ॥రామల్॥ రామున కరిభీమునకు భూమీతనయుకుఁ దగఁ గామితములు జెలువారఁగ అలరామల్॥ మోముల దరహాసములు బ్రేముం జిగురింపఁగఁ గోమలతనువుల జిగి గలుగఁగ నాఁ ॥రా॥ ఈదంపలను గొలువ నీనాటికి గలిగెను మోదం బరుచుచు విశదముగానా ॥ రా॥ మోక్షగుండమున వెలసిన మోక్షాంగనను గలసి సాక్షిగఁ జెలువొందిన రాముని కా॥రామల్ నలుగు లొసఁగిరి॥

వ. అటుపిమ్మట,

గీ. మంగళస్నాన మాడించి మధుపతులిత
చికురమును గూర్చి తడియార్చి చిక్కుదీసి
కీలుగంటులు ఘటియించి పూలు ముడిచి
పరగ సాంబ్రాణి నవ్యధూపములు వేసి.

తో. శ్రీరామునకును సీతాదేవికిఁ జీనాంబరములు గట్టి। హార మకుట కేయూర కంకణా ద్యాభరణంబులు వెట్టి ॥రా॥

వగలజేలు నగుమొగముల సొగసుగ మృగమదతిలకము దిద్ది। దగ బరిమళయుత మగుచందన మింపుగ నెమ్మేనుల నద్ది ॥రామ॥

వ. ఇట్లు శృంగారించి సకల జనులు స్నానంబు లొనరించి శుచిర్భూతులయి నవీనాంబరములు ధరించిరి. అంత—

బేహాగ్: ఆదితాళము. (నిదురలేక) వలె.

సభామండపము జేరెను శ్రీరాముండు పట్టాభిరాముఁడు వేడ్క॥సభా॥ వాసవ నీలప్రభాసములంకృత భాసురనవ్య సోపానరంజిత

॥సభా॥ ధర్మమయస్తంభభరితమై శశికాంతనిర్మలవేదికానిర్మాణ మగు॥ సభా॥ ఖ్యాతిగ దనయనుజాతులు వెనువెంట నేతేర సీతాసమేతుఁడై దివ్య ॥సభా॥ కరుణాకటాక్షవీక్షణమున బ్రజలను నరయుచు మోతుగుండాధిపుఁ డపుడు ॥సభామండపము॥

సీ. బిరుదరాజనులు వెవ్వేల నెన్నుచు బట్టు
లోలసి కైవారముల్ బలుకుచుండ
సస్వరమ్ముగ యజుస్సామాదు లాశీఃపు
రస్కృతి భూసురాగ్రిణులు సెప్ప
శ్రుతిహితగాన సంగతి భావమెనయించి
నట్టువచెలు లభినయము సూప
ఇదువుల్ కర్పూర హారతుల్ గైసేసి
పాడుచు మోహిల నివాళియొసఁగ

గీ. జనకనందన వామాంకమున రహింప
భరత శత్రుఘ్ను లోలి వీవనలు వీవఁ
గోరి సౌమిత్రి వెలిపట్టుగొడుగు వట్ట,
ననిల తనయుఁడు చరణ పంకజము లొత్త
కొలు వమరె సింహాక్షీతి రఘూద్వహుండు.

వ. ఇట్లు కొలువుదీఱియున్న కాలంబున,

రగడ: వచ్చిరి సీతాపతి వైభవమును
ముచ్చటగాఁగని మోదమందుటకు
గౌతమ సంయమి గర్గుఁడు శల్యుఁడు
శతానందుఁడును శాండిల్యుండును
యాజ్ఞ వల్క్యుఁడును అగస్త్యపాదుఁడు
భరద్వాజుఁడును భర్గుఁడు హారితుఁడు
ఆపస్తంబుఁడు నత్రి శుకుండును

మౌద్గల్యుండును మాండవ్యుండును
రేణుకాత్మజుఁడు ఋశ్యశృంగముని
కౌండిన్యుండును గాలవ శౌనక
సాలంకాయన వాలఖిల్యులును
మైత్రావరుణ మరీచులు వ్యాసుఁడు
కణ్వ పరాశర కౌశిక నారద
వాల్మీక్యాది తపస్వులు పనివడి॥ వచ్చి॥
నరు లురగులు కిన్నరులు చారణులు
సురలు గరుడ యక్షులు గంధర్వులు
సాధ్య సిద్ధ ఖేచరవర్గంబులు
విద్యాధరులును విశ్వేదేవత
లష్టదిగీశులు అష్టవసువులు
అప్సరోంగనలు నలకింపురుషులు॥ వచ్చి॥

వ. ఇట్లువచ్చిన ఋష్యాదుల కెదురేఁగి తోడితెచ్చి సిద్ధాసనంబులఁ గూర్చుండఁ బెట్టి పూజించె. వారి యనుమతంబున సింహాసనాసీనుఁడైన రామునకు వా రిట్లనిరి:

సురట : ఆదితాళము – (మాకులమునకీ)వరుస.

శ్రీరామపట్టాభిషేకలగ్నము సమకూరెను ప్రొద్దు మీఱెను; ఈ రాజ్యభారము వారక నీవు భరింపుము పరిపాలింపుము॥ శ్రీ॥ నీయవతారముచే సాధువులకు మేలాయెను! వెతలు వోయెను! శ్రీయుత మోక్షపురీశ్వర యుందఱుఁ జేరిరి! చూడఁ గోరిరి!

వ. అని ప్రశంస చేయుచున్న సమయంబున—

తో: హనుమంతుఁడులో నగు ప్లవగులు జతురబ్ధుల జలములు గొనుచు । జనుదెంచియు రాముని ముందఱ నుంచిన వారినతఁడుదయ గనుచు॥ రా॥

వ. వారి నెల్ల సమ్మానించె. అంత వారు రామునకు నమస్కరించి, యవ్వల నిలిచి చూచుచుండిరి. అప్పుడు వసిష్ఠ వామదేవాది ఋషులు పట్టాభిషేకం బొనర్చుటకు సంకల్పించిరి.

## శ్రీ రా మ ప ట్టా భి షే క ము.



కళ్యాణి : అటతాళము.

శ్రీరామపట్టాభిషేకమహోత్సవ మారూఢిఁ గనఁగ నేత్రానంద కరము! చారుతులసీకుశవిరాజితమై వరకుసుమ కస్తురిసారమిళిత సుగంధపూరితమై ప్రియమై జయమై తనరారుసింధుజలంబుతో మనసార నభిషేకం బొనర్చిరి॥ శ్రీరామ॥

భరతశత్రుఘ్ను లుభయపార్శ్వంబుల, సీత సరి యెడమదిక్కున లక్ష్మణుఁడు పడమటను, వరుస గరుడవలిపట్టి తూర్పునను, యువరాజ జాంబవంత రవిజ విభీషణులుఁ దగను గిలిమూల మొద లొరసి కోణములందు నిలిచి దృగుత్సవంబుగఁ గొలువ నలరెను॥ శ్రీరామ॥

నవరత్నమయభూషణములు హారంబులు దివిజవల్లభుఁడు దెచ్చియియ్యఁగను, వివిధవాద్యమ్ములు మొఱయఁగను, ఖేచరులు గూడి యవిరళంబుగ కుసుమవర్షమును గురియ మెఱయఁ గోటిభాను కాంతులు గలకిరీటము రమ్యముగ ధరియింప నలరెను॥ శ్రీరామ॥

వారల వసిష్ఠ వాల్మీకి జాబాలి వామదేవాదులు వైభోగమును,గ సారెకు నాశీర్వదింపఁగను, వారాంగనలు నొయ్యారముగ

మోదించి యాడఁగను, గరము ధరను దాభ్యారినారాయణమనోబ్జ విహారుఁడగు శ్రీమోక్షగుండ॥ శ్రీరాము॥

తో. వామభాగమున వైభోగంబుగ భూమీపుత్రిక మెలఁగ। క్షేమంబుగ మణిసింహాసనమున శ్రీరఘురాముఁడు వెలుగ॥రా॥

క. కనుఁగొని శంకర ఫణిపతు
లనిమిషపతి నిర్జరౌఘ యక్షాదులు శో
భనముగఁ గరములు మోడిచి
కొనియాడిరి రాము నసురకోటివిరామున్.

శంకరుడు: కేదారరూపకము. (సాటి) వలె.

రామ! సీతారామ! పరంధామ! భక్తకామ! జయసుందర రామ॥ సోమ సూర్య వహ్నిమండలగత! నీమహిమల్ సామాన్యమె రూపింపఁగ॥రా॥ భూతలాదిభూతకోశాతీత! మోక్షగుండపుర రాజిత! వీతరాగ! నారాయణకవివర చేతః కంజాతస్థిత! ధాతృస్తుత!॥ రామసీత॥

తేవారము. నీమహామహిమఁ దెలియనేర లోకాభిరామా!
భూమి భారంబు వాపి ప్రోచితివి రిపులజోపి!
క్షేమముగ దేవతాళి చిక్కులను బాసిహాయి
వేమరుఁజరింపఁ గలరు విశ్రమింపంగఁ గలరు.

శేషుఁడు: శంకరాభరణము—ఆదితాళము. (కరివరదా) వలె.

నినుఁ దెలిసి పొగడఁదరమా శ్రీరామా॥ నినుఁ దెలిసి॥ సులభముగాను సుషుమ్నానాడియందలరుచు వెలిగెఁడు నాత్మమయునినినుఁ దె॥ అణువులో నణువువై, ఘనములో ఘనమువై యణిమాదులకును నందరాని॥ నినుఁ దెలి॥ అక్షయముగ నారాయణవరకవి మోక్షగుండమున వీక్షించెను॥ నినుఁ దెలి॥

తో: నిరతము మమ్మేల నిలువ నీకఁ గడు వెతఁపించెడు రావణుని। బారిగొంటివి మా పుణ్యంబున సుఖముగ నుండెద మిఁకభువిని॥

క. తనముందఱ సంగీతము
మన మలరఁగఁ బాడు మనుచు మమ్మేచెడు నా
దనుజేంద్రునిఁ గ్రూరాత్ముని
నునిమితి వికనిన్నుఁ బాడుదుము శ్రీరామా!

తో: వెనుకొని యాగహవిస్సులు దానే గొనుచుండును దానవుఁడు। హనిసెను నీచే దురమునఁ గమ్మఱ దొరకెను మా కవి యిపుడు॥ రా॥

క. కడువడి నరులు గయాదుల
నిడుపిండంబులను జెంద నియ్యఁడు మాకున్
వెడరక్కసుఁ డీల్గిన ని
ప్పుడు మా కవి దొరకె నీదు భూరికరుణచేఁ

వ. అనియిట్లు యక్ష కిన్నర కింపురుష విద్యాధరాదులు వేర్వేఱ బాగడి రామునిచే ననుజ్ఞాతులై స్వస్థానంబులకుం జనిరి. అంతరాముండు వేదపారగులగు బ్రాహ్మణులకు లక్షగోదానంబులు లక్షతురంగదానంబులు జేసి, పిమ్మట వస్త్రాభరణసువర్ణదానంబు లమితంబుగా నొనర్చె.

తో: పొంగుచు సుగ్రీవునకును దానవపుంగవునకు హారములు,। నంగదునకు మణియంగదములుఁ, గపు లందఱికిని బహుమతులు॥ రా॥ సమ్మదమున నిడి సత్కరించి తన సన్నిధిఁ గొల్చుచు నున్న యమ్మారుతిఁ గనియడుగు వరములోయన్నా! యిచ్చెదనన్న॥ రా॥ నామదిలో నీనామస్మరణ మనారతమును జేయుచును నేమారక నే నెసఁగుభక్తి నాకిమ్మ పూర్ణ మగుదయను॥ రా॥

గీ. ఎంతదాఁక భవన్నామ మెంతదాఁక
నీదుస్మరణము భూమిపై నిలువఁగలదొ
యంతదాఁకను నాదేహ మవనియందు
నిలిచియుండఁగ వర మిమ్ము కలుషహరణ.

వ. అనిన, రాముం డానందించి,

తో: చక్కఁగ నీయిష్టంబు లొసంగితిఁ జయ్యన నినుమెచ్చితిని। తక్కఁగఁ గల్పాంతమున నిన్ను ధాతను జేసెద సన్మతిని॥ రాను॥

వ. అటుమీఁద ముక్తిపదంబు నొందఁగలవు. అని రాముండు వరంబు లిచ్చిన విని సీతాదేవి తానిట్లనియె:

తో: ఇలమీఁదను నీ వెచటనున్న నందిష్టములయిన భోగములు। గలిగి సుఖింతువుగాక! నీకు నిఁక గలుగవు మఱి శోపనులు॥ రా॥

వ. అని యాపురాణదంపతులు తత్త్వం బుపదేశించి మహాశీర్వాదపూర్వకంబుగా ననుగ్రహించిరి. వరంబులకు హనుమంతుండు బ్రహ్మానందంబు నొంది, పునః పునఃప్రణామంబు లాచరించి,

కళ్యాణి : ఆదితాళము – (సీతాధిపతీ)వలె.

జయ రమారమణ! గోవిందా! హరీ! జయ సుమాస్త్రశోభిత సముజ్వలాంగా! ఘనకుమారిమనోహరా! ॥జయ॥ అరుణసితాసిత వరకృష్ణస్ఫటికాంచితవర్ణవిలక్షణా! నిల॥ జయ॥ అమలమోక్షగుండాధిప, నారాయణకవిహృదయ విరాజితా॥ జయ॥

వ. అని పొగడుచు యథేచ్ఛఁగా జని హిమవత్పర్వతంబున హనుమంతుండు దపంబు జేయుచుండె. సుగ్రీవుండు గపికోటులుగొల్వ గిష్కింధ కరిగె. విభీషణుండు లంకఁ బ్రవేశించి రాజ్యం బేలుచుండె. రాముండు దన్నాశ్రయించి కరుణాపాత్రుండైన గుహునిఁ గని,

తో: మంతనమ్మునం జింతించుచు నీమహిని భోగమున బ్రబలి యంతమందు నాయందైక్యంబై యలరెదుపొమ్మిక గదలి॥ రా॥

వ. అని సెలవిచ్చి యనేకరత్నాభరణాదులచే సత్కరించె. గుహుండానందించి రామధ్యానంబుఁ జేయుచు శృంగిబేరమునకుఁ జనియె. పిమ్మట సాయంకాలం బయిన,

ఏకాంతసేవ ప్రారంభము.

తో: అంత రామ-సీతాంగనలకు నేకాంత సేవ సలుపఁగను। నంతరంగమున నలరి సువాసిను లాలోచనఁ జేయుచును॥ రా॥

వ. అన్యోన్యాహూయమానలై రి. ఎట్లనిన —

చెలుల కీర్తన : ఆటతాళము – (ఒకదివ్య) వలె.

శ్రీరామునికొలువుఁ జేయ రారమ్మ! కోరిక లెల్లఁ జేకూరుగద మ్మ! ॥శ్రీ॥ భవబంధభయములు బాయు గదమ్మ! యవిరళముక్తి కరామలక మమ్మ॥శ్రీ॥ నారాయణశర్మాధారుఁ డీయమ్మ! ధారుణి మోక్షప్రదాత గదమ్మ!॥ శ్రీ॥ మన పురాకృతములు మంచివోయమ్మ! ఘనమోక్షగుండేశుఁ గన గలిగె నమ్మ! ॥శ్రీ॥

వ. అని పిలుచుకొనుచు నాక్షణంబున,

క. బంగారుసరిగచీరెలు
రంగుగఁ బట్టుచు బాగడ రవికలు మాణి
క్యాంగద భూషణములు మెఱి
యంగను ధరియించి వచ్చి రంగన లెల్లన్.

వ. ఇట్లు వచ్చి యత్యద్భుత జగన్మోహన దివ్యమంగళవిగ్రహుం డగు శ్రీరామచంద్రమహాప్రభువును వీక్షించి,

కీర్తన : ఆదితాళము-(నీతితో) వలె.

అంద మౌరాముని సుందరము జూడరే॥ యంద॥ కందర్పసహా స్రదివ్యాకారుఁడని తెలియరే॥ యంద॥ వామభాగమున వేడ్క-భూమి తనయ నిల్వఁగ, సామీప్యము దాశ్రితులు సంతసమునఁ గొల్వఁగ, సౌమిత్రి లోనైన యనుజన్ములతోఁ జెల్వఁగ॥ నందమౌ॥ హారకేయూ రాదిభూషణావళి ధరించెనే! ధారుణి శ్రీమోక్షగుండ ధాముఁ డన మించెనే! నారాయణశర్మ హృదయసారసమున నిలిచెనే! ॥యంద॥

గీ. అనుచు నభివర్ణనము జేసి యంతమీఁద
రామచంద్రుని యంతఃపురంబునందు
స్ఫటికమయహంసతూలికా శయ్యపైకి
వేడ్క-తోఁ జేర్చి యిట్లని వేడి రపుడు.

కీర్తన : ఆదితాళము-(రామమంత్రం) వలె.

పవ్వళింపుము రామ॥ పవ్వ॥ జవ్వను లమరించినట్టి పువ్వపాన్పుపై ॥ జయ॥ వివిధకాంతుల నలరు విపులవసతుల కవల శుద్ధస్ఫటిక మయమౌ గేహంబులోపల॥ బవ్వ॥ ప్రీతినెకొ్కన భూజాత సంగతి భాతిగ నారాయణహృత్పద్మశయ్యను॥ బవ్వ॥ బల్పసం దగు స్వయంకల్పితంబగు తల్పమునందు మోక్షగుండధామశుభ మగు॥ బవ్వ॥

తో: ఆవిధమున నాత్మారాము సుషుమ్నాంతఃపుర వరమునను। బావన మగు హృత్పద్మతల్పమునం బవ్వళింపం జేసియుదు॥ రా॥

వ. తిన్నగా సీతాదేవి తాపునకు వెళ్ళి యిట్లనుచున్నారు:

కీర్తన : ఆటతాళము-(నమిలాం) వలె.

పతిసంగతి వేడ్కం బన్వళింతువుగాని పదవమ్మ పడకింటికి; పతివిరహాగంబునం బడినయలజడులెల్లం బాసె; సుఖమ్మున వఱలుము దేవి॥ నారాయణార్చితుని సూరిజనస్తుతు శ్రీరఘునాయకునిం జేరితివమ్మ॥ పతి॥

వ. అని చెలులు జానకినిం బానుపుం జేర్చి ఇట్లు బాడిరి.

కీర్తన: ఆటతాళము (కాంతుండు)వలె.

చల్లగను శ్రీరామునిపైం జల్లరే విరజాజులు మల్లెమొల్లలు సంపెగలు చేమంతివిరులు లాజలు॥జల్లగను॥ అందముగం జెలువొందు లసదరవిందములు జెంగలువలు బొందుగను దాసానసుమములు బొగడలును గురువకములు ॥జల్ల॥ పారిజాతప్రసూనములు మందారములు సురపొన్నలుం గోరి నారాయణ మనోజ్ఞవిహారుని పయిం గన్నెలు జల్లగను శ్రీరామునిపై ॥జల్లరే విరజాజులు॥

తో: కమ్మనితావులు ఘుమ్మని దెసలను గ్రమ్మసుగంధముం దీసి। కొమ్మలు బంగరు గురిగలమొత్తముంగొని దంపతులను డాసి॥ రా॥

హంసధ్వని: ఆదితాళము. (రవికుల) వలె.

పరిమళకలిత గంధము బూయరే॥ పరిమళ కలిత-లలితాతులిత॥ భరిత పరిమళకలిత॥ సారతర మగు మృగమదసారవిరచిత ఘనకచోర

సురజోయుతఘనసారపూరిత పరిమళ॥ కలిత॥ ప్రీతిమీరారీతిగా, గీతికల్ బాడుచున్, సీతాసమేతుఁడై చెలఁగిన రాముని చేతను రంజిలఁ జేరియుఁ బరిమళ॥కలిత॥ భూమిమోక్షగుండంబున వేడ్క వసించి వేసుడు నారాయణశర్మను మన్నించి కామితములఁ గడు నొసఁగి ప్రేమ నెగడు రామునకును బరిమళకలితగంధము॥

వ. ఈ విధంబున సుగంధంబు లలంకారంబుగా నలఁది,

క. మధురంబులైన ఫలములు
మధురాపూపములుగొన్ని మజిపళ్ళెములన్
మధుకర వేణులర్పిరి
పృథివిజకున్ రామునకును బ్రియము దలిర్పన్.

కళ్యాణి: రూపకము. (పరమ) వలెం

ఆరగింపుము ముద మార జనకజాతసహితంబుగ॥ నా॥ నారికేళ కదలికా ఖర్జూర దాడిమంబులున్, జంబీర చూత ద్రాక్షలున్, సుసార పుష్పసార మిళితంబుగ॥ నార॥ మేలుగన్ జిలేబి మణుగుబూలు కర్జకాయలున్ బూరీలు నామవడలు నతిరసాలు బూందిలాడు సురుచిరముగ॥ నార॥ చారపప్పు నెయ్యి పంచదార గూర్చి యుంచిరి తాళ్లూరి శ్రీనారాయణాఖ్యచారుహృద్విహార ! మధురంబుగ॥ నార॥

వ. ఇట్లు సమ స్తమైన ఉపాహారంబులు సమర్పించి, యనంతరంబు—

గీ. పసిడిఁ దాపిన రత్నాల పళ్ళెరమునఁ
గప్పురపు పీడియములు బొంకముగఁ గూర్చి
నేర్పునన్ జానకీరామ నృపులమోలి
నుంచి సౌభాగ్యవతులు ప్రార్థించి రిట్లు:

ఖ్యాండుస్వరము—ఆదితాళము.

విడెము సేయు రఘువరా! కడు వేడు కలర నఘహరా! పుడమికుమారి నేర్పునఁ జుట్టి యిచ్చిన మడుపులు ముసిపంట మజి యందుకొని వేగ॥ వి॥

శ్రీరామ చిద్విలాస! శ్రీమోతుగుండవాస! నారాయణాఖ్య దాసాధారామితోల్లాస! చంద్రికారస్మ్యదరహాస! ॥ శ్రీరామచంద్ర లాలీ! సీతాసమేతలాలి! కారుణ్యసాంద్ర లాలీ! కల్యాణమయ లాలీ! లాలి! కలుషాపహార లాలీ.

ఇట్లు లాలిపాటఁబాడి వారు నిద్రాముద్రితులైన పిమ్మట—

శహన: ఏకతాళము-(ఎంతని నే నం) వలె.

సందడిఁజేయం దగ దింపొందఁగ జనరమ్మా! మీమీమందిరము లకును॥సందడి॥ పొందుగ నిద్రానందంబుల రఘునందన-సీతాసుందరు లుండిరి॥ సందడి॥ కానల సన్మౌనులసాంగత్యము సలుపుచును, దానవు లను వెనుదవిలి చంపుచును॥ కానల॥ మానుగ నిద్రలు మాని యుండి రటు గాన, సుప్తులై మేనులు మఱచిరి॥సందడి॥ ఈ రేయిఁ మీరెల్లఁ గూరికి వేగినను గూరిమితో సింగారము లలరఁగ॥ ఈరే॥ కోరి మోతు పుర శ్రీరఘువీరుని జేరి యాకొలువు జేతురుగాకిఁక॥ సందడి॥

వ. అని చెప్పుకొనుచుఁ దమ యిరవులకుఁ జని నిద్రించి వేకువ జామున లేచి,

క. అమ్మా! శ్రీరాముఁడు సీ
తమ్మయు మేల్కొనఁగ లేదు; త్వరగాఁ జని మో
దమ్మున మేల్కొల్పఁగ రా
రమ్మా! యని లేచి వచ్చి రామామణులున్.

వ. చనుదెంచి ద్వారంబున నిలిచి యారాము ననంత రాము నిగా భావించి.

మేలుకొలుపు: అటతాళము.

శ్రీరామ! రామ! సీతారామ! యిదె తెల్లవాఱవచ్చె నిద్ర మేలుకో॥ పౌరులు సకలోపచారము లొనరింపఁ గోరి వచ్చినారు మేలుకో॥ రామా! మేలుకొనుమా ॥

దశవిధప్రణవనాదములనే కుక్కుటధ్వనులు మెండయ్యెను మేలుకో! దిశలెల్ల వెలుఁగ దేదీప్యమానజ్ఞాన దినకరుఁ డుదయించె మేలుకో॥ రామ॥

రమణ నిక్షేపావరణశక్తు లనునట్టి కుముదములు ముకుళించె మేలుకో॥ విమలమైనజ్ఞాన—విజ్ఞానము లను కమలముల్ వికసించె మేలుకో॥ రామ॥ పలుపలురంగుల భాసిల్లుచున్నది కొలువుకూటముఁ జేర మేలుకో॥ అలరు నాపోజ్యోతి యనుసింహాసనమున నాసీనుఁడ వగు చువు మేలుకో॥ రామ॥

అనుపమావస్థాత్రయం బనునట్టి నీయనుజులు జేరిరి మేలుకో! ఘనముగఁ దదవస్థాకార్యము లొనరింపఁగను నియమింతువు మేలుకో॥ రామ॥

అంచితసద్బోధ మనెడు బురోహితుఁ డరుదెంచియున్నాఁ డదె మేలుకో॥ పంచాంగమందలి భావమెల్ల వివరించి బోధించును మేలుకో॥ రామ॥

కనఁ జతుర్వాక్యమాగధవందిగాయక కవులు వచ్చినారు మేలుకో! అనయము నీ కన్న నన్య మొక్కటియు లే దని పల్కుచున్నారు మేలుకో॥ రామ॥

అంతరాంతరత్రిపుటి యను నంతఃపురములో నవనీజతోఁగూడ మేలుకో॥ కాంత నం దుంచి యొక్కఁడ వేగి కడు రాజకార్యములను దీర్చ మేలుకో॥ రామ॥

అష్టవిధప్రకృతు లను సచివులు బరివేష్టింప వచ్చిరి మేలుకో! స్పష్టముగా సన్నిపనులను నియమించి ద్రష్టవై యుందువు మేలుకో॥ రామ॥

అతులితకోటిసూర్యప్రభాభాసిత మగు కిరీటము దాల్తు మేలుకో! ప్రతిలేనిబ్రహ్మాండభాండసామ్రాజ్యముఁ బాలన సేతువు మే కో॥ రామ॥

కామాదిచోరవర్గము జ్ఞానధనమును గైకొనఁ బూనిరి మేలుకో! యేమరకయ వారిఁ బోవిడిచివేసి తద్ధన మింక సద్ధించుము మేలుకో॥ రామ॥

సాక్షాన్నారాయణస్వాంతవారిజసీను లక్షించి యున్నాఁడను మేలుకో! అక్షయమైన స్వయంప్రభ జూపఁగ మోక్షగుండేశ్వర మేలుకో॥ రామా మేలుకొనుమా॥

వ. ఇట్లు మేలుకొలిపిన నిద్రలేచి రాముండు కాలోచితకృత్యంబులు దీర్చుకొని మజ్జనం బాడి సీతాసహితంబుగా సమస్తాలంకారంబులు చేసికొని భోజనంబొనర్చి మహావిభవంబుగా గొలువుకూటంబుఁ జేరి లక్ష్మణునకు యువరాజ్యం బిచ్చి తాను లోకాతీతపరమాత్ముండయ్యును లోకవిడంబనార్థ మవతరించెఁ గాన, దుష్టనిగ్రహ శిష్టానుగ్రహంబులు సేయుచుఁ బదునొకండు వేలసంవత్సరములు ధర్మంబుగా రాజ్యపరిపాలనంబుఁ జేయుచు సుఖంబుండె. అట్టికాలంబున—

తో: జనులకు దుర్భిక్షభయంబులు విషసర్పచోరభయములును। ననువుదప్పు రోగాదిభయంబుల నందక భోగము లొందుచును॥ రా॥

వ. సంతోషంబున నలరారుచుండిరి. పృథివి సర్వసస్యసంపూర్ణం బయియొప్పె. వృక్షంబులుఁ గుసుమఫలభరితంబులై రంజిల్లె. పార్వతీ! యిట్టి మహనీయచరిత్రం బాద్యంతంబుఁ గర్ణరసాయనంబుగా నీకొఱకు వివరించితిఁ గదా! యట్టి రామమూర్తి కృపాప్రసాదం బనుభవించి ముక్తురాలవుగమ్మా!

క. నాచేసినుపదిష్టం
బై చెల్లిన మోక్షగుండహరిచారిత్రం
బాచంద్రార్కంబుగనీ
భూచక్రమునందు నలరుఁ బూర్ణేందుముఖీ!

వ. అని బోధించిన పార్వతీదేవి బ్రహ్మానందవారాశియందోలలాడి శంకరగురుపదారవిందంబులకు నందనంబు లాచరించె. అనంతరం బయ్యాదిమదంపతులనుఁ గూర్చి మంగళంబు బాడె నెటులనిన:

బేగడ: ఆటతాళము. (కమలాంబ) వలె.

నిత్యమంగళం నిత్యానందునకు॥ నిత్య॥ అత్యంతజగదాకారి ణికి॥ నిత్యమంగ॥ సత్యజ్ఞానానంతసాక్షిరూపునకు నిత్యానపాయిని యగు సీతకు॥ నిత్యమంగ॥ సాక్షాన్నారాయణసరసహృద్గోచర మోక్షగుండ రామమూర్తికి సీతకు॥ నిత్యమంగ॥

వ. ఇట్లు మంగళముఁ బాడి శ్రీ సీతారామబ్రహ్మప్రతిఫలితది వ్యామహోజ్యోతిస్స్వరూపంబుఁ దనహృత్కమలకర్ణికాంతరంబున సూక్ష్మం బుగాఁ గనుచు నిజానందంబునఁ దేలుచు గైలాసంబున నుండె.

ఆశ్వాసాంతము.

తో. అని తాళ్ళూరి నారాయణకవి రామాయణమును హరి కథను। ఘనముగఁ జెప్పెను గథయిం దిది రణకాండము చిలుకును సుధను॥ రా॥

ఇది వినువారలఁ కిహసౌఖ్యంబులు గొదువలేక చేకురును। ముద మునఁ దుదకట ముక్తిలభించును మోక్షగుండహరికృపను॥ రా॥

రామ రామ యనవే - శ్రీరామాయణకథ వినవే॥ పార్వతీ॥

గీ. మొదలి కావ్యమ్ము వాల్మీకిమునికృతమ్ము
రామచరితమ్ము భక్తలోకామృతమ్ము
హరికథగఁ గూర్చె రక్తి నారాయణుండు
వసుధ వెలయుత మాశశి భాస్కరముగ.

మోక్షగుండరామాయణము.

సంపూర్ణము.